ఇది వచనాత్మకమగు కాకవ్యాసమునకు సంబంధించినది; విద్యావయోవృద్ధులగు సాంబశివకవిగారు వ్రాసినది పద్యాత్మకమగు కోకిలకాకమునకు సంబంధించినది. దీనిని విమర్శించిన భాగమునకే "గురుదక్షిణ" యని పేరు. ఆధిక ప్రసంగములనువారించు తలంపున విమర్శించిన యీ మొదటిభాగమునకు "అధిక ప్రసంగదమనము" అనిపేరు. "అప్రస్తుతప్రశంస" అను నిరాధార వాక్యపూరితమగు వ్రాఁత వారి దిదివఱకుఁ జది యే యుందురు. దానిని విమర్శించిన భాగమునకు "లోకాభిరామాయణ"మని పేరు. అం దనేక మహనీయుల యభిప్రాయము లుదాహరింపఁబడి యున్నవి. శిష్యుఁడు నాయొద్ద నెంతకాలము జదివినదియు నేమేమి చదివినదియు నంఁబ సప్రమాణముగా నిరూపింపఁబడును. నన్ను వదలినపిమ్మట నతఁ డితరత్ర చదివినది సుమారు రెండు మాసములకన్న నధికకాలము లేదనుట కీక్రిందియుత్తర ముదాహరింపఁ బడుచున్నది.

"...... ...... నేను ప్లవంగనామ సం॥ పుష్య బహుళము మొదలు కీలక సం॥ వైశాఖ బహుళమువఱకు వింజరం పాఠశాలలలో ఉపాధ్యాయులుగా యున్నాను. ఆసమయమున ఓలేటి వెంకటాద్రియ్యగారు భ్వాది ప్రారంభించినారు. రెండుమాసములు సుమారు చదివినట్లు జ్ఞాపకమున్నది. భారద్వాజ ఘట్టము అయినది."

జయంతి భగీరథశాస్త్రి.

ఈ శాస్త్రులవా రెట్టి సత్యసంధులో యెంతయోగ్యులో సర్వపండితులను నెఱిఁ గినవిషయమగుటచే నాప్రశంసవదలి, చదివిన దింతమాత్రమే యైనను "ఆభ్వాష్యాంత మధీతం" అనియు, "ఉభయశాస్త్రప్రవీణ" అనియు వ్రాసి లోకము కన్నులనుగప్పఁ బ్రయత్నించినట్లే మమ్ముంగూర్చి కూడనసత్యములను బ్రకటింప సాహసించుచున్నారు గాన వీరిప్రాఁతలను జక్కఁగా విమర్శించికాని విశ్వసింపవలసి యుండదని చదువరులను హెచ్చరించుచున్నాఁడను. ఏదో వ్రాసికొందురుగాక యని మిన్నకున్నకొలఁది వీరి తుందుడుకు మితిమీఱుచున్నట్టు లీక్రిందివారి యుత్తరములవలనఁ దెలియఁగలదు.

28—1—12. పినపాడు.

"...... ...... రామకృష్ణకవులు తమవిషయమై వారియొక్క కవితలో బహుదూరు వ్రాస్తూయున్నారు...... ......"

T. Kotaiah.

కవితలో దుడుకు వ్రాతలు చూచితిని. రామేశ్వరీయ మను అప్రశస్త పుస్తకము చూచితిని,......" వేలూరి యజ్ఞనారాయణ, చిరివాడ, తెలప్రోలుపోష్టు.

ఇట్టివి పెక్కులు. మేమిందు వ్రాయు ప్రతివిషయమునకు నిట్లే యాధారములు చూపఁదగినంత సామగ్రి మాయొద్దనుండినను ఇక్కడికే గ్రంథవిస్తార మైనదని

యెంచి నూటికిఁ దొంబదు ఉదాహరింపక మానితిమి. వీరి వ్రాఁతలయందలి సత్యా సత్యములు సామాన్యులు గుఱితింపకున్నను బ్రాజ్ఞు లెటులో విమర్శించి కనుఁగొను చునే యున్నారనుట కీ క్రింది లేఖలు పనికివచ్చును.

"..........కవితాసత్యసందేశము సత్యమునకు దూరమని (1) బ్ర॥ శ్రీ॥ చర్ల రామశాస్త్రిగారివలన వింటిని........"

ఏలూరు 7—11—11. మై. కృష్ణమూర్తి.

——"శృంగభంగమును జూచితి,........ గావున వీరికి దుర్యశము అను మాటయే అబద్ధమైనపుడుబాపుకొనుటకు వీరు అచటకు వెళ్ళినమాటయే అబద్ధము. యీక్రింది వచనమునుజూడ కృష్ణకవి స్వగ్రామ మవుటచే అభిమానముతో ఆగ్రామస్థులు వ్రాసినట్లు తోచుచున్నది. ........అనేక సంస్థానములలో కీర్తివహించిన వీరు శరణుఁ జొచ్చిరి అనుట విరుద్ధముగా యున్నది. వింటివేరామకృష్ణ" అను పద్యంకూడ సందే హమే........ తక్కిన పద్యములయందునను యిట్లే సందేహములుయున్నవి. మీకున్నూ తెలిసియేయున్నవి. నాసందేహములు పోవునటులనిజము వ్రాయగోరెద"

(2) నారయ్యప్పారావు

ఆ యీయుత్తరముల వలననేమి శృంగభంగ విమర్శనమువలననేమి గతార్థ మనియెంచి వారిపురలో నొకరి బాపమఱఁది పేరితోఁ బ్రకటించిన వెంకటరామ కృష్ణుల 'సత్యసందేశము' నిం దుదాహరించి పిష్టపేషణ మొనర్పక అందుఁ బేర్కొనఁ బడిన యొక సాక్షి ప్రకటించిన వ్యాస మిట నుదాహరించు చున్నాఁడను.

1911 సం॥ అక్టోబరునెల 18 వ తేదీ దేశమాతనుండి—

చర్ల వెంకటాచలపతి శాస్త్రులవారికి,

తొలుదొల్త మీరు శృంగభంగ మను నొకదాని నసత్యంబులు నసందర్భంబులు నగు వాక్యంబు లైక్యపఱచి ప్రకటించుచు నందు నన్నొక సాక్షిగా వ్రాయించి యున్నారు. అందలి సత్యాసత్యము లరయఁ గొందఱు నన్నయ్యేసందర్భము లడు గుచు "నదియల్లరిసభ యగునా, కాదా?" యని ప్రశ్నించుచు వచ్చిరి. అట్లడిగిన వారికెల్లనది యల్లరిసభయే. కానియెడలఁ బండితులగు బ్రహ్మశ్రీ నారాయణశాస్త్రులవారే యనుగఁదగినరీతి నడుగుట తటస్థించునుగాని యట్లుగాక యతిధార్ష్ట్యముతో నయ్యె

(1) ఈ చర్ల రామశాస్త్రులవారు విద్యావయోవృద్ధులు. కాఁకరపర్తినివాసులు.
(2) వీరు శ్రీ శనివారపుపేట జమీందార్లు. ఈ యుత్తరము వేలూరి శివరామ శాస్త్రిపేర వీరువ్రాసిరి. ఆయనవలనవ మాకుఁ జేరెను.

# ఉపోద్ఘాతము



శ్లో. గిర్షు యేతు రతా స్తేషు । గిరతాః పరికీర్తితాః
తా సుద్దిశ్య కృతం కావ్యం । గిరతం పరిచక్షతే॥

ఇది ప్రథమమునఁ దిరుపతిశాస్త్రిగారికిని రామకృష్ణకవులకును జరిగిన 2–3–4 పర్వములలోని యుత్తర ప్రత్యుత్తరములను విమర్శించు నుద్దేశముతోఁ బ్రారంభింపఁబడినది. కాని నానాఁటికిరామకృష్ణు లేదో యసత్యమును బ్రకటించిదూషింప మొదలిడుటచే నంతతో విరమింప వలనుపడక పెరుఁగ వలసినదయ్యెను. ఉత్తర ప్రత్యుత్తరములవలన సూత్రప్రాయముగా గతార్థమగు నంశము లీవిమర్శనమందు సవిస్తరముగా సప్రమాణముగా వ్యాఖ్యానము చేయఁబడుచుండును. వలసినచోటనెల్ల నితరుల యుత్తరములు క్రిందిభాగమున నుదాహరింపఁబడుచుండును. రామకృష్ణుల వ్రాఁతలు కొన్ని యిందు స్థాలీ పులాకన్యాయమున వలసినంతవఱకుఁ జేర్పఁబడినవి. అవి ముందుఁ జదివి తత్సారమును మనమునకుఁ దెచ్చుకొనిన పిమ్మటఁగాని యీవిమర్శనము సుబోధము కాదు. ఇది విస్తరించి యుండుటచే నొకటి మఱియొకచోటను మఱియొకటి యింకొకచోటను దెలిసికొనవలసియే యుండునుగాని యేపుటలో రామకృష్ణుల వ్రాఁతలలోని యేపంక్తి యుదాహరింపఁబడి యుండునో ఆపుటలోనే దానికి సంబంధించిన విమర్శన ముండునటులకు వలనుపడదు. కావునఁ జదువరులు జాగరూకతతోఁ దిలకింపవలసి యుండును. రామకృష్ణులు బ్రకటించిన ప్రతివిషయమును మాత్రమె లోకమే ముందు విమర్శించి మాకు లిఖింప మొదలిడిన దనుటకుఁ గొన్ని ప్రమాణములను జూపుచున్నాఁడను.

ఉ. "కోకిల కాక" యంచుఁ దమగుట్టు బయల్పడఁజెప్పి. రందు వా
రీ కవిరాజశిష్యులనియే స్ఫురియించు గురుప్రదూషణం
బే కరణిం దలంకక రచించిరొ వారు కవీంద్రులై యసూ
యాకలనంబు పండితులకైనను నేమియుఁ దోఁపనీదుగా ।"

ఇట్లు, అడివి సాంబశివకవి.

(తక్కిన మఱికొన్ని వీరివాక్యములు గురుదక్షిణలో చూడనగు.)

మదరాసు, 18—8—1910.

విద్వన్మణీ!

తమ యసమాన ప్రజ్ఞామరీణత్వంబు నాకు చిరకాల శ్రుతంబు. కన్నులపండు వుగా మొన్న మొన్న బందరులో తమ దర్శనలాభము గలిగినది. "హృదయవచ శ్శరీరముల.... .... ....వదలక సాధుసద్గుణలవంబుల కొండలుచేసిమెచ్చుచున్.... ... మాన్యులు కొందఱువొల్తు రిద్దరన్" అను భర్తృహరి వాక్యము మీయందు బూర్తిగా వర్తించును. బ్రికృతమున శతావధానులను బిరుదు మీకే చెల్లినది. ఇక నీబిరుదు బొందువారు జనింపబోరని నాయభిప్రాయము. ఏలూరులో నామిత్రులగు వల్లూరి రామారావుపంతులుగారి కుమారుఁడగు చలపతిరావుశర్మ చేతికో "కవిత" యను పేర నున్న మాసపత్రిక సంచికలు రెండు, నాలుగు దినములక్రిందట జూచితిని. అప్పట నుండి భవదీయాకారములు మదీయ హృదయాగారమున కాపురముండి యిప్పుడీపద్య మును వ్రాయ బురికొల్పినవి గాన దీని నస్మదనేక వందనపూర్వకముగా తమసన్నిధి కంపినాఁడను. గనుక స్వీకరించుడు.

చ. తిరుపతి వేంకటేశ్వరుల తియ్యనిపల్కులు గల్గునే కవీ
శ్వరులకు జన్మజన్మముల సంయమివృత్తిఁ దపంబొనర్చినన్,
సరి యగు రామకృష్ణులనినన్ జనులెవ్వరు నవ్వరే వసుం
ధరను దదీయనామముల దాల్చిన నాటకవేషధారులన్.

ఇట్లు, విధేయుడు, * (నిష్పక్షపాతి)

కవితయను పత్రిక చూచినంతన మాయాకారము లేల స్ఫురణకు రావలెనో, వచ్చెఁబో, యిట్లేల వ్రాయఁబురికొల్పవలెనో చదువరులే విచారించుకొందురుగాక.

వీరి కవితాపత్రిక ప్రారంభించినది మొదలు మాకు సంబంధించిన దూషణమె దానికిఁ బ్రాణాధారముగా నున్నట్లు పైయుత్తరమువలన స్ఫుటమగుచున్నదిగదా! ఈ యంశమును బ్రాజ్ఞులైన పెద్దలేకాక చిన్నికుఱ్ఱలు గూడ గ్రహింపఁజొచ్చిరనుట కీ యుత్తరము సాక్ష్యమిచ్చును.

యింజరంమండి, 13- 1910.

"............ మీ మీఁద కాబోలు రామకృష్ణకవులు పిఠాపురంలో అచ్చుపడే పేపర్లలో కాకి, కోకిల, అవిపేర్లు పెట్టి కథవొకటి వ్రాసేయుచున్నారు....."

చక్రవర్తుల సుబ్బారాయనివ్రాలు.

---

* ఈ నిష్పక్షపాతిగారు తమ యభిజననామమును దెలుపఁ బ్రార్థింపఁబడు చున్నారు. (ఇట్లు కవితం గని వ్రాసినవారెందఱో కలరని యెఱుంగునది.)

బాలసామాజికులు మున్నుగువారనర్హముగ నడుగుట తటస్థించునా, యనిచెప్పఁదగుసంగతులెల్లఁ జెప్పి వారిసందేహముఁ దప్పించుచు వచ్చితిని. వారెల్ల "మీరీనిశ్చయము దేనికేనిఁ బత్రికకు వ్రాయుంపుఁడు లేనిచో మీరును వారి వ్రాఁత కంగీకరించినట్లే కొంద అనుకొందు' రని చెప్పినప్పటికిని సాక్షిగా నెన్నుకోఁబడ్డ నే నెవ్వరేని నడుగకుండ జెప్పుటొప్పదని యూరకొంటిని. అట్లూరకుండుటచే నీతండు మన యేవ్రాఁతకు నూరకొనునని కాఁబోలును మరల సత్యసందేశమని వ్రాయించుచునందులో సీ॥ "సన్నుతాచారుండు చిన్నవేంకటశాస్త్రి తనలోని దౌననుకొనుట చాలు॥" అని యానాఁటికృత్యమున కే నౌననుకొనినట్లు వ్రాయించితిరి. ఇంకను నే నిట్లే యూరకొనిన ముందుముఁదెటు లెట్టు లూహించి వ్రాయింతురో యను భయముచే నింతకంత దెలుపుకొనఁ దగినది దెలుపుకొను చున్నాఁడను.

మాయన్నగారగు బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రుల వారెట్టి సదుద్దేశముతోనాయూరునకువచ్చిరో యెట్టి సామర్థ్యము కలవారో యానాఁటిసభ యెట్టులున్నదో యదియెల్ల నెఱుంగు నే నాకృత్యమున కౌననుకొనమి యట్టులుండ నాసంగతి కొంచెమాలకించిన వారుసైత మట్టు లనుకొనరని నా దృఢాభిప్రాయము. ఇదియెల్ల నిటుంచి యొక మాట వినుఁడు. ఆ నాఁ డదివఱ కధ్యక్షులయి వినుచున్న బ్రహ్మశ్రీ అ॥ సుందరరామశాస్త్రులవారును బ॥ శ్రీ॥ వే॥ బ్రహ్మానంద శాస్త్రులవారును ఆయింటి యజమానులేయగు బ॥ శ్రీ॥ అ॥వ్యాసలింగ శాస్త్రులవారును నావచ్చు విద్యార్థులయు బాలసామాజికులయు సందడికి దందడించియే కదా యాస్థలము విడిచిపోయిరి. ఆయూరివారగుటచే వారవ్వారి విశేషమెల్ల నెఱింగినవారు కాన నటుముందే తప్పుకోనేర్చిరి, ఎఱుంగని వేంకటశాస్త్రులవా రెట్లుతప్పుకోనేర్తురు ? ఎఱింగిన పిమ్మట వీరును నట్లే తప్పుకోవలసి వచ్చినది. ఇప్పుడింత గొడవయేల ? ఇట్లువిద్యార్థులు మున్నుగువా రల్లరి చేఁతలు కల్లరి వ్రాఁతలు బయలు వెడలించుటకంటె సత్సభాంతరమునఁగదా వేంకటశాస్త్రులవారు "అతని చేతియూఁత నిన్నెదిరి జయింపరాదె యిటు లేటికి మూలముడుంగు పోఁడుముల్'' అని పద్యముఁ జదివిరి. అట్టులే నారాయణ శాస్త్రులవారును సత్సభనే యెదిరిననెంతబాగుగనుండునో యించుక యోజింపుఁడుఁ. ఇంతనెన్నఁడునిట్టి వ్రాతలు వ్రాయింపకుఁడు. మనమేది వ్రాయునప్పుడును నితరు లంతగాఁ బరిశీలింతురా యని యుపేక్షింపఁదగదు. ఇతరు లట్లంతగాఁ బరిశీలించినఁ బరిశీలింపకున్న నీశ్వరుఁడు మాత్రము పరిశీలించునను నమ్మిక దగును. మీరు మొట్టమొదట వేంకటశాస్త్రులవారిని దూఱుచు వ్రాయించితిరి. తరువాత శరణుగోరుచు వ్రాయించితిరి. మరల మొదటిదారిఁ జేపునే వ్రాయించితిరి. ఇట్టి వ్రాఁతల కెవ్వరైన హర్షింతురా ! మానుఁడు మానుఁడు మానుఁడు. చిత్తగింపుఁడు.

మ. జగమెల్లన్ జయపెట్టి నెల్లనృపసంస్థానమ్ములన్ స్వప్రశ
స్తిం గనంజేసి శతావధానకవితా ధీయుక్తిం బాండిత్య శ
క్తిం గడుం జేర్పడు వేంకటేశ్వరకవిన్ దీండ్రించి యజ్ఞుండటం
చగునే వ్రాయంగ? దీని కెందెవరు నేనౌనందు రం చెంచిరే।

గీ. ఓడెనని వ్రాయుమంతనే యోపినట్లు। వేంకటకవీంద్రు దలంతురే విద్వదట్ల
నిట్టి మీ వ్రాంతలకును మీయట్టి చేంత। లకునునోడినయట్లు తలంత్రుగాక.

చ. తలంపకుండయ్య వేంకటవధానిని నన్యునిపాటివానింగా
సలుపకుండయ్య తజ్జయమునల్పం బ్రయత్నము నిట్టి వ్రాంతతో
బొలుపకుండయ్య లేనివియుం బోనివియున్ మఱివారిపేరిపై
గొలుపకుండయ్య మాఱుపలుకుల్ పలుకన్ శరణన్న నాలుకన్.

ఇట్లు, చెళ్ళపిళ్ళ చినవెంకటశాస్త్రి.

ఈకబ్బము చదువువా రొకరహస్యము నెఱింగి మఱియుం జదువవలయును, పేరు గూఢముగా మమ్ముం దిట్టి ప్రకటించిన ప్రతివిషయమును దమంతటం దామే యిటీవల బయలు చేసికొనుచుందురు. గ్రంథవిస్తరభీతిచే నట్టిదొకటిమాత్ర ముదాహరించి తక్కినవి చూచుకొనుభారము చదువరులకే వదలుచున్నాండను.

తే. గీ. "…… సుయోధనుండు
ధైర్యమును గోలుపోయి యెద్దానడాంగి
నాండొ యదియొండు ద్వైపాయన హ్రదంబు
…… …… ……"

ఈ ద్వైపాయన హ్రదమునొద్దున నేదో చెట్టుమీంద వసించు కాకమునొద్ద గోకిలగానము చెప్పికొనినట్లును, అది చప్పని ముక్కలే చెప్పినట్లును పిదప నేమో యయినట్లును వ్రాసికొనియున్నారు. (కోకిలకాకము చూడుండు.)

"చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ద్వైపాయన హ్రదమునుండి బయలు వెడలి" (24 నవంబరు 1911 సం॥ కృష్ణలోని పరాన్తపాశుపతము చూడుండు.)

పేరుపెట్టివ్రాసిన యీవ్రాంత పైదానిగుట్టు బయటం బెట్టినదని కుఱ్ఱలకుంగూడ సుగమమే. వీరెన్నివిధముల నేని గప్టించి మాకపయశము గూర్పవలయునని పడు పాటులకుం బరిమితిలేదు. ఇందుకై తమకుం బరిసక్తిలేని యితర విషయములలో యథార్థమెఱింగికూడం గలుగంజేసికొనుచున్నా రనుట కీక్రింది యుత్తరమేకాక వారి పరాన్త పాశుపతములోని కొన్ని పంక్తులను పండిత బ్రువముపై వీరొసంగిన యానందపూర్వకాభిప్రాయము సాక్ష్యమీంగలవు.

"............... ఓలేటి వెంకటరామయ్య విజయముచేసి............చెప్పి యింక యెక్కడి తిరుపతి వేంకటేశ్వరులు, పని అయిందని అన్నాడు. ఒక మీసము కొప్పరపువారు తీసివేయిస్తారు, ఒకటి మేము తీసివేయిస్తాము. అన్నాడు............"

చక్రివర్తుల లింగమూర్తివార్లు. 6—9—11.

"ఆహా॥.... .......... తిరుపతి వెంకటేశ్వరుల శతావధానముఁ జూడఁబోయి గుంటూరునుండి వచ్చుచున్నాఁడను. కవి॥ శతావధానుల కేమిబహుమతి చేసినారు? ఆహా॥ ప్రస్తుతము నూటపదియార్లు బహుమతి చేసినారు. వెనుకనుండి పతకములు పంపెదమని చెప్పినారు. ఏది యెట్లున్నను అవధానముమాత్రము నిరాఘాటముగా జరిగినది. కవి(నవ్వుచు) అవధానముమాట మిమ్మెవ్వరడిగినారు? అదియెట్లుజరిగినదో మాకిదివరకే తెలిసినదిలెండి. మీరావిషయమయి వేరే శ్రమపడనక్కరలేదు. ........ ................"

(26 వ తేదీ జనవరి 1912 సం॥ కృష్ణాపత్రిక చూడుఁడు.)

"పండిత బ్రువలక్షణము,................0—1—0. ఇది రామేశ్వరకవి గారిచే రచింపఁబడినది. ఈ గ్రంధము శృంగభంగమైన పండితుని గుఱించి వ్రాయబడి యున్నది. దీనిం జదువుకొనిన ప్రతిపక్షి యిఁకమీఁద "బళ్యాం పుళ్యాం" చేయవలయుఁగాని గత్యంతరములేదు. రసవంతమగు నీగ్రంథమునుండి రసవత్తరఘులగు కొన్నిపాదము లుదాహరించెదము.........................."

(విరోధికృన్నామ సం॥ పుష్యమాఘమాసములు కవిత 8-9 సంచికలు చూడుఁడు")

వీరిట్టియభిప్రాయ మిచ్చి మెచ్చిన పండితబ్రువలక్షణమును దత్రీపు వాస్తవ్యు లెట్లు నిరసించుచున్నారో పరికింపుఁడు.

నరసారావుపేట, 20—12—1911.

"...............ఇక్కడికి వచ్చునపుడు గుంటూరులో దిగినాను. అక్కడ పండితబ్రువలక్షణమను పుస్తకమును జూచినాను. * లుడు తప్ప మఱెవ్వడును అట్టితప్పుడు కూతలు వ్రాయడు................"

చావలి వెంకటకృష్ణయ్య.

ఈయన బి. యే. పఠించుచున్న విద్యార్థి. ఈయననిట్లుంచి ఒక పెద్ద గవర్నమెంటు ఆఫీసరుగారు పండితబ్రువము గని యెట్లు వ్రాసిరో తిలకింపుఁడు.

గుంటూరు, 29—11—11.

"...............అను పిల్లవాడొకఁడు వ్రాయు వ్రాతల దౌర్జన్య మిట్టిదని చెప్పుటకు వీలులేకున్నది. ఆసంగతి లోకులే యోచింతురుగాక. తమవంటి పండితోత్త

ములు అటువంటి నీచపువ్రాతలకు జవా బివ్వఁబూనుట అనవసరమని నాకు తోఁచును. తమయభిప్రాయముకూడ నటులనే యుండవచ్చును ........ "

ఇట్లు విద్యాధికులగు తత్సమవాసు లనేకులు నిరసించుచున్నట్టియు మాపై వృథాగాఁ గాలుద్రవ్వి పాటిపోయిన వారి నుద్ధరించుటకై యెవరోమమ్ముఁ గసిదీఱఁ దిట్టి వ్రాసి యెవరిపేరనో ప్రకటించిన "ఆకాశరామన్న" యర్జీ యనఁ దగునట్టియు వ్రాఁతఁ మాశిష్యులకుఁ గర్ణరసాయనమగుటయు, యూనివర్సిటీ వారిచే బి. యే. పరీక్షకుఁ బఠనీయముగా నియమింపఁబడిన మా పాండవాశ్వమేధము నింద్యమగుటయుఁ జదువరులు మనస్సున నిడికొని మఱవకుందురుగాక. వీరిప్పుడు మమ్ము వంచించుట కెట్టి వారిస్నేహమును జేయుచున్నారో స్పష్టపడినదిగదా ! వీరికి సత్యాసత్యము లక్కఱలేదు; ప్రాజ్ఞుల సమ్మతి యక్కఱలేదు. ఎట్లో తిరుపతి వెంకటేశ్వరులను నిందించుటయే కావలసినది; ఒని తెల్పుటకింతకన్న విస్తరింపనక్కఱలేదని యుపేక్షింపఁబడియె. ఇట్టి పనులు తప్పని బోధించుటకును నీతిని గఱపుటకును నేర్పడిన మా గీరతమును వీరు వీక్షింపక పూర్వమే యిట్లుతిట్టుచున్నారు.

"..............చ॥కుక్కమూతి పిందియయను గీరతమ్ముచటఁ............

ఉ॥..............నన్నయభట్టు భారతమొనర్చి యశంబు గడింపఁ జూచి యీ గిన్నయభట్టు........."

(జనవరి 26 వ తేదీ 1912 సం॥ కృష్ణచూడుఁడు.)

"హితం మనోహారిచ దుర్లభం వచః" వారును వారినే యనుసరించు పండిత బుధవమువారును మెచ్చుకృతులు వేఖ, వారితో నేమి, ప్రత్యక్షముగా విన్న ప్రాజ్ఞులిటు శ్లాఘించుచున్నారు.

"......ప్రతిపదనీతి పారంబగు గీరతంబును గర్ణరసాయనముగ సాన్వయముగఁ జదివి సభ్యుల కానందం బమందమ్ముగం గల్పించిరి.''

కైవారం వెంకటలక్ష్మీనరసింహం

"మధుర గీరతు లీకథ సత్కరింతురంచు"

శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు, గుంటూరు కాలేజీ సహోపాధ్యాయులు, బి. ఏ. యల్. టి. గారిచే రచింపఁబడిన సుమనోవతంసము చూడుఁడు.

సీ. "మీ గీరతామ్నాయ మేధావిశేషంబు

గని వ్యాసమూర్తులం చనఁగవచ్చు"

వారణాసి శ్రీనివాసరావు.

క. సాంతరసీతి బోధా ధారం బయి విబుధ ధర్మ దర్పణ మగుమీ
గీరతము భారతమువలె ధారుణి వర్ధిల్లుననుట తథ్యము కాదే॥ ౧ ॥

క. గురుశిష్య సంప్రదాయము లరుదై నశియించు పాప మాసించెడు నీ
తరుణము నలుపఁదగు తదు ద్ధరణము మీగీరతంబె ధర్మాగమమై॥ ౨ ॥

రాయప్రోలు వెంకటేశ్వరశాస్త్రి.

"…………ప్రతిపద ధర్మ బోధకమగు మీగీరతము తజ్ఞు లందఱి కన్ని తెరంగుల మహోపకృతి గావించునని నా గట్టి నమ్మకము…. ……… ………

గూడ చిదంబరశర్మ.

"…………పెక్కునీతుల కాకరమై మాబోటి విద్యార్థులందఱు చదువుకొన నర్హమైనశయ్యగలదైన తమ గీరత మొక్కటి అచ్చైన వెంటనే, వీ. పీ. గా నాకు దయచేయుఁడు." ఇట్లు విధేయుఁడు, కోపల్లి నరసింహారావు.

గీ. "వెళ్ళపిళ్ళ కులాంభోధి శీతకిరణ । వేంకటేశ్వర కవిచంద్ర వీ-పి- గానె
కరుణఁబంపుఁడి గీరత గ్రంథ మొకటి । భారతమురీతి ధర్మముల్ పలుకునండ్రు

కందాళం నరసింహాచార్యులు

"…………మయా సుహృత్సమ్మితత్వేన నీతిదాయ కేతిహాస పురాణా దివ స్నీతిదాయక గీరతశ్రవణలాభః గర్తపుర్యా మవధానార్థ మాగమన సమయే సమజని.

…………గీరతస్య చక్షురక్షరసంయోగజన్యానందః కదా వా భవిష్యతి."

ఏవం సుజనవిధేయః ధూళిపాళ్ళ సూర్యనారాయణశాస్త్రిణా మంతేవాసీ, పప్పు సీతారామశాస్త్రీ, జానపాడు గ్రామనివాసీ.

"…………తాము గుంటూరుకు దయచేసినప్పుడు గీరతమునం దాయా భాగములు చదువగా వినియుంటిని, మాబోట్లు తెలిసికొనఁదగిన పెక్కునీతులు న్నట్లు గోచరించినవి…………

తంగిరాల సత్యనారాయణ.

"………… ఇంకను మీగీరతఫలమ్ము లనేకములున్నవి, వానివ్రాయఁ దొడఁగిన దానిపై వ్యాఖ్యాన మగునని యింతటితో విరమించుచు…."

చావలి వెంకటకృష్ణయ్య

ఉ. "శ్రీపరదేవతాపద కుశేశయబంభర । దివ్యకావ్య బం
ధాపర కాళిదాస । విబుధాదరపాత్ర । విధేయభూత పృ

ధీపతి । చెళ్ళపిళ్ళకుల వేంకటశాస్త్రి శతావధానిగా
రూ; పలుమారు గొల్తు మిము రుచ్యపుగీరత మంప వీ-పి-గాఁగా॥ ౧ ॥

ఉ. అచ్చున నుండఁగానె వెల నారయకే తమ గ్రంథ మన్నచో
వెచ్చటి వారుగూడఁ దమకెన్నియొ లేఖలు వ్రాసి వీ-పి- గా
నిచ్చటిమాకుఁ గొన్ని ప్రతు లిప్పుడె తప్పక పంపుఁ డంచుఁ బె
న్మచ్చట మిమ్ము వేఁడెదరు మోద మొసంగు రసం బెసంగుటన్॥ ౨ ॥

క. ఈ కథను బట్టి చూడఁగ । నాకొక గీరతము దొరకునా లేదా ? యం
చీకరణి మరల వ్రాసితి । వే కరుణన్ బంపుఁడయ్య వేంకటసుకవీ !"॥ ౩ ॥
స్వయంపాకుల సీతారామమూర్తి.

గీ. "కుకవిగజరాజమృగరాజ । సుకవి సింహ । వేంకటేశశతవధాని వెనుకఁదమరు
గర్తపురి కేగు దెంచిన కాలమందుఁ । జవివితిరి గీరతము నీతి చౌకళింప.

చ. వినిరిగదా । మహామహులు వీనులవిందుగ గీరతోక్తులన్
గనిరిగదా । భవన్మహిమఁ గ్రాలెడి తత్కృతిలోనినీతి చే
కొనిరిగదా । ప్రశస్త గుణకోటి సముద్భవ మోదమై ఖరుల్
ఘన కవనావనోదయవికస్వర గీరత మెప్డు వచ్చెడిన్॥ ౨ ॥

తే. గీ. నీతిదాయక మయి మహానియతిఁ బొలయు
తత్కృతిని నమ్మువేయించి త్వరితముగను
మోదవారిధి నెల్లరనీఁదఁ జేయుఁ
డయ్య వాకొక్కప్రతిఁ బంపుఁడయ్య వీ. పి."
గుండెపూడి శంకరనారాయణ.

"..........శ్రీ రాజాగారి పట్టాభిషేక మహోత్సవదినమందు (12-12-11) బాలురకు బహుమతులు యివ్వదలచినాము గాన ఈ క్రింది పుస్తకములు ఆతేదిలోగా మాకు అందేలాగు వెంటనే, వీ- పీ- గా పంపగోరెదను.

గీరతం, 1 వ భాగం — తిరుపతివెంకటకవులవి. గురుదక్షిణ — లోకాభిరామాయణం"

జే. విశ్వనాథం హెడ్ మాష్టరు. బోర్డుస్కూలు, దాచిపల్లి పోస్టు, గుంటూరు.

ఇవి యన్నియు గుంటూరి సీమలో విన్న వారు వ్రాసిన యుత్తరములని యెఱుఁగఁదగు. మఱికొన్ని మూఁడవభాగంబునందుఁ జూడందగు.

ఇట్టివి కొన్ని వందలు గలవు. మఱియు నీ గ్రంథము ప్రకటించుటకుఁ బ్రయోజనము గురుభక్తియుఁ గృతజ్ఞతయుఁ బ్రీతి మనుజునికి నావశ్యకమని తెల్పుట యొకటియు వెంకటరామకృష్ణులు మాపై వేయు నిందలయందలి సత్యాసత్యము

లను సమీపస్థులు గుఱితించినను దూరస్థులు గుఱితింపక మాపై౯ బడుదురలిపొ్రియ మును మరల్చుట మఱియొకటియు నని తెలిసికొనఁదగు; ఈక్రింది యుత్తర మును జూడుఁడు.

"…………యిచ్చట యిదివరకు తమ పేరు చాలా ప్రతీతిగా యుండెను. ఇప్పుడు రామకృష్ణకవులచే ……. శృంగభంగ ……. ఇంకా కొన్ని గ్రంథ ములు యిచ్చట విచ్చలవిడిగా యుంటచే మీసారము తెలియని కొందరు………… అది మనుటోటి కొందరికి మాత్రం చాలా కష్టతరముగా నున్నది…….మీవిమర్శన ముండినయెడల సరే, లేనియెడల లిఖించి కొద్దికాలములో………లును,………లును నగు గ్రంథములు కొన్ని ……. పంపినచో ……. యీ నెల 19 వ తేదీ పొతకమూరులో జరుగు సభలో నుపన్యసింపగలను…. …"

దొనకొండ రైల్వేయిలాకా ఇత్థం

చందలూరు పోస్టు గాడిపల్లి రాఘవయ్య, విద్యార్థి.

ఇట్టు లనేకులు సత్యనిర్ధారణైకతత్పరులయి యీగ్రంథమున కెదురు చూచు చున్నను గార్యాంతరాసక్తులమైన మేము వారి కోరికను దీర్పలేకయే పోవుచుంటిమి. వీరి తుందుడుకును వారింపఁదగు ప్రాజ్ఞులు వారింపకపోవుదురాయని ప్రతీక్షించితిమి. గాని వారును సమ్మతించుటచేఁ గాఁబోలు, నానాఁటికి వారొనర్చెడి గోల బొమ్మ జెవుడు. కంచెవలె నలమదొడఁగుటచే నప్రయత్న సిద్ధముగా దొరకిన యాధారముల నుదాహ రించుచు "సత్యం వద" యను నుపనిషదర్థమున కుదాహరణముగా నీకబ్బము హూర్చఁబడినది. అలంకారములు కావ్య పోషకములు గాన వానిని బ్రధానములుగాఁ జూడక సత్యాంశములను దిలకించు చున్నచోఁ జరిత్రమంతయు విస్పష్టముగాఁ దెలియఁగలదు: ఇది చదివి సత్యమును తెలిసికొననెంచు ప్రతి పరిశీలకుఁడును ఈ క్రింది యంశములను సదా జ్ఞప్తియందుంచుకొనఁదగు.

1. శిష్యుఁడు కృతఘ్నత కుపక్రమించిన తేదీ కీలక సం॥ ఫాల్గునము.
2. గురు వీ విషయమై శిష్యుని బ్రశ్నించిన తేదీ సౌమ్య సం॥ జ్యేష్ఠము.
3. అతఁ డట్లడుగఁబడి యెదుట నుత్తరమీలేక పిమ్మట నానారాజసందర్శనము లోని మనముల పద్యమునకుఁ దగులునట్లు వెక్కిరించి పద్యముచెప్పి ప్రత్యుత్తరమిచ్చిన ట్లభినయించిన తేదీ సౌమ్య సం॥ ఆశ్వయుజము.

తరిచి చూచిన వెం॥ రా॥ గ్రంథమాలలో వీని కాధారములు పూర్తిగాఁ గలవు. వలయువా రందుఁ జూడవచ్చును. పిమ్మట, ఈశ్వరవేరు లోనగు ప్రల్ల దములు పదపడి తిరుపతిశాస్త్రిగారి రిజిష్టరుత్తరము. పర్వనామము లన్నియు సార్థక

ములు. "వాసింగన్న" అను పదముగల పద్యముంగూర్చి వ్రాసినదానికి "వాసింగన్న పద్య" మని పేరు. ఇట్లే తక్కినవియు నని యెఱుఁగఁ దగును. వ్రాసినకొలఁది వ్రాయవలసియే యుండును గాన నిఁక ముగింప నెంచుచున్నాఁడను. జాగరూకులై తిలకించువారికిఁ గర్భమువలననే సర్వమును దేట తెల్లమగును. జాగరూకత యనఁగా నిట్టిది:— కాఁకరపర్తిలోని యల్లరిని "శృంగభంగ" మని శిష్యసహచరుఁడు మఱి కొందఱు తనకుసంబంధించిన కూటమువాండ్రితోఁగలిసి వ్రాసి తన బావమఱఁదిపేరఁ బ్రికటించిన ట్లాసందర్భఘట్టమునందలి యుత్తరములవలననే తేలును, ఆయుత్తర ములలోఁ జాలవఱకు వేమలవారివియుఁ జర్లవారివియునై యున్నవి. ఆ యీ సంద ర్భములు జాగరూకతగా విమర్శించినఁ గాని తత్త్వము తేలదు.

ఈయుగమందేగాక వెనుకటి యుగములయందుఁగూడ సత్య మసత్యముచే ఛాదింపఁబడుచుండుటయు దానిని బండితులు తమ ప్రజ్ఞానేత్రిముచే బయటికిఁ దీయు చుండుటయుఁ గలదని రామాయణాదులలోని కొన్ని భాగములవలనఁ దెలియుచున్నది. సత్యసంధులకు బంధుత్వాదికముకన్న సత్యమునందె యెక్కుడు ప్రీతియుండును.

(ఈభారతము చూడుఁడు.)

"చ. నుతజలపూరితమ్ము లగు నూతులు నూరిటికన్న సూనృత
వ్రిత ః యొక బావి మేలు మఱి బావులు నూఱిటికన్న నొక్క స
త్క్రితు వది మేలు తత్క్రితుశతమ్మునకన్న సుతుండు మేలు త
త్సుతశతకమ్ముకన్న నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్.

అట్టి సూనృతమును గప్పిపుచ్చు వారి వ్రాతలనుండియే బుద్ధిమంతులు సూనృ తమును దీయఁగలుగుదురు. కావున ననృతాధారమునఁ బ్రివర్తించువారి వ్రాఁతలు తాత్కాలికముగాఁ గొంతవఱకుఁ బనిచేసినను నిజము నిలకడమీఁద దేలఁగలదు గాన ననృతాత్మల వలని యపవాదలకుఁ బ్రాజ్ఞులు విశేషించి జంకవలసిన పనిలేదు.

"శ్లో. "జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాం యశః కాయే జరామరణజం భయం"



## చదువరులకొక హెచ్చరిక.

మా చుట్టుపట్టులవారికిఁ దెలిసినను దూరస్థులకుఁ గాఁకరపర్తికి సంబంధించిన పర్వములయందలి పరస్పర సంబంధములు తెలియుట కడు దుర్ఘటము. కావున నీ యంశములు వ్రాయఁబడుచున్నవి. అల్లరికిఁ గారకులగు ఆకుంది సీతారామయ్యగారు, రామకృష్ణకవికి పినమామగారును, శ్రీవ్యాసమూర్తి శాస్త్రిలవారికిఁ దమ్ములును, నని యెఱుఁగఁదగు. ఈయన నాఁడుకాఁకరపర్తిలో నున్నను, నిత్యము నివసించుగ్రామము ధవళేశ్వరము. వ్యాసమూర్తిశాస్త్రిలు అనువారిద్దఱు ఈయిద్దఱిలో నొకరికి వ్యాసలింగ శాస్త్రిలు అను నామాంతరముగూడఁ గలదు. ఆయీసభలలో నున్నట్లు వర్ణింపఁ బడినవారు వీరే. 77 వ పుటలోని యుత్తరమున నున్నవారును, వీరేయని యెఱుఁగఁ దగు. మఱియు నాపుటలోనే "పు. గవరయ్య" అను వ్రాలు గల యుత్తరము వేఱొకటి కలదు. ఆయన వినయార్థ మట్లు వ్రాలుచేసిరి, గ్రంథములలో "గౌరీపతిశాస్త్రి" అని వ్రాసినవి వారినేయని యెఱుఁగఁదగు. చర్ల చలపతియను నతఁడు రామకృష్ణ కవికి బావమఱఁది. తరిచిచూచినచో నాయీవిషయములును రహస్యములును దేలును గాని ప్రతిచదువరియును అంత తరముట తటస్థింపదు. శృంగభంగమును జదివికొని ప్రశ్నోత్తరరూపమున నున్న యుత్తరములు చదువుకొని అందలి పేళ్ళను, ఉత్తరములయందలి పేళ్ళను, ఎవరెవరివో మనమునకుఁ బట్టించుకొని చప్పట్లపర్వమును జదివికొన్నచోఁ జరిత్ర మున్నదున్నట్టుగాఁ దేలెడిని. ఉత్తరములన్నియుఁ జదువని యెడ 77 వ పుటలోని ఉత్తరములవలనకేనిఁ జదివికొనిన సత్యస్వరూపము చాలభాగము తెలియఁగలదు. ఏమి పాపమో వీరు మొదటినుండియు నసత్యప్రకటనకుఁ గడు సాహసించుచున్నారు. వారి గొప్పఁదనమునకుఁగాఁ బాటుపడు విషయము మా కవసరము లేదు గానఁ బీఠికలో నొక విషయము సూచించి విరమించితిమి. ఉభయశాస్త్ర ప్రవీణత్వము వీరికిఁ బదిమాసములలో వచ్చినట్లూహింపనయ్యెడిని. జయంతి భగీరథ శాస్త్రిలవారివద్ద తిజంతము మొదలిడి రెండుమాసములు చదివి మానివేయునప్పటికి కీలక సం॥ వైశాఖము ప్రవేశించినది. ఆ సం॥ ఫాల్గునములోనే వీరు పిఠాపురమునఁ బ్రవేశించిరి. అదిమొదలు "ఉభయశాస్త్రప్రవీణ" అని వ్రాసికొన మొదలిడిరి. పదిమాసములలో సిద్ధాంతకౌముది తిజంతము మొదలు యాపత్తును. బూర్తి యగుటయేగాక ఇంకనుమిగిలిన వ్యాఖ్యానములు భాష్యములోఁ గొంతభాగమునుజదివి తర్కముగూడఁ జదివినారు. ఇందులో నిఁక నొకచమత్కారము, రెండుమాసములు జయంతి భగీరథశాస్త్రిలవారివద్దఁ బుస్తకముపట్టి వదలినతరువాత గురువెవరో తెలియదు. అతనినిప్పుడు క్రొత్తగా సృష్టింపవలసి యుండును- ఈయంశమంత ముఖ్య

ముకాదు. "ప్రిపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః" కావచ్చునుగాని సత్య నిర్ధారణకుఁ మాకుఁ దోడ్పడు విషయముగానఁ జర్చించవలసితిమి. చదువకయే ఉభయశాస్త్ర ప్రవీణులు వెంకటరామశాస్త్రులవారైరిగదాయని కాఁబోలును. రామకృష్ణ శాస్త్రులవారు సభకురాకయే యింటను దాఁగియుండి విజయమును బ్రకటించికొనిరి. ఇంత యప్రౌఢపు వ్రాఁతలను విమర్శించుటయే తప్పుగాని లోకసామాన్యముకొఱకుఁ గష్టించుచుంటిమి. విస్తరము గురుదక్షిణ లోనగు భాగములలోఁ జూడఁదగు. మీమీ బుద్ధిబలమునఁ గూడ విమర్శింపఁదగు. రాఁబోవు పర్వకథకు సూచకముగా సత్య సందేశమునుండి యెకపద్య ముదాహరించు చున్నాఁడను. ఉ॥ "నీయపకీర్తి కజ్జలము నిల్పఁగనే మహనీయుఁ డాడఁగా నేయెడ నుప్పవించినదొ యీశ్వరవే రనుదివ్వె సార్ధకంబాయె, భవద్భృదాంధ్య మదుగంటఁగ వెల్గెను గారవల్లిలో, జేయనకింక నీవెడఁగు సిగ్గిలకున్నచదేమి పగ్గెయో" చూచితిరా! తనకై తనసన్నిహితులొనర్చిన మహాకార్యమునకు నేను సిగ్గిలవలెనఁట! తనబావమఱఁది పేరఁ బత్రికాముఖమునఁ బ్రకటించిన తన శృంగభంగమును జూచి ప్రాజ్ఞులెంత గర్హించినను దాను సిగ్గిలవలసి లేదు గదా! తనబదులు తన సన్నిహిత బంధువులబదులును గూడ నేనే సిగ్గిలుదుఁగాక. విశేషమక్కఱలేదు గాని ఆనాఁటి కరతాళమహా హావకర్తలతో నొకసారి ప్రాజ్ఞమహాజనులుందు సభకువచ్చి యీపద్యమునే చదివివారిని మెప్పించినచో నతని సార మొక యరనిమిషమునఁ దేలెడినిగాని యది యీజన్మ మధ్యమునఁ దటస్థించునని తోఁచదు. కావుననే యీయీ ప్రల్లదములనెల్ల మహావాక్యములుగాఁ గైకొని ఈమహాభాష్యము వ్రాసి సత్యనిర్ధారణమునకై పాటుపడవలసి వచ్చినదని ప్రాజ్ఞులు తలంతురుగాక. ఇప్పటికి వెలువడిన వీరి ప్రల్లపములలో నూటి కొక్కటివంతున నెత్తిచూపితిని. నిన్ననేఁడు వచ్చు ప్రల్లదములు మఱియును ఘోరముగా నున్నవి. "బాంచోద్ధలం కోరుపాక" మఁట, యేదోఅఁట। ఏదోఅఁట అవియన్నియుఁ జదువరులే విమర్శింతురుగాక! ఓం స్వస్తి.

తిరుపతి వేంకటేశ్వరులు

శతావధానులు.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# * గిరతము *

## అధిక ప్రసంగ దమనము

### (1) వాసింగన్న పర్వము

శ్లో॥ శ్రీ స్సర్వత్ర విజృంభతాం విజయతాం సంఖ్యావతాం గౌరవం
భక్తి ర్భాతు కృతజ్ఞతా భగవతీ ప్రత్యక్షతా మశ్ను తాం
చర్లబ్రహ్మసుధీంద్రదేశికకలా శిష్యప్రశిష్యాత్మ నా
నానారాజసభాంతరేషు రమతాం గీ రేభతాంగీరతే.

క. శ్రీ తిరుపతి నామప్ర • ఖ్యాతమహాపర్వతముస నాప్తవిజయని
ర్మాతవయి యొప్పెదఁట ః కా • దా ః తంద్రీ వేంకటేశ ? తత్త్వవిదీశా. 2

శా. రాముండెవ్వఁడు కృష్ణుఁ డెవ్వఁడను చర్చల్ త్వత్కళాలేశవి
శ్రామస్థానములే యటం చెఱుఁగుపై శాంతించు నోదేవ ః సు
శ్రీమంతంబులు నీగిడల్ గనిన నిన్ సేవించినన్ నీగుణ
గ్రామంబున్ వినుతించినం గలుగు వేడ్కల్ వేంకటేశప్రభూ. 3

శా. "వాసింగన్న కవీశ్వరుం" డయిన నెవ్వాఁడైన సాక్షాత్తుగా
వ్యాసుండైనను బ్రహ్మదేవుఁడయినన్ ఫాలాక్షుఁడైనన్ "దుర
భ్యాసుం" డంచు గురున్ వృథా దెగడి తా నన్యాపదేశమ్ముగా
వ్యాసమ్ముల్ ప్రకటించు టొప్పగునె దేవా ః వేంకటేశప్రభూ. 4

శా. "వాసింగన్న కవీశ్వరుం" డఁట ః సభన్ "వర్ణింపఁబోఁ"డంట ః సం
తోసంబే యటులూరకున్నయెడ నేదో సాకు గల్పించి పే

* ర్వాసిం జెందినదేశికుం దెగడఁగా వచ్చుం గదా, వానిదౌ
మీసంపున్ మెలి నేటి కెత్తవలెసామీ, వేంకటేశప్రభూ ।

శా. "వాసింగన్న కవీశ్వరుం" డయినఁ గావచ్చున్ గురుంగూర్చి "కా
కీ। సీ। హా"షని"శృంగభంగ"మని 'హీహీ' యంచు 'హహా' యంచనున్
"మీసా" లంచును వెక్కిరించుననె। యేమీ కాలమాహాత్మ్యం । మే
మీ సద్బుద్ధి । కృతజ్ఞతాగరిమ మేమీ । వేంకటేశప్రభూ ।

---

*శా. ప్రాసంబున్ యతియున్ విరుద్ధగతిశబ్దంబుల్ ప్రయోగించుచున్
మీసమ్ముల్ మెలిపెట్టి "మాకుపమ మేమే" యంచు నెందున్ దుర
భ్యాసం బొప్పగ నుండువారు కవులై పద్యమ్ములం జెప్పినన్
వాసింగన్న కవీశ్వరుల్ సభలలో వర్ణింతురే వారలన్.

(వేంకట రామకృష్ణ గ్రంధమాల 66 వ పుట)

ఈ పద్యము వీరు మమ్మునుగూర్చి వెక్కిరించిన వెక్కిరింపులకెల్ల మూలవి రాట్టనందగునాందియు వటబీజప్రాయమును నని యెఱుఁగఁదగు. ఇందలి మొదటి చరణము మమ్మునుగూర్చి వెక్కిరించినదే యనునంశము వారు మా పాండవాశ్వమేధమును చాలు మూలములేక వెక్కిరించి ప్రకటించిన శతఘ్నియే వేనోళ్ల ఘోషించెడిని. ఇఁక రెండవ చరణములోని మీసముల వెక్కిరింపును మమ్ముఁగూర్చినదే యను నంశమును ఈ క్రింది పద్యమును జదివి సులభముగాఁ దెలిసికొనవచ్చును.

ఉ. దోస మటం చెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుభాషలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా
రోసముగల్గినన్ గవివరుల్ మము గెల్వుఁడు గెల్చిరేని యీ
మీసము దీసి మీపదసమీపములం దలలుంచి మ్రొక్కమే.

(నానారాజ సందర్శనము చూడుడు.)

ఈ విషయము కాఁకరపర్తి పర్వములో విస్తరించి చూడఁదగు. ఇఁక నాల్గవ చరణములోని యంశమో, అయ్యది నేను శిష్యునితో నంతకు 4 మాసములకుఁ బూర్వము నాగురుత్వ గోపనముంగూర్చి యడిగినదానికిచ్చిన ప్రత్యుత్తరము ।

* ఆ. వె. సరగ "నిక్కనాముజాతి" యంచును "గడ్డి
పోఁచలే" యటంచు నీచసరణి
బుర్రివ్వఁ దిట్టి గురుని బూజించిరే శిష్యు
లెవ్వరేని వేంకటేశ చెపుము ! 7

• ఆ. వె. దురిత మనక "పిచ్చితో మ్రగ్గుచున్నాఁడు
గురుఁ" డటంచుఁ జాల గోలచేసి
యతనిబందుగులకు నార్తి గల్పించి రే
శిష్యు లెఱుఁగఁ జెపుమ శ్రీగిరీశ ! 8

---

* వెంకట రామకృష్ణుల వెక్కిరింపులు : (1) "ఇది నిక్కనాము జాతిలోనిది. (2) అరసున్నలేమి గడ్డిపోఁచలే ! (3) వెంకయ్య వ్యాకరణజ్ఞానమే, (4) బాలవ్యాకరణమురామి నిట్టి తప్పులు గల్గుచుండును, (5) విజ్ఞుపీఁగుట.... .." విస్తరము శత ష్నియందే చూడఁదగు. నిక్కనాము జాతి యన్నచో నెట్టిసదుద్దేశము పొడకట్టుచున్నదో సహృదయులు పరికింపవలయును. ఆయీసందర్భమెల్ల, మీసముల వెక్కిరింపుఁ బద్యములలోని ప్రథమచరణమునకు వ్యాఖ్యానమగునో కాదో విజ్ఞు లూహింపఁగలరు.

• ఒకరిటు వ్రాయుచున్నారు.

"............నిన్న వెంకటరామయ్య కాకినాడ కోర్టుకు వచ్చినాఁడట. అక్కడ వెంకటశాస్త్రిగారికి పిచ్చియెత్తినదనియు............నపభ్రంశములు..........మాయింట్లో నుండు ఆచార్యులుగారు పాప మాదుర్దాతో నన్నడిగినారు..........పిఠాపురం గగ్గోలు అయి పోవుచున్నది ........."

వేఱొకరిట్లు వ్రాయుచున్నారు.

"............పిఠాపురం గ్రామంలో, తమకు మతి పోయినటుల చాలామంది చెప్పుకుంటున్నారట. ఆసంగతి మా భావమరది యిచ్చటికి వచ్చి నన్ను అడిగినాడు ............యీమాట విన్నది మొదలు నాకు యేమీ తోచడంలేదు............కులాసాగా వున్నవయినం వ్రాయిస్తేగాని నామనస్సు స్థిమితపడదు.........."

మఱియొక కవిగారిట్లు వ్రాయుచున్నారు.

"............తమకీర్తి జగద్విక్రాంతమైనది. ఒక మహారాజాధి రాజులకైన రానేరదు............తమ శిష్యవర్గములో జేసినకీర్తికిని శ్రేయమునకును నిదానమని యెఱుంగక జిహ్వ బుర్రివ్వగ దురుక్తుల నాద నుంకించుచున్నారు ........."

శా. దేవీభాగవతమ్ము (1) బూతనుచు సందేహింపకే తిట్టె నే
మీ పిడ్డూరము! మమ్ముఁ దిట్టుటకు సామీ! (2) నిన్నుఁ దిట్టెన్‌వృథా
"దేవునై గురునై" యటన్నగతి గాదే యీ ప్రసంగంబు జ్ఞా
నావిర్భావము గల్గఁ జేయుటకునై యత్నింపు మోదేవరా! 9

మ. కలుగంజేసికొనంచగుణా భవదుపేక్షన్ ధర్మముల్ వోవు నీ
తలఁ పిం దెక్కడయేని మాతలపయిం దద్భారమున్ మోపు మో
కలికాలాధిప. వేంకటేశ్వర! యెటో కబ్బమ్ము నిర్మించి ధ
ర్మలతన్ వాడక యుండఁ జేసెదము శర్మం బెల్లెడం గూర్చుచున్. 10

చ. స్తుతులు పరశ్శతమ్మును నతుల్ వితతమ్ములు గొంటి వీవు నీ
కితరుల తిట్లు లెక్కయగునే! మముబోంట్లకుబోలె; నీ కుపే
క్ష తగునుగాక, మాకు నటుసాగునె? యాజ్ఞ యొసంగుమయ్య శ
శ్వతతులకెల్ల నియ్యది యనర్హ మటంచు వచింపఁగావలెన్.

---

ఇంకను నిట్లువ్రాసి నా క్షేమమును గమఁగొనినవారు పెక్కుమందిగలరు. ఈయుత్తరములన్నియు పిఠాపురము చుట్టుపట్టులనుండి వచ్చినవే యని యెఱుఁగ వలయును.

(1)ఉ. చేతులు కోతురంచుఁ దమచేతికి వచ్చినయట్టి రీతిగా
బూతులు వ్రాసి "భాగవతముఁ రచియించితి మంధ్రభాసిత
ఖ్యాతి నెసంగు నిద్దని జగంబునఁ జాటినయంతమాత్ర వి
ద్యాతిశయంబు గల్గిన మహాశయు లౌ నని సమ్మతింతురే. (శతఘ్ని 14వపుట)

ఇంతవఱ కుదాహరించిన సూత్రప్రాయపు సంగతులవలన మమ్ము నిందించు పూనిక ముందును వీరు తదనంతరమును జనించినట్లు ప్రాజ్ఞులకుఁ దేటతెల్లము కాకపోదు. కానఁ దక్కిన వుదాహరింపక చూచుకొను భారము మీకే వదలితిమి.

(2) ఈ తిట్లే తిరుపతి వెంకటేశ్వరార్థశతక మని కొన్నిటియందును తిరుపతి వెంకటేశ్వరశతక మని మఱికొన్నిటియందును కవితా పత్రికలపైఁ బ్రకటింపుచున్న పుస్తకమని యెఱుఁగఁదగు. దీనింగూర్చి 39 వ పుటలోని యుత్తరము చూడుఁడు. ఆశతకమింకను బ్రకటింపలేము. ప్రత్యక్షముగా వినినయొక మహాగౌరవసంపన్ను లిట్లు వ్రాసిరి... ...."ఇదిగాక వెంకటేశ్వరశతకమని వకగ్రంథం వ్రాసినారు నాకు వినిపించినారు కొన్నిపద్యములు శ్లేషగా నున్నవి మిమ్ములను దూషణప్రధానముగా నున్నది. అది వింటున్నప్పుడు.........వచ్చినది. వారుచెప్పిన మాటలు అనేకము లున్నని వ్రాసినచో ఆమాటలు విన్నందువల్ల నేను వక్కడనే బాధపడుచున్నాను. మిమ్ములను కూడా బాధ పెట్టినవాడను అవుతానని వ్రాయలేము........ ..."

మ. కలనైనన్ గురునింద సల్పమియు నిష్కాపట్యమున్ సత్యవా
క్కలనమ్మున్ బితృమాతృభక్తియుఁ గృతజ్ఞత్వంబు వేవేలు గు
ప్పలుగాఁ బోసిన లక్ష్యపెట్టమియు నేవంభూతముల్ నిత్యని
ర్మలముల్ మేల్గొనముల్ గలట్టి కవులన్ బ్రార్థింతుఁ బ్రాచీనులన్. 12

ఆ.వె. చక్రికేళిఫలము చప్పనైనను నగుఁ
గాక మావిఫలము కసరుఁదనము
నొక్కకష్టు చూపి యుండిన నుండుఁగా
కెందు సత్కవిత్వ మెలమి నొసఁగు. 13

క. కుకవిఁడు కవి యని చెప్పిన • శక్రుఁడతఁడు కాణుఁ డని ప్రసంగించినచో
నక్రములుతప్ప యోగ్యు లు • పక్రమణము సరిసరే! సెబా! సని నగరే. 14

సీ. శంకరాచార్యుండు షణ్మతస్థాపకుం డన నేదియో సోదె నడుగువారు
కృష్ణుఁడెంతేని యుత్కృష్టుం డటన్నఁ దక్రఘటమ్ములను గ్రోలఁగడగువారు
వ్యాసుఁడు నారాయణాంశం బటన్న విశ్వస్తాపురాణముల్ చమవువారు
కాళిదాసుఁడు మహాకవియన్న నూర్వశి యాటపాటలగాధ లడుగువారు

గీ. కల రిపుడెకాక పూర్వపుఁ గాలమందు వారిఁ బ్రాజ్ఞులు మెచ్చరు వారు సభల
నిల్వఁ జాలరు మిన్నక నింద సేసి సంతసింపుట యవ్వారి సహజగుణము.

క. భారతము నాటకమ్ములు • గా రచియించితిమి మున్ను గైకొను మిదిగో!
గీరతము గీరతులకు న • నారత మానందమిడు ఘనారవము క్రియన్. 16

క. భారతము కృష్ణవిజయో • దారము గీరత మనంగఁ దద్వ్యతిరేక
స్ఫోరకము వారకము దు • ర్వారస్ఫారావివేక భారమ్ములకున్. 17

క. మును పల కృష్ణద్వైపా • యను కతనన వెలసె భారతామ్నాయము నేఁ
డును నలకృష్ణద్వైపా • యను కతన వెలసె గీరతామ్నాయమ్మున్. 18

చ. గురువులకన్న మిన్నలగు కొందొకశిష్యులు నుండ్రుగాక వా
రెఱిఁగి యెఱింగి ప్రల్లదము లెక్కడ నొక్కెడ నాడినట్లు మున్
గఱుఁవలు భారతమ్మున నొకానొకటం గనిపెట్టఁ బోరు ధీ
వరు లిది గీరతమ్మునవె వారక చూతురుగాక యెల్లెడన్. 19

తే. గీ. చెనఁకి యీశ్వరవే ర్తొంత చెప్పఁ జేసె
చాటుపద్దెమ్ము లిఁకఁ గొంతసల్పఁజేసె

వ్యాసకాకమ్ము మఱికొంత వఱలఁ జేసె
గిరతమ్మిది రెండవ భారతమ్ము. 20

చ. కోకిలకాకమ్మునఁ గల దూఁకుడును నసత్యములును దుండగములుఁ బై
నేకాకుధార గిరత పాకమునకుఁ గారకములు పర్వత నిలయా! 21

తే. గీ. ఎన్ని తిట్టులు తిట్టిన నెడఁద నైఁచి
శిష్యభాగునకై కృషి సేయుటొప్పు
సీ! వినఁడటంచు వినువును కెందఁదగదు
యత్న మొనరింప ఫలియించునంద్రు బుధులు. 22

క. ఒకశిష్యుని కొక దేశికుఁ • డకలంకము తత్వవిద్యయందుఁ బ్రవేశం
బు కలుగకుంటకుఁ జింతిలి • *యొకనాటక మతనికొఱకు నొగిరచియించెన్. 23

క. ఈ గిరతమును నటులే • బాగున కేర్పడిన దంచుఁ బండితు లెఱుఁగం
గాఁగల రన్యుల సమ్మతి • కై గా దిద్దానిరచన యచలాధిపతీ!

క. ఓవిబుధసేవ్య! మాఖము • లో విషయము లెన్నిలేవు లోఁ తరసినచో
నేవిషయ మందుఁ దేలెడి ? • శ్రీవిభుచరితంబె యిందు శిష్యహితంబే. 25

మ. పితృదేవుల్ మఱి మాతృదేవులును నౌ విద్వాంసు లాచార్యులై
వతు లౌ ప్రాజ్ఞులు వొల్పుసత్సభల సంభావించి తన్మానసా
హృతికై భారతభారతీవిమల వార్థి స్ఫారధారాభిసం
భృతగంభీరవచః ప్రచోదితుఁడనై యికావ్యముం గూర్చెదన్. 26

---

## (2) ఈశ్వరవేరు పర్వము

ఆర్యులారా.

ప్రస్తుత కాలమునఁ బిఠాపుర సంస్థానమునందుండి శతావధానులమని పేరు పెట్టుకొన్నవారిలో నొకరిపేర రిజిష్టరు లెటరు వ్రాసి వారు త్రిప్పివేయుటంజేసి యది పత్రికాముఖమునం బ్రకటించితిని. పిదప వారు దానికి సమాధానమని చాటుగాఁ బ్రచురించినపద్యము లొక మిత్రునివలన నాకు లభించి మరలఁ బ్రత్యుత్తరము రిజి ష్టరుచేసి పంపితిని.

* ఇదియే ప్రబోధచంద్రోదయమని ప్రతీతి

అదియును వారు త్రిప్పివేసిరి. ఈవిషయమెల్ల సజ్జనులకుం దెలియుటకై పత్రికా ముఖముగాఁ బ్రకటించుచున్నాను. ది॥ తి॥ శాస్త్రి.

మహారాజశ్రీ ఓలేటి వేంకటరామయ్యగారికి,

అయ్యా.

మీ రందందుఁ దిరుపతి వేంకటేశ్వరులకు వేంకటరామకృష్ణకవు లీశ్వర వేరులని తఱచు వాగ్వ్యయముఁ గావించినట్లు వినుచున్నాము. మీవాదము మీరు స్థిర పఱచుకోఁదలఁచితిరేని దానికిం దగిన ప్రయత్నము మీరు కావించి మమ్ము సభకు రప్పింపుఁడు. లేదా, మేము కావించి మిమ్ము సభకు రప్పించెదము. రండు, ఈశ్వరవేరులో, జీలుగు బెండ్లో విన్వల్లోకమే నిర్ణయించెడిఁగాత ।

ఉ. ఆశుకవిత్వమందున జయంబు వహింతురొ శబ్దశాస్త్రమం
దాశ వహింతురో మఱియు నద్భుతరీతి శతావధానముం
టాశతపద్యకల్పనల దంబు వహింతురొ యీ సభార్థమే
దేశము మీకు సమ్మతమొ తెల్పుఁడు సల్పుఁడు తత్ప్రయత్నమున్.

చ. ఒకయెడఁ గూపకూర్మగతినుండి ప్రగల్భము లాడువారు వే
లకు మఱి వేల్కవుల్ గల రిలాతల మించుకయైనఁ జూచి కీ
ర్తికా, యపకీర్తికో తగినరీతి సమార్జన సేయ బొప్పు నూ
రక తగ నుండు బొప్పెడి భరంబగు పూనిక లేక యుండినన్.

మ. గురువో, శిష్యుఁడొ నీకుఁ దా నగుటచేఁ గోపంబు మావేంకటే
శ్వరుఁ డిప్పట్ల వహింపఁ డయ్యె నిఁక నెవ్వా రెట్టివారైన నె
వ్వరు శాంతంబు వహించి యున్నను వృథాప్రాగల్భ్యదుర్వైదుషీ
భరమున్ దిర్పతి సైఁచునే ! కవుల సేబా సందురే సైఁచినన్ !

* చ. కలి పరిపూర్తిఁ జెందె నెవి గన్నదు విష్ణుపురాణమందు గు
ర్తులు సకలంబు నయ్యవియె తోఁచెడు నెల్లెడ; శిష్యు లేడ ! భూ
స్థలి గురు లేడ ! యింక ననృతంబుఁ గృతఘ్నత రెండు మాత్రమే
బలముగ నూని యెల్లరును వర్తిలవచ్చు యథేష్టరీతిగన్.

కాకినాడ — చిత్తగించవలెను.
15-6-10 — దివాకర్ల తిరుపతిశాస్త్రి.
శతావధాని.

* శ్లో॥ వివాహో న కలౌధర్మ్యః. న శిష్యగురుసంస్థితిః॥ (విష్ణు పురాణము)

## (3) జీలుగబెండు పర్వము

(పైదానికి వారు చాటుగాఁ బ్రచురించిన పద్యములు)

ఉ. మాకవితావిశేషములు మానసవీధుల సంచరింప వీ
రే కవిభోగిభోగముల కీశ్వరవేరు లటంచుఁ గొంద ఱీ
లోకులు పల్కుచుండ్రు గుణలుబ్ధులు గావున మీరు సెప్పుచోఁ
గాకవి కాచపాత్రల మొగంబులు మూయఁగ జీల్గుబెండ్లమే.

చ. గురుఁ డని శిష్యుఁడంచు నొక కొంత చమత్కృతిఁ జూపి వేంకటే
శ్వరుఁడు సహించెఁగాని యిఁక సైఁపఁడు తిర్పతి యంచుఁ బల్కె నీ
వరయక వేంకటేశ్వరునియాదరణంబునఁ గాక తీరికన్
దిరుపతి మార్గ మిట్టి దని తెల్ప నెఱుంగ నెవండు గోరెడున్.

ఉ. అర్పకు లేమి సేయఁగల రంచుఁ దలంచితి వేమొ ! యిట్లసం
దర్భములైన మాట లయథార్థములంచుఁ దలంప కింతయున్
నిర్పయవృత్తిఁ బల్కెదు మనీషులు నవ్వ ననహ్యకల్పనా
గర్భితవాక్యసంపదలు గల్గవె మాకును వెల్లడింపఁగన్.

చ. చపలకులాబ్ధిచంద్రుకడఁ జాలఁ బఠించితిఁ గాన సత్ప్రభాం
తరముల నాతనిం బొగడఁ దప్పె ! తలంపఁగ నంతమాత్ర నిం
కొరుఁడు గురుండు కాఁడె యటు లుండఁ గృతఘ్నతయంచుఁ బల్కఁగా
గురుధనమున్ హరించితివె కూళతనంబున నేను ! తిర్పతీ.

చ. విడివడి మాటిమాటికిని విష్ణుపురాణకథా ప్రసంగముల్
దడవెదు నన్ను దూఱుటకుఁ, దత్పరతన్ గురుఁ డాతఁ డంచు నే
నొడుపకయున్న శిష్యుఁడవి నూటికిఁ గోటికిఁ గూడ నీవు సె
ప్పెడునది చాలదే ! వినిన పిన్నలు పెద్దలు సంతసింపఁగన్.

శా. చూడంజాలక కూపకూర్మములటంచున్ మమ్ము నిందించె దే
వాడం గన్గొనినన్ * జరించుమను గర్వస్ఫూర్తి భాషించుచుఁజ
పీడఁ బోవక వెంట వెంటఁ బడుచున్ వేయిండ్లపూజారి యో
వాఁడా మీకు ఘనుండు ! చాలు నివి దుర్వాదంబు లింకేటికిన్.

* బఠింపుమను (పాఠాంతరం)

## (4) మేకుబిగింపు పర్వము

క. 'లోకు లనుమన్నా వా' రని • వాకొన మీకేల గొంకు వాటిల్లదయో ।
లోకు లని మీరు వ్రాయుట • తేఁకువతో దాని సమ్మతించుట గాదే । 31

ఉ. బెండ్లమనంగ నొదురు; కవిప్రకరంబునకెల్ల నూఱువే
లేండ్లకునైనఁ గాఁగలరె యీశ్వరవేరులు; రాలకుండునే
పం డ్లటు లన్నచో; "శుభము పల్కుము పెండ్లికుమారుఁడా" యనన్
"బెండ్లికి వచ్చు నెల్లరును బెండ్లము" లన్న విధం బిదే కదా ।

ఉ. ఏకడ కేగి చూచె । మఱి యే నరపామర మానసంబులన్
మీ కవితావధూటిక రమింపఁగఁజేసె । రసజ్ఞులైన యే
లోకులు కూడియున్న సభలోన నిరర్గళమాధురీపరీ
పాకము రా నటించెను । బ్రపంచకమెల్లఁ బిఠాపురం బొకో ।

ఉ. మీ కవితామహత్త్వమది మీ కులవృద్ధుఁడు మెచ్చుగాక, తా
నేకతమందు మిమ్ము గని యీశ్వరవే ర్లనవచ్చుఁగాక, యా
హా కడు వింత, లోకు లెవ రాడిరి ? నీ వనృతంబు లాడెదే ।
కాకవి వేఁపపండ్లు తినుఁగా, కవి కాకవి యొడ్లు తిందురే ।

క. విను, జీలుగుబెండ్లని మి మ్మనలేదే మేము : విద్వదవతంసులపై
నునిచితి మా భారమ్మును గనుఁగొనఁగాలేక వట్టి కార్లనియెదరే : 35

ఉ. కాకవి । కాచపాత్రిల మొగంబులు మూసెడు జీల్గుబెండ్లకుం
జేకుఱునే సభాస్థితియుఁ, జేకుఱుఁగా కది; తదర్థిసంబులం
గై కొనువేళ నొక్క కడగాఁ బడవైవరె । పట్టుపట్టినన్
మేకు బిగించి లాగి బలిమిం బలు ముక్కలు సేయకుందురే ।

ఉ. తిరుపతిచేత వచ్చెనొ యతి ప్రతిభామహిమంబు వేంకటే
శ్వరునకు; వేంకటేశ్వరునివల్లనె చెందెనొ యా మహత్త్వముల్
తిరుపతి; తద్వివేకము నిలింపులుసైత మెఱుంగ రింతకుం
దిరుపతి వేంకటేశ్వరుల తేఁకువ కాకవు లంద నేర్తురే ।

చ. తిరుపతిమార్గ మిట్టిదని తెల్పియెయుంటిని; చాలి యున్నచో
జనుపుఁడు తత్ప్రచారములు, చాలక యుండిన మూల నుండుఁ; డె

వ్వరుఁ గనకుండఁ జాటుగను బద్యము లంపెద రేమి లాభ? మే
సరసులు మెత్తు రిక్కుటిలవారపుఁ జేఁతలు రచ్చ కెక్కినన్

ఉ. "అర్భకు లేమి సేయఁ గలరంచుఁ దలంచితి" వన్నమాట నం
చర్భము లేని దర్భక పదంబు వయస్సున మీకుఁ జెల్లునే?
యర్భకుఁ గన్నవార లెటు లర్భకు లౌదురు చెప్పు చెప్పుఁ డిం
కర్భకు లెందునో · కవిత యందునొ, యింకొక దానియందునో ?

చ అనృతము గావి మే మనిన యట్టి ప్రసంగము గాదటంటిరే ;
వినిన మహాత్ము లేమయిరి ? "వీనులు సూఁడినభంగి వారు కా"
చినిన నిజంబు నే నన్నృత మాడినవాఁడ, "నిజం" బటన్న నే
యనువున నీ కృతఘ్న బిరుదాంకము వాయునొ ? రామ ; చెప్పుమా.

చ మఱచితివేమొ, యెంత మతిమాలిన మానిసివైతి వయ్యో ; శం
కమని గృహంబునన్ బుణముగాఁ గొని కాఁకరపర్రివాసు లె
వ్వనొ భవమ త్తమర్థులకుఁ బ్రాఁతఋణంబులు తీర్చుకొంటివే ;
గురువగు వేంకటేశ్వరునకున్ మఱి తద్దన మీ వొసంగితే ?

చ. "గురుధనమున్ హరించితివి కూళ ? కృతఘ్నుఁడ" వంటినో గురుం
గురువుగఁ జెప్పుకొంటయును గూడదటంటినొ, లేదు లే దొకి
క్షర మొ యొసంగనీ తనకు గౌరవపాత్రుని పంద్యునిం గురుం
గురువుగఁ జెప్పుకోని చెడుకూళఁ గతఘ్నునిఁగా గణించితిన్.

ఉ వ్యాకరణంబుఁ జెప్పె నది యంటక పోయినఁ బోవుఁగాక నీ
కేఁవినామ మయ్యనఘుఁడే కద పెట్టెన, దంతఁబోక తా
నేకడ కేగె విన్నుఁ గొనియే చనె నచ్చటి కట్టివాని మ
శ్లోకు సభాస్థలి న్విడిచి చోయగతి న్మెలఁగం బనేమొకో ?

సీ ఇంజరం బొకసాక్షి యేనాము దా సాక్షి పల్లెపాలెంబు దా నెల్లసాక్షి
యిపుడు నీ వున్నట్టి యాపిఠాపురి సాక్షి యేలూరు సాక్షి నీయల్లుసాక్షి
పల్లూరున్నపతి శ్రీభాష్యకారులు సాక్షి నూజివీడ్రామచంద్రుండు సాక్షి
మంజావాణీప్రెస్సు మానేజ రొకసాక్షి శంకరుం డాతనిసాని సాక్షి

తే గీ మధునపంతుల సూరయ బుధుఁడు సాక్షి
యయ్యనఘు సన్న సాక్షి సుబ్బయ్యగారు

పొతులున్నారు పద్యంబు చాల దింక
వేంకటేశ్వరశిష్యుఁడవే నిజంబు.

గీ. వేంకటేశ్వరు పాదంబు వీడి పిదప
నెవని సేవించితివి చెప్పు మింత యేల?
యేవిషయ మీవు సాధించినావొ పిదప,
వ్రాయు మా వేంకటేశ్వరు పదములాన! 45

శా చూడం జాలని దేది? భూపతులమెచ్చుల్ చూడఁగా లేనొ! యే
జాడన్ ద్వ్యద్రచితప్రబంధ పరిభాష ల్వ్రాడఁగా లేనొ! యే
వాడున్ లేని శతావధాన కవితావల్లీన వాంకూరముల్
చూడం జాలనొ! నీకుఁ గల్గు నితి హెచ్చుల్ చూడఁగాఁ జాలనో?

క సభకుం బిలిపించిన మే • మభయంబున వత్తు మంటి మది గాదేన్ మా
సభకున్ రమ్మంటిమ యీ • యుభయంబున కీ ప్రాసంగు నుత్తర మేదీ?

గీ కూపకూర్మ మటంచుఁ బేర్కొనుట తప్పె.
కూపమందున్న కూర్మంబు కూయ దెందు;
నరయ కెంతయు "బక బక" మనెడుకతనఁ
గూపమండూకమంచుఁ బేర్కొనఁగవలయు

ఉ గాడిదకూఁతకుం బ్రీతిగఁ గర్దభకోరము గాఁగ నుండి యే
వాడకుఁ బోయిన న్వినెడివారు లభింపనికైత మల్లువాఁ
డేడకుఁ బోవ నేమి యగు? నెక్కడి కేగిన రండటంచుఁ గొం
డాడుచు వీనులార వినునట్లు కవిత్వము చెప్పువారికిన్.

చ గరువపు మాటలందుఁ జెలఁగన్ జగమెల్ల జరింపఁ జాలు త్రి
మ్మరితన మేకపీందుర్గిలకు మైకొనఁజాలు! విరస్గికామృతా
కరరసపుంజమంజులవికస్వర చారుకథాసుధాధురం
ధరబహుళప్రబంధకవితావనితా చతురోక్తి లేనిచోన్ 50

గీ. శక్తిగల్గియు లోకంబు శాస్త్రచయముఁ
గావ్యములఁ జూచి నేర్చినకౌశలంబు
లేనివాఁడెసుమీ కవికానివాఁడు;
కవికి దేశాటన మ్మొక్కకాని పనియె.

సీ చదువఁగాలేదె ! విశ్వము మెచ్చఁ బత్రికా పరిముగాఁ బ్రకటింపఁబడినలేఖ
వినిపింపలేదె ! పిచ్చెఱపాటుతో మిమ్ముఁ బోషించుచున్న మీ భూమిపతికి
సభలు చేయింపఁగాఁ జాలరే విద్యావిశారదులైన భూస్వామివరులు
మధ్యవర్తులు గారె ! మహనీయులైన విద్వాంసులు సుకవితావక్షతములు

తే. గీ. మీర మేమయ్యెనో. నేతిబీఱకాయ !
మాన మేమయ్యెనో. ప్రతిమాకపీంద్ర !
పౌరుషం బెచ్చటికిఁ బోయెఁ బాలకాయి !
కీర్తి యెందడుగంటెనో. కీర్తిముఖమ !

సీ వ్యాకరణంబుసం దసమానమతిశాలు లైనచో రండు వాక్యార్థమునకు
నుభయ భాషాకవిత్వైదేశిక బిరుదంబు కలదేని రండు తత్కాఱనమునకు
శతవధాన ప్రవీణతగన్న పేర్వాసి యున్నచో రండు పేర్కొన్నపనికి
వితరవిద్యాభిమావేద్యత్వ మెందేని యమరిన రండు వ్యాహారమునకుఁ

గీ దగిన ప్రభువులమోప్రం మీదార్ఢ్యమెల్ల
నీఱుగాఁ జేసి యేయూరు పేరు లేక
యుండఁగాఁ జేసి వరి పేలపిండిపగిది
నెఱపఁ దలచితి మిదియె మావిష్ట వినుఁడు.

ఉ. తాల్చితిఁ గంకణంబుఁ "గవితావిషయంబుల నెందు నేవియున్
గెల్చెద" నంచుః గెల్తు మహనీయుల ముందర నొక్కచోటికిం
బిల్చెద నమ్ము, లేక పిలిపించిన వచ్చెద లెమ్ము, లేనిచోఁ
జెల్చిన వాసి వేంకటకవిప్రవరున్ మదిఁ గొల్చుచుండుమా.

శా. మాకన్నన్ మహనీయులైన కవు లీక్ష్మామండలిన్ లేక పో
రీకాలంబున; యుష్మదీయ కవితాద్వీపంబు ముంపంగ న
పోక శ్రీకమనీయదివ్య కవితాతుంగాస్ఫుటఘోరగం
గాకల్లోలవతీప్రవాహభరవేగప్రక్రియల్చాలవే ! 55

గీ. మిమ్ముఁబోషించు నే మిదోషమ్ముపతికిఁ
దగని గర్వంబు పోకుండఁ దగదుగాక;
అంటుమామిడిగున్నపై నధివసించి
నంతనే కాకి కోకిలయగుట గలదె !

చ. "ఎఱుఁగక తూలనాడితి మహీవమతి ప్రతిభాధురంధరుల్
తిరుపతి వేంకటేశ్వరుల దీ టగువారమె" యంచు వేఁడ మీ
నరపతి యూరకుండె నని నామది నెంచెద; లేక యుండినన్
సరసుఁడు పీఠికాపురనాథుఁ డుదారుఁడు మిన్నకుంఢు నేఁ

గీ "ఎదిరి మీతోడ వాదింప నెంతురేని
రెండు మాసంబు లిటు లూరకుండువారె
ఓడి" రనుకొమన్నవా రుర్విజనులు.
ఎవ్వ రేమనుకొన్న నిం దేమి తప్పు.

గీ. లేడిపై దూఁకు సింగంబుజాడ వచ్చి
పడుదుమన్నంత వేగిరపాటు గలదు
"గౌరవింమనొ లేదొ భూకాంతుకడతుఁ
బిల్వ కేగఁగ రా" దంచు నిల్వవలసె.

గీ దీనికే నుత్తరంబు రాదేని మమ్మె
కామచూ ! గెల్చు టరయ. లోకత్రయైక
విజయసాధకమగు గొప్పవిద్య గల్గు
వారటంచుఁ దలంచి యే మూరకుండు. 60

ఇట్లు,
చివాకర్ల తిరుపతిశాస్త్రి.
శతావధాని.

కాకినాడ,
20-8-10

---

## (5) శాంతింపు పర్వము

శా. శాంతింపుండని రాయబార మవురా ! శాంతింపకేమున్న ద
శాన్తింత * ప్రస్మయ దస్మదీయ కవితాచండాసి ఖండీకృతా
హంతా దంతుర శాకవిప్రతివచఃప్రారంభరంభాకుట
ట్కాంతారమ్ములా సగ్గి మ్రగ్గి యసదై కప్పట్టు విప్పట్టునన్.

---

* నామధాతువుమీఁది రూపము

శా. శాంతింపుండని రాయబార మవురా। శాంతింప కేమున్న దా
క్రాంతాశేషదిగంత మామకగవీప్రాగ్భారదూరీకృత
క్లాంతక్లాంత విశాంతి శాంతకుకవి క్రవ్యాదనవ్యోదయ
ధ్వాంతంబుల్ ధరణీభృదంతిక దరీద్వారంబుఁ దూఱంజనన్.

శా. శాంతింపుండని రాయబార మవురా। శాంతింప కేమున్న ద
శ్రాంత ప్రస్ఫురదస్మదాశుకవితా ఝుంఝూమరుద్ధూతదు
శ్చింతాచింతురితాంతరంగకుకవిక్షేమాభ్రదభ్రిచ్ఛటో
దంతంబుల్ చెవులారఁగా విని ప్రమోదంబందు నిప్పట్టునన్

శా. శాంతింపుండని రాయబార మవురా। శాంతింప కేమున్న దా
శాంతక్రాంతమదాశుధారకవితాహంకారహుంకారవి
క్రాంతిక్లాంతదురాగ్రహగ్రహణకాకవ్యగ్రిణీగర్వదు
ర్వాంతుల్ గొంత ప్రశాంతిఁ జెంది లఘుతావాప్తిన్ సుషుప్తింగనన్

శా. శాంతింపుండని రాయబార మవురా। శాంతింప కేమున్న దు
ర్ధ్వాంతస్వాంతవికారకాకవికవిత్వత్వగ్భిదాధూర్వహో
హంతాకాంతమదాశుధారకవితావ్యాహారనీహారవా
స్వంతానంబులు సత్ప్రశాంతరసరస్సంపూర్తి గావింపఁగన్. 65

---

## (6) మందలింపు పర్వము

మ. ప్రాదుర్భూత శతావధానకవితాప్రాగల్భ్య సౌరభ్యసా
రోదారా ప్రతిభాప్రబంధ కవితాయోషావిభూషాయశః
కేదారాంతరతః కథంచి దుదయ త్కింపాకనూత్నాంకుర
చ్ఛేది చ్ఛాత్రినపస్కృతున్ దిరుపతిన్ శ్రీనాథుఁ దోమున్ గృపన్

ఉ. మొక్కిన మొక్కు నేఁడు మఱపుం గను నోటియపజ్ఞఁ జేసి యా
టక్కరి యాత్మభక్తుని జడత్వ మడంచెడియిచ్ఛ నేదియో
చిక్కు ఘటించి మొక్కుబడిఁ జేకొని పోచు మృదుస్వభావుఁ డీ
దృక్కరుణుండు వేంకటగిరిప్రభుఁ డేలెడుఁ గాక తిర్పతిన్.

శా॥ తిరుపతిశాస్త్రి ! నీ వనుమతించిన శిష్యసమీకపాక మ
ప్పరశుగురుండు భీష్మవయిఁ బార్థునిపై నరఃకుంభసంభవుం
డరిగెడునట్లు కాక యల యార్యులు మిన్నక రజ్జు లాడు ను
త్తరుపయి కేగుచందమయి దజ్జుల కొండొకభంగిఁ దోఁచెడిన్

శా॥ నాకుఁగా శిష్యులు నీకు శిష్యులనియున్ నాకున్ మఱి న్నీకు దే
హాకారమ్ములపట్లఁ దక్కఁ గవితావ్యాహార మందెందు భే
దాకాంక్షల్ జగ మొప్పకోనిదను నీ యంశంబు గుర్తించియు
న్నీకుం "గా" రని శిష్యు నొక్కరుని మన్నింపం బనేమున్నదో.

ఉ॥ "గా"రని నీవు వ్రాసితివి గౌరవభావము చూపి. శిష్యుఁడో
"గా"రని వ్రాసినంతఁ దన గౌరవ మెక్కుడఁ బోవునో ! యటం,
చూరక "తిర్పతీ" యనుచు నుల్లపు మొల్ల ము నెల్లఁ జూపె వా
క్ప్రారము లేక యెల్లొదవ్వఁ జక్కనిఫక్కి లిఖించు పద్దతుల్ 70

మ॥ తనకున్ "శాస్త్రి"యటంచు వ్రాయవని కాదా ! "తిర్పతీ" యంచు వ్రా
యను దా నీమెడ సాహసించెఁ; దన "కయ్యన్" వ్రాసితే నీవు నీ
కును దా "నయ్య" పదంబు చేర్పఁజనదొక్కో ! రీతి యిట్లుండ నా
కును శిష్యుం డచె యీతఁ ! డే మనుచు నీకున్ వ్రాసె నా పద్దెముల్

శా॥ విన్నన్ "దిర్పతి" యంచుఁ బిల్చుటకు మన్నీఁ డెట్లు సైరించె వి
ద్వన్నుంద్యుం, డెటు పల్కు నేమి యగు ! విద్యాపాటవం బున్నచో
నౌన్నత్యమ్ము వహింపరాదె ! కలుషవ్యాహారమా యున్నతున్
దన్నుంన్ జేసెడి దాఁడుపోఁడుములు పద్యావిర్భితిన్ దెప్పనే !

ఉ॥ ఎగతన మున్నదేదిఁ దనమాటనుఁ బుచ్చుకొనంగ నెందుఁ గా
క, గడుసుపోక లెందులకుఁ ! గాఱుమెయిన్ దెగఁదిట్టిపోసినన్.
బొగ రవిపించుఁ గాని కవిపుంగవలక్షణ మౌనె ! విద్యకుం
దెగువ నృపాలుఁ డీ, కనుమతించెనె దేశికుఁ దిట్టిపోతకున్.

శా॥ జ్ఞానుల్ మున్నటి సత్కవీంద్రులు సభల్ సాధింపఁగాఁ బోరెః "నీ
వా, నేనా ! " యనినప్పు డివ్వగిది దుర్వ్యాహారముల్ వల్కిరే !
దానం బే రెటు వచ్చుః హెచ్చు ననమర్థత్వంబు పైపెచ్చుఁ వి
ద్యానై పుణ్యము లేమివో ! పెఱుచులేలా, నోటినొం పేర్పడన్ !

మ. "అవలే" దంచు వచించి తప్పుకొనువాఁ డల్లంతనే పోక నే
రవియిప్పొంథ్రితిఁ జూపు టెందులకు ? ధీరమ్మన్యతాదోషపుం
గములా, విన్నెదిరించువారు ! ఘను లాకాంక్షింతురే విద్వద
మ్యవితోవాద ? "మహాత్తు" గాథ వినలేదో ! నీవు మున్నెన్నఁడున్

క. వ్రాసినయుత్తర మెందుకొ • ఆసంగతి విడిచి రజ్జులాడకు దిగి "పే
బా" సవిపించుకొనెద నను • నాస యతని కెంత మనమునం దున్నదియో! 76

క. సభ మాట విడిచి యూరక • రభసమ్మున నేహొ నోదె వ్రాసినఁ దనకున్
బ్రభ గల్గునె? యకటా, రా • సభమే లోకమ్ము ! చర్చ సలుపకయున్నే ?

క. "చామలు దుర్వాదం" బని • బాలుఁడు తుది వ్రాసికొనియెఁ "బరువెఱుఁగనియా
వ్రా లటువంటిది"యని తన • లోలోఁ దెలిసియును వ్రాసె లోకముకొఱకై 78

క. గురుధనమఁట ! హరణంబఁట ! • పఱవఱ నిటు వ్రాసినంతఁ బాపనుఁడై తా
గురుధన మెఱుఁగని లోకో • త్తరచరితుం డాయె నంట ! ధార్ష్ట్యం బహురా !

క. అప్పుగలదు పత్రము గల • దప్పునకుం దగిన భూములం దున్నవి యీ
తప్పుడు ప్రసంగ మేమిటి • కిప్పగిదిన్ వ్రాసి యొక్కయితఁ డధికుఁడగున్!

క. గురుఁ డప్పిడు ద్రవ్యం బని • తిరిగియు నీ భూమివలనఁ దీఱె, నితనికిన్
గురుఁ డిచ్చిన ధనమునకున్ • గుఱు తేమియు లేమి నీఋణం బెట్టులగున్.

మ. గురునామమ్ముఁ దలంపకే సభ నొగిం గూర్చుండఁగాఁ బోవు కాం
కరినామం బొకపట్టునన్ స్మృతికి నెక్కన్ దక్కనం దక్కఁ గా
కురుగ్రంథ మ్మొకఁడిచ్చి యీ జగము దా నున్నంతకాలమ్ము స
త్పురుషుల్ మెచ్చుకొనం జరించితివి నీతో నీతఁడా పోలుబల్ !

ఉ. విద్దెమ సాటి గామి పృథివీతల మెల్ల నెఱుంగు నిన్ గురుం
"దద్దిర" యంచు మెచ్చె, నితఁడందులకుం గొఱ గాఁడ, పత్రముం
బద్దను మందఁగా గురుధనంబు హరించుట నాఁగ నెట్టి ! దీ
పద్దికతమ్మువం దవకు జోడుగ నిన్నొనరింప నెంచెనో ?

చ. గురుధన మన్న విద్యయ యగున్ దన కిచ్చినవిద్య సత్ప్రభాం
తరములఁ జూపువేళ గురునామము దాఁచినవాఁడు పాపి; త
స్కరుఁ దన పేఱు లేఁ డతఁడ కాఁ డగు; దద్ధనహర్త వాఁడె, త
త్పరిచితి పాపహేతు వగు వాని మొగమ్మును జూడ రుత్తముల్.

క. మరియావగ వ్రాసిన నీ • తరతమభావంబు దెలియఁ దన కెట్లగుః బల్
దురుసుతనముఁ జూపుమఁ గడు • నణిముణిఁ బద్దెమ్ము లంపు టది యేమిటికో

ఉ పేపరులోన నీవు తగు పెద్దలు మెచ్చఁగ వ్రాసియుంటి. వా
రో ! పరువంపుమాట లెవియో యొక కొన్నిటి వెఱ్ఱిమొఱ్ఱిగాఁ
బాపము నాని వ్రాసి యవి పద్దెము లంచును జాటుగా గురు
శ్రీపతివైన నీకడకుఁ జేర్చిరి లోకము మెచ్చుఁ గోపమున్.

ఉ చాటునఁ దిట్ట లేరవి పరినంగము గోరితి వాక్కాః వారి వా
చాటతఁ జూపరాదె సభఁ ! జాలునదే వరిపేలు· నీవు న
చ్చోట నొకంట నుండి యది చూచెద నీశ్వరవేరొ, జీర్ణబెం
దో ! టకటొంకు లేమిటి కహో ! పెదయుక్తులు గీర్తి నిచ్చునే !

చ. గురు వని చెప్పగా మఱపు గూరినఁ గూరెదుఁగాక యెందు కీ
యెఱిఁగి యెఱుంగ రానిపలు "కీశ్వరవే"రవి గూడ దాని సం
బరముగఁదా వినంగఁ "బిసబాబు ! వచించిన" దన్నచో, మనో
హరముగ విన్నవాఁడు తన కౌనొకొ ! యిప్పు డసత్య మాడఁగన్

తే గీ వినియెఁ బో ! తాను "నీశ్వరవే" రనంగ
"నంతవాఁడనె కాఁబోలు" నంచు నెంచె
నిప్పుడే మయ్యె నాచేవ ! యెదిరి నిన్ను
వేరు గారాదె ! బెండుగా మాఱనేల ?

చ ఎలమి నినున్ జయించి పయి "నీశ్వరవే" రగునేని "యింత యు
జ్జ్వలమతి శిష్యుఁడయ్యె" నని నంబర మందుదుఁగాదె, యేను నన్
దలఁపకయుండుఁ గాక గురుభావద మాతని వ్రాఁతె చెప్పఁ, ది
ర్మలగురుముద్ర నీఁపుపయిఁ గ్రాలు భుజంబు భజింప జంకినన్ 90

మ "మన మేగం బని లేమ పితపురి కస్మచ్ఛిమ్య లందున్నవా"
రనునానందము తప్ప శిష్యుఁడయి నా కర్పించు భాగ్యమ్ములే
దన్యతం బాడుకతానఁ బోవునది లే దౌరా ! జగంబెల్ల బో
రన నూరేగిన మద్గురుత్వ మది యేలా డాఁపఁగా నెంచెనో.

ఉ దాఁచిన దాఁగువాఁడ నొకొ తక్కినదేశికులట్ల : కీర్తిన్
మోచినవాఁడ. "విజ్ఞుఁ" డని "మూఢుఁ" డటంచును గూడ వారికిన్

దోఁచక పోయెఁ గాకఁ యెటు దోఁచెడు నీకహమ్ము చూచి యా
లోచన లేదు పాప" మని లోకులు నవ్వెడి యోగ ముండఁగన్.

ఉ. "చెప్పక పోవుఁ గాక యొకశిష్యుఁడు తన్ను గురుండటంచుఁ దా
నిప్పగిదిం బెనంగు టది యాతనికిం దగ" దంచు నన్నుఁ ద
"న్నిప్పృథుకుండు శిష్యుఁడయి యిట్లు కృతఘ్నత చూపు టెంతయుఁగా
ద ప్పిది తప్పు త" ప్పనుచుఁ దజ్ఞులు పల్కుట తప్పు నేగతిన్ ?

ఉ. చాలఁ బఠించి పోయెనఁట ; చర్లకులాంబుధి చంద్రు సన్నిధిన్
నాలుగొ మూఁడొ మాసములు నాకడఁ బొత్తము పట్టె నంట ; యీ
బాలుఁడు రెండుశాస్త్రములు వచ్చినవాఁడఁట ; యెందు కీయన
త్యాలపనంబు లన్న జమఁ దక్కుట, యొక్కఁడు లేఁడె యప్పురిన్ ;

* ఉ. చాలఁ బరిశ్రమం బొకట సల్పినవా రఁట శాస్త్రపద్ధతిన్
బాలకవుల్, గురుం డెవరొ, వచ్చిన శాస్త్రము లేవొ ? యిర్వురుం
జాలఁ బరిశ్రమం బొకట సల్పిన దెక్కడనో ? యసత్యమే
చాలఁ పరిశ్రమం బొకట సల్పిగ్రహించిన పెద్దవిద్దెయో ;

† ఉ. "మూలము ముట్టఁగాఁ గవనముం గని యారసి నార"లంట ; వ
ద్యాలట యుండనీ వచన మంచు రచించిన గ్రంథపీఠికన్
నాలుగు పంక్తులే నొరులు నవ్వని పంక్తులు లేవుఁ దీనికే
"మూలము ముట్టినా" మని ప్రమోదము చెందుదురయ్య ధీవిధుల్ ;

ఉ. మూలము ముట్టఁగాఁ గవనమున్ గని యారసినార లేమి ; గ
ద్వాలయు నాత్మకూరు వనపర్తియుఁ గాదు పిఠాపురమ్ము భూ
పాలుఁడు చిన్నవాఁడు, తగువండితు లప్పటి కందు లేరు వా
చాలత లిట్టి వెట్లు కొనసాఁగెడి వేఱొకచో సదస్సులన్.

చ. చలకులాబ్ధిచంద్రుని ప్రసాదమునన్ గణియించు శక్తి వి
స్ఫురణము చూపరాదె ; యలసూరియు నన్నను బోలె నక్కటా
"గురుఁడ నైతినో" యనుచుఁ గొంకఁగ మూలముఁ దుంగ నేల ; తు
ప్పు రగులఁ దిట్టు టంచుఁ దలపోసెనొ ; నక్కపిఠావినోదముల్.

---

* ఉ. చాలఁ బరిశ్రమం బొకట సల్పినవారము శాస్త్ర పద్ధతిన్ † మూలము ముట్టఁగాఁగవనముం గని యారసి నారమింక---వేం॥రా॥ గ్రంథమాల 4 వపుట.

చ. చరలకులాబ్ధి పద్యగతచంద్రుఁడు "బ్రిహ్మమనీషి" యంచుఁ గొం
దఱు భ్రమ చెంది యూతని వృథా మనకున్ సహపాఠిగా గణిం
తురఁట ! యిపే, గురుండ సెను దోసముపై విది యొక్కదోస మో
తిరుపతిశాస్త్రి ! యెవ్వరు విధిన్ దరియింపఁగ నేర్తు రక్కటా !

చ. చరకులాబ్ధిచంద్రుకరఁ జాలఁ బఠించుసుగాక పీఠికా
పురవిభునొద్దఁ జూపిన యపూర్వపు విద్దెకుఁ గారకుం డెవం ?
డెఱుఁగినవారికిం దెలియదే ! యది మూపిన దాఁగనేర్చునే
గురుఁ డని నీవు వ్రాసినది "కొంత చమత్కృతి" యంట, యక్కటా !

చ "గురుఁడని శిష్యుఁ డంచు నొకకొంత చమత్కృతి చూపి"తంట ! య
క్కఱమెయిఁ ద్రోవఖర్చు లిడి గారముమై వెనువెంటఁ ద్రిప్పి య
క్కరము లొసంగినట్టిగురుఁ గా దని నందుకు మెచ్చి మేఁకతో
లెఱుఁగినవాఁ డెవండు తిన కెమ్మెయిఁ గప్పఁగలాఁడు పోడిమిన్ ?

చ గురు పని శిష్యుఁ డంచు నొకకొంత చమత్కృతి చూపు పెట్టినో
సరిగ లిఖింపఁగాఁ దగిన సాక్ష్యముగల్గినఁ జూపరాదె ? త
త్తఱపడ నేల ? పద్దెమునఁ దక్కిన యంశము లేల లేవు ? మ
ద్గురుత దొలంచు నంగతులు గొండొక వ్రాయఁగరాదెయుండినన్

ఉ మూసిన దాఁగునే ! "కదుఁ బ్రిబుద్ధుఁ డితండు గురుండు పేర్మిమైఁ
జేసినమేల్ వృథాగ మఱచెన్, జెఱిచెన్, జెఱిచెన్ గురుశిష్య పద్ధతిన్
వాసికినై" యటం చనవివాఁ డొకఁడుండునె ! పక్షపాతపుం
దాసులు తక్కః నేమిటి కతత్యవచస్కులతో వివాదముల్.

ఉ నాఁగొ మూఁడొ మాసములు నాకడఁబొత్తముఁ బట్టినాఁడఁ టా
శీలవదగ్రగణ్యుఁ డిటు చెప్పగ నోరెటులొప్పె? బో,
భూలలనామనోహరుఁడు "పొచ్చెము మాని వచింపు" మన్నచోఁ
దేలకయున్నె ? మోముకళ దీనియధార్థము దెల్పకుండునే !

ఉ ఏపని యేవిఁ జేసి తల యెత్తుకొను న్నరుఁ డొక్కమాట తా
నీపని, నాఁ !—గృతప్నుతకు నెవ్వఁడు పాల్పడు వావిమోముపైఁ
గాఁపురముండు వెల్వెల, యొకం డొనరింప మఱొక్కఁ డొను వాఁ
డీ వరసూర్థమున్ దెలియ మేమిటి కింక బహుప్రసంగముల్.

ఉ. ఏవపువావ మేలు! విను మే వచియించెదఁ గూపమందు గో
దావరియాట కొంత దిగెఁ, దద్గతనీరము గూడి షారమై
పోవునా, శీరమే యగునా బుద్ధిమదగ్రిణులే గ్రహింత్రు నా
కీవిధమైన శిష్యుఁ డొకఁ డిప్పు యశం బది యెంత పాటిదో. ॥6

చ చదివెను సూరపండితుని సన్నిధి, నాపయిఁ దాను వ్రాయు స
ద్విదితుఁడు చన్లచంద్రుకడఁ దెల్వినిగాంచె నొకింతకంత, నో
ర్మెనుపుటయుం గవిత్వమును మీఁదటి గ్రంథములున్ వహానసం
పద తగుపాటిశాస్త్రము నెవండిడెనొక్కొ ప్రమాణపూర్తిగా!

ఉ తేఁడు పరాపరోక్తుల నెఱింగి విచారణ సేయఁడేని మా
రేడును తేఁడె. త న్ననుసరించినశ్రీఫల మిమ్ముచుండు. నే
రేడును తేఁడె. యయ్యది భరించు ద్విజప్రకరమ్ము నెల్లఁ, బూ
రేడును తేఁడె. యయ్యది చరించెడి సత్పథమందుఁ బొందుగన్

చ తనకలరామకృష్ణకవి తద్దయు శిష్యుఁడు. తాను నాకు న
మ్మిన బహుశిష్యుఁ. డిర్వురును మీఁఱట కేవియుపాయ! మట్టివో
జనవరునొద్ద నావగుప్రశంసయె యెత్తమి కేమి హేతు? వుం
డిన సది పేపరింపఁ బ్రకటింపఁగ రాదె జగమ్ము మెచ్చఁగన్

* ఉ. సూరయగారికోఁ బలికెఁ జూ! యితఁ "డీ విడినట్టివిద్దె బస్
సీరసమై యెబో చనియె నీవు గురుండవు కావు నా" కటం
చా కసవేసి నాకు విది యంతయుఁ జెప్పె. స్వబుద్ధిమౌర్ఖ్యమా
ధీయునియందుఁ జొన్ప సువిధేయుని కేపని సేయరా దిఁకన్.

మ. మధునాపంతుల సూరయాభిదుని సమ్మానించె నీరీతి, నా
బుధమాన్యుండు వచించె అచ్చవడి "పో! పో! యెంతవారేని యి
య్యధమంపుం గలి నుండ వచ్చు" నని "తాతా! యీతనిం జెప్పఁబో
కు ధరణ్ లేఁ డిటువంటిధీయుఁ" డని వాకృచ్చెన్ బరం బేగుచున్

---

*" గారికి——మ వెం. సుబ్బారావు లేక. గీరతమునఁగా 2 ని సూరయ్య తాతగారియొద్దఁ జదివినదంతయు మఱచి పోతినను కారణమున గురువుగా చేసికొనలేదని వెనుక తమ యొద్ద నన్నమాట యెచ్చటనైనను తమును వ్రాయింపుఁడు "

వెం॥ సు॥ రా॥

ఈ వెంకటసుబ్బారావు మధునాపంతుల సూరయ్యగారి కుమారుఁడు.

ఉ సూరయగా రనంగఁ గడుసూరియుఁ దండ్రికి మేనమామయున్
ధీరుఁ డుదారుఁ డీతనికి దేశికుఁ డమ్మహనీయువట్లనే
నేరమి నట్లు చూపిన వినీతున కే నొక లెక్కయే? "మహా
శూరుఁ డితం"డటంచు చదియ చొప్పడఁ జెప్పెదుఁ జెక్కులేటికిన్ 112

ఉ అనమెయిన్ వరమ్ముఁ గొని యాపయి దేవునినెత్తి మొత్తు భ
స్మాసురు లిప్పుడుం గల, రహంకృతిశాలుల నట్టిమూరవి
శ్వాసుల నొంచు శ్రీపతులు సజ్జనమాన్యులునుం గలారు "సే
బా"సని వారిమెప్పు గుణవంతులునుం గలరయ్య. శ్రీపతీ!

చ. మొనటిగురున్ ద్యజించె నొక మూలములేకయె నన్ను సీగతిన్
బవపటివానిఁ బోవిడిచె, మధ్యగురుం డిఁకఁ జర్లచంద్రుఁ డీ
కదనమునాఁటికిఁ మిగిలెఁ, గావున నాతని చేఁయూఁత వి
న్నెదిరి జయింపరాదె? యిటు లేటికి మూల మణంగు పోఁడుముల్.

తే. గీ ఉభయశాస్త్ర ప్రవీణులఁ టుభయులును మ
తేవి యా శాస్త్రములు? వాని యెఱుక యెట్టి?
దుభయ శాస్త్రము లన నసత్యోక్తులును గృ
తఘ్న తావాదములు నేమొకత్వమరయ!

* క బావయఁట! యతఁడు శాబ్దిక! జీవుఁడఁట! యతని కితఁడు శిష్యుండట! యే
మీ, వీరల పాండిత్యపుఁ! జేవయుఁ గవనంపుఁ జేవఁ జెప్పగఁ నేలా! 116

శా "పుల్లాసారులు గారు వచ్చి రరుగో! పుస్కంబులా దేవ యా!
మల్లాసారులు! శీలమంతులము మేమూ! పుస్కముల్ దెప్పటా
యెల్లాసారులు గారు తెత్తు రిక టా! యేమండి! కూర్చోండి! మీ
రల్లాగంటది దమ్మమా!" యనువిధంబో నీ ప్రసంగ మ్మహో!

‡ 3 సీ బావకుశాబ్దికజీవత్వ మెటులబ్బెఁ? దనకెట్టులబ్బెఁ బ్రాథమిక పదవి?
అణుమాత్రముంగాని యవధానమున కెట్టు లత్యద్భుతపు బిరు దనుఘటించు?
తలమీఁదివార లెందఱో కవీశ్వరు లుండఁ గోరు నీతఁడు పెందేర మెట్లు?
పేరేడ! యూరేడ! పెంపేడ! సొంపేడ! ఘంటాశతంబేడ! కవనమేడ!

---

* ఉ పన్నుగ నాకు నత్కవన పద్ధతి నేర్పినబావ శాస్త్రసంపన్నుఁడు . ...
‡ ఈ కవితావిధానమునకు మేమే ప్రాథమికులము" 3 "సందేహములేదు బావ శాబ్దికజీవా." (వెం॥ రా॥ గ్రంథమాల 19—28—49 వ పుటలు చూ.)

తే. గీ. ఏల నీ: వేల యాకవు: లేల సూర్యు
లేల ఖద్యోతములు ? నీకు నింతమాత్రఁ
దెలియదేనియుఁ జూడుమా, దేశమాత
పత్రిక వచించు నివ్వారి పాటవంబు. 118

ఉ. ఆఁకకవుల్ శతమ్మును సహస్రము మున్నును నేఁడు నుండ నీ
రాశ వహించు టెట్టి దకటా! కటా! ప్రాథమికత్వమంద. న
త్రాశి నటుంచి కూపమున బ్రాథమికం బన రెవ్వరేని యీ
యాశకు మేర లేమగవ! యందని పండ్లకె యఱ్ఱు చాఁచెదిన్

మ. మొనమొన్నన్ గతియించు శిష్టకులజున్ మూర్తిన్ గవీంద్రేడ్యవిన్
జను లింకన్ వినకుండ్రుగాక ఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పనమందున్ బటరాట్కవిన్ దెలియరో! * లాఁతుల్ శతంబుండఁటో
లని యీమాటగలట్టి కాగితము నేలా చింపివేయింపరో 120

ఉ. చింపిననేమి కాగితము చింపక యుంచిననేమి యెవ్వ రా
దంపుడుపాట నమ్మెదురు? తప్పుడు వ్రాఁతనుబట్టి చింపివే
యింపఁగఁ బూనుచోఁ "గవనమెల్ల వనం" బగునంచుఁ వేడింపి
యింపరుగాక, "గుర్రిదికనులేటికి మూసిన మూయకుండినన్?"

మ. అఱకన్ గట్టిన గంగిరె ద్దుఱుకదే! యాత్మీయవాద్యధ్వని
స్ఫురణం బింపక విన్నయంతఁ నటులే సూరుల్ కళావాద దు
ర్భరతాఖండు లొకఁటఁ గట్టువడియున్ బాండిత్యకండూయనో
త్సరణోత్సాహసహాయులై కవులతో సంధింప కెట్లుందురో.

శా. వేఁడున్ వాడని కీడుమాట లిసిరో! "వేయిండ్ల పూజారియా
వాఁడా" యన్నపనాథయై యొకట విద్వాంసుండు గూర్చుండునే
మూడుంటోలె, మహాకవీంద్రచరితల్ మూచూడలేదొక్కొ "పం
డ్లూడుం బో!" యని నీవు ము న్ననినదే యుత్తంబు ముమ్మాటికిన్.

* ఖ్యాత శ్రీరఘునాథ నాయక దయాధారాముపారోన్మిష, ద్వీణావాదన సంస్కృ
తాంధ్రకవితాసామ్రాజ్యలక్ష్మీజుషా, తత్తాదృష్టుటికార్థ నిర్మితశతశ్లోకీ, ఫణిగ్రామణీ,
వాణీప్రాకృత శాస్త్రనైపుణసముద్వీమలద్యశశ్శ్రీజుషా॥ మధురవాణి (ఈ మధురవాణి
తంజాపురీ సంస్థాన విదుషి) స్వధర్మ ప్రకాశినీ పత్రిక చూడుఁడు.

ఉ. కుంటి కవిత్వమో మఱియు గ్రుడ్డి కవిత్వమొ కాని నేఁడు మె
చ్చంటుట దుర్లభం బనియొ యక్కట! యిక్కవు లట్టి కైతకై
కొంటకునై కడంగెదరు కొందఱు ప్రాజ్ఞులచేత గ్రుడ్డులన్
గుంటులెకాక యన్యులను గొందొక పూజిత లౌ తెఱుంగరో!

ఉ. కబ్బము లచ్చువేతురఁటకా! యవియే వచియించుఁ గాక యా
రబ్బసమెల్ల నేమిటికి అవ్వయు అట్టును నీకుఁ? గోతికిం
గొబ్బరికాయలాగు నమకూడెను బత్రిక యొండు వార్డి కా
గ బ్బది మున్నె లోకులకుఁ గన్పడె నొందొరులేల దీనికిన్.

శా లేకల్ పీరివ్రిపీణతన్ దెఱపు నీ లేఖావివాదంబు లే
లా? కృష్ణం గని భోధివిశా బదివి యన్యంబైన పత్ప్రత్రికా
నీకంబున్ జని చూచి యే మెఱఁగితో! నీ వల్ల యాకాశవా
ణీకళ్యాణపుఁబాట నొక్కటియు నేనిం జూడలేదా! సఖా.

క "మిడతంబొట్లు శతున" మను • వడువునఁ గన్నం బొకంటఁ బాఱిన యంతఁ
దుడుకు వడఁ జెల్లునే! యె • క్కడ నెవ రున్నారొ సుంత గాంచఁగవలదే 127

చ "ఇరువుర మేము మీ రిరువు రెందెవ రెవ్వరిఁ గోరుకొంటి రి
ద్వరు నొకనన్ను నే యెదిరి పోరి జయింతురొ? లేక యిర్వు రి
ద్వర నెదిరింతురో? తెలుపఁ బోలు" నటన్న వృథాగఁ బాటుగన్
మురిసిన నేమి లాభ మగు? ముక్కున మాపిరిలేదె యాదెసన్.

ఉ లోక మెఱుంగుఁజా! కవితలోఁగల పాకము; శత్రువైన ను
త్కళ కబ్బముం గని "యిస్" యనఁ జాలఁడు. మిత్రుఁడైన న
శ్రీక కవిత్వమైన "బళిరే" యని మెచ్చుకొనండు. నీకు నే
లా కలహంబు? లోకమె రసారసచర్చ యొనర్చుచుండఁగన్.

శా. తాతాచార్యులు లోనుగాఁగలుగు తంత్రిజ్ఞుల్ వధానార్థమై
యేతేరం గన మొక్కొ! నభ్యజను లిప్పీ యంటయుం గాంచమో!
యీ తంత్రిజ్ఞులు వారి కెంత వెనుకో యేతేరఁగాఁ దగ్గవా
రేతన్మాత్రులతో వివాదమున కీ వేలాగు తా లాఁగితో.

ఉ. "మా కవితావిశేషములు మానవవీధుల సంచరింప" నం
దా కవు లాడు మాటలకు నప్పురవాసులె గేలి గొట్టుచున్

"మీ కవితావిశేషములు మేదురవీధుల సంచరించుఁ జాం
దో కవులార" యంచుఁ గడునుల్లసమాడుదు రంట ! వింటివే

ఉ. "మా కవితావిశేషములు మానసవీధుల" పద్య మందు "మీ
రేకవి" యన్నచోటఁ గల "యే" ప్రకృతస్థితిఁబట్టి ప్రశ్నగా
స్వీకృత మయ్యె, బెండ్లనుట సిద్ధము నయ్యె, రసజ్ఞు లెల్లరున్
మేకు బిగించి లాగుటయు మేకొనె నేమిటి కింక వీరముల్

చ. కవి కవితావిలాసము జగన్నుతితోఁ బవిలేరిదేవిఁ గా
కవియుఁ గవీంద్రుఁడే యగునుగాక వివేకముతోడ నేమి ! మూ
కవియుఁ గవీంద్రుఁడే యగునుగాక రసారస చర్చయేల ! యే
కపియుఁ గవీంద్రుఁడే యగును గా కిఁకఁ బాకవివేక మేటికిన్. 13

చ ఎవని కవిత్వమున్ విని యహీనమహామహిమాను భావులౌ
కవు. "లిదివో ! కవిత్వ" మని కంపితశీర్ష చమత్క్రియామహో
త్సవన విశేషసూచితసుధారసధారధళీకు లౌదురో,
కవియనఁగా నతండ యగుఁ గాకవు లేకవు లేనిఁ గాకవుల్

శా దారిం జిక్కిన లాఠ మొందు గొని మోచం బంది "యీ మీఁదనే
స్వారిం జేయఁగ మూఁడు లాఠములు వశ్వ మ్మెక్కుఁడున్లో" టటం
చూరం జొచ్చినభంగి బాలకవు లేదో కొంచె మార్జించి యా
ధారాధారమునన్ భవత్పదవికై ధ్యానించుచున్నా రహో !

ఉ. గారెలు పిండివంటకయి కొంతుఁడు కొంతను బృచ్ఛ పేయు. నా
సారసనేత్రి వ్రే లొకటి చయ్యనఁ జూపి "యి దొక్కఁడున్న దా
ధార" మటన్న సామెతగ ధర యొకించుక కల్గుమాత్రినే
వీ రవధానపుంబనికి వీఁడుఁడులై ప్రియతించి రక్కటా !

ఉ వీ వచనంబు లెందుకొ మనీషులు నవ్వుచు రం టసత్యముల్
లేవనియో కృతఘ్నతలు లేవనియో గురునింద లిందులో
లేవనియో ప్రమాదములు లేవనియో స్వవచో విఘాతముల్
లేవనియో ! మనీషులు మలీమస చిత్తుల గాని మెచ్చరో !

చ గురునకుఁ బంగనామమిడు కోయిలపిట్టలు గావి పండితా
దరము వహింపరో ! యుగవిధం బిదియో ! యని బోధ సేయు న

ప్రశంసారహస్య శాస్త్రములు బాపయుఁ దామును దక్కి శిరోరోగములు
యొదు ! లవి నేర్పఁగాఁ దగిన దొందొకళాలను దాము విర్పిరో !

శా. రా నేదో మనమందుఁ దుమ్ముకొని యాస్థానమ్మునన్ నన్నుఁ జే
ర్కొ మంకింపక పోయె. లోకులు "గురుదోర్రహమ్ము గావించె" నాఁ
గా "నే పీశ్వరపేరు వారి" కనుమన్ గర్జించి పీ కోడి గే
హేనర్ధిత్వముఁ బూనె పీశవిని పీ వింకేల జంకించెడో !

ఉ. "భారతనాటకమ్ముల పెటా సని లోకులు మెచ్చ వ్రాసి యీ
పాటుఁ దెఱుంగఁడే యకట ! పాటినవారినె పాఱఁదోలుచే
పౌరుష ?" మంచు విన్న బుధవర్యులు దూఱరఁటయ్య ! యెందు క్షీ
సారవిచారులం గెలువఁ జాలబ్రియత్న మొనర్తు ? వక్కటా ! 140

శా. బాలమ్మన్యుల పోరు కీర్తికరమో ! ప్రాగల్భ్య సందర్భమో !
శీలాలంకృతియో ! భవత్సుకవితాసీమంతినీ చారులీ
లాలాస్యానుగుణంబొ ? యేమిపనికై లాభించునో ? తెల్పు మీ
యాలం బింతటఁ జాలుఁ; జాలు విఁక నేలా తూలితాచాలనల్ !

మ. చవరంగమ్ముఁ గలావివాదగతులున్ సంగ్రామరంగమ్ములున్
ముద మీనేర వసారు లన్యు లయినన్, మున్నున్న నైపుణ్యసంతు
పద గూఢం దొలఁగించు నీ కెచట సంప్రాప్తించి రీసత్కవుల్ !
పదముల్ దాటిరి వారి కైత నడఁపన్ బ్రాజ్ఞుల్ ప్రశంసింతురే.

శా. సింగం బాఁకలి దీఱ యున్నతటి నాచెంతం బ్రవేశించి వే
ద్కం గోమాయువు నోటిపర్కఁ బడుకండన్ లాగి భక్షించు. గో
లాంగూలాదులు హేలమై నరిగి వేళాకోళముల్ సేయు. నే
మిం గోపింపదు వానిపై. నటులె నెమ్మిం జూపుమీ వీరిపై.

చ. తిరిగితి కొంత దేశము ప్రతిజ్ఞ లొనర్చితి విల్పుకొంటి ము
ష్కరులు నవల్చి సత్కవుల గౌరవ పద్యము లందుకొంటి "ది
క్కరి కెన యాతఁ"డన్ యశము గాంచితి కాంతువు కాంచుమంటి వో
తిరుపతిశాస్త్రి ! నేఁ దనుపతింతువె ధీరులతో వివాదముల్,

చ నలువది యేండ్లు వచ్చె నరనాథులనేకులు విన్నఁ గోరువా
రలఘుమతుల్ గలారు. ధన మట్టులె యొంపను విద్దెకోన వి

స్తుతులఁదగు కృష్ణభూవిభునితోఁ గడు నెయ్యముఁ దియ్యమున్న నీ
వలకవులన్ జయించి ఫల మావల నందెడిదేమి చెప్పుమా 145

మ. ఫలమే యందఁగ నిచ్ఛ యున్నయెడ నీ పాండిత్యమున్ జేవిముం
గలఁ జూపం జనఁగావలెం బిదప నీకప్యగ్రణీవ్యగ్రితల్
తల యెత్తం గమకింప, నెత్తునెడఁ దద్వారంబు వారించు ని
గ్గులు నీ నేరని వాక్కుః తాతకును దగ్గుల్ నేర్పఁగా నేటికిన్.

శా ఇంకన్ గొప్ప నృపాలురం గనియెదే ః యీ, వెన్ని యేండ్లయ్యె రా
జాంకుం దాత్మకురు పరిభుం డిడిన మాన్యం బింతకుం బుచ్చుకో
సుంకింపన్ మది లేనివాఁడ వెవరో యుద్వేగులై నోటి గా
టింకన్ గొసనవట్టికోతలకు నీ వేలాగు లక్షించితో

శా మొనగాఁ డొక్కరుఁ డాఱుమాసములు సాముం జేసి మూర్ఛాలిఁ బం
బినభీపెంపున డాఁగియున్న ముసలాపెం బోరికిం జీరులా
గునఁ గూపస్థితవర్దుర ప్రికరదుర్గోష్ఠి విరావార్పటీ
జనితాహంకృతి గాలివై పెనఁగు పేచందంబు నీ బోఁటికిన్

శా. "ఏదో న న్నవివారు గాన సభ కీ రేతెంతురాః" యంచు వి
ద్యావతుండు వచింపఁగా కితరు లాతం డెవ్వఁడో, వాని వి
ద్యాదర్పం బది యెట్టిదో, యెఱుఁగి యేలా వత్తుః రేలా యనం
తాదారుం డిది యిచ్చగించుః విజవిద్వత్సారసంవేదియై

మ ఉరువేగస్ఫురణాగపాటనపటుద్యోవాహినీవార్ఝరీ
పరిణాహోరధిటీ పటాత్కృతులకున్ బ్రిభ్రిష్టసాంబుకౌ
తమషండంబులు విల్చె నేని భవమువ్యాద్యాఘ్ర రాసారపు
ష్కరిపోహాహలముల్ సహింపఁ గలుగున్ గాకవ్యహంతరముల్

చ కలమగదాః యశోధన, మఖండు లనేకులు మిత్రు లున్నవా
రెలమిఁ గవిత్వరాజ్యపదము నేలుచు నుంటివి ము న్నెపైన ని
శ్చలగతి నుండ కేమిటి కసారులతోఁ గలహమ్ము లక్కటా ః
తెలియవె "వృద్ధనారులు పతివ్రిత"లంచు వచించు న్యాయముల్.

శా ఉంపుంగాపుత శిష్యుఁ డొక్కరుఁడు మాయోపాయమిథ్యావచో
ఖండ పాత్రిభవశాలి విస్తులకృతఘ్న త్వానుసంధాయివా
క్పొండుం డాతని సాదుపేయు టది నీశక్యంబె ? నీ ముంద తా
తండెటుల్ విబుధున్ సభాస్థలిని ? గాతర్జంబు బాధింపదే ? 152

ఉ. తేజ మెఱుంగలేని యొక ధీరవిచారుఁడు సారెకున్ మహా
రాజును "మాలి" యంచుఁ దన గ్రామములోఁ దన వంటయింటిలో
భాజనముల్ వినన్ బలుకుఁ, బ్రాజ్ఞుఁడు దానిని లెక్కపేయునే ?
యేజనుఁడేనిఁ జెప్పిన మతేటికి ధాటి పరాటకోటిపై.

శా. "ఊరున్ బేరును లేక యొక్కయెడ నెట్లో యెట్టులో యున్న యా
ధీరమ్మన్యుల పేరు పైకి నితఁడే తెచ్చెన్, వినిర్జింపఁగా
కారంభింపక మున్న వెన్నడెటి విద్యాధీరులన్ వైరులన్
బాయుంబోతులఁ దోఁచి లాభము, యశం బౌ ?" యంచుఁ విన్నన్ జనుల్.

ఉ. దగ్గఱివారికిం దెలియఁ దత్వము దూరపువార "లిర్వురున్
దగ్గరు తుల్యులే" యనియుఁ "దగ్గిన వించుకమాత్రమే" యటం
చెగ్గులు చెప్పుకొందు రిది యేటికి మానఁగదయ్య; వారి యా
వగ్గులు లోకమే యెఱుఁగవచ్చుఁ గ్రమమ్ముగ నాఁడునాఁటికిన్.

శా. "మొత్తో మే మనలే దనత్య" మను వమ్మొత్తవ్ వినవ్ రాదె ; యీ
చిత్తుంబత్తు లిఁకేల? చేసియును "నేఁ జేయంగలే" దన్నచో
నత్తావందగు దోసమైన సయిరిం పావళ్యక మ్మందు రీ
వెత్తిన్ మానఁగదయ్య ; కాకవిగణోర్వీజాతయుం యూనిలా ;

మ. అవధానం బన నెట్టిదో యెఱుగరం చవ్వానికిం బెట్టు పే
శ్శై విశేషించి వచించు "ధారణము లేనేలేద"టం చందు, వా
రివచో గుంఫమె సాక్ష్యమిచ్చు, "నివివో వృత్తమ్ములిం" దంచు న
య్యవధానమ్ములె చెప్పు, నే తెలుఁగ రీ వ్యాపార మాఁవం దగున్.

ఉ. ఆనఁడఁ జూచి రెండవయు మహాత్ములు వందయి నొక్కపెట్టఁగాఁ
"గానరకూసరయ్యొ" యని కాని వచింపరు మేలి మాట; పీ
కీసు జనింపఁగాక, జగ మేటి కసూయ వహించెనో ; రసా
ధానము గాకయున్న నొక వద్దెము నొక్కరుఁడేసి యిచ్చెనే ;

*శా. శాంతింపగవివోయి ; దుష్పలిత నూజాతుండు మున్ గిడ్డి వి
క్రాంతిం దా విని యేమిచేసెఁ? గురువీరవారితముం గాంచపై

---

*శా "శాంతింపంగదవోయి" యంచుఁ గడు వాత్సల్యంబు పెంపార మీ
యంతశ్శాంతి వచించెఁగాక; కలరే ద్యావాపృథివ్యంతరా

గంతుల్ మానఁడె యుత్తరుం? డకట, కంగారైన యవ్వారిపైఁ
గంతుద్వేషి శిరస్సరద్వరధునీకల్లోలముల్ వించెదే?

†శా. వీఁకన్ దమ్ముమ గోకిలమ్ములగ నుర్విం బొల్చు విద్వాంసులన్
గాకుల్గా, బకముల్ గ, గప్పలుగఁ గోకశ్రీలుగా, జెప్పు వి
ర్భీకుల్ బంముగు లోఁజూర్చు గురువుల్ మీ మాన్పఁగాలేరొ? యీ
యాతంపం బది యేల? విన్ గెలువరాదా వారి గారామునన్.

క. ఏల పిక మ్మన్యులతోఁ, బోలనివాదమ్ము? బుబుసుపోకతు పీకి
బాలకవు లేడ దొరకిరి? చాలుం జాలింపు మీ విచారణ లింకన్.

క. "పపిలేని నాపితుఁడు పి ల్లివిగొఱిగె" నటన్నరీతి లేకులతోఁ బో
రానుంచి మెప్పు గొందువె? జను లెఱుఁగరె యెవరి శక్తిసామర్థ్యంబుల్?

చ ఎఱిఁగినవార లేవి నృపు లీ వొనరించిన పద్దెముల్ చెవిన్
జొరఁబడుమేఁద నీ మొగముఁ జూడక యేగతి మిన్నకుందురి? మం
తిరి తిరి వెట్టుఁగాక, కులదేవత వల్దనుగాక, లేక తొం
దరపను లుండుఁగాక, రసతత్పరుఁ డాఁగునె యిట్టివట్టునన్?

---

శాంతవ్యాపక సుప్రసిద్ధగురుశిష్య న్యాయవిచ్ఛేదివా
గంతే వాసికృతాపరాధ సహనవ్యాపార పారాయణున్
ప గురుధిక్కారణకారణం బయిన పత్కోపాగ్ని కీ కత్తృణాం
కురమున్ దాలిన యింధనంబు లగునొక్కో? దాని నార్పన్ ఘనుల్
దొరకో నెటికిఁ? దోడుగా నితరులం దోంచుచో నాఁడు కా
తరులం బ్రోవఁగ మీ ఘనప్రకృతిచేఁ దచ్ఛాంతి చేయందగున్.

శ్లో॥ యః కల్ప త్రిపురేణు రల్పధిషణః కామం కృతఘ్నో రచేత్
కిం తేనేతి పరిత్యజంతు కరుణావంతో భవంతోఽధునా
విందా మా స్పృహపాలిన స్ప సహతే నవ్యాకృతివ్యాకృతి
ప్రజ్ఞావర్ధిత సాహితీసుకవితా సర్వంకష శ్రీపతిః తి॥ శా॥

†తే గీ. కాకి తోఁదేలు జక్కవ కప్ప గొంగ
లార? కేల్మోడ్చి మి మ్మదె యడిగికొ నెద
గలకలము మాని వినవిందు పలుకుచుండెఁ
గంతుఁగోయిల పీమలపండువులుగ. (కవిత 2వ సంచిక చూ.)

క. నాకే ప్రభుత్వ ముండిన • నీకవితాధారఁ జూచి నీఁవాకచో నా
వాఁకిటికి రాకయుండిన • నీ కడ కేతెంచి కోరనే నీరాకన్ ।

తే గీ పాండవోద్యోగమునకు దోడ్పడు మటన్నఁ
దీఁ దఃట్టివాఁడ నీగీయకలహ
మునకు నేలాటి ధారను ముంచియెత్తి
తంపు మిఁకనైన నేఁ జెప్పుమన్న కవిత 165

ఉ. "జీలుగు బెండ్లు మీ" రని వచింపక పూర్వమె "జీల్గుబెండ్లమే
జీఁగుబెండ్లమే" యనుచు సిద్ధపడందగు బుద్ధిమంతులన్
బోలనె నీ వెదుర్కొనఁగ । బుద్ధులు కర్మముఁ బట్టి పోవుఁగా
కేల యెదుర్కొనం గడఁగి రిట్టి ప్రబుద్ధులు విన్ము శ్రీపతీ ।

సీ తిరుపతి వేంకటేశ్వరుల పేరులఁబట్టి తమపేరు లొనఁగూర్పఁ దలఁపవలయు
వారి కబ్బములఁజొప్పడు పద్యముల పాదములను దస్కరణంబు సలుపవలయు
నుప్పుపత్తిరి లేనియప్పు డవ్వారి శిష్యోపశిష్యులపోల్కె నుండవలయు
నేకణంబులొ సంగ్రహించి 'యాపైఁ గృతఘ్నతకల్మిఁగోకిలల్ గాఁగవలయు

తే గీ మీఁదఁ దిరుపతి నెదిరించి "మెమ్మెమే" య
టంచు "దెంకాయ పిచ్చికొం" దనగవలయు
నంచు దైవంబు నొసట వ్రాయంగఁబోలు
లేక యుండినఁ గలవె యీ లేకిపనులు

*ఉ. కాకము నేనఁ టాయన పికం బటః తాను గృతిఘ్నుఁ డౌట కీ
కోకిల నేర్చె నంట । వెఱిగొల్లలు మేఁకలఁ బట్టి నేర్చుకో
లే కెటు పోయిరో మిథునలీలలు । దుష్పథ మూస రాదుగా
కే కుటిలంపుజంతువులొ యేరికి నేర్పవు దుష్ప్రవర్తనల్ ।

* కాకమా ! నీవు నల్లనిదానవు, నీ కంఠధ్వని కర్ణకఠోరము. కావున నిన్నె వ్వఁడు గనుఁగొనఁడు సుఖమున దుఃఖమున, సంపదయందు నాపదయందు, వసంతమున వర్షఋతువున, నొకప్పుడననేల ? ఎల్ల వేళలయందు నందువు. నిన్నెవ్వరు గనుగొనకుండుట కిదియొక మూలకారణము .. అన్నా ! నీవట్టి యనాదరమునకు నట్టి విగ్రహమునకును భాజనమైతివా ? అయ్యో ! భగవంతుఁడు సృష్టికర్త నిన్నిట్లేలచేసెను ? నీవును నల్లని దానవే కోయిలయు నల్లనిదే. నీవును గూయుచున్నావు అదియును గూయుచున్నది మీ రిరువురు గాయకులే మఱి యిఁక

ఉ "బాలుకుఁ బెండ్లి యయ్యె నని బాలుఁడు సంతసమందెఁగాని మే
కై బహువెట్టు చెట్ట నవతమ్మ ఘటించు టెఱుంగఁ డయ్యెఁ" నాఁ
రా, బధిరత్వ ! మేను బికమైతిఁగదా ! యని యుబ్బెఁగాని యీ
కా బకపుంగవీశ్వరుఁ డెనంగు కృతఘ్నతఁ జూడఁబోఁ డహో

---

శేషమేమన—కోయిల యాదరణీయ మయ్యెను. నీవు గర్హణీయ మవైతివి. దీనికి కేమి కారణము ? అది సమయోచితముగ గానము సేయుచున్నది నీ వట్లు చేయవు కోయిల వసంతారంభమున మృదుమలయానిలవ్యావర్తితం బగు రసాలపల్లవము చెంత నధివసించి యభినవజ్యోత్స్నా సముద్భాసమానంబులగు దిగంతముల ముఖరితములఁ జేయ నాప్సని నాలకించి జగ మెల్ల మిగుల మోహించును నీవు మాత్రమా నీ పాణిగల్భ్యమును సమయానుగుణముగఁ జూపించుటలేదు దానివలె నుత్తరం గిత మగు స్వరలహరిచే నీ జగమును వ్యామోహ పెట్టుటయు లేదు కావున నే విన్నెవ్వరును బ్రేమింపరు నీ గానతత్త్వము నెఱుంగ నెవ్వరును బ్రయత్నింపరు ఎల్లయప్పుడు వినుచున్న నీగానము నెవ్వరును వినరు కావున నీ యన్నమును దిని పెరిఁగిన పరపుష్టము సమయానుగుణముగ నొనరించి జయము నొందె ననియు నీవు సమయాసమయములను లోకమర్యాదను దెలియనిదానవై నిజస్వభావమునే యవలంబించి పరాజయము నొందితివనియుఁ జెప్పుచున్నారము ఈ ప్రపంచమునను మీ వంటివారనేకులు గలరు తఱుచుగ వారిలోఁ జాలమంది కోయిలవంటి వారలే తఱుచుగఁ గోయిలవంటివారికే మిగుల శ్రేయము ఎల్లప్పుడు నేకస్వరంబున నీవలె గానము చేయువారలు పరభృతము నొకప్పుడును జయింపలేరు ఓ వాయసకుల తిలకమా ! ఈ భువనమున నందఱను జయించి వావదూకత్వము నొందుటకును నేర్పున జగమునెల్ల వ్యామోహ పెట్టుటకును నీవు కోరుచుందువేని సమయాను గుణముగఁ బ్రాగల్భ్యమును జూప నభ్యసింపుము చిరకాలోపనతంబగు నీరాగమును బరిత్యజించి మంజులముగ గానముఁ జేయఁ బ్రయత్నింపుము అవునుగాని, నీకట్లు చేయ శక్తిలేదు ఏలన నీవు కాకమవు. కోయిలవుగావు కావున నో కాకమా ! నీ వెన్నటికిఁ గోయిలవు కాఁజాలవు నీ వన్నివిధములఁ గోయిలకుఁ బిన తల్లివంటిదానవైతివి యుక్తవయసు వచ్చువఱకుఁ బినతల్లిచే సాదరముగఁ బెంపఁ బడి సుఖముగ నున్నవారలయ్యుఁ బిదపఁ దల్లిదండ్రులను నిందింప వెనుదీయని కొందఱు నవనాగరికులవలెఁ గోయిలయు నీయెడఁ గృతజ్ఞతను వహించుటలేదు . నానాప్రదేశములనుండి యొక్కొక్క తృణమును సంగ్రహించి యొక చిన్నగూడు కట్టుకొని యా గూటిలోనే కోయిలపిల్లను పెట్టుకొని గృహస్థధర్మములఁ బరిపాలించు

ఉ అనుకొన్నన్ బిక మౌనె కాకి ? శునకం బావానె ? యౌనేగజం
బెను(బో ? తానొకో పిల్లి పెద్దపులి ? యా యీ జంతువిష్ఠంబు సు
స్వనమున్ శుద్ధియు నీ తాగరిమయున్ జండాతిచండత్వమున్
దన కేలాగు ఘటించు ? వర్ణసహితన్ ద త్తద్గతుల్ గల్గనే ।

సీ కాకకోకిలముల పోకలం బట్టి యెవ్వా(డు దేశకునితో వైర మూను ?
మేకపోతుల( జూచి మేఱనీతి యటంచు నెవ్వా(డు తల్లితో నవ్వులాడు ?
నాలమంద( జూచి యో బళీ ! యుడియంచు భక్షించు నెవ్వా(డు పచ్చికనవు ?
తురకబిడ్డల(జూచి సరియంచు నెవ్వా(డు పినతండ్రి కొమిరెల( బెండ్లియాడు ?

తే గీ పక్షులంబట్టి పశువుల( బట్టి యితర
మనుజులం బట్టి నీతుల మనకు( గొన్ని
గలవు నేర్వంగ నివి కావు కావు కావు
పిల్లకాకి యెఱుంగునే ఏంటిదెబ్బ ।

ఉ కాకి గురూత్తముండును బికంబును శిష్యు(డు నౌట కేగుణ
శ్రీ కతమో, విచారణము సేయ( గృతఘ్నత యొందు దక్కవే
వే కనరాదు హేతువు, పరీక్ష యొనర్ప నపశ్రుతి స్వరూ
పాకులగాత్రముల్ గలవె యక్కట, కోకిల లెక్కదేనియున్ ।

క "కోకిలము కృతఘ్నత్వము • కాకియెడంజూపె(" నంచు( గాకవి చెప్పం
గాక, యది యెట్లు సరిపడు • నీ కల్పన సమ్మతింతురే సుకవీంద్రుల్ । 173

తే గీ కాకి నామరూపమ్ములు గలుగ(జేసి
కోకిలమ్మును బోషించు( గొన్నినాళ్ళు
అంత తెక్కలువచ్చి( బై నవలి కేగు
నంతమాత్ర( గృతఘ్న మెట్లౌను బికము ?

---

చుంటివి జగము నిజముగ బాహ్యాడంబరములచే మోసపోవుచున్నది. నీ స్వతస్సిద్ధములైన యౌదార్యాది సద్గుణములను బిగ్గరగ( దాళలయానుగుణముగ గానము చేసితివేని యప్పుడు నీవును బ్రసిద్ధి( జెందుదువు. ఇది నీకు సాధింప నలవి గాదు . . . అన్నా ! నీవు వచ్చి మాయింటిముంగిట నెండి యున్న మామిడి కొమ్మపై గూడునుండి తడిసిన తెక్కలను బటపట దులుపుకొనుచు యథాప్రకారము గనే కూయుము మేమును విన్ను బహూమానింతుము. (కవిత)

క. మతిమాలిన మా టిది "కు • ష్యతు దుర్జన" యన్న నీతి నంగీకారం
బ్రతికింపకొంచ మన్నను • బ్రిశిపకికి లేశమేని ఫల మున్నదియే? 174

క. ఇది "సహృదయ" యను పత్రిక • బొదలెడునని యనిన వారు బుద్ధిగలిగి చూ
డఁదగదె, "ఎమ బోతీవిన • యని" యనఁ గట్టుమని చెప్పవగునే దూడన్?

సీ. కల్లదాగ్రివుదురొక్కొ : కలదఁల్ల బలరాముఁడనియెంచియెవ్వ రేనలఘుమతులు
జూదమాడురొక్కొ సూరు లేరేని ధర్మాత్మజాతుండు దృష్టాంత మనుచు
తల్లిఁజంపుదురొక్కొ : తగ వేది యెవరేని బరశురాముండున్నవాఁ డటంచు
కుక్కమాంసము తిందురొక్కొ: విశ్వామిత్రమునిమౌళి యున్న వాఁడని తలంచి

తే. గీ ఉత్తమగుణంబు నేర్చుకో నొప్పుఁగాక
యధమగుణమున కకట! దృష్టాంతిమేల?
కోకిలముగాఁగఁ జక్కని గొంతు వలయుఁ
గాని కృతిమును మఱుమటగాదు సూవె!

చ మన మొనరింపనట్టి పని మాన్యుఁడునుం బొనరించుఁగాక, యూ
తవికి యశంబు దెచ్చినది తత్కృతియో, మఱియొక్కటో? యెఱిం
గిన నరుఁడేవిఁ దా నొక యకించనకార్యము సల్పియుగా దని
ర్శనముగ నాతనిం గొనఁడు, సార మసారు లెఱుంగ నేర్తురే!

సీ. కొండెగాంగ్రదంద ఋద్దండగాయక వరేణ్యుఁడు నారదునికీర్తి నొందఁ బోరు
కొంప లంటించు దుర్గుణరాసులెల్ల శ్రీ యాంజనేయులసాటి నందఁ బోరు
పరభార్యలనుగూడు దురితాత్ములెల్ల దేవేంద్రుతో సామ్యమ్ము నెనయఁబోరు
అనృతమ్ములాడు నీచాచారులెల్ల సాక్షాద్ధర్మరాజులై గ్రాలఁ బోరు

తే. గీ. ఒరు లొనర్చిన మేలును మఱచి "తిన్న
యింటి వాసాలు లెక్కించు" దంటలెల్లఁ
గోటిజన్మమ్ములకునైనఁ గోకిలములు
గారుపూ! కాకవిద్విప గర్వహారి!

ఉ. కోరుటువార లప్పు నొగి గూబలు సల్పి వసూలుచేతు, రె
వ్వారు కృతఘ్నతాప్తి గురువర్యుని గాకముమీఁదఁ బెట్టి య
వ్వారిగఁ దిట్టి తాము పికవైఖరి గంటిమటన్న తృప్తిఁ జె
న్నారుదు? రట్టివారి కెవ రయ్యెదరయ్య జగాన శిక్షకుల్!

క. "గురుఁడను వే"నన "మీరా! • త్వరపడి మా బాలుఁడంచు భావించితి మీ
పొరపాటు పైఁపుఁ" డను ధీ • వరు లిప్డును గలరుసూ! ప్రపంచకమందున్.

క. "వంటింట విట్టికృతి తగ" • దంటకు నొక్కింత కొంకి "యౌ విది తులసీ
మంటప మనుకొంటి" వనెడి • దంట లిపుడుఁ గలరుసూ! శతమ్ములు వేయన్.

ఉ. ఉండఁగ నిమ్ము వారిక మహోదయమందము గాక యింతబ్ర
హ్మాండము మోయునట్టి పరమాత్ముఁడు వారిని మోయలేఁడె ! తే
టుండిన విట్టిసృష్టి కెటు లొప్పెడి ? దేవునిసృష్టి తేఁటిపై
నుండెదునట్లు తేయపయి నుండు నటండుని కేటిభేదముల్ !

క. తేఁటి యితరకీటమ్ముల • మాటికిఁ దనయొద్దఁ జేర్చి మంత్రింపను నా
నాటికి నాత్మాభేదము • వాటించున్ దేయ వీలావరఁ బడఁ గుట్టున్

ఉ. ఎందుల కీవివాద? మిది యెవ్వరుతీర్తు రరణ్యరోదనం,
బందఱికిన్ భవత్కవితయందలిసార మెఱుంగవచ్చె. వా
రిందుల కుత్తరం బిడుట యెట్లు ఘటించెడి? వి న్నెదుర్చు శ
క్తిం దను రేఁడ నుండి కొని తెత్తురు ? చిత్తరు వేమి చేసెడిన్।

మ. ఘనలన్ జూడరు మాట లాడ రెపుడున్ "మద్దేశికుల్ వీ" రటం
చనువా రెందఱు లేరు ! వారిపయి రోషావేశమున్ జూపితే
"యనృత మ్మాడి" రటంచు? నీతని యసత్యం బట్టులే పైపు మె
ప్పునికి న్నష్టము దీన నౌనొ గుఱుతింపన్ లేరె లోకుల్, సఖా! 185

మ. మనశిష్యుం డవినంత నేమి యగు' నన్మార్గుల్ ప్రశంసింప ధీ
ఖనియై పొచ్చెము లేని యాశుకవియై కష్టావధానమ్ములన్
ఘనులౌవారలమెప్పు లేని కుహనాకల్ప ప్రవిష్టుండు, శి
ష్యునియజ్ఞానము దేశికున్ జెడు నొనర్పం గాదె విద్వత్కవీ।

చ. చపలకులాబ్ధిచంద్రుని పరిశంసయు లేదొకపట్ల, నట్టియ
క్కరములు గల్గు పద్దెము నొకండును దా లిఖియించి నట్టి దా
ధరణిపునన్నిధానమునఁ దాఁ బఠియించిన దేది ? చూపినన్
గురుపులకెల్ల నయ్యది యొకొండె వివేకనయై చెలంగుతన్.

ఉ. నే నొకచర్లబ్రహ్మయ మనీషినె పేర్కొనినాఁడ నంట ! రా
నా నియతిన్ జరించెనఁట! యట్టిపరిధాన గురుండు వీఁడె యౌఁ

గాని కులాబ్ధిచంద్రుఁ డెటు గాఁదగుఁ? ద ప్పొనరించి యింక స
ద్దాని సమర్థనమ్మునకుఁ దాఁ బరుపాటు లెవం డెఱుంగఁడో.

సీ. రఘువంశము భుజంగరాడ్గురుసన్నిధి నింపుమీఱఁగఁ బఠియించినాఁడ
శ్రీపాద కృష్ణమూర్తి కవీంద్రుకడ నైదు మాసముల్ శుశ్రూష చేసినాఁడ
కాజులూరను నూరగాఁపు సోములయొద్ద నొక మూఁడుమాసమ్ముఁ లున్నవాఁడ
చామర్లకోటలోఁ జదివితి రాఘవాచార్యుసన్నిధిని మాసత్రియమ్ము

†తే గీ. పైననంతార్య సూరయపండితు లిరు
వురును మూఁడుమాసమ్ములు గురువులైరి
పిదప శ్రీబ్రహ్మయమనీషి పేరు చెప్పు
గురుఁడు నాకయ్యెఁ దన కట్టిగురుఁడనేను.

తే గీ. "ఎవఁడు వెత్తిముండాకొడు కీనమస్సు। వాని"దన "నేనె" యని చెప్పువానిరీతి
నాకుఁ జేకూరి నందుకు నవ్వఁ బోకు। మయ్య! యేనాటికేహౌనొ యరయఁగలమె.

క. శ్రీకరము భాగవత మే, నాకృతికిన్ గృతి యొసంగ, నది కాదని సా
కీకవి కాకవ్యానము"కైకొను" మని కృతి యొసంగెఁ గరుణ క్షితిమెయిన్. 191

తే గీ మధునపంతుల సూరయబుధునియొద్దఁ
జదివె ముందట, నాపిఁదఁ జర్లకులజు
నొద్దఁ బఠియించెఁ, బిదప నాయొద్ద జదివి
కోకిలం బయ్యె; నింకొక్క గురు నెఱుగఁడు.

శా ఓ, నా, మా, లను జెప్పు నొక్కగురుఁ, డింకొక్కండు దా నక్షర
జ్ఞానం బించుక వృద్ధి సేయుఁ, బయి శాస్త్రం బింక నొక్కండు రాఁ
గా నేర్పుకా, గురుమాత్రులెల్లరు నమస్కారార్హులే యైన, వి
జ్ఞానం బబ్బినచోటు వర్ణపర్ణిధమవ కర్తవ్యంబు శ్రేయోర్థికిన్.

*చ. కమ మిది నమ్ముఁగూర్చి "కవిగండఁ" డటంచు నొకంటఁ బద్యమున్
మును రచియించి యిప్పుడది ముద్రణమందునఁ ద్రోసివేసి కీ
ఘనమతు. లంతమాత్రమున గండర గండఁడఁ గాకపోతినో
మును పెటులైతినో। యివియవో మనకోకిలకున్న యోజనల్.

† గురుపరంపరను దెల్పు పద్యములు తుది పుటలోఁ జూడవగు
* " .. .. వెనుక పీరు యానాంలో శతావధాన మొనర్చినప్పుడు తమ

క. కోడియుఁ గుంపటి లే కే • "జాడం ధెలవాఱు నన్న" సామెతగా వీ
రాడినమాట సహించినఁ • గాఁదే గండందు వీఁడు కాఁ దగియున్నన్.

చ తినునెడ రాయి రాఁగఁ గని డీఱఁగ వైష్ణవుఁ డిట్టివాఁడె లిం
గనిగ భ్రమించి తాఁ గొఱికెఁ "గట్టని" నెట్టనఁ బండ్లు వోయెఁ బే
ర్కొని యది ముద్రిణంబునను గూర్పనియంతన పోయెనొక్కొ ః వ్రా
వినజను లుండరే ? యది సహించెనొ వారిని వారు వ్రాసిరే ః

క పంచాంగమ్ములు చించి "న • శించెన్ జుక్క" లను గణక శేఖరులకు వీ
రెంతఁగ నన్నలొ, తమ్ములొ ః • కించిత్సంబంధ మున్నక్రియఁ జూపరైన్. 197

సీ. చామర్లకోట స్టేషనువద్ద జరిగిన చిత్రమ్ము వినుమయ్య ః చెలిమికాఁడ
అల పురాణపు వెంకటప్పయ్య రావుబహదరు గారును వారి యనుజాఁడైన
నాగభూషణముగా ర్నా కటఁ బొడకట్టి రవ్వారితో మాటలాడునప్పు
డీకోకిలయు వెంటనే యుండె నవ్వారి లడిగి "శీతం డెవ్వ" రనుమనన్ను

తే గీ నే వచించితి "రావుసూర్యేందుశ్రీశతవ
ధాను" లని తా వచించె నీతండు "వీరి
శుష్యుఁడనె" యంచు సభలోనఁ జెప్ప కప్పు
డేల చెప్పంగవలయునో యెఱుఁగరాదు.

---

సహాయములేనిదే వారేమియుఁ జేయలేక పోయిరను ననేక దృష్టాంతములచే
నొక వ్యాస మేపత్రికకైన వ్రాసి ప్రకటించుటకు నా కనేక దినములనుండి
యభిలాష కలదు . .. "

16—3—1911, వంతెద్దు రెడ్డినాయుడు.

" ... ఆ పద్యమును ఒకప్పుడు వెం॥ శా॥ గారి మీఁద చెప్పినామని
చదివిరిగాని నాకు కంఠపాఠముకాదు ధారణకు దెచ్చికొని యందువ్రాసితి.
నాల్గవపాదము నాకు విశ్రమస్థానమునుండి జ్ఞాపకముఁ చాలదు . . ...యింతవరకు
"మాకు శతావధాన మసమాన' అని కొంత జ్ఞాపకము." వెం॥ సు॥ రా॥

ఉ. ప్రాకట సత్కవిత్వ పరిపాటివి మేటిసభాంతరమ్ములన్
వీక శతావధానములు వేనకు వే లొనరించి యందు మా
క్కాకల దీరినట్టి కవిగంతఁడు వేంకటశాస్త్రి యుండఁగా
(మాక వధానపుంగృతికి మానసమందుఁ దలంక నేటికిన్)

శా. ఆనాఁడే కనసయ్యె నయ్యెడల విద్యాదక్షుఁడౌ పేరి కా
శీనాథాఖ్యబుధేంద్రుఁ డయ్యనఘుతో శిష్యత్వమున్ దెల్పె నీ
మౌనప్రాభవశాలి, రాజసభలో మన్నామసంబంధ మెం
దేనిన్ సుంత వచింపఁ బాపమయి య ప్దేలాగు గాకుండెనో॥

ఉ. ఇంతకు నాల్గురోజులయి యే వితఁ డుండెడి యూరికేగి "నా
చెంతఁ బఠించి రాజసభఁ జెప్ప, వొకుత్తర మేని వ్రాసియ వే
వింత యి" దన్నఁ గోకిలయు వెల్వెలఁ బోవుచు "నారికేళపుం
జెంతకు గడ్డికై చనుట" చెప్పెడి సామెత నుత్తరం బిడెన్.

తే. గీ. రాజసభలోన వల్లచర్లకులచంద్రు
శిష్యుఁ డగుఁగాక యాతండు చింతలేదు
పిదప నొకయుత్తరము వ్రాసి ముదము గూర్చ
పాటి విద్దెయు నావల్లఁ బడయఁ డోటు॥ 201

ఉ. "సత్కులమందుఁ బుట్టితివి సత్కవి వెంకటశాస్త్రిఁ గొల్చి యా
షట్కపెసంబు నేర్చితివి చాలఁ గృతఘ్నతఁ గాంచనేల, యా
సత్కర" మంచుఁ జెప్పితివి బాగునకై మదిఁ గోరి దానిచే
నుత్కటమయ్యె నాతని మహోద్ధతి నీ వికఁ నేమి చేసెదో॥

ఉ. అర్భకులంచుఁ దమ్ము మది నారసితంట। యెటుల్ ఘటింతు నా
దుర్భరమైన మీసములు దొడ్డది గడ్డము నొడ్డు పొడ్గు పై
నిప్పుకు లొక్క మూగు, రెవ రాడుదు రర్భకులంచుఁ దమ్ము। మా
విప్రియవిప్రపత్యములు నీ కెటు మాన్పఁగవచ్చు శ్రీపతీ,

చ. గురుధనమే హరించి తనకొందము దానికి నెప్పి రెట్టులో
యూరువగు దేవిభాగవత ముత్తమగంధ్రిధ మొసంగి దేశికా
దరమున కాలవాలమయి తత్కరుణన్ సిరి గల్గి నందన
స్ఫురణ మెలర్ప నొప్పెదవు వో। యవివేకవివాద మేటికిన్.

చ. ఇది తగునే యటంచుఁ దను నీ విపు డంటి, వీఁ కొక్క రెవ్వరో
మది గలవారు నీవలెనె పంచిచి గావని మందలించుచో
నెదిమొ యొకిండు నింద పయి పెట్టుట పొల్పి కృతఘ్నతన్ వెలా
ర్పఁ దలఁమనొక్క మెంతటి యుపాయము నేర్చెను శిష్యుఁ డద్దిరే॥

ఉ. పత్రికలందు, బాలుర యపత్రపరేమిగుణించి శ్లాఘ్యదా
రితుల న్యాయమేదు "లరరే! యిది యెక్కడిపాప" మంచు స
ర్వతర హితమ్ముఁ బేర్కొనుచు వచ్చిరి. వారలఁగూడ నిట్టులే
ఛాతుర "లపాత్రు" లం చనఁగఁ జాలఁ బ్రియత్న మొనర్తురో కదే.

శా. ఇచ్ఛామాత్రమునన్ బ్రబంధముల నెన్నేనిన్ రసారామపుం
గుచ్ఛమ్ముల్ బలె సృష్టి సేయు నిను నెగ్గుల్ బల్కఁగా కీతఁ డ
స్వచ్ఛాభీయుఁడె కాక బందుగుఁడు మచ్ఛాత్రుండు గాకుండఁగా
కచ్ఛమ్మైన కొలమ్ముమాఁ డితని నాకై నీవు పైరింపవే.

క. నీ వెంత కాలు ద్రవ్విన • మావాఁ డతి శాంతమూర్తి మాటాడఁడులో
నేవో చాటుగ ననుకొను • చే వానికి మాన్పవచ్చు, నెందుకుఁ జర్చల్ ? 208

శా. "చూడంజాలని" మాట సత్యమె, యెటుల్ చూడంగనౌ ! శిష్యుఁడౌ
వాఁ డీరీతిఁ గృతఘ్నుఁ డౌటయుఁ, బరిభ్రష్టాపథాన క్రియా
పీడుం డౌటయుఁ, జేతఁగాని కవితన్ బెంపేది యల్లంతఁటో
కేఁడున్ లేఁ దని విఱ్ఱవీఁగి తుద కి ట్టీపాటు గైకొంటయున్

శా "చూడంజాలని" మాట సత్యమె, యెటుల్. చూడంగనౌ ! వట్టి యా
యీడంబంబులు, కుంటి గుద్దికి విశల్. హేయాతిహేయమ్ములౌ
దూడల్. కూడని పోఁడుముల్, విఱుగుబన్, దుర్వారగర్వోచ్చతల్,
తాల్రిడున్ బొంగ్రము లేని యాటమడుకుల్, తర్యేతరాలాపముల్.

శా. "చూడంజాలని" మాట సత్యమె, కుశిష్యున్ గర్జునిన్ దుర్నయుం
జూడంజాలెనె భార్గవుం, డల వసిష్ఠుండు న్నిమిన్ శిష్యునిం
జూడంజాలెనె సాపరాధు ! ననయున్ శుక్రుండు వక్రాశయుం
జూడంజాలెనె రావణున్ ! వినవొకో శుద్ధాత్ములౌ పూర్వులన్ !

శా. "చూడంజాలని" మాటయే నిజము. శిష్యుండైన రంగార్యుఁడీ
జాడం జూపఁగ దండిభట్టకుల భాస్వజ్జ్యోతి. భాష్యాంతవి
చ్ఛాడాలంకృతి, విశ్వనాథబుధుఁ డీసుం జెంది యంతేవన
చ్ఛాడాచారము వాపకే విడిచెనే, సూరుల్ ప్రశంసింపరే !

శా. "చూడంజాలక" యంట కర్ణ మిది, శిష్యుం డొక్కరుం డాత్మకుం
దీశం గొప్పు కృతఘ్న శాతరముమైఁ బేరొంద మంకింప నా

జూడం గొంత యెఱింగి లోకులకుఁ దత్సత్త్వంబు సత్యంబుమం
గూడం దెల్పి యథార్థమార్గమునకుం గొంపోవ యత్నించుచే.

క "కుండలకోఁ బాండిత్యము • దండిగఁ గలవాఁ" డటంచుఁ దమ గురుపుత్త్రిన్.
దుండగమున విందించిన • పండితు లవ్వారి కుంతవలదే తెగువన్ 214

మ. యతియున్ బ్రాసయుఁ గూర్పుమాత్రిఁ గవిమేః యామాత్రపుందెల్వి యీ
క్షితి "యంత్రబ్రహ్మల" కుండ దెందఱికిః వాపిన్ మీనముల్ దువ్వి యే
ప్రతివన్ దా నొనరించు దాని సభ విల్పంజాలు నెవ్వాఁడు, వి
ష్ప్రితిముండాతఁడుః నోటివాడుకిఁక "యంబ్రిహ్మఁ" మహాపండితుల్

*మ ఎఱుగన్ జాలరు బుద్ధిమంతు లిసిరో ! యింటింటి పూజారు" లం
చఱవంజొత్తురు విజ్ఞులెంబలెనె. యౌరౌరౌర ! బాణున్ యశ
స్కరు నేమంచుఁ దనూభవుండు వొగడెన్ గాదంబరీకావ్యమున్
సరిగాఁ గన్నులు రెండు విప్పి కని చర్చన్‌జేయ విస్పష్టమౌ.

ఉ. ఒక్కఁడు శిష్యుఁ, డింక నొకఁడో పరికింపఁ బ్రిశిష్యుఁ డయ్యె. నీ
వ్రిక్కకుఁజూడ నీవు సహపాఠివి, మూగురి మందలింపఁగా
హ క్కొకయింత నాకుఁగల. దైనను లాభములేమ, వారు చె
ట్టెక్కిరి కోకిలమ్ములయి, యిక్కతన న్నిను మందలించితిన్.

చ ఇది విని యేరిశిష్యుఁడును విట్టి కృతఘ్నత చూపకుండుఁ గా,
కదియును గల్గెనేని గురుఁ డాచతురున్ క్షమియింప కుండుఁగా,
తెవిరివి దమ్ముఁ దా మెఱిఁగియే చరియింతురుగాక యేరు, స
త్పదము దొరంగియున్ మరల దారికి వత్తురుగాక యుత్తముల్. 218

## (7) ఇతిహాస పర్వము

శా చూడంజాలవొ నీవు భూపతిసదస్సుల్ ? జూడఁగాఁ బోయినన్
తేఁ "కీతం దసమర్థుఁ" డంచు సభకు న్నీరాక కొప్పందొ ! విశా

* శ్లో॥ ఆర్యం య మచ్ఛతి గృహేగృహఏవ లోక ః
పుణ్యైః కృతశ్చయర ఏవ మయాఽత్మలాభః
సృష్టాచ యేనచ కథేయ మనన్యశక్యా
వాగీశ్వరం పితరమేవ త మానతోఽస్మి. (కాదంబరి)

జూడంగూడినషోఁద వీరి నటుపైఁ జూడఁగా బ్రసక్తించునో ।
చూడంబోమియె తమ్ము మన్నటని లోఁ, జూడంగలేరక్కటా ।

ఉ "ఎందుకుఁ బోరు వీరు నృపుఁ డెంతయు దాతగదా" యటంచు లో
సంపియు ముందవచ్చుఁ గవిసంతతి కయ్యది వాపు టొప్పు, న
మ్మం దగునేవి నమ్ముదుటు మానిన మానుదు, రా నృపాలమౌ
ళిం దిలకింప నొప్పమికి లే దితరం బిది విన్ము శ్రీపతీ

చ కడియము తేవిగ్రామ మది కాపురమౌ మఱి నాకుఁ బూర్వపుం
దొడికపుఁగైత కెవ్వఁడు మహోదధి మత్ప్రపితామహానుజుం
డెడపక తేనిసన్నిధికి నేగక కాలము పుచ్చె నప్పు డా
తఁడు గలచోటికే నృపవతంసుఁడు వచ్చె రసజ్ఞుఁ డౌటచేఁ

* శా నీలాద్రిక్షితిపాలుఁ "డేమి వలయుఁగా మీ" కన్న "నా కన్న వ
స్త్రాలందెందు గొఱంత లేదు నరనాథా ! నీవు మేల్ దాత వం
చేలా గీతఁడు గోరు విన్ము ! సకలం బీవిచ్చినట్లే ధరా
పాలుర్ మీ రెపుడో యొసంగువిలయే బాలించెడిఁ మమ్ములఁ"

చ తగ విను మయ్య ! నాదగణితమ్మునఁ బండితు లౌ చెఱింగి మె
చ్చుగ మును మాదుపూర్వులకు సూరిజనావరు లెప్పుడో యొక
ప్డొగి నొకకొంతభూమి యిడి రోనరపాలక ! మీనృపుల్ తదా
దిగ నదిపెంచుచున్నది మదీయుల నెల్లరఁ గామధేనువై

చ. వలవనికోరికల్ తగవు బ్రాహ్మణజాతికి, నున్నదానితో
నలుపుటయొప్పు జీవనము, సంపద హెచ్చు కొలంది ముందువా
రలు మదమత్తులై చెడి పరంపరగాఁ గల వేదశాస్త్రపుం
జెలిమికి బాహ్యులౌదు; రటు చేసిన బ్రాహ్మణజాతియే చెడుఁగా.

ఆ. పె మూఁడు జాము లైన మ్రుచ్చు ప్రొద్దునవైన
నెవఁడు శాకమాత్రమేవియింటఁ
దనకు నున్నదానిఁ దాఁ దిమనో యట్టి
వాఁడు శ్లాఘ్యుఁ డంద్రు బ్రహ్మవిదులు.

శా అంతో యింతయొ పండు భూమి గల దావంతైననుం జింత లే
దెంతేఁ జింత యొకండు గల్గినను నాయీచింతయే మాకు న

* నరసింహవిక్రృత వేంకటేశ్వర విలాస పీఠిక చూడుఁడు.

శ్రాంతమ్మున్ ఫలదాత, తత్ఫలములన్ శాకమ్ములన్ గల్గ మా
పంతంబెట్టులు చెల్లకుండు నృపతీ! భవ్యాకృతీ! సత్కృతీ!

ఉ పొట్టకులేనియప్పుడు నృపుల్ గల, రూరక విన్నఁగోరఁగాఁ
బుట్టదు మానసం, బితఁడుపూజ్యుఁ డటంచు నెఱుంగుచేసుకీ!
పట్టము గట్టుటన్న, నరపాలక! నీపరిపాటి నేఁడు గాఁ
బట్టదు పూర్వపున్ యుగమువానిఁగ నిన్ మది నెంతు" నావుడున్

ఉ కోరియెతీరఁగా వలయుఁ గోరిన దిచ్చి యశమ్ము నందియే
తీరవలెన్ నృపుం డితఁడు, తేజము లేనియపాత్రదానముల్
పే రొడఁగూర్ప నేరవు, కవిప్రవరుం డొకఁ డిచ్చుపద్దెమే
చేరుచు స్వర్గమున్, యశముచేఁ గద! యయ్యెడ నిల్వఁ గల్గుటల్

క. నేరవి కవి కవితాఖర • వారారోహణమహోత్సవమ్ము నకన్నన్
నేరుచుకవి కవితార్ణవ • దోరూదారపరిహారయోగము మెఱుఁగౌ 229

ఉ ఇంద్రుఁడు చంద్రుఁ డంచుఁ గవు లెందరు సన్నుతు లెన్ని చేసినన్
బందకవిత్వమేని యది, పాడఱు నున్న యశంబుఁగూడఁ, బే
రందిన మిమ్ముఁబోఁటికవు లాగ్రహ మంది యొకంటఁ దిట్టినన్
బొందు యశమ్ము దాన, రసపూరిత మయ్యది గాన సత్కవీ

ఆ కుట్టికవి మహిషశతకము • గట్టిగఁ గోపించి చెప్పెఁగద! తంజావూ
ర్పట్టణ విభుపై నాతఁడు • దిట్టువడియు మెచ్చుకొనెఁడె ధీవరు డతనిన్!

ఉ మున్ను మహమ్మదీయనృపముఖ్యుఁడు దా ననుమాటఁ దప్పఁగాఁ
గ్రన్నన గోపగించి కవిగండరగండఁ డొకండు తొల్లిఁ దాఁ
బన్నినకైత చింపి, పయిఁ బన్నెను దిట్టుచుఁ గావ్య మొండు, దా
న న్నృపుఁ డందె మోదమువినన్ సుకవీంద్రమహత్త్వ మల్పమే!

క కల విట్టిప నేకము లీ • కలికాలమునందుఁ గూడఁ గవుల చరిత్రల్
కలరు నృపాలకు లిట్టిరు • బలవంతపుటీవి యశము వడసినవారల్.

ఉ కావున నీకతావఁ గృతిగావలె నీతఁడు కోరుఁ డెద్దియో,
పావనుఁ జేయఁడీ నృపునిఁ, బాత్రము చేకుఱు నెంతవారి కౌఁ,
జొప్పు ధనం బెటో యశము పుట్టఁగఁ జేసెడిదానమన్నచో
నీవిధమైన సత్కవుల కిచ్చినదే యది నిల్చునెప్పుడున్.

తే గీ సత్కవుల గ్రంథములు గాక సాక్ష్య మేది ?
రాముఁ డెట్టిఁడొ, యెట్టిఁడో రావణుండు ?
తా రెచట మన్న మృగ్యులే తజ్ఞులెందుఁ
గీర్తికాముని కళ చక్రవర్తికేని

క. అని చెప్పి కోరుఁ డని ప ట్టును బట్టినఁ దాత గోరెదుగా విను "మోయీ
జనపాల ! నాదుకోరిక గను మది యిచ్చుటయె నాకుఁ గనకాచలమౌ

చ. కల దని మున్నె చెప్పితివిగా ! యిల మీరికినట్టి దింత, య
య్యల కొకకొంత కట్టుబడి యేర్పడి యున్నది మున్న. దానిలో
పలఁ గల మూఁడుభాగముల భాగ మొకం డది నాది; దానికిం
గలకరముగా వెలార్పు మది గాఁదగు నాకొకకోటితుల్యమై

క. కృతియన్న యామినీ పూ ర్ణతిలకలో నీదు పేరు నాటించితి నిం
తకుమున్న దేవునికి నం కిత మది చేసితిని ధన మకించిత్కరమౌ ''

క అని తేనిసమాధానం బు నెటో పొనరించె, నట్టిపుణ్యాత్మునికిన్
మునిమనుమఁడ నరసకవీం ద్రునికిన్, నాయంత నరుగుమనె నృపుఁ జూడన్

క. తిరుపతికి వేంకటేశ్వరుఁ డరుగనియెడ కరుగు టొప్పు నని యెంతురె యె
వ్వరుగాని మనకుఁ గల్గిన పరస్పరస్నేహ మెఱుఁగు పండితమూర్తుల్

చ ఇది యటులుంచు మింకొకటి యీశ్వరవే ర్లట నున్నవారు నీ
కెవ భయమౌఁగదా యటకు నేగ ! నృపాలుఁడు పిల్చె నేనిఁ గో
విదు లెటు లెంతురో యనుచు నీసముఁ దాౘసము లేక కైత తా
వదరిన దీపెఱుంగవాకొ వారలధాటికి నాఁగ నేర్తువే.

* ఉ. ఊరును బేరునుం దెలిచి "హూ'' షని తోలఁగఁ జాలపండితుల్
ధీరులు రామకృష్ణు లరుదెంచి సభాస్థలిఁ గూరుమున్నచో
నోరు మెదల్పఁగాఁగలవె నూటి కటంచు మొకండు పద్దెముం
గోరినఁ జెప్ప నేరుతువొకో ! వృతగాఁ జననేటి కోనలా !

ఉ పల్లెలలోన సూక్ష్మల్పడులఁ బామరసంఘమునొద్దఁ దక్కఁభూ
వల్లభస త్స భాస్థలుల వా క్కెటు లేచెడి నీకు ! నీదు వి

* ఉ. ... ఈ హిరహిమెంత పీఠపురి నీశ్వరవేర్లు వసించువారు నీ
యూరును బేరునుం దెలిచి హూషని తోలెవ రేగి వ్రాయుమీ.
(సత్యసందేశము 6 వ పుట)

ద్యోల్లసనం బెవం డెఱుఁగఁ దూరక ఱంకెఱ వైవఁ. "దల్లిష్టు
ట్టి" ల్లనునట్టి సామెతగ నీశ్వరవేరు రెఱుంగరే సఖా ।
ఉ వచ్చును రెండుశాస్త్రముఱ వారికి నీ కొకటేవి రాదు. స
ర్వోచ్చముగాఁ గవిత్వ మలయుగ్మము పెప్పెడి నీవు చెప్పలేః
వెచ్చటనో రచించుటకు నిచ్చటికిం గడు భేవ ముందు. ని
న్నెచ్చట మెచ్చి రొక్కఁడును నేనియు సాక్షిగఁ జూప నేర్తువే ?
చ. ఇటు మొగమోటముగా విడిచి యే నవినాఁడ నటంచుఁ గోపము
క్కట మగునేమొ నీకు. వృథగా మతి నాపయి రాకు మీగతిగా
రటనము సారెసారెకు దురంబుగఁ బత్రికయందు వించు మా
ఱటమొగపుగా బ్రబుద్ధుల పరాక్రమపుందెబుపుల్ లిఖించితిగా
క. కలరేమొ యిట్టివారి • క్కలియుగమునవేని యొండు కడ నక్కట । యీ
కలిటొల్లి బ్రాతలేతమ • కలవఱచునె సుకవివీరు లను సవ్యశముగా 246
క. ఎందులకుఁ బిచ్చివ్రాఁతలు • సందేహములేదయేని సత్సభకుం బొం
దందఱుఁ గందురు మీ శ • క్తిం దగ నవిచెప్ప నొక్కఁడీరుఁడు లేఁడే
క మన యపధానంబుఁట । వీ రొవరుమ నవధానమునకు నొక సూఱవ వం
తునఁగూడ మాఱదవియే • ఘనుఁడో లిఖియించె నంట । కంటివె? సఖుఁడా.
క. రెండును విడిచినవ్రాఁతకు • నొండొకసందియము కూడ నుండునె ? మతియె
వ్వండెవి యొకఁడు వ్రాసినఁ • గొండురె తా మట్టివ్రాత కోవిదులేనిఁ!
క. ఎవఁడో సీతను పైతము • వివేకరహితుఁడయి యాదెవి వినమ్మెనె యా
యవివేకుని ప్రల్లదముఱ • కవిలోకము విజము పివపఁ గవి వ్రాయవౌకో ।
తే. గీ. అప్లై యెవ్వండొ వ్రాయుఁగా కంతమాత్రఁ
జంకలం గొట్టుదురె ? వివేచనయె యున్న
తిరుపతి యెవండు । వేంకటేశ్వరుఁ డెవం । డ
టంచు వించుకయేవి యోజించ వలదె.
క గేహెనర్థు లొసర్చు దు • రూహలవలనన యశమ్ము లుకివోయిన వై
దేహి పతివ్రతయై తా • నేహనియు లేక జగతి నెటు వెలసె సఖా ।
* క. బందరులో ఘనులందరు • వింది౦చిరటంచు నెవఁడొ నెఱి వ్రాసె నటం
చుం దారువ్రాసికొవి రత • విం దెలిపినఁ బిసప దాని నిక్కముతేలుగా 253

*అట్టహాసము 10-11-వ పుటఱ చూడుఁడు మతికొన్ని ప్రల్లవములకు 17 వ పుట

ఆ. వె. వ్రాలుదెల్పరేని వ్రాసిన యీ పెద్ద
మానిసిని దగుంబ్రమాణమొప్ప
నడుగఁ దగినవారె యడుగుదు రేం దో
బూచి దొంగబూచి బూటకములు.

తే. గీ. అందరేవచ్చి యటులేని ప్రశ్న చూపి
మునలితనపు మన వధానమునకు నేని
దీ టటన్నమాటను దారు దెచ్చికొన్న
మనల మొక్కింపరే వారిఘనత కొరులు?

క. పసి పూసి యెద్దుకో లిరు • దు సాపముం గూడఁ జెలిచి తుందుడుకున వె
క్కసమగు కోలఁలు కోపెడి • యసత్యపుంగనుల నెవ్వ రాఁగెదరు? సఖా!

ఉ. ఆతఁడు నాయెడన్ సలిపినట్టి కృతఘ్నత కీవు లోకవి
ఖ్యాతకవిత్వతత్త్వకృతి కల్పలతావళితా ప్రశాఖవై
చేఁతకుఁజేఁత చేసితివి. చేకుతె మోసము. తిట్టు విమ్ము. వా
రీతతి నెంత తిట్టినను వించుక ఖేదము లేదు తిర్పతీ!

ఉ. సంతసమైనదే యగును ధాత్రిని వృద్ధి. మనంబునందు నా
వంత కృతఘ్నతం గనఁత యంతటఁ బోక వృథాగ వెక్కిరిం
పంతట నేవిఁ బోక యిటు లాఁబడివ్రాఁతలు పిప్పిగంతులున్
బంతములున్, సభాస్థలికిఁ వచ్చునొ? రాఁ దిది యేటి బీరమో!

చ. నరుఁడు శిఖండి యల్ల కురునాథుఁడుఁ దమ్ములు నొద్దు ద్రోణు కిం
కరులయి విద్య నేర్చి కొనఁగా నమకట్టిరి నేర్చి రెల్ల, రం
దఱును బ్రవీణులైనను ధనంజయుఁ డొక్కఁడె తుల్యుఁడయ్యె నె
వ్వరు తన యగ్రమందు నిలువం గల రన్న గురుం డెఱుంగఁడే.

క. గురుపుల వంచించెడి ధ • ర్మరతులకున్ ధర్మరాజు మార్గముఁ జూపెన్
బరుషోక్తు లతవినోటన్ • దొరల వసత్యమ్ము వానితోఁ దుల యగునే!

ఉ. ఆలములోనఁ గూడ గురునంఘ్రులకున్ బ్రణమిల్లి గావి న
చ్చిలుఁడు పార్థుఁ డెప్పుడును జేసియొఱుంగఁడు యుద్ధ, మందుకే
చాలియుఁ ద్రోణుఁడాతనికిఁ జాలియట్లు నటించి ప్రాణమున్,
బాలికునట్లు పోషించి పాండవులన్ గెలిపించె ప్రేమ్మిదిన్

ఉ. వీ కసమానకక్ష యిది నే ఘటియించితిఁ దప్పు పైపు మీ
లోకము ని న్నెఱుంగు "నతిలోకకవిత్వవిదుండ" వంచు, ని
న్నాకవు లేమి యన్న నవి యన్నియు నోర్వఁగదయ్య ! యింతకే
చేకుఱెఁ గార్యసిద్ధి, యిఁకఁ జేయుపఁ్రయత్నము లేటి కోసఖా !

చ. వలసినవారు "వీరలకు వారల కెంతటి వార యున్నదో !
తెలియుఁడ" మంచుఁ గబ్బములు దీసి వివేచన సేయరాక్కా ! యీ
కలహ మదేల నీకుఁ ? గవికాంతులతో నగు నేవి యొప్పఁగా
కిల విటువంటి యర్భకుల నే మని నీవు జయించి ఖించితో !

సీ. తిరుపతివేంకటేశ్వర కవీంద్రులముందు నిల్తురో యెవ్వారు నిల్వలేరొ
వారికవిత్వమే సారవంత మ్మొక్కొ వీరికవిత్వమే సార మొక్కొ
వారికి వీరికి నారయ గురుశిష్యభావమో సహపాఠిభావ మొక్కొ
అవధాన మన్న వీ రాచరించెడితంత్రమే యౌనా యవ్వారిదే యగునొకొ
తే గీ వాగిపేరన్న వీరొక్కతిరుగఁగ
నభినయించుట కేమొక్కొ యవసరంబు
అనుచు సంశయమున నోలలాడులోక
మిపుడు నిక్క మ్మెఱింగి స్వస్థపడుఁగాక.

ఉ. వీరి కసూయ యంచును, నవీముల పైఁప రటంచుఁ, గొందఱె
వ్వారో వచింతురి గాక, యని వాస్తవమైన, వఘాను లెందఱు
న్నా రిపు, డట్టివారిపయి నాకును నీకు ససూయ లేక యి
వ్వారిపయిం బొసంగుటకు వారె యెఱుంగఁ గలారు హేతువున్.

క పలుమాట లేల తోటన్ • దల దూరిచి రోఁకటి కిఁకఁ దలఁకం బని లే
దిల "కురులైన సూరుల • పొలకువ లిట్టివె" యటంచు బుధు లెఱుఁగరొకో!

---

## (8) దైవత పర్వము.

*ఉ. తిట్టుమన్నవారని పదింబది వార్తలు వమ్ముమన్న; వా
తిట్టులకెల్ల నుత్తరము దేపుఁడె లా విడువాఁడు గాక; యా

---

* నడుమ తమక్షేమములు తెలియుటలేమ. రామకృష్ణకవులు, తమ ఉభయుల పైని "తిరుపతి వేంకటేశ్వరీయ" మను నొక శ్లేషకావ్యము, అట్టిదే యొక

దట్టుల కెట్టులో దొరలు తప్పరుకై తకుఁ దోడు తిట్టులా
కట్టట ; యట్టికై తలకె కావలె నెక్కుడు తెల్పి శ్రీపతీ ;

ఉ. తిట్టుట నాకు సమ్మతిమె. తియ్యనిపద్యాలు మేల్మికయ్యయున్
బెట్టినకై తయేని యది పేర్మిలుపుం గద వారికిన్ ; వృథా
తిట్టుటవల్ల గ్రామ్యులకుఁ దెల్పి విశేషము గాన వారలన్
గట్టిగ మేపి తిట్టుఁ దనఁగాఁ దగదో ; తమ కేటి కీర్తిమల్ ;

ఉ. తిట్టచుఁ జెప్పినారలఁట ; తిర్పతివెంకట ఈశ్వరీయ మం
టట్టి పబంధమందు నఁట ; యన్నియు శ్లేష్మము లంట ; "విగ్రహం
బెట్టిదియైనఁ బూజ్య మిఁక పీపయి గా" దని సారమంట ; పీ ;
యెట్టివివేక మాకవుల కిచ్చెనొకో భగవంతుఁ డింతకుఁ. 271

శతకమున్నూ వ్రాసిరనియు అందు విగ్రహారాధనము చేయఁగూడదను నర్థము బాహ్యముగానున్నూ, తమరిని పూర్వులెవరైన పూజించిన పూజింతురుగాక అధునికు లెవ్వరు అట్లు చేయరనియును అర్థమువచ్చునట ; కొద్దిరోజులలో అచ్చువేసి పబ్లిష్ చేయుదురట. అందుల వక పద్యమొక కుఱ్ఱవానివల్ల నా వద్దకు వచ్చినది. యిందుతో పంపించినాను పయిసంగతులన్నియు . . గారివల్ల విన్నానని . . . . శాస్త్రిగారు నాతో హేళనగా చెప్పినారు. యిందుగురించి అనగా రామకృష్ణులచేయు అనవసర ప్రసంగములను గురించి . . సమాధానము వ్రాయుటలో తాము . పూనుకొననిచో శ్రీ॥ది॥ తిరుపతిశాస్త్రిగారు అంత శ్రద్ధగా పనిచేస్తారని నమ్మకంచాలక నాకు.... . హేళనవినుట చాలా కష్టము తోచి విశదీకరిచుంకున్నాను "

లక్ష్మీనరసాపురం, 4—12—10, శ్రీరాములు.

క. "కొంగొంగునమచుఁ గూసెదు • కొంగను మాంగికులమొంఁగు కొంచెపుకాకిన్
బంగారుపంజరమ్మున • సింగారింపంగ నెవడు చిత్తముగొలుపున్."

గొల్ల పోలు 31—1—11.

" .. . త॥ బ్ర॥ ద్విభాష్యం పుల్లకవిగారు విన్నటిరోజున పిఠాపురం వెళ్ళినారు. ఆయనవద్ద తిరుపతివేంకటేశ్వరశతకం పిఠాపురం కవులు చదివి విని పించినారట. ఆయన నాతో చెప్పిరి. . . . . "

అల్లంరాజు లక్ష్మీపతి.

పై సంగతికే 8—9 సంచికలుగం కవిత సెటిల్ పేజీకూడ చూడఁదగు.

చ తిరుపతివేంకటేశ్వరుని దేవుని వాని యభిఖ్యఁ బూనుత
ద్గురువుల మమ్ముఁ బట్టికద తోఁచినపట్టున దిట్టఁ జొచ్చిరి
ర్వ్వరు కవు లక్కటా! యిచట ద్రోహము సర్వము వానిపేరనౌ
బరఁగెడి మాది, యేమనినఁ బండితు లావృతిమై వినం దగుఁ.

ఉ. గవ్వయుఁ బోనిమేము త్రిజగమ్ములకున్ ప్రభువైనవాని పే
రెవ్వగనో ధరించుటకు నీకిపు లొప్పక పోయి రందుచే
నవ్వఁ దొడంగి రాకుధరనాథునియోరిమిఁ జూచి, లేనిచో
నెవ్వఁడు నవ్వఁ జాలు నల యేలికఁ దిర్పతి వేంకటేశ్వరుఁ.

మ. అపమర్థుండు సమర్థుపేరు గొనఁగా హర్షింపరెవ్వారు వె
క్కసమౌ తాదృశఫక్కి యెంచఁ దెలుపన్ గష్టించు మావారి యీ
వ్యసనంబున్ బుధు లాచరింపుటకునై ప్రార్థించుచున్నార మా
కసి యేమైనను దీనిపార మిటులే కన్పట్టె మా కియ్యెడన్. 273

"చ కలి గనుఁబ్రామ నేలికల గావననేమగు! లాఁతివారలే
దలఁపరు వేల్పు లంచెదఁ, దత్ప్రతిమూర్తులవార్త లేమన
వ్వలె! విపరీతవాసనల వాకొను వారును వీరు నీదు చె
ప్పలు దల కెక్కఁ గప్పుమిడి మోయరె తిర్పతి వేంకటేశ్వరా! 1

చ. కొలఁదికి మీఱె నీదు గుణకోటి గణింపఁగ నెవ్వఁడోపు! నే
తలమునను న్న వేల్పు లరుదా! యటమానితు లౌట, యెట్టిగో
తలకడనేవి శోధనవిటంకము నీ దగునామ మొప్పి పూ
జలఁగొను వారిశ్రేయములఁ జాటుచుఁ దిర్పతి వేంకటేశ్వరా! 2

చ. కొలుతురు విష్ణుఁ డామరులుఁ గోవిదులున్ మఱి రాజరాజులున్
దరఁవ నశక్య మొందొకఁడు దుష్టుఁడు నీయెడ, విఱ్ఱవీఁగినన్
దలగొఱిగించి "వంత మిడి దాసుఁడ నే"వనఁ బ్రోతు, దానఁజూ
కలియుగదైవత ప్రథితిగాంచితి తిర్పతి వేంకటేశ్వరా! 3

ఉ తేరె త్వదీయనామ మొకలీల ధరించినవార లెందఱో
వారును నీపునున్ గప్పుచె. వచ్చునె నీదు ప్రతిష్ఠ వారికిన్?
తేనువ నీదు పాతి దెబో చేరఁసూతప్రియ పల్వాలమ్ములన్
వారక మానపంబు లనవచ్చునె తిర్పతి వేంకటేశ్వరా! 4

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి. చందవోలు (రేపల్లె తా॥)"

ఆ వె. కాని మమ్ముఁ బట్టి కసి దీర్చుకొనక య
ద్దేవుఁ డిట్టు లరిది; తెలివి యధిక
మైనకతన నిట్టిపూనిక గల్గె మా
వారి కదియు మాకుఁ బ్రాభవంబె

క. కాకవ్యాసము తమకే । మేకౌ గతి విడియు నెత్తిమీఁదికి వచ్చుం
బో । కత్తిసాము నేరవి । ప్రాకృతులనుగాలొ గేహె బలి గోరుఁజూమీ. 275

## తిరుపతి వేంకటేశ్వర స్తవము.

శ్రీమత్పరదేవతాయైనమః

“కలౌ వేంకటనాయకః”

శ్లో॥ “పాపధ్వాంతదివాకరం కుకవిరాడ్ భద్రేభకంఠీరవం
రంగత్కోమలగద్యపద్యలహరీధారాదిధారాధరం
నానాశాస్త్రపురాణపావనకరం లక్ష్మీమనోనాయకం
ఆర్తత్రాణ పరాయణం తిరుపతి శ్రీ వేంకటేశం భజే”

ఉ. నీ కరుణాకటాక్షమున విద్యల నెవ్వని జూతు వాఁడె
లోకములోన మెండుగ వెలుంగును; నన్వినుతింప శక్యమే ।
ప్రాకటమైన నీదు పదపద్మములన్ భజియించుచుండినం
జేకుఱుఁగాదె విద్యలను శ్రీకర । తిర్పతి వెంకటేశ్వరా । 1

ఉ. భారతవర్షమందుఁ దగ భాసిలుచుండిన నాంధ్రదేశమం
దారయ నీదు నామమును నాత్మఁ దలంపనియట్టి కీర్తివి
స్ఫారుఁడు గానరాఁ డిదియె సత్యము సత్యము సత్యమయ్య । సు
శ్రీరమణీశ । సద్విబుధసేవిత । తిర్పతి వెంకటేశ్వరా । 2

ఉ. రాలకు మ్రొక్కఁగూడదఁట । రాతికి మ్రొక్కిన పాపమంట । భూ
పాలురఁజేరి గొప్పగ స్తవంబులఁ జేయఁగవచ్చునంట । మే
ల్మేలు । భళీ । యెఱింగితివె మేదినిలోపల నిట్టిమాటలన్
బాలితభక్తలోక జన వందిత । తిర్పతి వేంకటేశ్వరా. 3

చ. తిరుపతి వెంకటేశ్వరుని తేజ మొకింత యెఱుంగలేక త
త్తిరుపతి నేల చేరుదురు దేవుఁ డటంచు భజింతు రేల యం
చరయఁగఁ బల్కుచున్ సతత మర్కట । భక్తివిహీనులౌచు రీ
కరణి మహాంధులౌచు; దయఁ గావుము తిర్పతి వెంకటేశ్వరా. 4

చ. తిరుపతిమార్గ మిట్టిదని తెల్పియె యుంటిని: వీర లట్టిచోఁ
దిరుపతి కేగ మ్రొక్కులను దీర్పఁగడంగు టెఁ జెప్పు ; దక్కడన్
జరుగు మహోత్సవంబులపనం గని పొంగుట యెప్డు ; వేంకటే
శ్వరచరణారుణాంబుజరజంబు శిరంబునఁ దాల్చి చెప్దిఁకన్.

---

చ "గురుఁడను నేనె లోకములకున్, నను గొల్వఁ" డటంచు వేడుకన్
నిరతము పల్కుచుఁ మఱియు నిర్భయలీలను నావహించి యీ
నరులను వేఁపుచుందువఁట ; నమ్మఁగరాదఁట; గల్గనౌనె యీ
సరణి వచించువారలకు సద్గతి తిర్పతి వెంకటేశ్వరా ; 5

చ. సరసిజసంభవాది సురసంఘకిరీటవినూత్న రత్న సం
స్ఫురితమరీచిజాలపరిపూరిత పాదసరోజయుగ్మ ; నీ
వర కరుణారసంబునకుఁ బాత్రులు గారె కవీంద్రు లెల్ల రీ
వరధరణీస్థలిన్ సుకవి వందిత ; తిర్పతివేంకటేశ్వరా. 6

చ నిరతము మీ మహాద్భుత వినిర్మలనామచరిత్రి మెప్పు దే
మఱక యహర్నిశంబును మానసమందుఁ దలంచు మానవుల్
పరమపవిత్రులై చనుచుఁ బల్వురచే విని యున్నవాఁడ నీ
సరికిని "రామకృష్ణ" యను చక్కని మంత్రము దోఁచదయ్యె న
న్నరయఁగ నేమి చేయుదొ మహాత్మక ; తిర్పతివెంకటేశ్వరా ; 7

మ ధనధాన్యంబులు సంగ్రహింతురు సుహృద్దారాసుపుత్రాదులన్
మనుపన్ రాజులఁ జేరి గర్వు లగుచున్ దైవంబు లెక్కింపకే
ఘనమౌ సద్గురుసేవ సల్పరకటా ; గర్వాంధు లై వట్టు దోఁ
చె నరుల్ కొందఱు భూమిలోఁ దిరుపతి శ్రీవెంకటేశ ప్రభూ ; 8

మ ధరణిన్ క్షీరపయోధిమధ్య గతరత్నద్వీప రత్నావళిన్
బరిశీలింపక వత్తు గుల్లలనుచున్ భక్షింపఁగాఁ బోవు కా
క్కెర పుల్గంబలె సద్గురున్ సభలో గేలించు దుశ్శీలుఁడుస్
స్థిరమోహంబును బొందునే ; తిరుపతి శ్రీవెంకటేశప్రభూ.

మ. శతలేఖివ్యవధానపద్య రచనాచాతుర్య ధౌరేయుఁగా
పతి భోగాన్వితుఁగా యశోయుతుఁగ వార్యశ్రేష్ఠుఁడింగా సమం
చిత కీర్తిప్రదుఁగా విసర్గశుభదక్షితాత్రిగాఁ జేయునీ
స్థితకారుణ్యము భూమిలోఁ దిరుపతి శ్రీవేంకటేశ ప్రభూ. 10

చ. తిరుపతి వేంకటేశ్వరులతీరు తెలుంగనివారు లేరు. ను
ష్కరములు సాగి రా వచట పాగిలి మ్రొక్కఁగఁ బోయి నప్పుడున్
శిరమున భారమున్న నల శ్రీపతి పై(వడు. వారిఁ దిట్టుటల్
కొఱవివి నెత్తి గోకికొనఁగోరుట యందురు భక్తిలోసఖా ।

మ సమదాటోపపతంగ పుంగవవిభాస్వద్దీర్ఘ చంచూసమ
క్షమునం దల్పఫణావిజృంభణనటత్కాకోదరం బట్లు నీ
దు మహత్త్వంబెఱుగంగలేక యెపుడుం దూషించు దుర్మార్గుఁడున్
స్తిమితానందముఁ బొందునే ః తిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ 11

మ గురువై యాప్తుఁడవై సఖుండవునవై కొండంతచుట్టంబవై
వరభక్తాళిని బ్రోచుచుందువు కృపాపాథోధివై యెప్పుః డీ
నరులేరున్ నినుఁ గొల్వఁగూడ దను సంబల్కంగ మూఢాత్మకుల్
చిఱునవ్వుల్ జనియింపవేః తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ 12

మ ఎవరేమన్నను నెట్టి భంగులను విన్నెవ్వారు దూషించినన్
స్తవముల్ సేయకపోయిరన్ మఱియుఁ జర్చల్ చేసినం బండిత
స్తవనీయంబగు నీచరిత్రి సుజనుల్ సద్భక్తిఁ బూజింపరే
శివపాదాంబుజచింతనా ః తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ 13

మ. శ్రవణానందము నీచరిత్రము మహాసక్తిం బఠింపంగ న
ర్కవి బృందంబుల నెల్ల నిశ్చయముగా ధన్యాత్ములం జేయవే
భువి నీనామమ భక్తితోడ నెపుడున్ బూజించువారిం గృపన్
శివపాదాంబుజచింతనా ః తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 14

ఉ "దొంగ బజాన వేసికొని పో" న్మని కొందఱు పల్కినంతనే
భంగమురాదు మీ కెపుడు దాఱరు వారలు పల్కినారు పే
ర్మిం గనుఁడింపు తప్పులు క్షమింపుము పుత్రులు తప్పుఁజేయ వా
రిం గనుఁగాదె తండ్రి కృప శ్రీధర ః తిర్పతి వేంకటేశ్వరా ః 15

మ. సువివేకున్ నృపులెల్ల మీదు మహిమల్ శోధింపఁగా నెంచి యి
య్యవనిన్ భక్తిని బూజసేతురు కదా ః యశ్రాంతి మిమ్మట్టునన్
భవదువ్యక్తుగుణంబులం దెలియఁగన్ శక్యంబె మూఢాత్మకున్
శివపాదాంబుజచింతనా ః తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 16

ఉ. బ్రహ్మనమాజముల్ పవికిరా పచటన్ గలికాలకీశ్వరయం
బ్రహ్మల' పేరు విన్నయెడ మండిపడుగా జామి యూత( దాపర
బ్రహ్మము రాముతమ్మని నెపంబుల కంకనిదేవదేవు(, దా
జిహ్మగశైలవానున(ట ! శ్లేషకు( దార్చెదరంట పీరి(కగా

సీ ఏడుకొండల వేంకటేశ్వరస్వామిపే ర్కుక్కుటేశ్వరు( డంద(గోరు టెట్లు ?
వేంకటగిరిదేవవిభుమహైశ్వర్యంబు పీఠికాపురి వేల్పు బెరయుటెట్లు ?
వేంకటేశపదారవిందసౌభాగ్యంబు గయరాశనునికొఱ్ఱు గాంచుటెట్లు ?
అలమేలు విభువి యుద్యానంబుతో( గోడిపుంజయ్య పూ(దో(ట పోలుటెట్లు?

తే గీ. తోడ( బర్కోడి శేషగిరీదధిక్క
కానతంపువితోడ సామ్యం బదెట్లు
గలుగు ? దుర్వ్యాకగిరీశగహ్వరాంత
రస్థితం బగు చౌనముద్రికు( దలంప. 279

ఉ పొఱు(డనంటి నీ చరణపద్మములే మది నమ్మియుంటి నె
వ్వారిని వే(డనంటి నను బాలన సేయ(గ వే(డుమంటి నీ
ధారుణిలోన నీకు నరిదైవము లే(దని చెప్పుచుంటి ను
శ్రీరమణీశ ! సద్విబుధసేవిత ! తిర్పతివేంకటేశ్వరా 17

చ స్థిరముగ నీయహస్తమున దీనులగావ(గ ధర్మకంకణం
బరయ(గ( దాల్చినా(డవని యందఱు( జెప్ప(గ నాలకించి నీ
గురుతరసత్కృపారసము( గో్రల(గ నెంచితి(గాన వేగమే
దరికిని జేర్పుమయ్య నతతాపన ! తిర్పతివేంకటేశ్వరా. 18

మ. అవిశంబుగా భవదీయ వామకచరిత్రాకర్ణనాసక్తి న
జ్జనసాంగత్యము ధర్మతత్పరత షట్చాప్రవిణత్వముగా
ఘనముజ్ఞానము( గల్గనట్లు వరముగా గాంక్షించితిగా విగా భజిం
చిన నేమగా సురవందితా ! తిరుపతి శ్రీవేంకటేశప్రభూ. 19

చ. "తిరుపతి వీ(డు" మం చొకరు దెల్పిన యంతనె మాదు వేంకటే
శ్వరు( డటు జేయునందు ఘనసాహస లీలను నెంచినారు భా
వ్యరు(డుమ ద్రోవదప్పినను సత్యము సత్యము సత్యమయ్య( యీ
కరణిని జేయ నీవు బుధకాంక్షిత ! తిర్పతి వేంకటేశ్వరా ! 20

శా. హాలాపానమొనర్చియుఁ మృగయగవ్యాపన్నతఁ గాంచి ము
న్నోలిఁ రాముఁడుఁ గృష్ణుఁడుం జనిరి యుద్యోగంబు చాలించి, పై
లీలఁ దిర్పతివేంకటేశ్వరమహోలిప్తంబులై దిక్కుఁబు
ద్వేలశ్రీవహియించె నీతఁడె కలి న్వేల్పన్నచోఁ గా రొరుల్.

మ. కలి విం కాటబు సాగి రా వనుచు నీఁకఁ రాముఁడుఁ గృష్ణుఁడుఁ
దొలి రూపంబుబు వీడి యేగి రటుపై దుర్మార్గులఁ శిక్షలఁ
గొలుపఁ శిష్టుల రక్షసేయ నలవైకుంఠుండు శేషాచల
స్థలి శ్రీతిర్పతివేంకటేశుఁ డయి సత్తావర్తఁ బెంపారెడిఁ.

చ "కలియుగదైవతప్రతిభగాంచెడిఁ దిర్పతి వేంకటేశ్వరుం,
డలయికమాత్రమే మనకు నర్చన లెచ్చటొకాని కాసరా
విల గిరులందుఁ దద్గిరులకే గబుగుఁ రనవర్త" యంచు వి
క్కలి తొలి రామకృష్ణులు జగద్గతికిఁ వెలియైరి తిర్పతి

చ తిరుపతివేంకటేశ్వరులతీర్థముముందఱ నెన్ని ద్వారకా
తిరుపతి వేంకటేశ్వరులతీర్థము లెందుకు మాఱనేర్చు। న
ప్పరధరణీభృదున్నతియుఁ బ్రిజ్ఞాలు తక్కు కుభృద్విభూతిఁ దా
మెఱుఁగరె। యాత్మ యొక్కటగునేనియుఁ బిల్లులు వ్యాఘ్ర మెట్టు గొ।

తే గీ రత్నగిరియందు సత్య నారాయణుండు
వెలసెఁ దద్వైభవము చూచి తెలియవలయు
నాయెడమగుట్ట బదరినారాయణుండు
వెలసెఁ, దాటాకు గుడిసెయు వెలసె మీఁద 284

---

ఉ బ్రహ్మమతం బనంబడెడు మాన్యతకెక్కిన జాతియంట। న
ద్బ్రాహ్మణు లందుఁ జొచ్చిరట। వహ్వారె। నీపదభక్తిమావి స
ద్బ్రహ్మము నీవు గావనుచుఁ బాటలుఁ బాడుచునుండిరంట। శ్రీ
బ్రహ్మమనీషి వంది। గుణరాజిత। తిర్పతి వేంకటేశ్వరా। 21

మ. పను నారాయణరావు కూర్మిసుతునిఁ బాలామహామంత్రచిం
తనసంపాదితచిత్రచారుకవితాధారాలనక్కర్తిచం
దమ సంలబ్ధమహావధానధను సీతారామనామాంకుఁ గాఁ
చిన మీ కివ్వె నమస్కృతుల్ తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ। 22

క. అల రామేశ్వరమును న • త్తలరామేశ్వరముఁ దూఁపఁ దలఁతురె తత్త్వ
జ్ఞులు, తలఁతు రేని యవ్వా రలె "కంసాలు" లను మ్రొక్కఁ రా దవ్వారిన్.

క రలయో రభేద మని వా • రలకున్ మ్రొక్కంగఁ దలఁచు రాజులకుఁ గపీం
ద్రులకున్ బుట్టిల్లగునొకొ • కలికాలం ? బైనవట్లగాని మ్మనుమా!

---

## (9) విద్వత్పర్వము

క. త్యాగయ్యకృతులు గలవని భోగయ్యయుఁ జెప్పెఁగృతులు, శోధించి యటన్
బాగోగులు దెలుప మహా • భాగులు లే రొక్కఁ, సుకవిపంచాస్యంబుల్ !

క ధనకోటి నాగరత్నం • బు నల భవానియును రసము పొందిరి వోపం
గను బాధ వింటిఁ గోలా • రు నాగరత్నంబు గాత్రిసుసౌమునుఁ గంటిన్.

తే గీ హాయి యన నల్లపిచ్చాయి యభినయించె
పీ ! యనఁగ వింక నొకలేమ చేయిద్రిప్పె
దద్దిరిందక్క ప ట్టొక్కతరుణి ద్రొక్కి
కాళ్ళనే వద్దు బియ్యమ్ము గా నొనర్చె

తే. గీ. వేణుగానంబు జేసె శ్రీవిభుఁడు మున్ను
శరభశాస్త్రియు నద్దాన జగమువిందె
రాణఁగనె నేఁడు సంజీవరావు దానఁ
బాడుచున్నారు పసుల కాపరులుగూడ.

తే గీ. కాళిదాసుమ గవియె విక్కఁముగ మనము
గవులమే, పవిత్రమ్మన గాలి దూళి
యగుఁ బదార్థమున్; నిర్ఘరాపగయు నీరె
తక్కువకాలువలును నీరె, యెక్కువేమి ?

ఉ. ధారుణిలేవె మామిడులు తత్ఫలమున్ మఱి వేనవేలు జా
జాపల మందు దింత్రిణులసంగతి నుండెడిఁ గొన్ని కొన్ని ని
స్సారము లందుఁ గొన్నిటి రసంబు వినంబుగ నుండెడిన్, "జహం
గీరు, నిమాన్ పసందు" లిలకించు పయిం దిగదుడ్చు లన్నియున్

క. "నాజూకుపసం"దమ ఫల • రాజ మ్మొక్కండుగలదు రాజార్హము, త
త్తేజం 'బిమాన్, జహంగీర్'‌లు, తేజముసడ దివ్వటీకి దీపంబె యగున్.

క. నారాయణదాసవిమేది • ధీరు నెఱుంగుదుము కాదె, తేఁకువమై న
వ్వీరుం బలె నొకదాసరి • ప్రారంభము చేసి పాట పాడఁగ వింటిన్.

ఉ. ఎల్ల జగమ్ములన్ దెలియు నెవ్వని వేఁట యతండె శాంబరీ
ఖిల్లిఁ దనంగ, నేఁటి పృథివీపతులందున వేఁట యన్నచో
"వల్లూరి పెద్దతేవి," దిఁకఁ బక్షుల మందలఁ గొట్టుపోయెలున్
బిల్లుల వేఁటకాం డ్రెలుకపిల్లలవల్లనఁ బట్టు పట్టునన్.

క. రవివర్మ నెవ్వరేవియు • నవివేకులు చిత్రరచనయందుం బోలం
దవులుకొనిన నది గనుఁగొని • నవుఁబాటని యనని వా ర్గనంబడుదురొకో!

---

## (10) కాఁకరపర్తి పర్వము

ఉ. కాకరపర్తి నుండెడి యఖండమనీషివరేణ్యులార! వి
ద్యాకమలాప్తులార! గురుతాభరితాంతరులార! బంధుతా
శ్రీకరులార! నాకు నల శిష్యునికిన్ సము లీర లిందులో
నేకడ లోపమున్నదియొ యేర్పఱుపుండని మిమ్ముఁ గోరితిన్

ఉ. శాఖకు సప్రతిష్ఠ, గురుసంతతికిన్ దలవంపు. శిష్యతా
రేఖకు వేరుపుర్వు. కలిరీతికిఁ బెంపుడుతల్లి సుంది మా
వైఖరి. యిందుఁ ద ప్పెఱుఁగ వచ్చినచోఁ దగఁ దెల్పి న్యాయవి
చ్ఛేఖరులై జగమ్మున విశేషయశంబు వహింపు టొప్పదే.

ఉ. విద్యకు నేమి! యెల్లరకు విద్యలె వచ్చెనె! యందు మీరు మా
హృద్యత నేర్పఱింపగఁ బరిశ్రమ సేయుట లాభకారి గా
దద్యతనుల్ మహామహు లనంతముగా బుధు లుండవచ్చుఁ ద
త్తద్యశముల్ తదీయములు, తక్కినవారవి గోర వచ్చునే.

మ. "గురుశిష్యత్వవిభాగ మెంత" యని నేఁ గోరన్, మతేమన్న, నా
గురుతన్ సున్నను జుట్టుమీఁద సభలోఁ గూర్చుండి నామీనముల్
పరిహాస్యమ్ములు చేయు టొప్పగునె? యాపై నెట్టులో వచ్చె "నే
శ్వరవే" రన్నది సత్యమే యనుచు నే స్వాంతమ్మునం దెంచెదన్

మ. గురుతన్ జెప్పనిహేతు వే మడిగితిన్, గొంకెన్ సమాధానపుం
దఱి, నెచ్చెల్లా క్షమాపణంబు నొడివెం దప్పైన నొప్పైన నం

తరమందుంచికొనంగఁ జెల్లు నని యంతన్ మిన్నకే యుంటి, వె
క్కిఁరిపింపన్ దొడఁ గేమి చేసితివహో ! కించిత్తు యోజింపుఁడీ 301

చ. తిరుపతికావ్యయుత్తరము తీవ్రమె కాదొ జగం బెఱుంగుఁబై
నటిముఖి చాటుపద్దెముల నామ్యలు మీర లెఱుంగ లేరె? యు
త్తరముకన్నఁ బూర్వము నదస్సున మీనముఁ బట్టి లాగు ము
ష్కరతకు నేమిచెప్పెదరు ? కాకరపర్తినివాసు, లుత్తముల్!

క. ఉత్తరము వ్రాయుపైవా • రెత్తఁగున నేమి యన్న నిష్టమె నాకున్
జిత్తం బెరియదె వారికి • మత్తరమును జూపిపన సుత్తలపడరే.

ఉ. చిత్తమునందుఁ దత్తఱము చేరిపపిమ్మట శక్తి చాలియో
యుత్తలపాటు గూరియొ, మతొక్కనిమిత్తము దావరించియో
నత్తుపఁబట్టి హేళనమునల్పిన నల్పఁగవిందు, దానఁగిం
చిత్తున నన్నుఁ దాప మది చెందమ, మీనలతోలి యేటికిఁకా ?

క మీనముఁ జూపుట నొక్కట • నే సూత్రిములోన నుంట నిటు చేసిరొ! యా
మీనల పద్దెము నాకై ? చేసినయది కాదొ ? మీరె చెప్పఁగ వలయున్.

సీ ఆణివిళ్లకులాబ్ధి నవతరించిన మహామహులార ! బంధుకామహితులార !
పల్లవంశమునందు జననమందిన మహామహులార ! వైదుషీమహితులార !
వేములాన్వయమున వెలుఁగొందు నో మహామహులార ! సాహితీమహితులార!
లకొండివంశమ్మునందు వర్ధిలు మహామహులార ! పాండితీ మహితులార !

తే పుణియనుఁ గల బంధుసంబంధులార !
యెల్లఱును పేరు పండితు లెల్లవిషయ
మెఱిఁగి యుండకపో రిందు నెవరిదయ్య
మొనటితప్పిద ? మెఱిఁగించి కదలుఁడయ్య

తే గీ మొనటితప్పిదమే కాదు పిదపఁ గూడ
దురుసుతన మేరిదో మీకుఁ దోఁచకున్నె ?
చాటుపద్దెములను జూచి చాటు వదలి
తెలుపుఁ డయ్య సత్యము, వెనుదీయ నేల ?

ఆ. వె ఎందు కీకృతఘ్నుఁ? లెందుకయ్య శఠఘ్నుఁ?
లకటకాకులేల, వికపులేల ?

వట్టి సీసములవు బడఁ బీకఁగానేల ?
వాఁగ నేల ? వేరు కాఁగనేల ?

క. సౌర్వాపర్య విచారము • పర్వమునకు మీకు ముఖ్యసాధన. మది మీ
ర్వేర్వేఱఁ దెలిసికొన్నను • గుర్వారాధన పరత్వ గోష్ఠులు తెలియుణా. 309

ఉ కాకరపర్తి మూలమునఁ గాదె ద్విజత్వము శాఖకెల్ల విం
దాఁకను నిల్చె. నాదు ప్రపితామహుఁడౌ నఁసన్న సత్కవి
త్వాకలనమ్మునన్ గరిమ మంచి ప్రబంధ మొనర్చు పిమ్మటన్
వ్యాకరణంబు మీ పురికి వచ్చి పఠించుటయే నెఱుంగుడుణా.

సీ అతఁ డొనర్చిన "యామినీపూర్ణతిలక" రెండు ప్రతులు మామకగృహమునఁ
గల, వందొకటమూఁడుగలవు భాగమ్ములు మఱియొకంటను నాఱువఱఁదుండు
రెండు ప్రతులుసూచి యెం దేమి కారణంబని యెంచుచుండ మాయయ్యగారు
"మొదటఁజెప్పినదేమొ మూఁడెయాశ్వాసమ్ము లటుమీఁదివు స్తకంబాఱునుమ్మి

తే గీ తప్పు లుంటకుఁ గొంకి మాతాతగారు
కాంచవల్లీపురమున వ్యాకరణమును బ
ఠించె" నని వారితండ్రి వచించినట్లు
చెప్పె. నివి నిక్క మని మీకుఁ జెప్పవలెనె ?

1 మ. కవియై కాఁకరపర్తి కేగి యచటన్ గష్టించి యామీఁద శా
బ్దవిధుల్ నేరిచి యాకృతజ్ఞతకునై తద్దేశికున్ గ్రంథమం
దు విశేషించి నుతించె నయ్యనఘుఁ డితోఁప్రిపల్ ప్రసంగింపఁ డీ
సువివేకం బిసుమంత నేఁ డివి యిచ్చోఁ గల్గె ధీకోత్తముల్.

ఉ కౌముది పూర్తిగాఁ జదివి కాదనుఁడీ ! యతఁ డట్లు సన్నుతిన్
శ్రీమహనీయు నాగురువిఁ జేసిన, దాతనిశాస్త్ర మెంతయో
యామహితుండు వ్రాసికొని వట్టిది సంపుట మిప్డు మున్న . ది
ట్లే మహిలో ననేకబుధు లెందుఁ గలారు కృతజ్ఞతాఖనుల్.

---

1మ. తనరార మ్మృతియుంతు దాంతులను వేదావంతులన్ సాహితీ
ధనవిశ్రాంతుల భాష్యకారసమసిద్ధస్వాంతులన్ మానసా
ర్చనగౌరీమణికాంతులన్ కుణవిభాస్వన్ముఖ్యనామాత్మజో
ధనహృద్వేధుల వెంకటార్యబుధ భృత్యామంతులన్ శాంతులన్.

2 తే గీ. "మేదవరపుఁగోనయ్యగా" ర్గాఁ దవకుఁ
జిన్నతవమునఁ దెలుఁగులు సెప్పుకతన
వారిపైతము గ్రుక్కెఁ గావ్యంబు మొదట
నరసకవిగారు వారి నెవ్వఁబనియేమి

చ పరికృతము చూచి కొందము. భవత్పుర మప్పటి కేమి నేఁటికే
మి ! కళకె కాదు. యోగ్యతకు మేల్మితనంబున కొటపట్టు కా
ఖకుఁ గుదు. రిట్టిపట్టున నఖండులు పండితు లుండి మిన్నకుం
టకుఁ గత మేమి ! ధర్మమునెడన్ జనునే· విసువుల్ బుధోత్తముల్ !

చ. గురుతనుగూర్చి చెప్పుమని కోరుట త ప్పది నాదియే. యశ
స్కరులకు నన్నువంటి చెదుగాకము దేశికుఁ డౌట యెట్లు ! నా
గరువము నెంచి మీనములు గట్టిగఁ బట్టి బలాత్కరించి నా
గురుతకు దక్షిణా గొలుపు కోరిక కేమనువారు మీ రికన్ ?

ఆ వె గురుఁడు గర్వియైన గురువి గర్వమ్మును
దల్లి చెడ్డదైనఁ దల్లి చెట్ట
తనము శిష్యసుతుల తడవిన స్లైందేవి
జదివియున్న బోధ సలుపుఁడయ్య.

వ గురుతన్ జెప్పవిహారంబుం బదుగుచే కోపావకున్ హేతు వం
దురో ! లేదా, మును పే నొనర్చిన మహాదోషంబు నేదేవి నా
కరయం జేతురో ! అట్టి పద్యముమ పీయం దేల యారోపణం
బు రహిం జేసికొనంగఁ జెల్లు వమచున్ బుద్ధుల్ ప్రసాదింతురో !

తే. గీ అవ్నియును నచ్చుపడియున్న వరపియందు
రేది యే తేది జరిగె మీ కెఱుఁగఁ జెప్ప
వలసి వచ్చిన నే వ్రాసి పంపువాఁడఁ
దగు ప్రమాణమ్ములను జేర్చి తథ్యముగను.

---

2 తే. గీ. సరసుఙ్ఞానవరమంత్రి చక్రవర్తి
సమద పరవాదిగజ గజాశన శరాగ్రి
జాగ్రదుగ్రప్రతాప సమగ్ర మూర్తి
కోనయాఖ్యాంధ్రగురుకీర్తి గూర్తుమదివి.

క. త ప్పెవరిదొ చెప్పుఁడుః మా • యప్పలు, మీకన్న నెవ్వ రన్యులు దీనిం
దప్పింపనేర్తుః రూరక • యొప్పరికింపు టిది మీకు నొప్పదు విబుధుల్

తే. గీ. శంకరాచార్యు లిది తీర్పఁ జాల రింకఁ
బ్రిథుపులేవియు డీనిని బట్టరుకద ః
మీరు మా కిర్వురకుఁ దగు గారవంపు
బాడుగుబా గానఁ దీర్పఁగ వలదె వామ ॥ 321

తే గీ. గురుత యేమైన నగుఁగాక గురుఁ దపాత్రిఁ
డైన నగుఁగాక యాతవియంపుద్వేష
మంకురించును గాక సభాంతరముల
గేలి సేయుట కొప్పనఁ జాలు మీరు.



చ నిజమున కీరు పాటుపడు విష్ణ గలట్టి మసీపులేని శ
ష్యజను లనాదిగా మిము యశన్కరులన్ స్మరియింతురేని నా
భజనమహత్త్వ మెట్టిదియొ బాగుగ మీ కెఱుఁగంగ నయ్యె నే
వి జగతి సందియంబును గణించి తొలంచుట మీకుఁ జెల్లదేః

ఉ. నాయెడఁ దప్పులున్న వను నమ్మిక మీ కుదయించెనేని, లే
దీయెడఁ గొంతుకోదఁ బని, "యిమ్మది నీకొనఁ" గందుఁ డెప్పుఁ, దే
నాయెడఁ జూపఁగాఁ దగిన యాపరు పుండినఁ జూపువాఁడ, లే
దా, "యిదమిత్థ" మం చెఱిఁగి శాపము మానెద మాననమ్మునన్.

---

## (11) సభా పర్వము

మ పిదపన్ గాఁగరవర్తి కేగితి నటన్ విద్వాంసులుజా బంధులున్
సదయాంతఃకరణాల్ మదీయకవితాచాతుర్యముజా బ్రేమనం
పద దై వారఁగ వక్షుథన్ గని జగన్మామ్బల్ ముదం బంది ర
య్యద నెల్లన్ సరసమ్ముగా జరిగె విద్యాగోష్ఠి యొప్పారఁగన్.

మ. ప్రతివిద్వాంసునియింటి కేగి కని సంభావించి యవ్వారి వ
మ్మతికిం బాత్రుఁడనైతి. వచ్చిరి జగన్మామ్బల్ పథం జూడ న
ర్చితుఁ గావించిరి పుష్పమాలికలచేఁ జేతఃప్రియం బొప్ప మ
త్కృతహా గీరతమంమః గొంత విని రౌత్కృష్ట్యంబు దీపింపఁగన్.

ఆ. వె. అదివిళ్ల వారి యలసౌధమున యందు
సకలబంధుజనులు సంతసింప
గిరతమును నెల్లగిరతుల్ విని మెచ్చ
వినికి చేసినాఁడ వినుము సఖుఁడ ॥

క. అసభ సమకూర్చిన యల • శ్రీ సీతారామశాస్త్రి శేఖరునకుఁ ద
చ్చాసనమును మానించిన • ధీనముపేతులకు నే నతిం బొనరింతున్.

ఆ. వె. వ్యాసలింగశాస్త్రి వరుఁడు శ్రీ యాకొండి
కులజుఁ డుత్తముండు గుణసముద్రుఁ
డంతరాంతరముల సన్మతక్కవిత్వంబు
నకు శిరంబు నూఁచి నన్నుఁ దనిపె.

ఉ. శ్రీసుదేవతాపద కుశేశయబంధరితాంతరుండు గౌ
రీపతిశాస్త్రి గౌరవపరిస్ఫురణమ్మున నన్నుఁ జూచెఁ, జి
ద్రూపి పురాణపండకుల ధూర్వహుఁ డిమ్మహనీయుఁ బోలఁగా
నా పురిలోన వేఱొకబుధాగ్రిణి లేఁడని యందు రందఱున్.

ఆ వె శ్రీద్వివేదివంశశీతాంశుఁడు కవీంద్రుఁ
డమలహృదయుఁ డతిసార్ద్రచిత్తుఁ
డెంతయేని ముదము నెనపె బ్రహ్మానంద
పండితుండు సుకవివందితుండు.

తే గీ వారు పీ రన నేల, యె వ్వారుగాని
నాఁటిసభలోన మోదంబు నాటకున్న
వారు నా కెందుఁ దోఁపరు, వారిగుణమె
కారణం బేరు మెప్పింపఁ గలరు వారి.

క ఒక యామము వినిపించితి • నకళంకముగాఁగ వివిరి యాప్తులు విబుధుల్
సుకవిత్వమనుచు మెచ్చిరి • యిఁక నొకసభ మఱుదినమున నేర్పాటాయెన్.

---

## (12) చప్పట్ల పర్వము

క. మఱునాఁటి యుదయమున నే • వఱిముఱిఁ గాల్యములు దీర్చి యారామమొకం
డరయఁగ నేగెడిచోఁ దో్రి • వ రిహిఁ గనుపట్టె నొక్కపండితుఁ డనఘా,

తే. గీ. ఈయనయుఁ దాణివిళ్ళకు లేండుఁడైన
యల్లసుందరరామ నమాహ్వయుండు
అలమూరున మును మనదైన శతవ
ధాన మీక్షించినట్టి విప్రప్రభుండు. 335

తే. గీ. గతదినము సభఁ జూడని కారణమునఁ
గోరె సారాంశమును దెల్పఁగొంచెమేను
మరల వినిపింప మొదలిడ మంచిచెడ్డ
లరయుమండె మహామహుండతఁడు పేర్మి.

తే. గీ. పీ రిజష్టరుత్తరము విప్పించి వారి
చాటు పద్యమ్ములను విన్కి సల్పినాఁడ
మోటు లేవియొ తెల్పె నా బుధవరుండు
వ్యాసలింగమనీషి గేహమ్మునందు

తే. గీ. వ్యాసలింగమనీషియు వయ్యనఘుని
విద్యయమె మంచి దనియె సునీతియెఱిఁగి
తెలివితేటలుగల్గిన ధీరహృదయుఁ
డెవఁడు గురుదూషణము మెచ్చునే సభుండ।

ఆ. వె. అంత నేగుదెంచి రయ్యెడ కిఁకఁ గొంద
ఱందు నిపుడు రొక్క యంశమునకు
మున్నె వాదు సల్పియున్న కారణమున
మరల వాదమునకు మనము నిడిరి.

తే. గీ. తలఁప "డిద్ధడబిద్ధ" యుద్ధపరిహసన
కర్త యందొక్కరుఁడు వేఱొకండు మఱొకఁ
డిరుపురును నాదురాకకై యెంతయేని
వాదమొనరింపఁబూని రవ్వారిగాఁగ.

శా. ఆవాదం బిటఁ గామ పత్రిస్తుతము వారంతంత లెంతెంతకో
పోవం జేసి యథేష్టరీతిగ నుదుల్ పూరించి ఘోరాన్ఫుటుల్
చేవల్ దేఱఁగ నొండొరు ల్లుఱక "పీ. పీ।" యంచు నేమేమొయుం
చావేశా గవనంబు సల్పిరి భవిష్యత్సూచనల్ దేలఁగన్. 314

ఉ. ఒక్కఁడు నామవశ మిక నొక్కఁడు వేతొకపక్షమొండి "వీ
రెక్కడు వారె యెక్కు" దని యెక్కటి నెక్కటిఁ బోరఁ జొచ్చి రీ
టక్కరు లేల యిట్టిలు కదంగి" రటంచుఁ దలంచునంత మీ
రిక్కడ రాఁ గతంబెదియొ యేర్పడఁ జెప్పుఁ దలంచుఁ బుద్యుఁడుకా.

ఉ. కాఁకరపర్తి పర్వము దగన్ విని యుంటిని విన్నరాత్రి నా
రాకకుఁ గారణం బిది కరంబును దెల్పెదిఁగాదె యేటికీ
రాకడ యూరకుండుఁ దన బంకెలు గొండొక మావి రద్దియే
మూః కరతాళ నాటకపు సూచక మాముఖ మంచు నెంచుమా.

ఉ ఇం దొకరుండు యోగ్యుడఁగునేమొ యటంచు మదిం దలంతు నెం
చెందుకుఁ గాక హీనకులలేనియు వాదని బూతుకూఁతలన్
బొందుగఁ గైత చెప్పిన ప్రబుద్ధుఁడు "దిద్దదబిద్ద" కర్త ము
న్నుంబొనరించు నల్లరికి మూలవిరాట్టని లో నెఱుంగుమీ.

ఆ. వె అతని ప్రహసనంబు నంపె నాకదకు ము
న్నది గనంగ భీతమయ్యె మనము
మందలించి దీని మ్రింగింపు మిది బూతు
చిక్కఁ డెచ్చునముఁ జెప్పియుంటి.

క. అది హేతువుగా నతఁ డి • య్యదనకా నా కేదియేని యవమతిసేయం
గఁదలంపఁబోలు నుపకృతి • నదమలాలకు నన్నృతమొ విషమగునొయిలకుకా.

తే గీ చర్ల నారాయణమనీషి చంద్రశిష్య
లొకరివెంబడి నొకరుగ నొకరినొగము
లొకరు చూచుకొనుచు వచ్చి యెక్క పెట్లఁ
జట్టుముట్టిన వన్ను నప్పట్టునందు

క సుందరరామమనీషియు • గందరగోళమ్ము జరుగుఁగా యని మెలమె
ల్లం దెలిసి చనియె. బ్రహ్మ • నందమనీషియును గ్రిన్ననం జనియె నటుల్.

క. అల రామకృష్ణకవి బం • ధులు దులువ ప్రసంగమునకుఁ దొడఁగిరి, కదుబం
డలు చుట్టుము గరతాళము • లొలయించుచు వంగుసేయుచుండిరి తఱితోన్.

తే. గీ. ఇంటియజమానుఁడైన కృతీశ్వరుండు
వ్యాపలింగాహ్వయుడు ఠక్కఁ బ్రాజ్ఞుఁడొక్క

రుందు నయ్యెడ లేఁడ, యయోగ్యుఁ డూర
కుండె నల్లరినాఁగ శక్తుండుగామి. 340

సీ. కౌముది పాఠమ్ము గావలె నా కిప్పుడం చొక్కవిద్యార్థి యడుగఁ దొడఁగె
పోనిమ్ము రఘువంశమేనిఁ జెప్పుమటంచు నిఁక నొక్కవిద్యార్థి యానడించె
కాకరపర్తి యీ గ్రామం బెఱుఁగు మంచు వేఱొక్కవిద్యార్థి వెక్కిరించె
పెద్దపేరుగ వింధు మిద్దియేనా పస లంచొక్కవిద్యార్థి హుంకరించె

తే. గీ. వీరినే పండితు లటంచుఁ బేరుపెట్టి
శృంగభంగాన లిఖియించెఁ గృష్ణసుకవి
అతని ధైర్యమ్మునకుఁ బోలినట్టి ధైర్య
మన్యతమునయందు నేనెందు నరయ సఖుఁడ!

ఆ. వె. అటులు చుట్టుకొనిన యవ్వార లెల్లరు
నవ్వ లేమగూడ నవ్వ నగుట
"నవ్వ గోల" యనెడి యార్యులమాట య
త్తఱి మదికిఁ దగిలెఁ దరుణ మగుట.

సీ. ఆర్ట్సుకాలేజిలో నాంధ్రగీర్వాణపండితులు శ్రీవ్యాసమనీషివరుని
యనుజుఁ దొనర్చినయల్లరి యప్పట్ల వర్ణనీయము వినవయ్య సఖుఁడ!
భటరాజకవనంబు పచరింతు వీ వని యొక్కొక్క పరి నన్ను నొక్కి పలుకు
మీసాలుదీయించివేసెద నని మఱియొక్కమా ఱాగ్రహం బొందుచుండు

తే. గీ. ఆయశస్వి సీతారామయాహ్వయుండు
ఛాత్రభక్తికి సౌమిత్రిపార్థులతని
కించుకయుఁ బోలరింతకు హేతువేమొ
యెఱుఁగుదే తిర్పతిమనీషి! యదిగో వినుము.

ఉ. వ్యాసమనీషి కైతమును వహ్వారె యంచును మెచ్చునంట! యే
నాసకలజ్ఞు మెచ్చని యహంకృతిశాలికిఁ బాచితం బిటుల్
చేసిన నొప్పునంట! యిటు చెప్పఁ దొడంగె నతండు దీర్ఘవి
శ్వాసపురస్సరంబుగఁ బ్రశాంతముగా నిటు లేను బల్కితిన్. 354

ఉ. వ్యాసులవారు నాకుఁ గురు బంధుగు, లెంతయొ గొప్పవారు, త
ద్దాసుఁడ నేను, వారి కవితాకలనం బది నాకు నచ్చ దే

దోసమొకాని, యే నొక బుధుండను గాను, మఱొక్క రమ్మహా
వ్యాసుని మెచ్చవచ్చు, బలవంతము పెట్టిన నేను మెత్తునే! 355

ఉ. నాకవనంబు వారలకు నచ్చదు నా కవివారి కైతరోఁ
జోకడ లింపు వింప, విది పూర్వ జనుర్మహిమంబొ యేమొ! న
వ్వీకతనన్ వృథాగ విటు లిక్కడ నొక్కట కిచ్చనేయ మీ
రాకడ పాఠ్రిజ్ఞ లొప్పరు, కరంబిది కూర్రముగాఁగఁ దోఁచెడున్

క. అని యేదో యొక తెఱఁగున • ఘను సీతారామమూర్తిగారిని వారిం
చు నుపాయమ్ములు వెదకుచు • వినయముతోఁ గల్పుమంటిఁ బెంకితనమ్మున్.

క వినినైనఁ గొట్టుదురు న • న్నన్నన్ శాఖాభిమాన మడ్డుపడె న్నా
యన్నా! యే మని తెల్పుదుఁ • జిన్నెలు వన్నెలమనాఁటి శిష్యులచెయ్యుల్

క. నాపినతండ్రికుమారుం • దోపికమై వారి కేమొ యుక్తులు చెప్పన్
గోపంబె హెచ్చె వారికి • బాపురె, యే మందు నాసభాశోభ సుభా!

ఉ నాలుకయొండె నాకుఁ జిననాఁడు మొదల్ మఱి నేఁటిదాఁక నా
కీలలి యెచ్చటన్ జరుగ దీపయి నేనియు నాఁటిరీతి నా
కేల ఘటించు దైవ "మిహిహీ యిహిహీ" యని నన్ను సారెకున్.
గేలిని గొట్టసాగిరి పగిల్చిరి భూమియు నాకసంబునున్.

ఉ కాఁకరపత్తిలోనఁ గపికాండము లున్న వటంచు వింటి నేఁ
డాకలితంబులయ్యె నవి, యొందఱు నొక్కటఁ జుట్టికొన్నచో
నాకవనంబు వారఁ నణంపఁగనేర్చునె? దేహదార్ఢ్యమూ
నా కొకభంగిదయ్యె, నిఁక నాగతి యేమగునో వచింపుమా!

తే గీ గణపతిని బోలు విద్యార్థిగణము కొంత
ఆంజనేయుని బోలెడు నదియుఁ గొంత
కుంభకర్ణుని బోలెడు కొంతగణము
చుట్టుముట్టె సేనాపతి చూచుచుండ, 362

క సేనాపతి యగు నలవ్వా • సానుజవాగ్ధోరణికి నహంకృతికి మిత్రా
గానము దలచపిన యల • మానిసి కల్లరి యొనర్ప మన పెటు లయ్యెన్.

తే. గీ. "వాయవా! బాలటంచు సేనాయనాధ
గతిని పెలిఁబుచ్చుచును నొక్కగంటకాల

మెట్లో గడపితి నంతట నేగుదెంచె
చర్ల నారాయణమనీషి చందురిఁ దనకు

చ. "బ్రతుకుము జీవుఁడా" యని యపారముదంబును బొందునంతఁ బిం
డితుఁ డతఁ డాస్య మెంతయుఁ గడిందిగ నెఱ్ఱవడంగ "శబ్దసం
గతి నెఱుఁగంగ లేక కవి కాదగు దె" ట్లని వెక్కిరించుమన్
మితికిని మించు నొక్క మిడిమేలపుఁ దోవకు బండితోలుమన్.

ఉ. "కౌముది చెప్పనేరవఁట ః శాఁదగుసంగతి చూచికొమ్ము. నీ
వీమెయిఁ గాగితమ్ముపయి విట్లనె వ్రాయుమ" మటంచుఁ గోపము
దా్రముషితాత్మగౌరవభరంబుగఁ బల్కెను. వ్రాసి యీయఁగా
నామెయి నేను సిద్ధపడునంతట నొక్కకలార్థి వేర్మిడిన్.

మ. తతివాగ్ధాటి చెలంగఁగా నవియె "చత్వారింశదబ్దంబు పం
గత మెట్లయ్యెనొ తెల్పు"మం. చతని పేద్కా దీక్షితిన్ మీఁదఁ ద
త్ప్రతిరోధం బొక కొంత తగ్గె. నటుపైఁ బ్రాక్షేతరాలాపసం
గతి యొక్కింయక తగ్గెఁ. జప్పటలు తగ్గంజొచ్చె నంతంతకున్.

తే గీ. అశ్వమేధ విమర్శమ్ము నందునున్న
"దుర్ణయ" పదంబునందు సాధుత్వ మిబ్బి
దనుచు నాయంత నేఁ జెప్ప నలఘుమూర్తి
చర్లనారాయణమనీషి సంతసించె.

తే. గీ. ఏకవచనప్రయోగాన నిమ్మహాత్ముఁ
డింతదాఁకనె మాట్లాడె నంతలోన
మరల గౌరవమును జూపి మాటలాడఁ
దొడఁగెఁ బండితుఁ డెట్లు తుందుడుకుచెందు ః 369

ఉ కోపవశమ్మునం గలిగెఁ గొండొక తుందుడు కిమ్మహాత్మునం,
దాపయి నెట్టులో దయఁగె నయ్యది; పిమ్మట మంచిరీతినే
చూపె నితండు శిష్యులను జూపరు దొడ్డమ్ము నంతగా "యథా
భూపతి" యన్న న్యాయమును బూర్తిగ నే మది న స్థిరంగితిన్. 370

చ అదియుసుగాక నాగశర మట్టులు దాఁచినవప్రశ్న మంతలోఁ
బదట నడంగ నిం కితఁడు పట్టువడం డని తోఁచి గౌరవా

స్పదముగ మాటలాడుటకు శాస్త్రిలకున్ మది గల్గఁబోలు; నా
కది గన నట్లు తోఁచె, నిజమౌనొ, యసత్యమెయౌనొ ! తిర్పతీ !

శా. ఈ నారాయణశాస్త్రిగా రనఁగ నెంతే యోగ్యులం బందుగుల్
జ్ఞానుల్ తుందురు కందు కారణము నేఁ గన్పెట్టితిన్ వీరిపే
రానంగాఁబడె గీరతమ్మున నదే యాత్మన్ గలంగించె, లే
దేనిఁ "పీ" నని నన్ను నా రనుట కెన్నే గుండె లుండున్, సఖా !

ఉ. వీరిగురుండు వీరయ వివేకి యొకించుక నాకు శిష్యుఁ, డా
కారణమై ప్రశిష్యతను గాదనఁజాలఁడు దేవుఁడైన, నీ
ధీరుఁడు నన్ను "పీ" యనుచుఁ దేఁకువమాలి వచించు టెట్లు ? ధీ
దూరులు త్రొక్కుత్రోవను బుధుం డెటు త్రొక్కుఁ? వచింపుమో సఖా !

తే. గీ. హీనసంబోధనము గురునెడలఁ దప్పు
గాదనుచు నీతఁడే బాలకవికిఁ జెప్పె
నేమొ, యని యెంచితినిగాని యిమ్మహాత్ము
నవపటిచరిత్ర మది ధృవపఱచదయ్యె.

మ. మితభాషిత్వము మేనిమేలిమియు సన్మిత్రత్వముం బొల్చు నం
దితుఁ డీతండు కలావివాదమునకున్ దీకొంట యుక్తంబె; త
త్కృతికిన్ శిష్యుల నొప్పగించి వృథగాఁ గీకీధ్వనుల్ చప్పటల్
ప్రతియోగ్యుల్ విని నొచ్చుకోఁగ నొనరింపం జేసినాఁ డేటికో.

ఉ. "కౌముదిచెప్పు"మం చొకఁడు, "గంటకు నూఱు వచింపు" మంచొకం,
డేమియుఁ దోఁచనీక యొకఁ, "డీ పదమర్థుఁడ" యంచు వేఱొకం
డీ మహనీయు ప్రేరణమునే గొని యల్లరి చేసినారు; వి
ద్యామహితుం డితం డెటుల తప్పుపథమ్మునఁ గాలువెట్టెనో !

ఉ. "పండితు లంచు వ్రాసెద నవారిగ పారెకు వెంత పండితా
ఖండలు దాతఁ'డం చడుగఁగా గమకింతువొ, చెప్పనేల ! యా
తండె ప్రమాణపూర్తిగ శతఘ్నికిఁ గర్త; తదీయపాండితీ
చండిమ మాశతఘ్ని పెలుచన్ వచియించెడిఁ జూడు మయ్యెడన్. 377

ఉ. ఏదియుఁ జేతఁగాదనుచునే వచియించుట తప్ప అన్య మిం
కేదియు లేక పోయె నొకఁడేని యుపాయము; దానఁ జేసియే

నాదెన వారి కెంతటి ఘనంబగు కోపము గల్గియున్న న
న్నేదియుఁ జేయలేక యిటు లింటికిఁ బంపిరి సుమ్మి తిర్పతీ!

చ అడిగిన దెల్ల రా దమట కాత్మను బొంగిరి గేలి గొట్టి రా
బెడిదము పై చితిన్ సురిఁగి వేటొకచోటికి వచ్చుపిమ్మటం
గడబిడనెల్ల నాఁగఁదగుకార్య మొనర్పఁగ వచ్చునంచు నా
యెదఁద నుపాయమిట్టి దొకఁ డెట్టులొ తోఁచెను దైవికమ్ముగన్.

చ. "కల రిట రామకృష్ణకవిగా రలవారికి మీకునున్ సభన్
గలిపెద. నెవ్వ రెక్కుడొ తగన్ దెలియంబడు" నంచు గొందఱు
జ్జ్వలితగతిన్ వచించి రల ఛాత్రులయందలివారు. వారికిన్
దెలియదొ పూర్వవృత్త. మిటు తేకువమాలి వచించు టేటికో!

చ. తిరుపతిశాస్త్రి వారివయిఁ దేఁకువ దీకొనినప్పు డోడి నే
దరయక నన్ను మార్కొనుట కాకవిగా రెటు లొప్పికొందు! రా
తిరుపతిఁ బిల్వఁ దందులకుఁ దీర్చును మీముద మంచుఁ జెప్ప వా
ర్దురుసుగ నాపయిం దొరరి దుందుడుకున్ బచరించి రయ్యెడన్

శా. వారేశా దెవ రేగుదెంచినను నే వారింపఁగా నేర్తు నే
నారామద్రివిదుండ నయ్యు సమయం బాలాటి దయ్యెన్ మహో
దారుల్ తక్కిన పండితోత్తములు లే రచ్చోట. నున్నప్పు డి
ప్పీరుల్ వీఱిఁడిపోకలన్ జలిపిరే! వీక్షింపుమో శ్రీపతీ!

మ. తతవిద్యాచతుర ప్రభావు లగు సీతారామశాస్త్ర్యాదు లు
న్నతతన్ దప్పదుపోక లొప్పరవి విజ్ఞానుల్ కలార్థుల్ మహా
మతి నారాయణశాస్త్రులున్ గనలి యీమార్కన్ బ్రసంగింప కు
న్నతబుద్ధుల్ బలె మిన్నకుండి రిపుడన్నన్ లేచి రొక్కుమ్మడిన్.

ఆ. వె. "బాలనాయకంబు బహునాయక" మటన్న
యార్యజనుల మాట యాత్మయందు
జ్ఞప్తిదగిలె నాకుఁ గాకరపర్తిసం
ఘమ్ము చుట్టుముట్టి కలఁచునపుడు. 384

శా. మీసాల్ ద్రెంచెడి వ్యాససోదరుల కేమేన్ జెప్పికో నెంతునా!
కీసుం బాసను లేవి యత్తరులనే కేలెత్తి తూలింతునా!

"సీః సీః యిట్టిదవే కదా!" యనెడి కు స్తీవారి వారింతునా ?
వా సామర్థ్యము దేని కిందు దగు నన్నా ? శ్రీపతీ, చెప్పుమా ?

చ. కలకలమున్ గళార్పుటుచ గ్రొందుకొనం, దరిలేని చప్పటల్
వొలయఁగఁ, బోటుమాటలను బొంపిరివోవఁగ, వెక్కిరింపుకం
పలమఁగ, నేమి చెప్పుదు నహో, యిఁక నా కగు శృంగభంగముల్ ?
నలుదెస ధార్తరాష్ట్రిలను నద్మ మురారియు నయ్యె నయ్యెదన్.

ఉ ఆతఁడే విశ్వరూపమున నందఱ ధాటికి నాఁగెఁ గేశవుం,
డీతఁడే విశ్వరూపమున నెల్లరధాటికి పీఁడు లోఁగినాఁ,
డాతఁడే భీష్ముఁ డెట్టు లటు లయ్యెను వ్యాసమనీషి నేఁడు,పర్రి
ఖ్యాతులు లేరు పెద్దః లిఁక నయ్యెద నల్లరి యెట్లు రూపఱున్ ?

ఉ. "బంధు పటంచు పైఁచి" రని వ్రాసిర దెక్కడఁబోయెనొ క్కొ ? యీ
సందునఁ బెట్టి నొక్కునెడ సాక్ష్యము వేఁకొకఁ డేల ? వారి వ్రాఁ
తం విలకించినం దెలియదా ? వికరంబును దేర్చికొన్న: డాఁ
చం దలఁపూవినం బయికి సత్యమెబో యుబుకున్ దనంతటన్.

ఉ ఎంతని వ్రాయుదున్ నలిపి రెంతటి గోలయునేని, సర్వమున్
శాంతము నూఁతగాఁగఁ గొని పైఁచితి వ్యాసమనీషి "సాగ" దం
చింతయు నాఁగుయత్నమున కియ్యకొనం గమకింపఁ దెంతయున్
సంతస మిచ్చెఁ జర్లకులచంద్రిన కీ యెకనక్కెపు న్నుడుల్.

మ "పన దీయూరుగదా, యెచే నికవి జిమ్మం గట్టఁగాలేమె" యం
చనుకొన్నారలవారు, నే నది విజం బొనందు లో నెంచి యెం
దునకుం డిగ్గకపోతి, నంతనె ననుం దూలించిన ట్లెంచి రా
ఘనబుద్ధుల్,గను "శృంగభంగ" మను సద్గ్రంథమ్మునం దంతయుః. 390

---

శృం గ భ ం గ ము

(కాఁకరపర్తివివాసి చర్ల వెంకటచలపతిశాస్త్రిగారి పేరఁ బ్రకటితము)

పీ ఠి క

"ఏదేశము మీకు సమ్మతమో" ? అని వ్రాయించిన చళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు "హూలెండు !" అను పాటమీఁద పూగాగ్రిమునకు దయచేసి యీ క్రిందిచర్య

(శృంగభంగము)

నంతయు నడిపెను. ఇందునకు లేశముగాని, యతిశయోక్తిగాని, లేదనుట కిందుఁ బేర్కొనఁబడిన విద్వచ్ఛేఖరులె సాక్షులు. కవిసమయసిద్ధమగు నేకవచనప్రయోగా దిక మిందుఁగలదు పండితుల కది హర్షదాయక మగునని మే తలంచెదను.

క. నారాయణునకు గురునకు • భారతకవయితకు వ్యాసపండితునకు జో
హారు లొనరించి కవితా • ధారితికి మ్రొక్కి జయముఁ బతియింపఁదగున్

మ. పరిశమం బబ్బ విరోధికృత్సుమమహావైశాఖశుద్ధత్రయో
దశినాఁ డిర్వురు బందువుల్ నడుపఁ బతిగ్రంథదుర్లేఖలన్
దశలోనంగడియించి వేంకటకవీంద్రశ్రోత యేతెంచె ము
ర్వ్యాశముం బాపుకొనంగ గెల్పుగొనఁగా రావిల్లి మత్ర్తిలికిన్

వ అట్లు బహు పండిత మండితంబగు కృష్ణకవి వివాహగ్రామంబు నగు కాఁక రపర్తికి శకటారూఢుండై యరుగుదెంచి నంపన్నుఁడును బందుగు నగు నొక గృహస్థునియింట విడిసి యిష్టాన్న సంతృప్తుండును సుఖశయితుండు నయి—

ఉ కాఁకరపర్తి పండితశిఖామణి మందలి వేలువేల నా
లోకన మాచరించి తమలోపము లేదని తెల్పి రాముపై
వాకొనినాఁడ గీరతము వచ్చినిమండని పిచ్చి యొక్క సు
శ్లోకుని సౌధ మెక్కి తనశ్లోకములం బఠియించు నత్తఱిన్

ఉ "వ్యాసకవీశ్వరుం దలఁతివాఁ"డని కబ్బములోన "నేత నా
తో నరివారులే"రనియుఁ దోఁచిన రీతి బిగల్పుమాట రా
గా సభవారు సైఁచి రది కర్ణ కఠోరమెయైన బంధుశం
జేసి విడంబముల్ మఱియుఁ జెప్పఁగ సాగెఁనతంపు వేర్మిడిన్.

చ పటుపుర వేంకటేశ్వరుఁడె పార్థనఁ బిల్చె ధనంతఁ, గొందఱున్
బిలిచెను దత్సభాపతియుఁ, బిల్వఁగలే దొకరైనఁ గృష్ణు, న
బ్బలి "ననుఁ బిల్వఁబంచెనె ? సభాపతిగా"రన, దూత "లే"దనెన్,
గలహము నాత్మ నెంచి కవిగండరగండఁడు రాఁడు మేడకున్.

వ. వెండియు గీరతాఖ్యానమునందు "గురువులతోడం గూడియేని జయింపరం" డనునర్థముగల యొక పికత్థనవాక్యముం జమవు ను నెమట బృహస్పతిబోవివారి నారాయణ బుధేంద్రుంగని వెఱచఱచి,

(శృంగభంగము)

చ. "ఎఱుఁగమ మీమహత్త్వ మిదమిత్థ మటంచును దెల్లమయ్యె నేఁ
డొరపడి రజ్జులాడితివి, పోఁడిమి గల్గిన రామకృష్ణులన్
గురువులతోడఁ గయ్యమునకుం జనుదెంచని తప్పువ్రాసితిన్
శర ణని తీసివైతు" నని చల్లఁగ దాఁటె యథార్థభాషలన్.

ఉ. మేకులిగింపు పర్వమును, మేలగు నీశ్వరవేరుగర్వమున్
గేకల మండలింపనెడు గర్వము, జీలుగుబెండు గర్వమున్
స్తోకము కాంతిగర్వమును జొప్పడు వాసివిగన్న గర్వమున్
గాఁకరపత్త్రి గర్వమును గ్రైకొనిపాడె నతండు వేఁడుకన్

క. కల్లరివావలజాబుల • నల్లరిపద్దెముల గీరతాక్షేపములో
బొల్లిబ నుల్లాసంబునఁ • గొల్లలుగా నతఁడు విబుధకోటికి వినిచెన్.

వ. అంత దివాకరుండస్తాద్రి కేఁగుటయు నాఁటికిఁ గొలువు చాలించి యందఱుఁ దమతమ విడిదలకుం జనిరి. వేంకటేశ్వరుండును నిజనివాసంబున కరిగి కతిపయసుహృజ్జనపరివృతుండై "కృష్ణకవి నీవమ్మ గలాఁడేని యెల్లి నాతో నవధానము సేయఁగూడు" ననియు, "నేటికొల్వున నారాయణబుధుం క్షమింపఁ గోరుట వినయార్థం"బనియు నిచ్చానురూపమ్ముగఁ బద్దులాడుటయు నదియెల్ల నాప్తముఖమ్మునం దెలిపి శ్రీనారాయణ బుధేంద్రుండు కృష్ణకవి రావించి యిట్లనియె.

ఉ. వింటివె రామకృష్ణ! మన వేంకటశాస్త్రి వచోవిరూఢి? న
ట్లింటికి నేఁగి వెండియును నెప్పటియాటయె యాడుచున్నవాఁ
డంట! యెదుర్ప మీన్నపునియానతి యున్నదియొక్కొ నాఁగ, నా
దంట "భవన్నియుక్తి నవధానమొనర్పఁగ మెచ్చు తేఁ"డనెన్.

వ. క్రమమ్మున నారేయి గడచనుటయు మఱుచటినాఁడు పూర్వాహ్ణమ్మునందు.

సీ. అగ్రహారికుఁడు విద్యాధికుండు సుగుణశాలి సుందరరామశాస్త్రిగారు
ఘనకీర్తి హితకారిణివి గురుండును సాధుమతి వ్యాసలింగపండితుఁడుగారు
ధవళాద్రిలో నుపాధ్యాయుండు సౌభాగ్యశాలి సీతారామశాస్త్రిగారు
గానవిద్యను బేరుగలవాఁడు చర్లాద్ధిచంద్రుండు లక్ష్మణశాస్త్రిగారు
వేదులాన్వయవార్ధి విమలశీతాంశుండు సూర్యనారాయణసూరిగారు
అవధాని సంస్కృతాంధ్రవ్యాఖ్యాకర్త సూర్యనారాయణసూరిగారు

(శృంగభంగము)

కవిరాజుగారి యుద్యోగి పండితపురస్సరుఁడు బ్రహ్మానందశాస్త్రిగారు
చెళ్ళపిళ్ళాన్వయ సాగరేందువు కవిశశి చిన్న వెంకటశాస్త్రిగారు
సంస్కృత సత్కళాశాలలో నొజ్జ సజ్జనసుతమతి రామశాస్త్రిగారు
సాహితీధనుఁడు శాస్త్రపరిసక్తుం దధిజాతుఁడు వేంకటశాస్త్రిగారు

గీ మఱియుఁ బండితులును గవుల్ మఱియు ఘనులుఁ
పిన్నలును బెద్దలును గూడియున్న సభను
చెళ్ళపిళ్ళ వేంకటకవీశ్వరుఁడుగారు
గీతము విప్పి వెండియు గేలిచేయ.

వ. కతిపయచ్ఛాత్రసహితుండై యాసభావేదికకు విచ్చేసియున్న నారాయణ బుధేంద్రుం డది సహింపఁజాలక సముచిత భాషణమ్ముల వేంకటేశ్వరు గీరత పాతమ్ము నాఁగి.

ఉ. "మీరు రచించు చిత్రముల మీఁది రచించును గృష్ణశాస్త్రి నా
కూరిమి శిష్యుఁ; డెచ్చటనొ గొప్పలు చెప్పుదు రేమి కార్యమో !
పోరుఁడి యాతనిం బిలువఁబుత్తు" నటంచు గురుండు వల్కు, నా
ధీరుఁ డికేమి చెప్పుదును "దెత్తెతె పెప్పెపె మెమ్మెమే" యనెన్

క. ఎవియో బీరములాడిన • నవధానము సేయఁ గృష్ణుఁ డరుదేఁడు యతం
బవల సుసాధం బనుమతిఁ • గవి వేంకటశాస్త్రి రేయి గరుసము సూపెన్.

చ. తిరుపతిశాస్త్రి వచ్చునెడఁ దీర్పరి యాతఁడు సేయుఁగాని నే
మఱచితి నే నెఱుంగ నను మాట యిదేమిటి విన్న రేయియే
పురుషుఁడయేని కృష్ణకవి పోరెడివాఁడని యంటిరంట, నా
సురకయ పల్కినాఁడ నవి యోడినతండు వచించె నద్దిరా !

ఉ. వారలలోనఁ గృష్ణకవిఁవర్యుడు మాద్వయమందు నేనెపో
ధీయుఁడనంచు నెల్లరకుఁ దెల్పుచునుందురు గాన నిర్వురుం
బోఁరుడు మీవధానముల బోఁడిమిఁ జూతుమటంచుఁ బల్కె నా
నేరుపుకాఁడు మా యిరడు విన్వెఱఁజెందఁగ సభ్యులందఱున్.

శా. నాకుం శిష్యుఁడు రామశాస్త్రికవి కొన్నాళ్ళేమొ సిచెంత నే
దో కాలక్షయ మాచరింపుటయు నోహో శిష్యుఁడం చెప్పుడున్
మీకబ్బుమ్ములఁ జెప్పుకొందు రది మేల్మీకౌనె ? మీరెట్టు లా
శ్రీకృష్ణుం గవిరాజు జెప్ప ? రన, విస్పీః మాకు రా దచ్చటన్.

(శృంగభంగము)

వ. అంత

ఉ. కౌముది చేతఁబట్టి నయగారపుమాటల రామశాస్త్రి "మీ
రేమి యెఱుంగువారొ, యిపు డించుక చెప్పుఁ" డటంచు వేఁడఁగా
నామహనీయమూర్తి "యది యంతయు విస్మృతమయ్యె నిప్పుడే
నేమియుఁ జెప్పలే"నని యెల్లరు విజ్ఞులు బిట్టు నవ్వఁగన్.

ఉ. వ్యాకరణమ్మున న్గెలుతు వాదమునం దని రిత్తపద్దెముల్
గోఁకిఁ యిదేమి! నేఁడిటుల కొంచెము లేదని నిక్కమాడుటల్
నాకు సతీర్థ్యులా కవులు, నన్నదివింపఁగలేవి మీరెటుల్
వాకొననేర్తు రావిబుధవర్యులయొద్ద, విడంబమేటికిన్

ఉ. కౌముదిచెప్పుడం చడుగఁగా మఱి వేదులరామశాస్త్రి య
ప్పామహితుండు పుస్తకము నంది పదంపడి కొంతచూచి "య
య్యో! మఱిలేను విస్మృతమె యయ్యెను సర్వము చెప్పలేను న
న్నేమనియాడువార లిఁక, నింత నిజం"బనె వెల్లవోవుమన్.

చ సగుణ రామశాస్త్రియుఁ బ్రశంస యొనర్పఁగఁ జెప్పనేరమిన్
గిఱవయి యాకవీశ్వరుఁడు క్రిందులు మీఁదులు సూచుచున్నచో
గురుఁడిటు పల్కె "శబ్దకృతిఁగూడ నెఱుంగనియట్టివార ల
బ్బిరుదుల వ్రాయనే?" యనినఁ "బెప్పెపె మెమ్మెమె చెప్పలే" ననెన్

ఉ "తామువచింపఁగావలెఁ బ్రతాపచరిత్రముఁ దెచ్చినాఁడ నిం
దేమి పఠింపఁజేయుదురొ? యి" ట్లని రామబుధుండు పల్కఁగా
నా మహనీయుఁడున్ "దిరుపతయ్యకవీంద్రుఁడు గాని యిందు నే
నేమియుఁ జెప్పఁజాల" ననియెన్, నిజమాడినఁ దప్పులేదుగా

చ "పెరుఁగును బువ్వయున్ మెసవి పెద్దసహోదరుఁ దోడఁగొంచు స
త్వరముగ వత్తు సందనుక తాళుము నిల్వు" మటన్న బమ్మనాఁ
"దిరుపతి వెంటరా నరుగుదెంచెద శ్రావణమాసమందు నే
మరల బలమ్ముమీఱ"నన మాఱ్కొని బుచ్చివధాని యిట్లనెన్.

చ తలనెరియంగ వారలను దాతలు తండ్రులతాతలై మఱిన్
గలహము సేయవచ్చెదరుగాని, యిదిట్లెపుడయ్యెఁ జాలలెం
డలయిక నంద నేమిటికి? నల్కవహింపకుఁ డింకమీఁద మీ
బలిమను వారిశక్తియును బాహ్యములయ్యె జగమ్ము మెచ్చఁగన్".

(శృంగభంగము)

వ ఇట్లు పరాజితుండగుటయు నొక పద్యంబు లేచి,

ఉ. "వ్యాసకవీంద్రుఁ డింతయనువాఁడవె ? నీవును బట్టు పద్దెముల్
జేసినయంతమాత్రమునఁ జెల్లెనె ? యాయనతీరిచూడ నీ
కూసుకవిత్వమెంత ? యిదిగో నన లోఁగితిఁ కొరవేల్లకుఁజా
మీసము లప్పగించి చనుమీ ; యిఁక మాటలువేయు నేటికిన్

క ఘనులు శిరసావహించెదు ; ననర్ఘ రాఘవముఁ దూలనాడెదు దానిం
గనుఁగొని నీయిష్టమువ ; చ్చిన దొక పద్దెమ్ము విప్పి చెప్పంగలవే ?"

వ అని యుల్లంబుచ్చిపోనాడెనిట్లు కొలువు ముగియుటయు మండగీంగు దాలకులు కొందఱు కరతాళంబులు వైచిరి. మధ్యాహ్నంబగుటయు నెల్లరు భోజనమ్ము లకై తమతమ నెలవులకుంజనిరి వేంకటకవీంద్రుండును.

చ. స్థిరపడి ప్రశ్నకుత్తరముఁ జెప్పఁగ నేరక కుఱ్ఱవార ల
ల్లరి యొనరించిరంచు నపలాపము పేపెకునంట బాపురే !
గురుఁడును కుఱ్ఱ, శిష్యులును గుఱ్ఱలు నూటికినెంచిజూడఁగా
విరువదియెన్మి దేడులకు నెక్కుడు ప్రాయము లేద యేరికిన్.

వ. వెండియు సాయాహ్నమ్మునందు సీతారామశాస్త్రి గౌరీపతిశాస్త్రి పురస్సరులగు బుధేంద్రులు కొలువై యుండ సతీర్థ్యసంఘమ్ముతో నల్లమరాజు రామబుధుం డచ్చటికి విచ్చేసి వేంకటకవివరు నుపలక్షించి "పూర్వాష్టమ్మున వారందఱు దూయఁబట్టుకొనుట నే నట్లంటి నవి పల్కిరఁట, నిక్కంబే ?" యనుటయు నక్కవివరేణ్యుండును నది యథార్థము కాదని ప్రతిపాదించె నంత మఱియు నొక ప్రధానచ్ఛాత్రుం డద్యైపండితులసా క్షులుగాఁ బలికె.

మ "అవధానమ్మునయందు వ్యాకరణమం దధ్యాపనమ్మందు నే
వివిధప్రక్రియలందు మీకుఁగల ప్రావీణ్యంబు సూపింపుఁడీ
వ్యవధానమ్మిఁక లేదు కృష్ణుఁ డిదిగో వచ్చున్ బుధా !" యన్న న
క్కవి పూర్వోక్తమె నిర్వచించెను వినంగాఁ బండితుల్ వెండియుఁజా.

చ. కల్లలువల్కినార లవి గ్రంథములఁజా లిఖియింప నేలొకో ?
కొల్లలుగాఁగ దోషములఁ గోవిదులొప్పనవాని వ్రాసినా
రెల్లెడఁ జిమ్ముచుండి, రవి యే బుధుడుఁజా గనియుండుఁ, గాదనం
జెల్లునె ? వానిదిద్దుకొనఁ జేఁదె ? యథార్థము తా మెఱుంగరే ?

(ప్రాంగణరంగము)

ఉ వారు శతఘ్ని వ్రాసిన వవార్యములోటను దిద్దుకొందు మం
చీరు పఠించినారుగద ? యిన్ని యబద్ధము లున్న గ్రంథ మె
వ్వారలుచూచి యూద. రిఁక వారలగ్రంథము మీఁద నెవ్వియో
దూఱులు వ్రాసినార లవి దోసములే ? ధర గొడ్డువోయెనే ?

వ. కాదేని ముఖాముఖి వాదించి సాధించుకొనుం డనుటయు నాకవి శేఖరుండం
దుల కియ్యకొనక,

చ. "తిరుపతిశాస్త్రి పల్కఁబడెఁ దిర్పతియంచును రామశాస్త్రిచేఁ
బరపతివిల్వ నేవిటకు వచ్చితి. దప్పదికావొకో ?" యనఁగా
సరసులు సభ్యు లిట్లనిరి "చాలును వేంకటరామశాస్త్రి నా
తిరుపతి "రామయాః" యనినఁ దీరదె ? తిర్పతిఁ "దిర్పతీ" యనన్"

ఉ వేంకటరామకృష్ణ కవిసీరులు రత్తలు వ్రాసిరంచు మీ
రంకము చేసినారలట యయ్య ? యథేచ్ఛగ, నెందు మీకు శ్రీ
కింకవిరాజ మత్తగజకేసరినామము నెవ్వఁ డిచ్చినా
డింక వచింపుఁడన్న నది యేమె ధరించితిమంచుఁ జెప్పవో
వేంకటనేత ? వారిసన వేడ్కఁయె ? మే ? లని రెల్లవారలుఁగా

వ. అట్లు సభముగియుటయు నాటిరాత్రి వేంకటకవీంద్రుండు భాష్యకారబుధేంద్రుం
గని యట్లేని సంధినడపుఁడని కోరి పేకువకడ లేచి సంబంధుండై తను
గ్రామమ్మునకు విచ్చేసె నంతనిక్కడఁ బౌరులు

గీ శతవధానముఁ జేయఁగఁజాలనన్న
యతని కింతవిడంబమే మనెడువారు
కౌముది మఱచిపోయిన ఘనున కింత
యల్లరింజేయ నేమిటి కనెడువారు

ఉ శారె శతావధానులఁట ? తక్కినవారలు పేరుపెట్టుకొ
న్నారఁట ? లోకమందుఁ గవినాయకు లందఱు జన్నిదమ్ములో
వారఁట ? రండు వొందులఁట వహ్వరె ? హ్రీవిడనాడి యూరు వ
ల్పీరము లన్నియుఁగా ముగియఁ జెప్పెసె మెమ్మె మె యమ్యోనేఁటికిన్,

ఉ తారును కృష్ణుఁడుఁగా శతవధానము సేయఁగ మెత్తు మన్నచో
నేరనటంచు నిబ్బడిగి విక్కము వేంకటశాస్త్రిచెప్పె. విం

తారయ నెన్నియెన్ని యయథార్థము లాడిన నేమి యయ్యెడుఁగా
భీరమువోయె, గీరతము పిప్పియె సారము లేదుదానిలోన్.

వ అని చెప్పుకొనసాగిరి.

ఉ శౌర్యముగల్గువాఁ డని పశ్చిమ జయవెట్టగఁ దమ్మసింగమం
దార్యుల వన్వ లేశనుచు వన్యులఁ జెప్పిన కల్లరిదె దో
ర్వీర్యముచూపు చెళ్ళపిళ వేంకటశాస్త్రిది మేఁకపోతుగాం
భీర్యమటంచు నెల్లరకు వెల్లడియయ్యె. విఁశేమికావలెన్.

ఫలితార్థము.

చ. విసుకరి గిల్లికయ్యమును వెట్టిన వేంకటశాస్త్రి యోడిపో
యెను, గురుపాదభక్తుఁడగు కృష్ణునకుం జయమబ్బె నింక సీఁ
దను జెళపిళ్ళ వేంకటవధాని యెదేనియువ్రాయ వారితోఁ
జెనఁగఁగ రామకృష్ణకవివీరులకుం బనిలే దొకింతయున్.

---

(1) ప్రశ్న

ఈ శృంగభంగకవిత్వ మిందు వ్రాలు చేసిన చర్ల వెంకటపశుపతిశాస్త్రులవారిదే యగునా ?

ఉత్తరము.

పల్లెపాలెము, 8-7-11

... ..గారికి .. మధునాపంతుల వెంకట సుబ్బారావు నమస్కార ... మణియు రాసుకృ . .....యీమధ్య నిచ్చటి కేతెంచి తాను చేసిన శృంగభంగము యిచ్చటి వారికి విన్పించి ...—"కారవల్లికిఁ మీనము లప్పగించి చనమీ యిక చాలును వీపఁ్రతాపముల్" అనుచుఁ గొన్ని పద్దెములు చదివెను.......వెం॥ సు॥రా॥

14-7-11. వింజరము.

"... ... ...గారికి... .....వేదుల నారాయణమూర్తి . ... శృంగభంగమను పుస్తకములో అకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారి తమ్ములు చేసిన ...... చేష్టలమాత్రము వ్రాయనట్లు అల్లంరాజు రామమూర్తి నాతో చెప్పినాడు. అతడీమధ్య తీవరుగ్రి వెళ్ళినాడు. .... .. శృంగభంగ గ్రంథకర్తయగు చర్ల చలపతికి కవిత్వ

ఉ. ఇంతటిమాత్రివే విజయ మేర్పడుటే ఘటియించునేని, వృ
త్తాంత మెఱుంగ కోర్చు నల రసాభాసపుతర్కిని తోఁకఁ గాల్చి వి
శ్రాంతత గన్న రక్కసుల శ్రీ గద యీవిజయంబు మేలు. మే
లెంతటి బుద్ధిమంతు లదయించిరి కాఁకరపర్తివో సఖా!

మ. అపు డేఁ జెప్పితి వారితోడ "మిము నే నాఁగంగలే వియ్యెడన్
గృపమైఁ దప్పునకో మఱొక్కెడకొ మీరేతెంతురేనిన్ భవ
చ్చపలంపుంబలుకుల్ గనుంగొనెద మీ సామర్థ్యమున్ నా కవి
త్వ పటుత్వమ్మును బ్రాజ్ఞలోకమునకుం దార్కాణమౌ నయ్యెడన్."

ఉ. కాఁకరపర్తి కేగునెడఁ గావలెఁ బోలిసువారి సాయ, మిం
కేకడనైన నయ్యది యొకించుకయైన వలె. దండు నుత్తమ
శ్లోకులు పండితుల్ గలరు శుద్ధమనస్కులు; వారిఁగూడ నీ
పోకుల లెక్కవెట్టరఁట! వా రొనరించెడిదేమి పిమ్మటన్?

---

మననేమో తెలియదు. అతడు చేసినట్లు మీరు వ్రాసిరట. ఆహాహా యెంతమితిగ నున్నయది. ఈయది విచారింప గలియుగ మహాత్మ్యమని తోచెడిని . . . ."

వే. నారాయణశాస్త్రి

కాకరపర్రు. 23—7—11.

" ......యిందుతో శృంగభంగం వకటి పంపించుచున్నాను. ఈ గ్రంథము రామకృష్ణకవిచేతనున్నూ కాకరపర్తి వెంకన్న చేతనున్నూ రచియింపబడి వేముల బ్రహ్మన్నగారి కుమారుడు సూర్యనారాయణ శాస్త్రులచే తణుకు-తీసుకు-వెళ్ళబడి చర్ల చలపతి పేర నచ్చునొత్తింపబడినది. గాని యితనుమాత్రం గ్రంథకర్తగాదు. ఏమని యితను కవిత్వమెట్టిదో యెఱుగడు. యితను రామకృష్ణకవికి భావమరది అయి యున్నాడు. యీగ్రంథముకు యీ సూర్యనారాయణ శాస్త్రులు చాలా ప్రేరేపణ కర్త యయి యున్నాడు. గనుక యీసంగతులు యావత్తు తమకు విశదపర్చుచున్నాను. . . .."

చర్ల సీతారామయ్య వ్రాలు

4 ఆగష్టు 1911—అలమూరు (పోష్టుముద్ర)

". . ......... శృంగభంగములో వున్న పేరు, రామకృష్ణశాస్త్రిగారి భావమరిది. 20 సంవత్సరముల వయస్సుగలవాడు ....... .." కామవరపు వీర్రాజు.

ఉ. కాఁకరపర్తికారిది నాకానొక తేఖను బంపుమయ్య. వా
లేకర కేగుదెంచెదరొ. యెందుఁ గవిత్వములో జయింతువో ?
లేక నమన్ జయించినటులే కరతాళ మహాహవంబునన్
వాఁకి వినన్ జయించెదరొ ! తథ్యము లోకమె తెల్పి మెచ్చెడిన్.

ఉ. ఈమొదలన్ శతఘ్ని నొక యుంచక పొందితి మీకు వల్ల నా
రాయణ శాస్త్రిగారిది కరంబును బోధపడెంగదా ! నఖలా
శ్రీయుతమూర్తి యాసుకవిశేఖరు వాక్ప్రతిమంబు వత్కవి
త్వాయతియున్ జనుత్కృతియు వంతయునుం దెలియంగ క్షణమ్మునన్

క. కనుఁగొంద్రు గాక పండిత ! జమలాయనకున్నశక్తి సత్కృత పీ కుం
దిన శక్తియు వెనువెంటన ! వినమోకొ్ప పాటిమీఁది విద్దెల బలుపుల్ !

ఉ. కని గంటదేవిఁ దా స్వయముగా నెదిరించుచు కొంత యొప్పఁగా
కి నరసులైన పండితవికాయము లున్నసభన్ రసౌచితిన్ ;
బనపన మూఁక నాపయికిఁ బంపు టిదేటి వివేక మింతతో
వ్యసనము తీఱనేయకట ! పాపము వాఁగదు దాఁచిపెట్టినన్.

ఉ. వింటివె. యీతఁడే సుమి వివేకులు నవ్వెదిరీతి నేవియో
కొంతెతనంపు మాటలను గొల్గుచు భారత నాటకమ్ములం

---

కాకరపర్తి 25—7—11.

"... .....రామకృష్ణ ... బావయగు చలపతి పేరు పెట్టినాడు... ... కాకరపర్తి వెంకన్నయను వతడున్నూ యిద్దరు చేసినారు. రెండవయతని పేరు పెదతానంతే అతను వద్దనగా, బావమరది పేరు పెట్టినారు యిక్కడ యింకా వేదుల సూర్యనారాయణ అను నొక పుణ్యజనుడు తనకు స్వయముగా పట్టుకువెళ్ళి ముద్రణ చేసినాడు ......"

పురాణపండ సూర్యనారాయణశాస్త్రి.

29—7—11, పోడుమద్రి.

"కాకరపర్తి శ్రీ భారతీనిలయము భాండాగారము శకర్తిటరీగారి వద్దనుంచి ... ... . ....తిరుపతి శాస్త్రులుగారి చరణసన్నిధికి—

.........కృష్ణునికి, శృంఖంగంపైని కర్తృత్వమున్న చలపతి, బావయగు ... ... ....గురువు నారాయణశాస్త్రి మొదలైనవారు పద్యములు వ్రాయుచుండిరి ... ...." భా॥ భాం॥ శ॥

గుంటివిగా వొనర్చుటకుఁ గూర్చెదు శిష్యులకై యతించువాఁ
డంట ! నిజమ్ముగాఁ దెలిపెనయ్య సమస్తము నాలమూరునన్.

ఉ. ఆయెడమండి నే వెడలి యాలయ రేగిన తక్షణంబ "నా
రాయణశాస్త్రిగారు నొక రామసమాహ్వయుఁడౌ కలార్థియున్
బాయక యశ్వమేధమును బట్టిరి పా దొవరింప" నంచు నా
రాయణమూర్తి సత్యవదరాశితుఁ దొప్పుగఁ జెప్పె నాకడన్.

తే. గీ. పట్టినారాయణుఁ డసత్యవాది యైన
నయ్యెడుంగాక సత్యనారాయణుండు
గా దసత్యంబునకు నొడిగట్టువాఁడు
సత్యమియ్యది సత్యంబు సత్యమయ్య.

---

2 ప్రశ్న.

ఎవరు చర్ల వెంకటచలపతిగారేమైన వ్రాసిరా ?

ఉత్తరము.

దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగార్కి—.

1. నిత్యం భజామి శరణం, చరణం తవకామదం, శిష్యానుగ్రహ సంసక్తం స్నేహైప్రేమిత విగ్రహం। కథయామి తవేదంతు హృద్యమేతద్వచశ్శృణు, నమాం మన్యస్వపతితం శృంగభంగస్యకారిణం॥ 2. త్వయాచ ప్రేషితాం దృష్ట్వా పత్రికాం జనకో మమ। జ్ఞాత్వా రిజష్టురీరూపేణ। ఆగ్రహం కురుతేఽయి॥ 3. ఏతదాభాషణం శ్రుత్వా అనుగృహ్ణాం త్వమంజసం। భవతాం సర్వకార్యేషు మంగళం ప్రార్థయా మ్యహం॥ 4. తస్మాద్యూయం మయిదయాం కుర్వంతు త్వఛ్ఛాత్ర సమూహేమామప్యేక ఇవమన్యస్వ। మయి ఆగ్రహం నాస్తీతి ప్రత్యుత్తరం రహసి విలిఖంతు॥ తప్పుల నమగ్రహింపవలెను. చర్ల వెంకటాచలపతి.

మఱియొక యుత్తరము

"కాకరపర్రు శ్రీ భారతీనిలయ భాండాగారాధిపతులవద్దనుంచి.

7 ఆగస్టు 1911, పోస్టుముద్ర.

. . ... ఇంకతమరు వ్రాసిన ప్రశ్నలకుత్తరము, అతడు బహుకొంచెము కౌముది చదివెను. పంచకావ్యములు, శాకుంతలము మొదలగు రెండునాటకములు చదివెను. పాఠంచెప్పే సామర్థ్యం వున్నట్లు తోచదు. వయస్సు 20 సంవత్సరములు......... .. ఇప్పుడు నారాయణ శాస్త్రులుగారి శిష్యుడు— పై తెలుగుపద్యాలైలివి ఆంధ్రమున కవిత్వము కొద్దిగా చెప్పును. సంస్కృతశ్లోకములు ఊహించతగు.. ...."

ఉ. "కాకరపర్తిలో నెవరో గాని విమర్శన మాచరించి" రం
దాకడఁ జూచి చెప్పిన కలార్థివచోరచనన్ లిఖించె ము
న్నే కడు సత్యసంధుఁ డొకఁ డీవిషయమ్ము నెఱుంగువాఁడె నేఁ
గాకరపర్తి కేగితిఁ దగన్ సకలమ్ము నెఱింగి వచ్చితిన్.

ఉ. అతఁ డెఱుంగఁ డంచు నొకఁ డాయన శిష్యుఁడు చెప్పెఁ గావిప
ఖ్యాతకుబుల్ మహామహు లఖండు లనేకులు గూఢవర్తన
స్ఫీతి నెఱుంగఁ జెప్పి రిట వేఱొకఁ డేటికిఁ జెప్పఁగావలెన్
జాతురి లేని వర్తనమె సర్వము దెల్పెఁగదా సభాస్థలిన్

మ. కపటంబెంతయు లేకయున్నయెడ విష్కంపమ్ముగాఁ దా సప
త్రప యొక్కింతయుఁ బూనకేయకట । "శబ్దజ్ఞానమే లేదెటుల్

---

3 ప్రశ్న.

ఆల్లరిసభయన్నందు లవాధారముకలదా ?

ఉత్తరము.

రాఘవభట్ల విశ్వనాథకృతానేకనతయః . .. .యిక కాకరపర్తిసమాచారము. ఆ॥ సీతారామయ్యగారు వచ్చినవెంటనే యాసంగతి యావత్తును తమరు సెలవిచ్చినట్లుగానే చెప్పిరి అల్లరికి తానే ప్రోత్సాహకుడనని వప్పుకొనిరి. మాతన్నగారిని ఆక్షేపింమటచే చేసితినవిరి.

4 ప్రశ్న.

ఆయీఅల్లరివిగూర్చి పనివచ్చినచో నచ్చటి యోగ్యులెవరేని సాక్ష్యమిచ్చెదరా?

ఉత్తరము

కాకరపర్తి, 29—7—11.

పురాణపండ గవరయ్యా అనేక నమస్కారములు, . . ... తమరు వ్రాసిన కార్డు చేరినది. అందుల సంగతులు గ్రహించితిని. బ్రహ్మశ్రీ సీతారామయ్యగారున్నూ మీరున్నూ కూడనాకు బంధువులే యగుటచేత, తమయుత్తరమునకు బ్రత్యుత్తరమేది యిప్పటకు తోచక యింతకాలమాలస్యము చేయవలసినది. ఆయన సన్నిహితబంధువగుటచేతను వారియన్నగారు నాకు గురువులగుటచేతను నవరు విషయంబున నా సాక్ష్యంబు విడువగోరెద. ఇదియ నాప్రార్థన అకాలమున తమరు దాల్చిన శాంతత హా యుల్లంబుల కెంతయు నానందము గలుగజేసెనని మాత్రము చెప్పగలము. ..

ఫు॥ గవరయ్య.

కపితమ్ముగా రచియింతు పీ" వవఁగ పేర్కొల్ ఘట్టునే ౹-చర్లవం
శపయోరాశి శశాంకమూర్తికి వపుప్పారణ్యసంస్ఫూర్తికిగా.

ఉ. "ఏమియురాదు" మంత్రియొకఁడే సమయమ్మునకున్ స్ఫురించె. శ్రీ
రాముని మంత్రి మయ్యె నది: రాక్షసవర్గ మొకింత గొంకఁగా
పాపముకల్గి నే విజువఁ జాలితి; దాని కొకింతదక్క నా
గ్రామము దాఁటజాల నని గట్టిగయుం ఋదయించె నెచ్చెలీ।

చ. పలుపురు పండితుల్ గలరు పద్య రపండితులుం గలారు న
ద్యలు మవ శిష్యవర్తనుఁ బోలమి చెప్పెడివారె గాని లో

7—8—11, తుని.

బ్రహ్మానందశాస్త్రి నమస్కారములు.

తమయుత్తరమందినది కొన్ని కారణములవలన యదార్థములగు సంగతులు గూడ వ్రాయఁజాలమికి క్షమింపగోరెదను. చిత్తగింపుఁడు.

మఱియొక యుత్తరము.

... .....శృంగభంగం పాతువ్రాతగానున్నది .. ..వ్యాసమూర్తిశాస్త్రి గారు ప్రత్యుత్తరమిమ్మట కెట్టకేల కొప్పికొనిరి ఏయే సంగతుల కిచ్చెదరని యడుగ మీయుత్తరము చూచికాని చెప్ప వీలులేదన్నారు. యల్లరిసభ యగునా కాదాయని యడుగ "పఘుపంశపాతము చెప్పనడుగుట యల్లరికాకేమి" యనిరి 5—8—11పి ౦॥

5 ప్రశ్న

ఇంకేమైన శృంగభంగమువంటి కల్పనలు బాలకవులు చేసిరా ?

ఉత్తరము

.. చక్రవర్తుల కృష్ణమూర్తి సిద్ధాంతి . ...

తమకు మతిపోయినదని యిచ్చట ఓలేటి వెంకటరామశాస్త్రి ఒక తంపివార్త వేసినాడు. దీని నిజము యెంతో తెలియదు. ఏమియు తోచదములేదు

ఇఁక నొకటి.

. . యంజిరములో వెంకటశాస్త్రికి మతిపోయినట్టున్నూ డాక్టరువచ్చిచూచి. వట్టున్నూ తిరుపతయ్యకు టెల్లిగ్రాము యిచ్చి మీవు తీసుకువెళ్ళి మీవద్ద పుంచుకోవలసినది. అనిచెప్పినట్టు పుకారు .. వెంకటాచలము

(పై రెండుత్తరములున్నూ యానాంనుండి వచ్చినవి)

వల నొకఁడూవి పైకినొక ఫక్కిగ వర్తివారు కొంద ఱీ
వఱుగుతనంబుఁ జూపుటకుఁ బొల్పడి రజ్ఞులు కోఁడుసీడగన్.

మ. విదురామల్ వలుమంది నాగపురిలో విచ్చేసి యున్నార ల
య్యదునాథాగ్రిణి పూనికన్ దెలియువా రచ్చో సభన్ మాధవున్
మృదుతాతూమ్యలు కొరవాధములు బన్మింబట్ట సంకించి రే
కద యాపైవని యెట్టిదైన: విదసుల్ గర్వంబు లూహింతురే.

చ తతమతి మేటి నాదుపినతండ్రి కుమారుఁడు వెంకటాఖ్యుఁ దు
ర్దతభుజశాలి నాదుపినతల్లి కుమారుఁడు వీరయాఖ్యుఁ డూ
ర్జితు లల సాత్యకిన్ గదనరీతి విదున్ గృతవర్మునిన్ మహో
న్నతులు స్ఫురింపఁ జేసిరట నాకల కాఁకరవర్తి హస్తినన్

ఉ ఆయన సత్కులీనుఁడు కలాకరుఁ డయ్యును నేమొకాని నా
రాయణశాస్త్రిగారు ధృతరాష్ట్ర సుతాగ్రిజుభాతి నీయస
త్ప్రాయము నాచరించి, రిది తథ్యము దేవళమందు దీపముం
బాయఁగ నార్పి చెప్పఁ గలఁ బాపములేదు యథార్థ మౌటచే.

శా విద్యావాసనగల్గు హేతువున నీవిద్వాంసుఁ డెట్టెట్టులో
సవ్యక్పాంతి వహించెఁ గాని మఱి వ్యాసప్రీతిపాత్రుల్ పునః
పోత్రివ్యత్నిచవచః ప్రపంచమునకున్ బుట్టిల్లుగా నెన్నియో
గవ్యంబుల్ ప్రవహింపఁ జేసిరి తిరస్కారధ్వనుల్ బోఁవన్

---

## 6 ప్రశ్న

శృంగభంగపు వ్రాఁతపై వివేకులకెట్టి యుద్దేశము కల్గుచున్నది ?

## ఉత్తరము

పిర్సారావుపేట, 30–7–11.

.... ....కాకరవర్తితో మీ కవన్మానము జరిగినట్లు . .. పద్యరూపముగా ప్రకటించిన ప్రకటన పత్రిక చూచి చాల దూఖించితి... ......దాని యాదార్థ్యమం తయు ... .తెలిపి చింతాలత గా దెగ్రింపివేయఁ బార్థితులు . ... శతఘ్నివి భూదిక కొలది చింత హెచ్చియున్న నాకు పాకువత మువచ్చి ఎట్లు నివర్తిచేసెవో యట్టే యీ యపవాద విని చింతిల్లెడి నన్ను తవళావబోధక భవదీయులేఖ యానందింపజేయు గాక ........ శా. పట్టాభి రామశాస్త్రి.

చ. ముగిసెఁ గ్రమమ్ముగా సభ సభోమణి యుండనమన్యథాగమం
దొగి నిలిచెం బవంపది యథోచితకృత్యము లాచరించి గ
ద్యగ సకలమ్ము వ్రాసి విదితంబుగ సుందరరామశాస్త్రి కొ
ప్పుగ వివిపింప వాబుధవిభుండు దురాగత మంచుఁ దేలిచెన్. 410

చ. పదపడి వ్యాసలింగకృతి భద్రిగణం బగుపట్టె నాతఁడ
య్యదన స్వకీయగేహమునయం దటు లొటకుఁ జింతనొంది "దు
ర్మదు. లొనరించు కృత్యములు మాన్యులు తారుగతించ" రన్న ధీ
పదములతోన దెల్పి తనసజ్జనతఁ బ్రకటించెఁ దిమ్మటన్

---

మఱి యొకటి.

... పిఠాపురంనుంచి కవితతోకూడా రామకృష్ణకవులు పంపించిన కాగితం ఇందుతో పంపించినాను. ఇది చూచినప్పటినుంచి నాకున్నూ శ్రీబాబుక్కున్నూ వున్న ఖేదం వ్రాయజాలను. ఇందుల యదార్థం వెంటనే తెలిపేటుగా వ్రాయ ప్రార్థితులు.

7—8—11, నూజివీడు, రా॥ వెం॥

7 ప్రశ్న

అయూర నల్లరిచేయు విద్యావంతులును గలరా ?

ఉత్తరము

11—2—11, తుని.

బ్రహ్మశ్రీ . . . గారికి- ద్వివేది బ్రహ్మానందశాస్త్రి నమస్కారోపరి, కాలాంతరమున నేనిక్కడ నున్నప్పటికి స్వగ్రామమగుటచే కాకరపర్రు రెండు రోజులకిరింపట వెళ్ళి నేడే అక్కడనుండి వచ్చితిని. కాకరపర్తిలో నెవరో కొందరు మీకుఁ బ్రతికూలవాదము చేయుచున్నట్లు కాకరపర్తి నివాసు లెవరో మీకుఁ దెలియ పరచినట్లును ఆప్రకారమిప్పుడు మీవ్రాయు గీరతములో వారినిగూడ నెక్కించి నట్లును గర్ణాకర్ణికగా వింటి. ఇందు నిజమెంతో తెలియదు. అక్కడిది మూడు వంతులు కోతిమూక. మీకు వ్యతిరేకవాదు లొకరయినచో నింకొకరిని వ్రాసెడు ప్రబుద్ధులు. కావున మీ గీరతములో నుదాహరింతురేని తగు మనుష్యులవలన యధార్థ మరయుటావశ్యకము. కొన్నిమాటలు తమ సముఖమున మాటలాడవలయునను సంకల్ప మున్నను దూర మగుటవలన వలనుపడకున్నది. అయినను అది వేసవి సెలవులలో సంఘటిల్లవచ్చు ... ... ..

(ఈ శాస్త్రులవారే యల్లరి పాండిత్యమైనకోడనే యాస్థానము విడిచి చని తమ వేదికాసమును దెల్పిన పరమోత్తములలో రెండవవారు.)

మ. ధనవిద్యాగుణగౌరవాన్వితుని సీతారామశాస్త్రిన్ గనం
జన నాధీరుఁడు పర్వమున్ వినఁగ సచ్చాతుర్యుఁడుగా గేహవే
దిని గూర్చుండుము విక్కు చేసితి మహాశీరుల్ మఱింగొంద ఱం
తన యేతెంచిరి మత్కృతిన్ వినిరి తాత్పర్యం బవార్యంబుగన్.

ఉ. ఆసలుధీరులందు నొక యార్యుఁ డఖండకలాకరుండు గౌ
రీపతిశాస్త్రి: "యీతనివశించె సరస్వతి" యంచుఁ జెప్ప నే
నాపురినెందు వింటి నొకఁ డంచు వచింపఁగ వేల సర్వవి
ద్యాపథముల్ వశమ్ములయి యమ్మహనీయుని గొల్చు దాసులై.

శా. సీతారామఘనుండు పండితజన శ్రేణియోర్వి సాహిత్యవి
ద్యాతత్త్వజ్ఞుఁడుదారమానసుఁడు ఛాత్రశ్రేణియుక్తుండు నం
జాతామోదముపై మదీయ కవితాసందర్భమేకాక యా
ప్రాతఃకాలపువారి యల్లరిని దాఁ బ్రత్యుత్తరంబుగా వినెన్.

చ. విని కడు నొచ్చుకొంచు "నవివేకులహేతువునన్ జగమ్ములో
ఘనమతు లున్నయాళ్ళకును గల్గఁగదా యపకీర్తి"యన్న చిం
తను వెలిఁబుచ్చినంతఁ గరతాళమహాహవకర్త వ్యాసమూ
ర్యమజుఁడు నన్నుఁ గాంచి తన యాగ్రహముగా బ్రకటించె నీగతిన్.

---

8 ప్రశ్న

నిజముగా నాయూరివారి కెవరికేని పత్రికృతవివాదమును సభాముఖమునఁ దీర్చ వలయునను నుద్దేశమున్నదా?

ఉత్తరము

కాకరపర్రు, 21—1—11.

.... .....సభ జరుగుట యసంభవము. జరుగు టొకానొకప్పుడు (వేఱొక చోట) సంభవించినచో వెంటనే యా సంగతి వ్రాయవలయును. తప్పక రానుద్యోగించుచున్నాను. గనుక ముఖ్యముగా వ్రాయుఁడంత గోరుచున్నాను .. ......

వల్లా సోమనాథశాస్త్రివ్రాఁత.

(వీరిదే ఇంక నొక యుత్తరము)

.. .....మరియును "సభనుగూర్చి మీగ్రామస్థులు యత్నించినట్లు విన్నాను. ... ... ..వారేమి జవా బిచ్చినది వినఁగోరితిని" యని వ్రాసియున్నారు ......సభ

ఉ. విచ్చము నెత్తి పీదుపిత పేవతనంబున పీపుఁగూడ ని
పృచ్ఛరమున్ భరించితివి పాండితి నేఁటికిఁ గల్గుఁగాక యీ
యచ్చరముల్ యథార్థములొ, యట్టివి కావొ ; వచింపుమన్న నే
విచ్చలు వొప్పికొంటి నవి నిక్కము లౌ కతనన్ సహోదరా.

చ అది విని యాశవిల్లకులుఁ డాస్యమునన్ జిఱునవ్వెలర్ప నీ
ముదిమమజాం డిదేమి యిటు మూలములేని ప్రసక్తిఁ దెచ్చె నం
చెద యొకయింత చేపికొని యేవము మోమున వెల్లడించు న
య్యదన మహాగ్రహమ్ము మెయి వ్యాససహోదరుఁ డిట్లు పల్కెడిన్.

క. మాయన్నగారికడ నం • తో యింతో చనుపుపీర లొగిఁ దప్పిందన్
జేయునితవి సైరించుట • న్యాయంబె ; కృతఘ్ను లనఁగ నన్యులె చెప్పఁడా.

ఉ వెంకటరామకృష్ణుల వివేకుల గా రన నేల, మీరు ని
శ్శంకగ నట్టివారె విలసక్కవి శారనపేవధిన్ విరా
జంకు మదగ్రిజున్ గణన తద్దయుఁ జేయనియాతవిన్ సభన్
గొంకకనిందఁ జేయఁ దొరకోని భవద్గుణవర్గ మేటికిన్ ? 419

సంగతి మాగ్రామములో నున్న వేదుల బుచ్చన్నగారనే సుబ్బారాయుడుగారు వేగా
కోశమున కొకసారి బాలురతో మడివిరని కర్ణాకర్ణికగా వినియున్నాను గాని మరి
యేపండితులవల్లగాని యగ్రహారీకులవల్లగాని మరి యే యోగ్యగృహస్తులవల్ల గాని
వినియుండకపోపుటయేగాక యట్టి యుద్దేశ్యమైనను మా గ్రామస్థ పండిత పామరుల
కింతకు పూర్వమందుగాని యికముందుగాని కలుగబోదని నిక్కముగా వక్కాణింప
గలను. నాలుగురోజులక్రితం మా గ్రామమునుంచి యొకరు యేలమూరు వెళ్ళినపుడు
బ్రహ్మశ్రీ కామవరపు వీరాజుగారు కాకరపర్తిలో సభాప్రయత్నము జరుగుచున్నట్లు
తమకు బత్రికాముఖమున దెలియజేసినట్లున్నూ అందుకు దమరు సిద్ధముగా నుంటి
మనియును గాకరపర్తి లోనేకాదు . .. తప్పక వచ్చితీరెద మనియును ఆ వీరరాజు
గారికి ప్రత్యుత్తరమిచ్చినట్లున్నూ ఆయుత్తరమును వీరాజుగారు మా గ్రామస్తునకు
చూపినట్లున్నూ ఆయన యీ గ్రామమంతయుఁ జెప్పినాడు. వినినవారందరు
వారు సమర్థులగుట వట్లే వ్రాసెదరనియు జెప్పికొన్నారు. ఏతద్వ్యతిరిక్త మేమి
యును జరుగలేదు... . చ కవిత యొనర్చుటన్న నతి కష్టము దానికి సత్క
వీత్యమో । నవి గలుగంగజేయుట యసాధ్యము, అట్లొనరింపగల్గ నా । కువుగ
రచించుటన్న నతి చోద్యము దానికి దోడు ధారణ। ధవుల సభాస్థలిన్ శతపధాన
మొనర్పఁ తటన్న శక్యమే" చల్లా పోతునాధశాస్త్రివ్రాయు.

ఉ. ఈపగిదిన్ మహాగ్రహపరీతుఁడు వ్యాసమహోదరుండు సం
స్థాపితకోపుఁ డూరక సదస్సున నేదియొ పల్కుచుండ గౌ
రీపతిశాస్త్రి యిట్లనుఁ "కృతికి లక్షణ మిట్టిదౌనె? మీ
రేపగిదిం గృతమ్ము లవి యీ మముఁ జెప్పఁ గలారు శిష్యులన్.

మ. భవదీయాగ్రజులన్ గవిత్వమునెడన్ బాటింప మన్నంతనే
యవివేకంబని చెప్పఁగాఁ గలమె యిష్టానిష్టముల్ సర్వవ
స్తువిశేషమ్ములయందు నొక్కొకరికిన్ దోఁచుం గా విభిన్నమ్ముగా
నవివిగా, మెచ్చనియంత దూష్యులన నన్యాయంబు గాకుండునే?"

మ. అని గౌరీపతిశాస్త్రి పల్కుటయునుం వ్యాసానుజుండుం గ్రసం
బున వాగ్ధోరణిఁ గట్టిపెట్టి యెటకో పోయెన్ ఘనుల్ యోగ్యతా
ననుఁబన్నట్టి సభాస్థలమ్మున వృథాగా వాగ్వ్యయం బెట్లొ నే
య నెటుల్ పాఁగు నెవండు మెచ్చెడి నగప్త్య శ్రోతృధౌరేయులన్

ఉ. పోవుచు "శృంగభంగ" మను పొత్తము రేపటి కేగుదెంచు నీ
కై విలిఖించెఁ గృష్ణకవి యల్లదె యచ్చునకేగె నిప్పుడే
కేవల మక్కటాన నిఁక గీరతమెల్ల నడంగు నంచు వి
ద్యావిధి నాడె నిప్పలుకు సభ్యులు విన్నదె సుమ్ము తిర్పతీ.

క. అల శృంగభంగమును గృ • ష్ణులె వ్రాసియుఁ జేయి మార్చి శుద్ధులక్రియ నెం
దులకో దాఁగిరి సూ • కో • కిలకాకముకన్న వింతఁ గీమున్నదియే.

---

౪ ప్రశ్న

అయ్యూరి పెద్దపండితుల కీ శృంగభంగ ప్రసంగము నెతలఁ గల్గిన యుద్దేశమెట్టిది.

ఉత్తరము

ఆలమూరు, ౩–7–11.

. . . . . కాకరపర్తి పద్యములు అచ్చుపడినవట. వేదుల సూర్యనారాయణ అవధానులు నేతిపిధాని యిక్కడకు వచ్చి నాతో చెప్పినారు. మీకు పత ప్రతి పంపి స్తానని చెప్పినాడు .. ..మనము కాకరపర్తినుంచి వచ్చిన తరువాతను వారిలోవారికి చాలాకలహములు జరిగినవట. బ్ర॥ శ్రీ॥ సీతారామశాస్త్రులవారు వగైరాలు అంతా "మంచిపని చేసినారుకారు" అని అన్నారట ... అంతా స్పష్టంగా తెలిసినది .... క్రియకు వీరు (అల్లరిసభలోనివారు) యెవరూ సభకురారు .. కా. వీర్రాజు.

చ. చలపతిగారికిన్ దుదిని శాస్త్రిపదంబు దగిల్చి దీని న
య్యలఘుఁడు చేసినట్లు సుమహాత్ములు కృష్ణులు వారసూరులుగా
వెలయఁగఁ జేసి రీ సుడి వివేకు లెఱుంగరె? యెంద తెంద తి
క్కలహమునందు శాస్త్రులయి గ్రాలిరి కాఁకరపర్తినో సఖా!

క. అల్లరిపథ గాదనుటకుఁ గొల్లలుగా శాస్త్రి పేళ్ళు గూర్చి రకట! యీ
కల్ల విజంబుల నాపుర • మెల్ల నెఱుఁగకున్నె? యితరు లెఱుఁగకయున్నన్.

క. వా రెవ్వరి సాక్షులుగాఁ • బేరుకొనిరొ నేను వారిఁ బేరుకొనెద న
వ్వారలలో నొకకొంద ఱు • దారగుణాలు గలరు వారలాడ రనృతముగా.

క. సీతారామమనీషి య • నేతాదృశుఁ డమ్మహాత్ముఁ డెది చెప్పిన వే
దాతిగము తద్వచన మది • గీతార్థముకన్న మిన్న కృతబుద్ధులకున్.

ఆ. వె. ఆమహాత్మునెదుట నల్లరి యొక్కింత
సలుప మొదలుపెట్టి సాఁగనీక
యాఁగె వారిఁ దతని యత్యర్థితత్వంబు
వింత యని వచింప నెవ్వఁ డోపు.

క. ధవళాద్రి సీతరామ • స్థవిరు లవినప్రిల్లదములు తత్సవిధమునం
దవ్విటను సీతారాముఁ • కవినేత వచించు టొప్పుఁ గలవిజ మెల్లన్.

ఉ. సుందరరామశాస్త్రిని పిశుద్ధులు సర్వము చూడలేమువా
రిం దొక కొంతనే యెఱిఁగి యెల్ల విశేషము లెట్లు చెప్పువా
రందఱు సన్నిసంగతుల నారయ రిందొక కొందఱేని యీ
చందము సర్వముగా దెలియసాక్షి పరాత్పరుఁ డొక్కఁడే సఖా

క. గౌరీపతిశాస్త్రి మహో • దారగుణుఁడు వివియె నన్ను వ్యాసానుజ లే
దారను మతించిరో యది • వారక యాసుగుణి చెప్పువాఁడని యెంతున్.

---

## 10 పత్రిక

మొదటి సభకు సభ్యులగు శ్రీసీతారామశాస్త్రిలవారి యావర మెట్టిది.

### ఉత్తరము

బ్రః శ్రీ .... ..వెంకటశాస్త్రిలవారి సన్నిధికి.

ఆశీర్విశ్క సీతారామశాస్త్రి .. .చిరకాలము అయినది తమ దర్శనమునకు నిరీక్షించుచున్నాము. తమరు వ్రాయించిన ప్రత్యుత్తరమును చూచికొని తమరిని చూచినట్టుగానే సంతోషించినాము. .. . ఆః సీః శాః వైశాఖ శు ౧౦ సోమవారం.

ఉ. ఏపున నొక్కసారి మనకృష్ణకవిం గవి సారవేది గౌ
రీపతిశాస్త్రిగారు "బళిరే! యవధానివరేణ్యా! నాకడం
జూపఁగ నేర్తె ప్రజ్ఞ" యన "సూర్యనృపాలుని చెంతఁ దక్క నేఁ
జూప" నటన్న వా డొకటి సూరులు చెప్పఁగ వింటి నయ్యెడన్.

ఆ. వె. అట్టివాఁడు గురుని యాజ్ఞమై నామీఁది
కిపుడు వత్తునని యెనంట! వింతె
యెట్టికూటసాక్ష్యమిది "రాను రప్పింప"
నన్నపద్యమెచట నడఁగెనొక్కొ

చ. యెదుటికి రాకయేగెలిచె నీనను గుర్వవరోధహేతు వి
య్యదన నృపాజ్ఞ నాఁగె నపురా! యని యెక్కడియుక్తు, లిట్టులే
గద యశమున్ జయంబులను గాంచిరపూర్వు! లొకింతకాలముల్
బ్రిదుకని పిల్లయౌ యశము వచ్చిన నే మది రాక యేమగుల్.

చ. కలవల శృంగభంగమునఁ గల్లలుకొన్ని నిజాలు గొన్ని యో
గ్యులు తమ చేయునల్లరిని "గూడదు వో" యని దూఱుమీఁద న
ప్పులుకులకోడి దుర్యశముఁ బాపికొనం బ్రియతించి వ్రాసిర
వ్వల నలశృంగభంగ, మట వాస్తవముల్ జగమే యెఱుంగుతల్. 436

---

## 11 ప్రశ్న.

మాకపనమం దచ్చటి ప్రాజ్ఞులు "బట్టుకవిత్వ" మను నభిప్రాయము కలవారేనా!

## ఉత్తరము

25 — మె 11 (ఇది పోస్టుముద్ర)

..... .....వెనుకనేను తమదర్శనమునకు బందరు వచ్చినప్పుడు ... .(15) ఈ పుస్తకముల నొసంగితిరి. అప్పటికి అనగా నే నున్న రోజులలోనే దేవీభాగవతమును అచ్చువేయుట కిచ్చియుంటిరి. పిమ్మట కొన్నిపుస్తకములు మాగ్రామం వచ్చినవి. . నాయందు సానుగ్రహులై అచ్చుపడ్డ దేవీ భాగవత సంపుటములనున్నూ ..మన్న నున్నూ .మన్నూ ......నున్నూ యావత్తు పుస్తకములునున్నూ దయచేయించ గోరితిని.

చల్లా సోమనాథశాస్త్రి (కాకరపల్లి)

చ. తుది గల పద్దెమం జదువ వోచకవోదు విజయబు గాన నే
విదితమొనర్పనేల యిక వేంకటశాస్త్రి నెదుర్పరారఁ బ
భ్యుదయము గల్గె వంట ! యల యోగ్యుల కృష్ణుల కొర ; యెట్టి నే
ర్పిది యొకమాఱు గెల్చినసుధీశ్వరు డింకొకమాఱు గెల్వఁడే ?

శా. ఏదేశీతివి నల్లరిన్ సలుపఁగా నిద్వల్ పిసాళించు దు
ర్వాదోదగ్రుఁడు కృష్ణసూరి తనదౌ గ్రామంబు నే నేగ దా
యాదుల్ పద్వర లేపి తా గృహమునం దంతర్హితుండై యుండి వం
పాదించెన్ విజయంబు తిర్పతికవీ ! ప్రావీణ్యముగా గంటివే

ఉ. తా సభ కేగుదెంచిన వృథాగఁ దనన్ మఱి నీవు దుర్వచో
ధ్యానము జూపి జుట్టు నొగిఁ బట్టుక గొట్టుచు వంచు వ్రాసె నేఁ
డానరబిన్ నమగా నలుప నాయనయే ప్రియతించెఁ జూచితే
యోసఖ ! "అత్మవ" త్తనెడి యోగ్యులమాట స్మరింపఁ జేయుచున్.

చ పలువురు గూడి యెట్టెటులొ పట్టుక గేలియొనర్చి "నోటిలో"
పల నొగి గుడ్డ కుక్కి" రను వైఖరి యాఁతగఁ గీర్తి గొన్న, యో
గ్యుల సభలేల ! కీర్తికి గొప్ప ప్రయత్నములేల ! విద్దెలన్
గొలిచి పఠింప నేల యివి గూర్పదె కీర్తిఁజంబులోపలన్.

ఆ. వె. అహహ ! కృష్ణకవి గృహాంతరమ్మునుండి
నన్ను గెల్చినాఁడు నాకు శృంగ

---

మఱియొక యుత్తరము.

శతావధానిగారికి— 2-12-10 కాకినాడ.

పుష్పులదడియం వెంకటరామయ్య వ్రాసినది.

క. ఘనవెళ్ళపిళ్ళకులమం । దున జననం బొంది దిశల తుదల యశముఁ జెం।
దిన వెంకటశాస్త్రికి వం । దనములనొనరించి వ్రాయునది యేమనినన్. చ. పటుతర
వాక్యనైపుణి ప్రబంధములన్ రచియించి కీర్తి । కైతవముల నంటజేసిన బుధాగ్రణి
యోరసికాగ్రగణ్య వేంకటకవి । మీదు గ్రంథములకై కడు నంతసమంది పత్రి
మొక్కటి లిఖియించినాఁడ దమ, కాకపి యయ్యది వేగ బంపుఁడీ. చ. "ఇవి"
యవి నామధేయము లిఖించిననాతవు కావు పెజ్జివాఁ డవుగన । వెంకటాఖ్యుఁడ ।
యటంచును మీరు పఠింతు రేమొకో భవతరుణీకటాక్ష విభవాయిత పత్కవికాదురంధ
రుండవు గవ యస్మదీయకృతు లన్నియుఁ జూతు విపశ్చిదుత్తమా॥

భంగమయ్యె ; నెట్టి ప్రాజ్ఞులు పుట్టక
యేమి ; కలియుగంబు నెఱుఁగ రెవరు. 441

ఉ. ఏయెడ నే రెఱుంగకయ యింపెసలారెడి పండితుండు నా
రాయణశాస్త్రి గారకడ నంతయొ యింతయొ నేర్చు శిష్యులే
హహా ; యని నన్ను గెల్చినపు డొండొరుఁ డెవ్వఁడు గెల్వలేఁడు, నా
రాయణశాస్త్రిగారఁట, బృహస్పతియంట ; యెఱుంగుమోసఖా.

ఉ ఇంటనె కూరుమండి యిటు లెల్లజగమ్ము జయించునట్టి బల్
దంటల కాకరం బయి యిలన్ గదుఁ గాఁకరప ర్తి యొప్పుఁ గా
కంటియు నంటకుండ జగమంతయు గుర్తిదిగాఁ దలంచుమన్
బంటుతనంబు చెప్పికొను పాజ్ఞులు వొల్తురుగాక యెల్లెడన్

సీ సూనృతవాదియౌ సుందరరామబుధో త్తముం డెటు లన్యతో క్తి పలుకు
త త్త్వవిగ్రహుఁడు సీతారామబుధనేత యేరీతి నన్యతాన కిచ్చగించు
కనులారఁ గాంచిన మనుఁడు శ్రీవ్యాసలింగమనీషి యేరీతిఁ గల్ల పల్కు
నఖిలం బెఱుంగు బ్రహ్మానంద పండితుం డెందు కాదెడి నిందుకేవియనృత

తే గీ మక్కటా ; నన్ను విద్యార్థి యడుగవలెనె
యల్ల నారాయణమనీషి యడుగఁదగిన
పాటి తెల్వియు లేదె నావద్ద, నింద
కేమి యందురొ విబుధు లే నెఱుఁగవలయు 444

మ ఇది యట్లుంచుము వ్యాపనోదరులత ప్పేర్పాటుగా శాస్త్రిగా
రెద నూహించిన వెంటనే యతఁడు కానెల్లో చనె న్మీఁదఁ గో

---

మఱియొక యు త్తరము.

కాకరపర్తినుంచి

.. .....తమ గ్రంథములరసము యెంతగోలినను అమృతరసము సుకలకుం బోలె తనివి దీరకయున్నది, మరియు తమ గ్రంధములు అన్ని చూడవలె నని యున్నను, శ్లో॥ "అనంతుష్టా ద్విజా నష్టా." యనెడు వాక్యమునుబట్టి యెక్కడికక్కడికినంతసము నొందుచుంటిమి కావున ....... కటాక్షము వుంచి తమ గ్రంధములలో కేవలకల్పితంబును కీ ర్తికంపకమ్మను నయున శ్రీవణానంపమ్మును ..ఈ పదకొండు గ్రంధములు....పంపినచో నామనస్సు తృ ప్తికరంబగును....కట్లుకమవిధేయుఁడు,

. వేమల వెంకట సత్యనారాయణమూర్తి.

వినుఁ దయ్యాలవిశాస్త్రవాయుఁ డిటు చెప్పెం బేర్మి దైవారఁ. బ
ల్కాడి సేయుఁగా బడికోటు లోతిరుపతి ; యాలింపు వాకుప్రిచ్చెదగా.

చ. "సకలము మీదుగీరతము చక్కఁగ నున్నది విన్నవట్టు, మీ
రకుటిలచిత్తు లాతఁ డిటు లజ్జితచే మిము నిందచేసెఁ బు
త్రికుదొసఁగుగా క్షమించు టది తండ్రికిఁ దప్పునె ; మీరెఱుంగరే
యకట, తమూజశిష్యులకు నంతర ముండునె ; యెంచి చూచినన్

---

"—మాయమజాండు విన్నటిదినమున తమవద్దనుంచి తెప్పించిన పుస్తకములు చూచి మాగ్రామములో వారందరు మీదాతృత్వమునకు గ్రంధసారస్యమునకు అత్యంతము సంతసము నొందినారు .. ఇవి మఱివకరికి సాధ్యమగునా ; ఏవో రెండు మూడు పద్యములు అల్లుచు బంధువులు నలుగురు ముగ్గురు వున్నచోట్ల చులకనగు సమస్యలు వారిచేత సీయఁబడి అవి పూర్తిచేసి రాజసభలలో శతావధానము చేసినామను వారలా ; కవులు— నూటికి ఒక గ్రంథము తప్పులతుప్పలతో చేసి —కుకవులు మీగ్రంథములు చూచి తలలువంచిరి సుకవులు తలలెత్తిరి—కొందరు కుకవులు తమతో పైఁబడుపెట్టి పద్యములు వ్రాయుదురు శ్లో॥ మహాగజాః పలాయంతే మశకానాంతు కాకథా" అవి మీ పాండవవిజయములో ఉదాహరించిన సామ్యతను బట్టి గొప్పకవులే పరుగెత్తుచుండే మనము పూరుకొంటే మేలనియయినా బుద్ధి తెచ్చుకొనిన బాగుండును మీశతావధాన సారములో కొన్ని వర్ణనలు పదములుఇటీవల కవుల శతావధానములో కానబడుచున్నవి అపాదములుఇప్పుడు ఉదహరించిన చిక్కువచ్చునవి ఉదహరింపలేము. తమకు పంపుదుము.—నా శిష్యులకు కొందఱికి తెలుగు మనుచరిత్రము మొదలైన గ్రంధములు చెప్పుటకు యత్నించితిని. ఇప్పుడు తమ ప్రబంధములు చెప్పవలయునని కుతూహలముతోయుంటిని "

వేదుల పేరయ్యశాస్త్రి, తణుకుతాలూకా, కొకరపర్రు.

" . తమచే రచింపఁబడిన శ్రవణానందము . గ్రంధములు మా బంధువులవద్ద . చూచి చదివి ఆనందలహరీ నిమగ్నుడనైతిని. కాని తమచే రచియింపఁబడిన గ్రంథముల నన్నిటిని చూచుటకు ఆతురతకలవాడనై యుంటి....యీ దిగువ పుస్తకముల పంపింపుడని ప్రార్థిస్తున్నాను . న్యాయ మని యూహించి దీనితో 0–8–0 అణాబిళ్లలు పంపితిని .."

చర్ల పండుశాస్త్రిగారి కుమారుడు సూర్యనారాయణ,
కాకరపర్రు, తణుకు తాలూకా. 27–11–10

ఉ కబ్బముచేసి శాశ్వతముగా నొనరింపకుఁ డంచు మిమ్ము నే
నిబ్బరమైన పేర్మిని మనీషులఁ గోరెదో నాఁగ నేనునున్
గొబ్బున "నోమహాత్మ ! మిముఁ గోరికమైఁ గనుఁగొంటకున్ ఫలం
బబ్బె యథార్థ మాడితి రహా ! మిము నేమని సన్నుతించెదన్.

ఉ అచ్చునకై నదర్ధ్రవ్యమది యంతయు నష్టమ యౌనుగాక మీ
యిచ్ఛయె నాదునిచ్చ "క్షమియింపు" మటంచును శిష్యుఁడాడినన్
జిచ్చున బుగ్గిగాఁగ నిది చింపి యడంచెద వట్లు కూర్పుఁ డో
సచ్చరితుల్ ! ప్రమాణముగ సల్పెద మీమడి మీఱ శేర్తునే."

*వ అవినఁ "బ్రియత్నమున్ నలిపి యాపయి వ్రాసెద నప్పు నాపుఁ దొ
క్క నెల" యటంచుఁ బల్కి విధిగా నటుచేసెదనంచుఁ జెప్పి య
య్యనఘుని యాజ్ఞగైకొని రయమ్మున నారయ శాస్త్రి గారి ద
ర్శన మొనరించి యాబుధుని శాపనముగా వచియించితిన్ సఖా

---

. అయ్యా తమరు చేసిన పుస్తకములను చూడవలెనని కుతూహల పడు చున్న నాకు తమరీ క్రింది పుస్తకములు పంపింపఁ బ్రార్థితులు

వేదుల సుబ్బారాయుడు

12 ప్రశ్న

గిరతమునం దచ్చటి ప్రాజ్ఞులకు విప్పియను నభిప్రాయము కలదా !

ఉత్తరము

9-7-11, కాకరపర్రు.

" ...గిరతంకూడా యెంత అచ్చుపడితే అంతే పంపించవలెను .. "

చర్ల సీతారామయ్యవార్లు

" ... . గిరశాది గ్రంథములను ముగిసిన వెంటనే పంపించుటకు ప్రార్థితులు."

చల్లా సోమనాథశాస్త్రి.

*"శ్రీ వేదమూర్తులగు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారి సన్నిధికి. ఆణివిళ్ళ సీతారామశాస్త్రి నమస్కారపూర్వకముగా చేయు విన్నపమేమనగా .... తమతో మనవిచేసినట్టే వారితోకూడా చెప్పినాను మేము మానుటయే కాని వారుచేయక మాన రని చెప్పగా, వారు తిరిగి యేమియు చేయరు. మీరు మానవలసినదని చెప్పితిని. తిరిగి అలాగుననే చెప్పినారు. పిమ్మట యేమితోచినదో అచ్చువేయించినారు మీరు చాలా యోగ్యులు, విద్వత్కవులు గాన విశేషించి వ్రాయనక్కరలేను ఇటుపైని మీ యిచ్ఛానుసారముగ చేయవలయును. ఆ॥ సీ॥ శా॥ ఆషాఢ బ॥ గు॥

చ. అదివిని యాశుఁడుంబయికి "పట్టెదెయుక్త" మటంచు శీర్షముం
గదిపి బహూకరించెఁ దదనంతర మాయనయంత నేగియా
పదపడి శాస్త్రకార బుధవర్యునితో సకలమ్ము చెప్పి కో
విదుఁ డతఁ డాచరించిన కవిత్వపుబంధముఁ గంటెఁ బిమ్మటన్.

ఉ. ఈయన యిప్పుడే కలిసి యుంచుక గోష్ఠి యొనర్చినాఁడఁ గా
ర్యాయతి నిమ్మహాత్ముఁడు పదార్థము మున్నరుదేఁడు మేటి సు
శ్రీయుతుఁ డీతఁ డెంతయును జేపగఁబట్టె మనీషి సత్వరా
వాయతనమ్ముగాఁ దెలిపెనయ్య యొకించుక చూచినంతనే

---

13 ప్రశ్న

అచ్చటివారిలో నెవరేని మమ్మును దూషించి చాటుగా వేవేని పద్యములల్లుచున్నవారు కలరా!

ఉత్తరము

కాకరపర్తి

" . ..యెవరో కొంతమందికవులు తమరిమీఁద చెప్పినపద్యములని కొంత రచ్చటచ్చట చదివితి కాని యవి యిప్పుడు నాకుదొరకలేదు. దొరికినచో నేనే పంపించుదును. మీరు నాకు వేరే ఉత్తరము వ్రాయవద్దు. యెందుచేతనన . . ...కావున నేనే దొరకినప్పుడు తమకు పంపగలను. అప్పపత్రికలలోలేని పద్యములు .. . "

వేదుల వెంకటసత్యనారాయణమూర్తి.

" ..... ..తమకు అయిష్టులయినసుకవులు కొంతమంది "కవనముబాగున్నదికా" దని యిటువంటి మొదలైనకొన్ని వాక్యములచే వారికిప్పి మాకున్నా కొంచెము వైరము కలుగుచుండును. మేమున్న ఒక్కొక్కవేళ " తే. గీ. వికటమున మంచి కీర్తిపుట విష్ణుసముగ। అతరికొకులు బిట్టు పెద్దార్చినప్పు। దువధిరాయంచ యూరకయుండు టొప్పు పై పరాకున్న నెందేని జనుటయొప్పు॥ అన్న శీమేశ్వరి పురాణ కుకవినిందను బట్టి సంచరించుచుందుము. ... ... మొదలగు గ్రంథమ్ములు వేను తెప్పించి స్వయముగా చూచితిని వాట్ల యందు నైఁగాని అక్కడక్కడ రసహీనపదంబు లుండును గాని తమ పాండవ విజయ శ్రవణానందాదులయందెచ్చటం గానరావు. ఆరామద్రావిడులలో యింతకీర్తిగల పురుషుఁడు .. .. కలిగినవారిలో కానమని తలంచుచుంటిని.— బ్రహ్మన్నశాస్త్రులవారి యశశ్చంద్రికమ్ము లగుమిమ్ముఁ బొగడుటకు శ్వసనగ్రసనా ధిపునకైన అసామర్థ్యము. ... ..." ఆరామద్రావిడి వేదుల వెంకటసత్యనారాయణ, తణుకుతాలూకా, కాకరపర్తి.

శా. తర్కవ్యాకరణజ్ఞుఁడుగా గవనబంధజ్ఞుండు గీర్వాణవా
క్కార్కశ్య ప్రవిభేది బంధకవితాఘట్టమ్మునం దట్టుఁ ద
య్యర్కుగా బోలెడువాఁడు తేజమున నార్యాచారి యెద్దాన సం
పర్కం బీతఁడు వెట్టికోఁ దఁట; కలావ్యాసంగి వాలాయమున్ 452

శా. వెలనాఁట్యన్వయుఁ డొక్కఁడే వెలయు నవ్వీటన్ మహాపండితుం
డలఘుం డాతఁడు సోమనాధబుధుఁ డయ్యార్యుండు చల్లాకులుం
డెలమిన్ నాసభ లొక్కరెండు గనినాఁ డీసూరి చప్పట్లనేఁ
తలవేరగా దరి లేఁడ యుండినను నీతం డాఁపలేఁ డల్లిక

ఉ. ఈయనయే "యితం డిటకు నెమ్మెయి రాఁ గత"మంచుఁ గొంద ఱం
దాయనమీఁదఁ గొంత విశయంబును బూనిరిగాని యెట్టులో
పోయెను సంశయం, బదియ పోవక నిల్చిన నీతఁ డిప్పరిన్
బాయు నవస్థ వచ్చునఁట; బాపురె; యీపురి కట్టెతింగితే

ఉ. పండితులైనవార లటఁ బల్వురు గల్గియు నిట్టిపల్ల మ
ద్దండులు నాఁగఁజాలరఁట; తాదృశులేగద కృష్ణసూరికిన్
గండరగండఁడన్ బిరుదు గట్టిరి చూడుము "శృంగభంగ" మె
వ్వం డెఱుఁగుగా గృహస్థు ప్రతిభల్ వెలికేగినదాఁకఁ దిప్పతీ;

ఉ. ఇఁక ముగియింతు నీగొడవ యిద్ధచరిత్రుఁడు భాష్యకారశా
స్త్రికి మణిసోమనాధబుధశీతమయూఖునకున్ గృతజ్ఞతం

---

## 14 ప్రశ్న

పాండవాశ్వమేధ విమర్శనము (శతఘ్ని) వెంకటరామకృష్ణ కవులదియే యగునా? కాఁకరపర్తి వారెవరేని యందుఁగలరా?

### ఉత్తరము

ఆకిరిపల్లి, 22—3—11.

" .. .కాకరపర్తియు వెంక— కృష్ణులంచే అత్యభిమానముగ నున్నదఁట; అయూర మణిసబాపురు శతావధానులు గలరఁట. వాండ్రు అశ్వమేధమును విమర్శించుచున్నారఁట గ్రంథము పూర్తియైనదఁట శ్రీవణాసందములో వృద్ధ వేశ్య వర్ణనసీసము "వంది" యనునది స్త్రీలింగ విశేషణమగుట "వందిని" యుండవలయునని యొకవాదము చేసిరి. ఇత్యాదులు పెక్కు అసందర్భము లొకవిద్యార్థితో ముచ్చటించిరఁట. ... "

శివరామశాస్త్రి.

బ్రికటన చేసెకన్ మిగులమున్నవ చేసిన యాజివిళ్ళ వా
రికి మఱి చర్లవారికి మఱింగల సూరులకుఁగా గృతజ్ఞాడఁగా.

తే గీ. భాష్యకారుల కవనంపు బంధములను
వినఁగ నారేయి యొకకొంత వెడలిపోయె
పదప నిద్రించి తెల తెలవేగు వేళఁ
బయనమై యాలమూరికి వచ్చినాఁడ. 457

ఉ పాండవపత్ని నింబలెనె పండితకీర్తిని దక్కరింప నే
దుండగమో పౌనర్పునెడ దూఱువినా ఫల ముండదంచు దీ
శాండుఁ దెఱుంగు నన్యులకు సత్పథముల్ గనరామి వ్యాజ మొ
క్కండును నూఁతఁ జేసికొని కాపథమం దడుగంటుదుర్ తుదిన్.

చ ఇపు డెటులన్న నేమి యగు ? నీతవిదేశకతన్ దదీయశి
ష్యపదవి, కాకకోకిలము, నాత్మకృతిత్వము, మత్కృతిత్వముఁగా
గపటపు శృంగభంగమునఁ గల్గిన కల్లలు నారసూరిగా
రెపుడొ వచింత్రిగాక పరమేశ్వరుఁడే వినుఁగాక సర్వమున్.

ఉ. కోకిలకాకమందుఁ గల కోడిగపుంగతికన్ననుఁగా శత
ఘ్నీకృతియందుఁ గల్గు కడుసీచపుధోరణికన్న శృంగభం
గాకృతి గర్హ్యమైనదియె ! యన్యుని గర్తగఁ బెట్టనేల ? క
న్నాకు శతఘ్నికర్తయల నారయశాస్త్రి యిటుల్ విధించెనో ! 460

ఉ. సూర్యననుగ్రహమ్మునఁ బ్రసూజనగు ప్తివి పాండవుండుగా
నార్యులు కర్ణునిం దెలియరైరి యనంతరమందు డాఁగెనే
కార్యము నేఁడు గుప్తముగఁ గాఁకరప ట్టిదియెల్ల డాఁచుఁగా
కార్యులమూలమై తుదకునంతయునుం బయలెక్కెడిఁగా సఖా.

---

## కాఁకరపర్తి శృంగభంగము.

కాఁకరపర్తి కరతాడనంబు లాంధ్రిదేశమునకు నూఱుయోజనముల మీఁద నున్న కలకత్తాపురమందుఁ జాతీయ వైద్యకళాశాలలోఁ జదువుకొనుచున్న మాచెవులకు, తప్పెట్లమ్రోఁతవలె వినంబడగా దద్దరిల్లి యేమియుఁ దోఁచక, నిర్ఘాంతపోయితిమి ఇక్కడనున్న యాంధ్రివిద్యార్థులలో, గలిగిన సంభ్రమ మింతయని చెప్ప శక్యముగాదు

చ. గురుఁడఁట ! పాండిత్యయుఁట కొండొక యాజయ మిచ్చెనంట ! త
న్కారణపువేషముల్ మును వొసంగక యొదినజాడ దెల్పి న
త్తతి గురువేమి యయ్యెనొకదా యగునా ! గురువెట్టిఁడో తిర
స్కారిణిని నేర్చి యిక్కారణిగా బ్రతుకుండని తోఁచెఁ జూపెనో !

---

మ. కవులీలోకమునందుఁ గల్గరె ? దమిన్ గాల్ చివ్వకుఁడా దర్వివ్వరే ! యవు గాదంచనఁ జాలుపండితులు మధ్యస్థంబుగా నుండి న ! త్కవి యితండని చెప్పరే బళిరె ! యీకార్వల్లి గ్రామంబునన్ ! గవులో మూకవులో యొనర్చువవి యేకాలంబు నన్ గంటిమే ఉ జబ్బును పట్టికూర్చి యెకసక్కెము లాడుచు "శాస్త్రిగారు మీకబ్బిన సాహితిన్ గవన మందఱు మెచ్చఁగఁ బైట వేయుఁడీ ! విబ్బరమేమొచూతు" మన నేరిమి గల్గిన వేంకటేశుఁడా ! దబ్బఱ గాండ్రఁ దప్పికొని దాఁటుట పాటియె గాదె చూడఁగన్ సీ శాస్త్రార్థమునఁగాని చప్పట్లఁ దేలునే వ్యాకరణమున నస్తోకగరిమ ! సుకవిత్వమునఁగాని యెకసక్కెముల దేలునే కవిత్వమునందు నేర్పుకలిమి ! అవధానమునగాని యల్లరిఁదేలునే ధారణాశక్తిలోఁ దారతమ్య ! మనసూయతనుగాని ఘన ఘోషమునఁ దేలునే యొండులొండుల యెక్కువలను ! గీ. కాకిమూఁకలు యట్లుఁ గేకలిడుచు ! గెలిపేసిన యంతనె గెలుపుగలదె ! ఇట్టిగెల్పునుజాట సిగ్గెలలేదొ ! బళిర యియ్యదియే శృంగభంగమాయె చ "జరుపుదుమేము సత్సభను జయ్యనరం"డన రాక "మీరలే ! జరుపుఁ"డటన్న మార్పలుకఁజాలక, యొక్కని వేంకటేశునిన్ ! దఱి గనుపెట్టి పట్టి కరతాడన పర్వము సల్పిరంట హా ! యుఱుకఁగ లేక నాకు నితఁడోడె "బలాదు"రటన్న చాద్పునన్. ఈ వారును వీరుమాకు నొకవైఖరివారలె, వీరిలోన నె ! వ్వారిని నేరు గెల్చినను వారికి వారికిఁ జాలినట్టుగా ! గౌరవమేము సూపుదుము, కానిపనుల్ వొనరించువారలన్ ! దూరకమాన మేరయినఁ దోసము లోకమెఱుంగునట్లుగన్."

ఇట్లు సుజన విధేయుఁడు,
దంటు సుబ్బావధాని,
191 బోబజారువీధి, కలకత్తా 13—9—11.

(శృంగభంగమును గూర్చిన మంచిచెడ్డలను విమర్శించుకొనుటకై చదువరులకుఁ గొంత యాధారమునకై యాయా యాయుత్తరములు మొదలైన వుదాహరింపఁబడియె. గ్రంథవిస్తరభీతిచే వింకను బెక్కులున్నను వవి వదలఁబడియె. ఈశృంగభంగము మొదటనేదోరీతిగా పచ్చాత్తించి పదపడి దేశమాతలోఁ బ్రకటింపించి పిమ్మట వారి కవితా పత్రికలోనే ప్రకటించుకొనిరని యెఱుంగునది )

చ గురువిపసన్ గనుంగొనఁగఁ గొందొక చూతము గాక యీతఁడే
నరవరునాజ్ఞ నాఁగు నెడ వాటక మీగతి గట్టనేల ! త
స్కరణపుఁద్రోవలన్ యశము గైకొనఁ గోరఁగ నేల ! శిష్యుడున్
గురువునుగూడి సత్ఫలము జనుదేనగునాఁడె శ్రీపతీ. 463

చ గురుఁడు యథార్థమున్ దెలుపఁగోరెడివాఁడె గురుండునాఁగ న
ల్లరి పను లాచరించిన నలందురువాఁడె గురుం దనన్ యశ
స్కరుఁడె గురుండునాఁ దనకు సద్గతి చూపినవాఁడె యెల్లరున్
గురువులె యెల్లరున్ హితులె కోవిదులే కలవేశ నోసఖా.

చ గురువన నేమి ! సత్యమునకున్ జవదాఁటనివాఁడె, నాణెపుం
గురువననేమి ! యల్లరులకున్ మునమందనివాఁడె, నిక్కపుం
గురువననేమి ! దోసమునకున్ దెరువీయనివాఁడె, యెల్లరున్
గురువులె యట్టులేని యలగుష్మడికాయఁ బగిల్చి చూడుమా 465

చ అకపటులైన శిష్యులకు వట్టియశమ్ములె గల్గుగాక నేఁ
టి కపటు లిట్టికీర్తినె గడింతురుగా కది శాటియూకు ద
ళ్లకరణి వెంటనే దుపికిలంబడుఁగాక సదా యథార్థవ
ర్తికి జయమో మహోక్కటియొ తీఱని దప్పెదుఁగాక యేకమై

---

## (13) శాఖాచంక్రమణ పర్వము.

రిజిస్టరీ ఉత్తరమునకు సరియైన నకలు.

| | |
|---|---|
| దివాకర్ల తిరుపతిశాస్త్రి. శతావధానిగారి వద్దనుండి | శ్రీ వేదమూర్తులయిన చర్ల వెంకటచలపతిశాస్త్రిగారికి- |

ఉ. చూచితి శృంగభంగమునఁ జూపఱు నవ్వఁగఁ జిత్తమందు సం
కోచమొకింతయుం గనక కొంకు వహింపక జంకులేక మీ
కీఁచురవంబు గన్పడ లిఖించిన యా యనృతంపువ్రాత; దో
బూచులకున్ భయంపడునె భూతము లక్కట ! భూతలమ్మునన్.

ఉ. కాఁకరపత్రికో నఁట ! జగంబుబు మెచ్చ శతావధాన సు
శ్రీకతనన్ బ్రతిష్ఠ పఱచురించిన వేంకటశాస్త్రి కెవ్వరో
యాకవిరాజ శిష్యపరమాణువు డీకొన మూలమూలలం
దేఁకిన పాఱుబోతఁట ! యెదే నొనరించె నఁటెంతవింతయో ! 468

ఉ చుక్కలు రాలలేదు రవిసోముల పోకడ మారలేదు న
ల్దిక్కులు కూలలేదు జలధిజ్వలనం బుబుకంగలేదు నేఁ
డక్కట! రామకృష్ణకవు లర్భకు లేగతి వేయనేర్తు రా
ధిక్కృతవైరి వేంకటసుధీకవిమౌళికి శృంగభంగమున్.

ఉ పేర్మిలిన గీర్తిరా దనృతపిష్టము మాటినఁ బూర్తి కాదు రాఁ
జాలిసరమ్ము మీకవుల సంబరముం గెలిపించుకొమ్ము బిం
కాలకు బంకువారమొకొ కాఁకరపర్తికిఁ గీర్తితెమ్ము, పీ!
జాలమికేల వేగమొక జాబు లిఖింపుము వచ్చి వ్రాలెదన్.

శా మున్నే కోరితి రామకృష్ణులను "మమ్ముక్ గెల్వ రండంచు" వా
రెన్నెన్నో లిఖియించి "యేసభకు మే నేతేరలే" మంచు మే
ల్కొన్నా రేటికి నీకు నీ దురద వీలుంజాలు లేకుండ న
ట్లున్నన్, వారలఁ గూడి నేఁడయిన నాయుత్సాహముక్ దీర్పుమా.

ఉ, కాఁకరపర్తి యొక్కటియ కాదు, జగ మ్మఖిలంబు నేకమౌఁ
గా కల రామకృష్ణులకుఁ గల్గునె శ్రీపతి వేంకటేశ్వరా
స్తోకశతావధాన కవి ధూర్వహవివ్యతర ప్రతిష్ఠతో
డీకొనుశక్తి ? యయ్యది ఘటించిన మాకును మోదమేకదా!

సీ రామకృష్ణులు సభాస్థము పిల్వలే దంచుకొఱకు వేంకటశాస్త్రి యడుగలేదు
చుట్టాలతోఁ జెప్పి చూడ నేతేర మీగాత్రిమమంచున్న శ్రీరామసేన
యూరి గౌరవమును నూరిలోనున్న పెద్దలగౌరవంబును దలఁపకుండఁ
జప్పట్లపర్వంబు జరిగించి యెక్కసక్కెములాడుకొనుచుఁ బ్రశ్నములువేయఁ

తే గీ దగినటులు చెప్పుటయెకాక తగునె యచట
యోగ్యతములకు బుజారీతి నుత్తరంబు
పొంగుచును నంతలో "శృంగభంగ" మనుచు
గోల గావింప మీకు సిగ్గేలలేదు?

ఉ గోణము కట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వ దుపీ
వేణిక యొమఁ బేర్పడిన వేంకటశాస్త్రికి "శృంగభంగ" మన్
వాణి వినంబడం బ్రజలు నమ్మరు చింతవహింప రింతకుం
బ్రాణముతోడఁ బంపిరి మాతల్లి మిమ్ము మతింతుర్ని విచ్చలన్.

ఉ. ఆతఁడొకింతె వో, సభకు నాయకమై గెలుపొందుఁగాక మీ
చేతులలోనిదే కలము చెప్పునటుల్ వినువారు సభ్యు లే
సేఁతలు సేయలే రతఁడు చేసిన దంతయుఁ గప్పిపుచ్చి యే
వ్రాఁతలు వ్రాయలేరు గుణవంతులు కాఁకరపర్తి పండితుల్ ।

సీ. ఎందేని సభసేయు నేర్పాటుఁ గావించి సభ కొక్క-యోగ్యు నీశ్వరునిఁ జేసి
రామకృష్ణులచేత "రం" దంచు వ్రాయించి మీరేగుదెం డారుబారు మనుచు
శృంగభంగము శిరశ్ఛేదంబొ కావించి తిరుపతి వేంకటేశ్వరుల రామ
కృష్ణకవులచేత గెలిపించి తెందు కాఁకరపర్తికి పెద్ద గౌరవంబు

గీ. ప్రాజ్ఞులున్నారు కవులు విద్వాంసు లున్న
వారు భూపతు లున్నారు వారువారు
పంతసింపఁగఁ జేయుఁ డీ సాహసంబు
నందుకొనుఁడయ్య యివియె నా వందనములు

కాకినాడ,
26-7-11

దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని

ఈ రిజిష్టరుత్తరముపై నేవో కొన్ని వికటపు మాటలతో "సత్యసందేశ"మను పేర రిజిష్టరుచేసి పంపితి సత్సభకు సంబంధించిన యుత్తర మందు లేమింజేసి దానికిఁ బ్రత్యుత్తర మీఁగఁబడదయ్యె. పిష్టపేషణమని యెంచి యది యిందుదాహరింపలేను దాని సత్యాసత్యము లుపోద్ఘాతమున నింతక విమర్శింపఁబడినవి అందుఁ జూడఁదగు

(14) పాశుపత పర్వము

తే గీ సత్సభ యటన్న రం డవఁజాలరైతి
రల్లరి యొనర్చువారల కన్నలైతి
రౌర ! ధీరులరై గడేకాతిపదవి
కాన చేసితి రేమందుమయ్య మిమ్ము.

శా. నారం బన్నను గూపపీరముమ, నెన్నం గప్ప లందెందు పం
చారంబున్ జరిగించుచుం శ్రోత్రికటుల్ చాలఁ బ్రినంగించు నా
దూరావం బిడ నేర దేరికిని సంతోషంబు, నారాయణా
ఖ్యారూఢిన్ బ్రకటింతురే యకట ! యే యారావమో సేయుచుం.

ఉ. "పుట్టె నెటో స్వకాళి విది పో దిఁకఁ దోఁటకుఁ జేటు తెచ్చు నీ
చెట్టనెఱింగి రక్ష విడి శ్రీయము గూర్పుము మీకుఁ గీ ర్తి" యం
చెట్టులొ వేను జెప్పుటకు నెంచిన వల్లరి జేసి విందలం
గట్టినయంతనే యశము గై కొన నేర్తురొకో యనామకుల్ ।

† సీ. నాల్గుకాశ్రమంబు నున్నతిగన్న వెంకటసుబ్బశాస్త్రిల వచశ్శ్రీలఁగన్న
ఆశ్వాసకవియు భాష్యాంతవేత్తయు నైన రంగార్యు వాక్ప్రసారంబుఁగన్న
పన్నెండాశ్రమంబు విజ్ఞత్వమ్ము గల వానమామలస్వామి వమ్మతులఁగన్న
మఱియునెందఱొమహామహులు మెచ్చియొసంగుజయ పత్రికానముదయముఁగన్న

తే. గీ. మిన్న యగునొక్కొ మీ వ్రాయు చిన్నతనపు
శృంగభంగపు వ్రాఁతలు చెప్పవెప్ప
వెంకన యశమ్ము నకు నివి మీనమేవి
లోటు దెచ్చునె నీకు వల్గతయె కావి. 480

శా. ఆయాపండితవర్గ మిచ్చు జయపత్రానీకముల్ వోయి మీ
దాయల్ మీరున వ్రాయు కుచ్చితపు వ్రాతల్ బైటికే తెంచి "హీ
హీ!" యంచున్ నను మీరుమంబలెనె యేరే వన్నెఁ జూతున్. వృథా
హేయంబుల్ పచరించు మిమ్మదుగ నా కేలా ! యసద్వాదులన్ "

చ. ఎఱిఁగియు నివ్విధోపుజను నెవ్వఁడు మేల్కొనఁ జేయుః వేంకటే
శ్వరుబలెఁ గొన్ని కబ్బములు వల్కి వధానము లాచరించి కొం
దఱు బుధవర్యులన్ గని యనంతర మాతనితోఁడఁ బోరునం
బరమున కీయకొన్న బుధవర్యులు మెత్తురె మీ ప్రయత్నమున్

ఉ. మీర లుపాయశూన్యులటు మేకులు చెక్కిన శృంగభంగమున్
గాఁబుగ వ్రాయువారె యది గాంచిన తోడనె "క్రోధమూర్తికుల్
దూఱనకై దురుద్యమముతో నిది కూర్చి రిపీ !" యటంచు నే
మోఁటకుఁదేని లో నొగులు మోసపువావన గొట్టు నామమే

మ. చరితం బ్రాయుటో ! దుఃఖముం దెలుపుటో ! సత్యంబు వాక్రుచ్చుటో
గరితల్ వోలె గృహమ్మునన్ మడఁగి యీకాఱుల్ ప్రసంగించుచో
ప్పరయన్ మాటికిఁ గాక కేవల మసూయామాత్రపర్యాప్తమై
విరసత్వమ్మును దెల్పుచున్న దిటువో ! విఖ్యాతి నార్జించుటల్

† ఇందలి పండితుల ప్రశంసలు శతావధానసారమునఁ జూడఁదగు

శా. తోలుంబొమ్మలయాటగా "నెవనినో దోకొంచు నేతెంతు మా
బాలు న్నీ వెదిరించెదే" యనిన వాక్యాలుం దెవం డంచు నే
నాలోచింపనె, వాఁడు నాయెదుట కేలా వచ్చు? నామోము వాఁ
డేలా చూడఁగలాఁడు, నే నెఱుఁగనే యీ గారడీవేషముల్ ॥

*గీ. "రాను రప్పింపఁ బవి గానరా" దటంచు
వ్రాసి ప్రకటించినట్టి యాబాలసుకవి
యతఁడు గాఁడొక్కొ రానేల యిచ్చగించు
వల్లరికిఁ గాకయున్న నారయఁబుధేంద్ర ॥

తే. గీ. అతివిశక్తి మీశక్తియు నఖిల మెఱుఁగు
వాఁడ వీజన్మమంతయు వ్యవధి మీకు
పత్రికకు రండు విల్వాండ్రు చాలు; నోరు
మెదప నక్కఱలేదు మీచదువు తెలియు

సీ. దాతృత్వమునఁ గర్ణు వాఁటినాఁడను పేర్మిగాంచువాఁడు యశమ్ము నింపువాఁడు
అఖిలవిద్యలు చూతునని ప్రతిజ్ఞవహించి నెగడువాఁడు బుధాళి పొగడువాఁడు
తారతమ్య మెఱుంగఁ దగుపండితుల చేత మెలఁగువాఁ డహితంబు తలఁగువాఁడు
విద్వాంసుఁడను పేరు విన్నంత నానంద మందువాఁ డాశీస్సు లొందువాఁడు

తే. గీ. రావు వెంకట శ్రీ సూర్యరాయవిభుని
మ్రోలఁ "జాల" మటంచు మీబాలు డనర
యేని యామేటి యేటి కుపేక్ష సేయు
నాఁసి వచింపుమయ్య యో నారయార్య ॥

సీ. అచ్చులోఁ బొరఁబడ్డయక్కరమ్ముల నేరి దోషమ్ములను విజిగీషులార
భారతాదుల వాడఁబడినలక్ష్యము లెఱుంగక కుమ్ములాడు మేటికవులార
ఎవరి నేతప్పు పట్టవలెనో యెఱుఁగక పత్రికల్ చెఱచు సర్వజ్ఞులార
భానుపైనిఁ బరాగపటలిఁ జల్లఁగఁ జూచుపోల్కి చేకుఱినవిద్వాంసులార

తే. గీ. యింటఁ గూర్చుండి మీచిత్తమెట్లు వచ్చు
నట్లు గొప్పలు చెప్పుకొం డంతెకాని

* "రాను రప్పింపఁ బవిగానరామమాకు" అను పద్య మప్రస్తుత ప్రశంసలో ముఖపత్రమునందు జూడఁదగు.

పత్రికలకు విమర్శనల్ పంపకుండు
మీరహస్యంబు బయలెక్కు- మేలుకొమ్మఁడు.

చ. అదె చనుదెంచెఁ * బాశుపతమందుఁ గృతఘ్నుఁడనుఁగా శతఘ్నులుగా
బడుమచెదుగా మహామహుఁడు పార్థుఁడు ము న్నది వాడెదాని కి
వ్వదనుడయుంచె గౌరవమహాహవ మిత్తఱి నత్తమిల్లుటగా
గుదురుమఁగాక యాశరము కూర్గిరగవీపటాలావలేపముల్.

ఉ ఇంటనె దాఁగి కృష్ణకవి యేవియో ముగ్గులు వెట్ట నేరినో
కొం'పెల వంపి మీరలను గోల యవారిగఁ జేయఁజేయ నే
నొంటరి నేమిసేయఁగల "హహా" యిఁక లెండన నెట్టు లేరు మీ
దంటతనంబు లయ్యెడఁ గదా! ప్రకటింపవలెన్ మహోదయుల్.

ఉ అల్లరికేమి యెట్టులనొ యజ్ఞతమై ఘటియింపవచ్చు మీ
యుల్ల మె సాక్షిదాని, కది యూరక వో దని లోన జంకి యే
కల్లలొ కొన్ని వించి యొకకబ్బముకూడన! దాని వెంటనే
వెల్లడిసేయుటా! యకట! పే రిఁక దానికి శృంగభంగమా!

చ. ఇది యటులుండనిత్త మెటులేని యశమ్మును గోరు మీర లా
ప్పిదముగ వింటనుండ కెటు పిప్పిపర్విసంగముగా శతఘ్నికన్
గుదిరిచినార లాపదను గోదు సమస్తము వెళ్ళఁగ్రిక్కు- మీ
కెదియును రాదు నిక్కి- మవి యేర్పడఁ జేసెడి దానిపోకడల్.

ఉ. అందునఁ దాము లే మనెదరా, యది మీపుర మొప్పికోదు నే
నందుకె వచ్చి మీ నలుపునల్లరి చల్లఁగ నోర్చినాఁడ మీ
పెందల సున్నసంగతి యథార్థముగాఁ గని పెట్టినాఁడ మీ
నిందలకెల్ల సైఁచితి గణించితి పట్టియమూల్యతత్త్వముగా.

ఉ శబ్దజ్ఞానము నాకె యున్నదియొ విచ్చల్ మీకె తా మన్నదో
యబ్దంబుల్ మఱి యెన్ని నాదుకడ శిష్యత్వంబు గావించుపై
శబ్దజ్ఞానము సుంత కల్గెడినొ యీసందర్భమే తెల్పు "హహా"
శబ్దజ్ఞానము పైపయిం గలదె! వాచాటూఁతల్ కూడునే!

చ. "పలుకఁగవచ్చు నూ తొకటి వ్రాయుట శక్యముగా" దటన్న యీ
పలు కెపుడేని మీమదికి వచ్చెనె యూరక గేలిసేయు నా

* "పాశుపతము" ఇది వారి శతఘ్నికిఁ బ్రత్యుత్తరము

పల మెదిరించెదిన్ గడచుపౌర్జిజ్ఞత యుండినఁ గాచికొందు పే
రలుత వహించినట్టిఫల మందుఁడు యాత్రికిఁ జాల కుండినన్.

ఉ. అల్లరిపేయ నేర్చిన కలార్థుల తో దిట పొఁగిరాదు వి
ద్వోల్లసనంబు గల్గ మహయోగము సేకుణు లేవిచోఁగడుం
దల్లడపాటు పైఁబడు వృథా యొనరించిన వాగ్వ్యయంబు మి
మ్మెల్లవిధమ్ములన్ గడకు నింతకుఁ దెచ్చె లభింపుఁ దీపయిన్.

చ. ఒదలి బలమ్ములన్ గెలువ సాహసయోనర్చితి రీరబంచు నా
యెదఁద నెటో గ్రహించితి వహించితి నావయి మీరు శిష్య లే
గడబిడఁ జేసుదన్, దెలియఁగాఁ బడెనే యిపుడేని మీకు నా
యెదఁదతెలుంగు ? పాండితి వొకించుక పాటవతంబె తెల్పెడిన్.

తే. గీ. ఏకవచనప్రయోగాన నెక్క సక్కి-
యముగ "పీకు శబ్దజ్ఞాన మకట లేదు
కవిత యింక నేట్టు" లనుమాట జ్ఞప్తియందుఁ
బెట్టుకొని యుత్తరమువ్రాసి పెనఁగుఁడింక.

ఉ. వేంకటశాస్త్రినైపుణి వివేకు లెఱుంగనివారు కారు మీ
లెంకలు మీరుఁ దుల్యులని లేకియుఁ గూడ వచింపఁ దట్టవో
లెంకల నంపి నన్ను నదలించెద రెంతటిసాహసమ్ము మీ
కంకఁగఁ జేసె దేవుఁ ! డిపు డాతఁడె యడ్డెడుఁ గాక మీకమై.

తే. గీ. కూపకూర్మప్రసంగముల్ గూడవిచట
చప్పటులు గొట్టుటలు కొనసాఁగ విచట
వట్టిప్రల్లదములు వనకట్టవిచట
పాండితియు నైపుణియు మంత పలయుఁ జాండ్.

ఉ. వెంకటరామకృష్ణ లతివీరులు వాండ్రి నటుంత నిందు మీ
శంకల కుత్తరం బొసఁగి జాడ్యము వాపుట ప్రస్తుతంబు గా
వేంకటశాస్త్రి పూనె మును వేగిరపాటున నైచినట్టియా
రంకెలు పొఁగిరావిచట వ్రాతయవన్ బలిఁ గోరెదం జాఁడీ.

చ. దయగలదేవుఁ డెట్టులో శతఘ్నిని వ్రాయఁగఁ జేసె మిమ్ము మీ
చెయి వచియించు మీ చెయిది చెప్పకయే, జగ మక్కటాన నె

మ్మెయి గ్రహియించు వెంకయకు మీకును గల్గినవార, యోర ! యే
రియశము లేరి కబ్బెడు, వరించునె గీర్తులు తమ్ము తామయై.

చ. ఒడలిబలమ్మునన్ గెలుతు రొప్పిరి, నందుని గూడ దిర్పతిన్
దడబడ గొట్టుఁజాల రొకదద్దదదిందక పట్టు బట్టి నన్
గెడపుమ రట్టిపట్టులకుఁ గేవలవిద్యకు నేడకేడ ! యీ
వెడఁగుఁదనంపుఁదోవలు వివేకులు నేర్తురె కీర్తినిత్తురే.

చ ఇఁకఁ బ్రియతించి పాశుపత మెట్టులొ త్రిప్పికొనుండు దాన మీ
కవిలుపమైన కీర్తి యగు నందుకు జాలరయేని నన్ను మీ
రొకరె హసింపఁ బండితు "లహో" యని యెల్లరు మిమ్ము నవ్వి "హ
స్తికి నలదోమ యెక్క' దని తేల్తురు సారము బీర మేటికిన్.

సీ చర్లనారాయణశాస్త్రియు నాకుండి వ్యాసమూర్త్యాఖ్యమహాకవియును
అల్లపురాణపండాన్వయాభరణంబు మల్లయాఖ్యుఁడుదేంద్రితల్లజుఁడును
వెదకి తప్పులు సూప వెంకటరామకృష్ణకవీశ్వరుల్ కృతజ్ఞత్వనిధులు
వెంకటసూర్యరాడ్విభునేలుబడి నుండి మానాటకమును సమ్మదముకల్మి

తే గీ పాఠొనప్పఁ బ్రియత్నించి పంపినట్టి
యలతతప్పని జూచిన యనఘులెల్ల
మరల మా పాశుపతమును దఱచిచూచి
గుణవివేచన మొనరింపఁ గోరువాఁడ.

*ఉ "అంక మొకింత గల్గని మహాత్ముఁడు వ్యాసమనీషియున్ విరా
తంకుడు మల్లసూరియును దక్షుఁడు యోగ్యుఁ డుదారుఁడైన శ్రీ
వెంకటసూర్యభూవిభుఁడు' పేర్రకులంచును వారివద్దనే
కొంకక తెల్పు నే నొకవిఁ గ్రొత్తగఁ జేర్చితిఁ జర్లచంద్రువిన్.

ఉ ఈయనమే వనున్ మిగుల హేళనచేసిన బుద్ధిశాలి నా
రాయణశాస్త్రిగారి కెటులైనను జ్ఞానము కల్గనేవి ల

*ఉ. అంక మొకింత కల్గని మహాత్ముఁడు వ్యాస మనీషియున్ విరా ! తంకుఁడు మల్లసూరియును, దాతలు నేమము చూపుచుండఁగా ! వేంకటసూర్యరాయప్రభు వీర మణుం డనుకూలుఁ డేలఁగా ! వేంకటరామకృష్ణకవివీరులగారపుబిడ్డకైత కర్గంకులు వల్కు పోటపలు దాగఁక లోఁగకయుండు కెట్లగున్ ॥

(కవిత 1911 సం॥ 10 సంచిక)

జ్ఞాయతి పిట్టివ్రాత లడుఁగంటు నటంచు మదిం దలంతు న
న్నాయన గేలిసేసినను నాయన కేసువచింతు నొప్పులన్.

ఉ. తప్పొకఁ డాచరించితిరి దానిని గప్పికొనంగ నెన్నియో
తప్పు లొనర్చుచుంటిరి వృథా సుఁడి మీ రొనరించుయత్న మే
మొప్పెయు మిమ్ము మెచ్చఁడు "నమోనమ" యంచు వచింపుఁ డెందుకీ
తప్పుడుతోవ లెందుకుఁ గృతఘ్నశతఘ్నులలోన దూఱుటల్ 509

సీ. శృంగభంగమటంచుఁ జెలరేగి తప్పుడువ్రాఁతలు ప్రకటింప వచ్చుఁగాక
ఆటిముటిఁ బొరిఁబొరిఁ బరపురమై గురువరుని బ్రివ్వఁగఁ దిట్టవచ్చుగాక
చాలుమూలములేక శబ్దార్థములు తప్పువట్టి పత్రిక నింపవచ్చుఁగాక
చదువుకొంటి నటంచుఁ జక్క వ్రాయుచుఁ దల్లిపై వసంతముచల్లవచ్చుఁగాక

గీ. "హూ" యనఁగ వచ్చుఁగాక. యేమోయనంగ
వచ్చుఁగాక, రెండును పీడవచ్చుఁగాక
పైని మూఁటి జయింపఁగా వచ్చుఁగాక
పాశుపతమును ద్రిప్పఁగా వచ్చునెట్లు ?

ఉ దిక్కులనెల్ల నాత్మ గురుతేజము నింపి దివాకరుండు తి
ర్యక్కులకందరాని గగనాంతరసౌధపుఁజంద్రశాలపై
నెక్కు తఱిన్ శతఘ్ని యొకఁ దిట్టులె రోజును రోజు పేల్చు నే
తుక్కనొ మూర్ఖతుష్టికయి "తుస్ తుసు తుస్సు"ని వెళ్ళఁగ్రక్కుచున్

ఉ పాశుపతాగ్నిహోత్రమున భగ్గున మండి వెలింగి బూదియై
రాశికి రాక దూళియుఁ బరస్పరమేళన లేమి బ్రింగఁగా
నాశనమయ్యె దానికి వినాశనకాలము మూఁడి మున్నె మీ
యాశలతో శతఘ్ని. యిఁకనైనను మేల్కొని మేల్కొనందగున్

సీ నావల్లనే మీకు నామరూపమ్ములు వచ్చినమాట ధ్రువంబయేని
నాకున్నశక్తిలో మీకున్నశక్తి యెన్నవవంతుగామి సత్యంబయేని
కపటవర్తనుల హృత్కాలుష్యములు భగవంతున కెఱుఁగంగ వచ్చునేని
పనిపాటలను వీడి పరుల గుణాగుణములు సూచువా రిలఁ గలరేని

తే. గీ ఎందులకునేమ వ్రాయుట ? యెల్లకల్ల
నిజములవి వానియంతనే నెగడు. నట్లు
కానినాఁ డేమ గష్టించి కలదె ఫలము ?
వ్రాసికొనుఁ డింక మీయిచ్చవచ్చినట్లు.

## (15) ఉపసంహారపర్వము.

ఉ ఊరకవార్తయు మంటి నొకయుత్తర మంతనసీమపొందితీ
పారమునెల్ల, జూపి తలవారలపై నభయన్నచో గడే
కారులుకత్తురయ్య ! గుణగణ్యులు పేతురటయ్య యల్లరుల్ !
చోరులు తోర్రివఁగాచునెడ శూరులొ, వేతొకవట్ల శూరులో !

తే.గీ నభకు రాఁదగువారలు శాస్త్రవిదులు ! కొందఱప్పురి నున్నారు కొంతవఱకు
వారి దెల్పియె యుంటి నవ్వారికొఱకె ! చనవలపె సత్యసంధు లాఘనహృదయులు.

తే గీ. తజ్ఞులగు వారివారి య త్తరములందు ! చెఱఁగ కవ్వారి పేర్గూడఁ జెఱవఁదంఁచి
తమకుటుంబమ్ములోఁజేర్చి దబ్బఱలను ! మన ప్రబుద్ధులు ప్రకటించికొనిరి కంటె?

*చ చలపతిశాస్త్రిపేరను రిజిస్టరు పత్రిక నీవు పంప లో
పల దిగులంది యాతఁడు "కృపన్ క్షమియింపుఁడు త"ప్పటంచు వె
ల్వెలబడుచుఁ లిఖించి పయిపేరును వారును భీతిమాన్పి యె
గ్గులిఖియింప దాని పయిఁ గొండొక వార్తలొనరించెఁ గంటివే.

గీ "సత్యసందేశ"మఁట దానిఁజదివియుందు ! వదియుఁగవిత యె ప్రకటించెనంతఁబోక
శృంగభంగమ్ముగూడఁ బత్రికను జేర్చి ! కొనిరి బయలమ్యోబాబార గుట్టుకంటె !

ఆ వె ఎవనివార్తలొ చేసి యేదకో రమ్మని ! వ్రాయనేల ? సభకు వచ్చుశక్తి
తమకు గల్గియున్నఁ దమరె వ్రాయఁగ రాదె ! యింతమాత్ర మెఱుఁగదే ! జగంబు.

ఉ ఇంతటి బుద్ధిమంతు లని యిప్పటికేనియు నీకుఁ జక్కఁగా
నుంత యెఱుంగఁగాఁ బడెనె కుంతలచేతఁలు పత్రికఁ సుధీ
కాంతులు గొందురే ! తమకుఁగా లిఖియించిన పాడువార్తఁతగా
నెంతురు లోకులం చెఱుఁగ రేమన వచ్చెడి వారి చెయ్వులఁ !

ఉ. ఏదియొ గిల్కుచుందు రది యెవ్వరొ మెచ్చుచునుంద్రు వీరికిఁ
లేమ సుబుద్ధి వారలకు లే దది యంతకుమున్నె, మద్యశ
శ్శ్రీపరి కేగ నీమరుకుచేఁతల కేమధికార ? మెట్లొ వా
పోదురుగాక యీ చెనఁటి పోకలు లోకులు విశ్వసింతురే

చ. ఎఱుఁగని వారి వ్రాఁతలకు నేదియు నుత్తర ముండఁబోదు స
ద్గురుపద పంకజమ్ములను గొల్వఁగ నేరక తప్పువార్తఁలన్
బురపుర వింపి పత్రికలు పుచ్చెడిశిష్యుల పై ఁపుమయ్య కాఁ
కరపురిలోని పెద్దల మొగమ్ములనై నను జూచి శ్రీపతీ.

---

* ఈయన క్షమాపణయుత్తరము 76 వ పుటలోఁ జూడఁదగు

ఉ. శ్రీపతి నీవు నీకవిత నీత విశుద్ధచరిత్ర. యాపె ౩
ట్లో నవిఁబూని యెవ్వరో జిడుల్ దొనఁగుల్ వొనఁగింప నెంచఁ ద
ద్వ్యపృతి నాఁగఁగా మొదట వా రెవరో యెఱుఁగంగఁ గోరి నే
నాపురి కేగితిం దెలియ నయ్యె వొకింతన వారిపోకడల్.

ఉ. సీతమజాడ రామునకుఁ జెప్పఁగఁబోయిన వాయుసూతి తా
నాతఱి నయ్యశోకవనమం దొనరించినకృత్య మేమి । యా
దూతమనమ్మువం దపుడు తోఁచినయూహయె నాకుఁ దోఁచెఁ బ్ర
ఖ్యాతికి మూల మైన నగుఁగాక మఱేం దగుఁగాక శ్రీపతీ.

ఉ. పట్టిరి కొట్టి రయ్యవిలుపట్టివి బిట్టుగ బోఁకుముందఱన్
బెట్టిరి తోఁక కాల్చిరి బిభీషికలన్ గవఁజేసిరిన్నియున్
బెట్టిదముల్ సహించి యల వీరుఁడు గుట్టు నెఱింగి రాఁడె? యా
దట్టువితోఁవఁ బట్టితి యథార్థ మెఱింగితి నెట్లొ వచ్చితిన్.

క దొంగ గతి తప్పఁ దనకు న • భం గెఱపిఁక లేక "శృంగభంగ"మనుమ వ్రా
పెం గృష్ణుఁడు మఱికొందఱు • వెంగఱులన్ జేర్చికొని వివేక మెడలఁగన్.

క. వెంకటరామయ తా నీ • వంకమ్మునఁగలఁడొ లేఁడొ వ్రాసె నతఁడు మున్
గొంకక కోకిలకాకము • వంకిలచిత్తులకుఁగలవె భయభక్తులిలన్

* క. గురుదక్షిణ యిదెఁ గాదె ? • వరామకవి నీకు నూటపదియాఱుల నో
తిరుపతిశాస్త్రీ ! యితఁడిదు • గురుదక్షిణ నేల యందుకొనఁ దగదొక్కో !

గద్య ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగుగీరతామ్నాయమ్మున
నధిక ప్రసంగదమనమను ప్రథమభాగము సంపూర్ణము

* (తెనాలి శతావధాన పీఠికనుండి)

అవధానిగారి కొనఁగఁబడిన బహుమానము ( రు 116—0—0 ) లును బ్రహ్మ సభవారొసంగిన సత్కారము (రు 25—0—0) లును అవధానిగారు తమకుఁ గలభక్తి విశ్వాసములు వెలువడునటుల బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రి గారికి సమర్పించిరి. గురువులయెడ శిష్యుఁడిట్లేకదా ప్రవర్తింపవలయును .

ఇట్లు విద్వజ్జన విధేయులు
తెనాలి 28—12—11. } ప్రశల వీరరాఘవులు.
పెద్దిభట్ల లక్ష్మీనరసింహం.

శ్రీ మత్పరదేవతాయై నమః

# గీరతము




## ద్వితీయ భాగము

# గురుదక్షిణ అను నామాంతరము గల

గిరత ద్వితీయ భాగమునందలి

## పర్వక్రమసూచిక



# ఉపోద్ఘాతము



చదువరులారా !

గిరతప్రథమభాగము చదివి యుంటిరికదా. సర్వవిషయములను సూత్రప్రాయముగా నందే గతార్థము లగుటచే నిప్పుడు ప్రకటించు ద్వితీయభాగమునఁ గాని, ప్రకటింపఁబోవు తృతీయ భాగమునఁగాని తెలియఁదగు విశేషాంశము లంతగా నుండవు. ఎన్నాళ్ళు చదివినను నాయా యీగ్రంథభాగములయందు—

(1) శిష్యుఁడు గురుద్రోహము చేయుట తప్పు. (2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది చదివిన శిష్యుఁడుగాని వేఱొక విధమగువాఁడు కాఁడు. (3) పైఁగా నితఁడు కృతఘ్నుఁడగుటతోఁ జాలింపక వదరుఁబోతువ్రాఁతలు, అసత్యములు, అపవాదలు లోనగునవి ప్రకటించుట మొట్టమొదలే తప్పు.

అను నీయంశములు దక్క వక్తవ్యాంశము గానరాదు గురువే దోషియో, లేక శిష్యుఁడే దోషియో మీకు మొదటిభాగమువలననే గతార్థమై యుంటచే దీని ప్రకటన మంత యావశ్యకమని మాకును దోఁచలేదు గాని మొదటి భాగమునందు విస్తరభీతిచే వదలిన యంశములు కొండొక యుంటచే నయ్యవి యిందు ఖండించు మిషమీఁద గురుశిష్య ధర్మములు కొన్ని సంగ్రహించి చూపుటకై దీనిని ముద్రించితిమి. "అట్టహాసము" అనునది ప్రథమభాగమందే యించుక స్పృశించి వదలఁబడినది. పిమ్మట గుంటూరుసీమ పూర్వరంగము 45, 46, 47 పుటలలోఁ గొండొకదాని బండారము బయటపెట్టఁబడినది ఇందుంగూడ నక్కడక్కడ దానింగూర్చి ప్రస్తావింపఁ బడినది. "అట్టహాసమే" యననేల, మాశిష్యులు వ్రాసెడి వ్రాఁతలెల్లఁ బరికించి చూచినచో—

(1) మాగురువు పండితుఁడుగాఁడు (2) పాత్రుఁడుగాఁడు.

అను నంశము సాధించుటకై పాటుపడుటదక్క వేఱొక్కటి గానరాదు. ఇందులకు వారు చూపు ప్రమాణములో, పేరు దాఁచికొని తోఁచిన ప్రల్లదము లెల్ల వ్యయపఱచిన తస్కరుల వ్రాఁతలు ఆవ్రాఁతలవలననే గిరత ప్రథమ భాగము నిస్సారమనియో నిరుపయోగమనియో గూడ లిఖించి సంతసించుచుండిరి ఆవ్రాఁతల తత్వము లోకమెల్ల నెఱుంగును మాశిష్యు లంతకుమున్నె యెఱుఁగుదురు. ఎఱిఁగియును వానివలన మాకేదియో న్యూనత కలుగునదియు నంతలోఁ దమ గురుత్వము కూడఁ బోవునదియుం గాఁబోలును వీ రవి పట్టుకొని సారెకు వ్రేలాడుట !

శ్లో॥ కతిపయదివసైః క్షయంప్రాయాయా, త్కనకగిరౌ కృతవాసరావసానః
ఇతిముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే.

(విద్యానాథకృతము)

"తుష్యతుదుర్జన" న్యాయమున నాయా యీతప్పుడు వ్రాఁతలెల్ల నిజములే యైనను దమ కవి పాయముగావు అవి మాకుఁ గల యశము బోఁగొట్టినఁబోఁ గొట్టుఁగాక. తమ గురుత్వము నెట్లు బోఁగొట్టఁగలవు? కావున వీరు మమ్ము దోషులనుగాఁ జేయుటకు వ్రాయు వ్రాఁతలేమి, యందులకై వ్యయపఱుచున్న ద్రవ్యప్రదాతల సొమ్మేమి వమ్మేగాని లాభకారి గాదని వారి కిప్పటికేనిఁ దెలిసినచోఁ గొంత యుక్తముగా నుండును నానాఁటికి వీరు మతియును నష్టదవిని బడుచున్నట్లు వ్రాఁతల వలనఁ దెలియవచ్చుచున్నది మొదట గురుని కపాత్రత్వము సాధించుటకుఁ "గాకి" యని పదరఁ దొరఁకొనిరి

"పక్షిణాం కాకీ చండాలీ" అనుటవలన నది యపాత్రత్వమునకు సాధకమే. ఇటీవలనో? ఈ వేంకటేశ్వరుఁడే యా వేంకటేశ్వరుఁ డని యభేదాధ్యవసాయముచేసి కొని పదఁదిట్ట నారంభించిరి. అతి విస్తరమెందులకు? ఏదోవిధమునఁ దిట్టుట వీరి ముఖ్యోద్దేశము. ఏదోవిధమున నీతిగఱపుట మాముఖ్యోద్దేశము. వా రందులకును మే మిందులకును బాటుపడవలసిన దని భగవంతుఁ డేర్పఱచి యుంటచే నేవో వ్రాసి కొనుచుందుము. రసారస విచారముతో మాకుఁ బనిలేదు కావునఁ జదువరులుమమ్ము విందింపకుందురుగాక ..

పరికృతమగు "కోకిలకాకము"ను గూర్చియు, నింతకుమున్ను ప్రచురించిన గిరత ప్రథమభాగముపై వారు ప్రకటించిన శంకలనుగూర్చియుఁ గొందొకవ్రాసి విరమించెదము "కోకిలకాక" మన్యాపదేశముగదా, దానిని మీపై వేల పెట్టుకొంటిరిఁ అని ప్రశ్న రావచ్చును. అందులకుఁ బ్రథమభాగ పీఠికలో మాశిష్యుల వ్రాఁతలనే బోధకములనుగాఁ జూపియున్నారము. ఇందుఁగూడఁ గొందొక చూపెదము.

(కవితలోని ప్రభాకరపరామర్శమునుండి)

చ॥ .. .మీగురులకుఁ దెల్లమే, .... మాగురులశక్తి .... ఉండిలు బద్ధ
శక్తి .. . దెబ్బఁదినుకాకియె కాక విసుంగొఱుంగునే॥

ఈ పద్యము 169వ పుట మొదలుకొని యుదాహరించిన వేటూరి ప్రభాకరశాస్త్రి సతీర్థ్యసంప్రార్థన పద్యముల కిచ్చిన ప్రత్యుత్తరములోనిది. అతఁడు గురువును కాకి యని వ్రాయుటతప్పని మందలించిన పైని వ్రాసిన వ్రాఁతలో మరల పదేపాటపాడుచు శేదని బొంక మొదలిడిన వీరి తెల్వని, వీరి దైవానుకూల్యమును జదువరులే విచారింప

కొందురుగాక. ఈ బొంకులను దమపేరితోఁ బ్రకటింపకశిష్యునిపేరఁ బ్రకటింపుటవలన దా మతని మందలింపున కుత్తరమీలేమి స్ఫుటమగుచున్నది. ఏశిష్యుపేర నీ ప్రల్లదములను వీరు ప్రచురించిరో ఆశిష్యుఁడే యిటీవల "పాణిగ్రహీతా శ్రవణానందశృంఖల" యనుపేరితో 120 పుటలకు మించిన బూతుఁగూఁతలను వ్రాసి లోకుల స్తోత్రముల కగ్గమైన గుణవంతుఁడు అతనిపేరా పొత్తముననే చూడఁదగు. అతని శంకల కుత్తరములు "శృంఖలాశృణీకరణము" చదివిన విస్పష్టముగఁ దెలియఁగలవు ఆబూతులవ్రాతలు వెం॥ రా॥ ల యెఱుకమీఁదనే జరిగినవనుటకు సాక్షిభూతము లగు నంశములు బోలెఁడుకలవు. అవిగూడ నన్యతఁ జూడవలయును. మఱియుఁ బ్రకృతమగు "ప్రభాకర పరామర్శము" నుండియె మఱికొన్ని యసందర్భ ప్రలాపములను జూపుచున్నారముఁ

"మ॥ ...వ్రాయఁగ నాయంబె సతీర్థ్యులంచు కొద్దిగ శ్రీరామకవీంద్రు దొక్కరుఁడె విద్దెన్నేర్చె ...యిర్వురన్ బిలిచెదే

ప్రభాకరశాస్త్రి "సతీర్థ్యులార" అని వెం॥ రా॥ ల నిరువురను బిల్చుటతప్పుఁట॥ ఈతప్పిట్లు సమర్థింపఁబడుఁగాక. ఏండ్లకొలది వెంకటరామయ్య శిష్యుఁడు. రెండవ యతఁడో? కొన్నాళ్ళు మాత్రము శిష్యుఁడు దీనింగూర్చి భారవిమహాకావ్యములోని ద్వితీయసర్గమును, రామకృష్ణశాస్త్రి తండ్రిగారగు వృద్ధులు, బ్ర॥శ్రీ॥ రామచంద్ర శాస్త్రులవారును సాక్షులగుదురుగాక. మఱియు నీవిషయము 188 వ పుటలోని యుత్తరములోని 5, 6, 7, వ పంక్తులవలనఁ గూడఁ దెలిసికొనవచ్చును, ఆయుత్తరము రామకృష్ణశాస్త్రి పినతండ్రి కుమారుఁడు వ్రాసినదే, అగుఁగాక అతఁడుగూడ వేంకటశాస్త్రికే దగ్గఱబంధువని రామకృష్ణశాస్త్రి యపలాపింపక మానఁడు. ఇట్టి యపలాపమునకు రోసి యొక రిట్లువ్రాసిరి

(1912 సం॥ సెప్టెంబరు అభినవసరస్వతినుండి)

ఓకృష్ణకవిగారూ! మీరు గిరతవిమర్శనమని వ్రాయుచునందు నన్ను మీకిరువురకు సరిపడిన బంధుగుతననియు మీకుగల్గిన తంపియంతయు పెట్టినవాడను నేననియు నుడివితిరి. అసత్యములేయూడ గంకణము గట్టికొనిన మీకిదియొక వ్యత్యాసముగ దోచకున్నను నాకు గడుగడు నసహ్యముగ నుండుటచే లోకు లెఱుంగుటకై నాసత్యమును జెప్పుచున్నాఁడను. అది మీరును గ్రహింతురుగాత. నేను మీకే సమీపబంధువుఁడగాని బ్ర॥ శ్రీ॥ వెంకటశాస్త్రిగారు శతావధానిగారికి అంత బంధువుఁడగాను మీసావసారస్యమునకై మీరు వేఱుగా చెప్పునప్పటికి మన బాంధవ్య మెఱుంగువారెవ్వరునొప్పరు

పల్లెపాలెం.

M. V. Subba Row, 16-8-12

ఈయపలాపములను గూర్చి గ్రంథములో నచ్చటచ్చటఁ గొండొక దర్శింపఁ బడుననే యుండును ఇది యటులుండుఁగాక. అతఁడు 'సంప్రార్థనము' అని వ్రాయవలెను 'పరామర్శము' అని వ్రాయుటవలననే కొంతవఱకు యోగ్యతస్ఫుటమగు చున్నది దానివలన వచ్చుదుర్ధ్వని నివారింతమన్నను నివారింపఁ బడదు. అది యటు లుండె, దాని విండఁ దిట్లు శరపరింపరగా నున్నవి

(1) ఉ॥ కోకిలకాకము వెల్లడింపటల్, మంకుతనంబటంచుఁ బలుమాఱికి లించితిరి (2) చ॥ ఛాత్రుఁడ వెంకటరామకృష్ణ ధీవరులకటంచు మ్రొక్కు-ఁడు॥ (ఇట్టివనేకములు)

పరీక్షాకరశాస్త్రి "మీ యడుగుల్ మ్రొక్క" అనివ్రాసినది చాలదఁట ! పైగా "ఛాత్రుఁడ" ననవలెనఁట !

"చ॥ రామకవివీరుఁడె నీకు సతీర్థ్యుడైనచోఁ దిరుపతిశాస్త్రిగారుమసతీర్థ్యులె"

తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రివద్దఁ జదివినదేదియును లేదు.అట్లే వెంకటరామయ్య కూడ నని శిష్యుని వ్రాలుతోఁ బ్రకటించు మా శిష్యులసాహసమును లోకమే పరి కించుఁగాక తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రియందు గురుత్వమును జూపుటకుఁ గారణము అతనికంటె నితఁడు ముందుగాఁ గవనము రచించుచలవాటు గల్గిన వాఁడగుటచే నే కంచపద్యలక్షణమునో యేయొక విముషమందో యితనివలనఁ దెలిసికొనుటతప్ప వేఱుగాదు. ఇఁక వెంకటరామశాస్త్రికిఁగల యావద్గురుత్వముకో నెన్ని వంతులలోనో యొక వంతుమాత మిత్రులలదియుఁ దక్కినదెల్ల వెంకటశాస్త్రిదియు నగుటకు భగ వంతుఁడే సాక్షి కాఁగలఁడు, దీనింగూర్చి మూడవభాగములో విస్తరింపఁదలచి యిందు సూత్రముమాత్రము వ్రాసి విరమింపఁబడుచున్నది అపరిష్కృత పరిశంసలో మూడు మాసము లని కృష్ణకవి వ్రాసినను, కోకిలకాకములో "చాలఁగాలము విసివి" అని యిరువుర చేవ్రాళ్ళతోఁ బ్రకటించియున్నారు "చాలఁగాల" మనఁగా, మూడుమాస ములే యని పోట్లాడుదురా? అయినచో "శ్రీపరిత్యయాంతము కౌముది" చదువుట పొసఁగదు. ఎక్కువ బుద్ధిమంతులకు మూడుమాసములలోనే శ్రీపరిత్యయాంతము కావచ్చునని వాదమునకు దిగినను నిలువదు. మూడుమాసములు శుశ్రూషచేసెను. మాసము 1కి ననధ్యాయములు 10 దినములు. అదిగాక మధ్యమధ్య నైమిత్తికములు గొన్ని యుండును. అవియెల్లఁబోద్రోసినచో షుమారు 45 దినములు చదివినట్లు తేలును ఆ దినములలోనే శ్రీపరిత్యయాంతము చదువుటకు పై యాకరణు లెవ్వరును నొప్పరు, పైగా నా ఛలుబడియైన దినముచేని పాఠము జరుగుటకు —

"తా నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచు నుంట నేమియుంజెప్పదు కాక కోయిలకు". (కోకిలకాకము )

అను వారి వాక్యమొప్పికొనదు కావున విమర్శించుచో మాశిష్యులు వ్రాయు వ్రాఁతలెల్ల వింతసారము కలవి. వారియదృష్టము మంచిది. కావున వారికి గురుదూషణ దేవదూషణ"ఆనృతోక్తులు" ఇకనేమి కావలెను? కలియుగమునకుఁ గావలసిన సామగ్రియంతయుఁ దటస్థించినది "దానితో" బోలెడు గ్రంథమును వ్రాయుచున్నారు, వ్రాయఁగలరు. ప్రతి గ్రంథమును నిట్లు విమర్శించి నిగ్గు తేల్చువారెవరు? ఎవరికిఁగావలెను? స్థూలదృష్టిచేఁ దిలకించువారో" "కాఁబోలును" అని యనుకొందురు ఇదియిటులుండె "పరామర్శము" నుండి యిఁక నొకమాట నుదాహరించి దానిసారమును దేల్చి వదలుచున్నారము

"సీ॥ దయమీఱ నైషధాంతము కావ్యములు చెప్పి సాహిత్యహితునిగాఁ జర్పినాఁడు".

వెంకటశాస్త్రికి శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిలుగారు నైషధాంతము కావ్యములు చెప్పిరనియుఁ గవిత్వము మొదలైనవి నేర్పిరనియు వారియెడల వెంకటశాస్త్రి కృతఘ్నుఁ డయ్యెననియుఁ బై పద్యమునందలి సారము. శ్రీకృష్ణమూర్తిశాస్త్రిలవారి వద్ద వెంకటశాస్త్రి చేసిన విద్యాభ్యాసాదికము నీక్రింది పద్యములవలనఁ దెలిసికొనఁ గోరెదము

చ॥ కదలి యనంతరం బచొటు కాటవరంబను నొక్కపల్లె కింపొద వగ నేగ ." (జాతకచర్యనుండి)

కాటవరమనునది శ్రీశాస్త్రిలవారి నివాసస్థానము శిష్యారిటీవలఁ జాలకాలము క్రిందట రాజమండ్రి ప్రవేశించిరి —

తే గీ. అచట శ్రీపాదవంశజుఁ డనఘమూర్తి. కృష్ణమూర్త్యాఖ్య సుకవివరేణ్యు నొద్ద, మొదలిడి కుమార సంభవమునను రెండు, సర్గలుపఠించె మూడుమాసముల కెలమి" . తే॥ గీ॥ గురువుఁ దత్సహపాఠియుఁ గూడితఱచు, నాడుచుందురు చదరంగ మట్టియెడల, లక్షణంబెట్టు లట్లతల్లక్షణంబు, నితఁడు గ్రహియించె నాదర మెనకమెనగ . తే॥ గీ॥ అంత మేఘసందేశకావ్యమును మొదలువెట్టి చదువుచునున్నంత విఘ్నకార, ణం బుదయమందెఁ దత్స్వరూపంబు దెలియఁ బఱచెద ..." చ॥ గురువింత మృతింగనె నాత్మదేహమం, దొదవె నొకించుకంత జ్వరయోగము, ...గురువికిఁ జా వచియించి యావమాఖ్యపురముంజనెఁ దల్లిని దండ్రినింగనన్" ..

(జాతకచర్యనుండి)

నై షధము శేషశాస్త్రులవ రివర్దనే కాదు, మఱియొకరి యొద్దఁగూడ విప్పటికివి వెంకటశాస్త్రి చదువనే లేదు. ఇంక ముందు చదువవలసియుండును. అయా యంశము లకు శేషశాస్త్రులవారే సాక్షులు. శేషశాస్త్రులవారు వెంకటశాస్త్రిని గృతఘ్నుఁ డనియం దురో,యేమందురో,176వ పుట. 12వపంక్తిలోని గాదే జగన్నాథస్వామిగారిపద్యములో జూతఁ గోరెదము. గిరత ప్రథమభాగమున 34వ పుటలోని పవద్యమునఁగూడ శేషశాస్త్రులవారి విషయము కొంతకలదు. చదువఁగోరెదము. అతవా. శేషశాస్త్రుల వారికి వెంకటశాస్త్రి కృతజ్ఞుఁడు గాఁడు. అంతమాత్రమునఁ దమకేమి లాభము? ఆతఁడే రౌరవాదినరకముల కగ్గమై పోవుఁ గాక. అతవిత్రోవ విందు మవి మెఱఁ గెయు వీరేల పట్టవలెనో?

"యాన్యస్మాకగం సుచరితాని, తానిత్వయోపాస్యాని. నో ఇతరాణి-

అని చెప్పినవేదవాక్య మేరెఱుఁగనిది? అతవిమంచిని గ్రహించినచోఁదమ్ము లోకము మెచ్చును గాని యందులకుఁ బరాఙ్ముఖులై యతని చెడ్డను గ్రహించినఫల మేమి. ఇది యిటులుండుగాక, ఇఁక వీరి గిరతవిమర్శనపు శైలి వించుక ప్రవ ర్శింత ము.

"గిరత" శబ్దము సాధువు కాదని కొంత చర్చ వ్రాసి దూషించిరి. అది పండి తులు చేయవలసినది కాని జ్ఞానలవదుర్విదగ్ధులెల్ల దానికి నధికారులు కారు వీరు జ్ఞానలవదుర్విదగ్ధు లనునంశమునకుమును జదువఁ గోరెదము. పాఠకులకు మే వారి "శతఘ్ని"యే మొదటిసాక్షి. ఈ విషయమును దెలిసికొనఁగోరువారు పాఠకుల యక్కఱలేదు. వీరొక కవితాపత్రికలో నెవరో మేజస్ట్రీటుగారు కాళిదాసకృతమగు "శృంగారతిలకమును" దెలిఁగించి వ్రాయుచు వారిపద్దెములను మెచ్చుటకుఁగా "రసికావందమును" దెగఁ దిట్టెను వలిడి కొన్ని పత్రికలు దానితోడనే వించి కాలక్షేపము చేసిరి. అందెన్నో యసంగత ప్రలాపములను వావిడిచిరి, దిఙ్మాత్ర ముదాహరించుచున్నారము.

ఉ॥ రాతిరి మబ్బుచేతఁ దిమిరమ్మధికమ్ముగ నుండె, వ్యాప్తమై । నాతత కష్టుఁడై పతిరయమ్మున విద్దురవోయె దొంగలీ । రాతిరి యూరుచొచ్చిరి కరమ్మును బాలసుగాన నెంతయుఁగా । భీతిలుచున్ననాన విఁక వేగమె విద్దురమాను పాంథుఁడా॥
(రసికావందము)

పైపద్యమును విమర్శించుచు నందు "రాతిరి" అనుపదము రెండుసార్లు వాడుట తప్పని వెక్కిరింపఁ జొచ్చిరి.

"వసంతతిలకమా, ఈ బాలునెత్తికొని యింటికిఁ జన్నవమ్మ గా, నాబంధు లందఱు మనంబున నేమనారే, ఈబాలు సూర్యవిభు నిట్టులపెట్టిపోవంగా. బుద్ధిపుట్టనవి కన్య మనంబులోవన్"— భారత - ఆది - ౨౮

దీనింబట్టి యట్లు వాడుట భారతసమ్మతమని స్ఫుట మగుచున్నది. ఇంత స్వల్పవిషయమును గనిపెట్టని వీరు పెద్దపెద్ద విషయములలోనికి దిగుట "ఉట్టికెగుర లేనియమ్మ స్వర్గమునకెగురుట" వంటిది. గాన వీరివిద్యావిషయక మగు శంకలకిట నుత్తరము లిచ్చుటకు బ్రారంభించి కొన్నిపుటలు వమ్మొనర్పఁ దొరకొనము. అది గాక గీరతమువలన దమ నెత్తినిబడు నంశములేవియో వానిని ఖండించుకొనుటకన్న శబ్దవిచారమేమి ముఖ్యము? కృతఘ్నత్వమును గాని యసత్యతత్పరత్వమును గాని లేకుండఁ గాపాడుకొనఁ బ్రయత్నించ వలయునేకాని యాశబ్దము బాగులేమ అందలి యుత్తరములు వ్రాసినవారు "తి॥ వెం॥ కవులకు బంధుగులు" మఱియుఁ "గొందఱు స్నేహితులు" లోనగునపలాపములవలన ఫలమేమి? ఒకరిద్దఱు మూగురు లేక నలుగు రైదుగురు వెం॥ శాస్త్రికి బంధుగులే యగుదురుగాక, వారు వ్రాసినవ్రాతలో నున్న విశేషమేమి? వెంకటశాస్త్రికిఁ బిచ్చియెత్తినదని యెవరేని ప్రచురము చేసినప్పుడు దానిం గూర్చి క్షేమసమాచారము తెలిసికొనుటకు వ్రాయువారు బంధుగులు కాఁగూడదా? అంతమాత్రమున నందలి యుత్తరములెల్ల బంధుగులవియు స్నేహితులవియు నని తొంకినఁబోవునా? మఱికొన్ని "తమంతఁదామే కల్పించినవి" యని కూడ వ్రాఁగ మొదలిడిరి. ఈ మాట కర్థమేమైనఁ గలదా? అట్లు కల్పించినచో నయ్యెవార లూర కుందురురా? ఈత్రోవ కొప్పరపుఁద్రోవ. దీనింగూర్చి గుంటూరిసీమ, ఉత్తరరంగపీఠిక చూడఁదగు. యిట్టివే యనేకములు ప్రల్లదములందుఁ గలవు. ద్విభాష్యం పుల్లకవిగారు వీరియందభిమానము కలవారా? కారా? ఆయన వ్రాసినయుత్తరము సీగురుదక్షిణలో బ్రచురించితిమి. 173 వ పుటలోఁ జూడఁదగు ఆయనకు వీరియందుఁగలయభిమాన మును స్ఫుటీకరించుచున్నారము

(కవితాపత్రికనుండి)

క॥ శ్రీవేదమూర్తులై తగు, శ్రీవేదుల రామకృష్ణశేఖరునకుఁ దద్భావుకుఁ దోలేట్యన్వయుఁ, డౌ వెంకటరామకవి పదంఘ్రిద్వయికిన్ ॥౧॥ .మ॥ ఒకచో ముద్దులు మాటఁ గట్టు నొకచో నొయ్యారముల్ చూపు విం, కొకచో మంజులశయ్యలందు నొకచో నుత్సాహముల్ పెంచు విం, కొకచో విందు నలంక్రియామలను, బ్రాజ్ఞాల్ పంతసింపంగఁ గొం, కక రాజిల్లెడు రామకృష్ణకవితా కళ్యాణలీలాగతుల్॥ .

యిట్లువిధేయుఁడు

ద్వి॥ పుల్లకవి, దుర్గాడ. 22-9-1910

ఈయన కట్లు మన మేలు విశీగి పోవలెనో యోజింపుఁడు. తా మొనర్పు దురద్యమమువృర్పిసంగాదికములు తల్లివెనుకఁ దల్లి యనఁదగిన పెద్దతల్లిలోనగువారికే రుచింపనియప్పు డితర బంధువుల కెట్లురుచించును. ధర్మమబంధుత్వాదికము ననున రించునది కాదుగదా. ఈపుల్లకవిగారు వెం॥ రా॥ ల ఖావిష్క్రియత్నమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు

. తే॥ గీ॥ గిరతిమ్ము విమర్శింప గ్రిట్రయొకటి, వెలువరుమనున్న యది దాని వెనుకనుండి, నిజవిశేషమ్ములను గని నెగడవచ్చు - కుకవి కాండ వేదండఖండ విఖండనార్య.

దీవిభాష్యం పుల్లకవి,

30-7-13 గోదావరి డి॥ పిఠాపురం, డి॥ దుర్గాడ.

---

ఇది యిటులుండె, మాశిష్యవి పెద్దతల్లులిరువురు. వీరు కడు ధర్మతత్పరు రాంధ్రవి మాబంధువులెల్ల నెఱుఁగుదురు. ఆ యిరువురిలో నొకరి హృదయము ప్రకృతవిషయమున ననంతుష్టమని కనిపెట్టబడినది అందులకు సూచకమగు లేఖ 204 వ పుటలోఁ గలదు. అదివారి సౌహార్దమునే తెల్పునుగాని తక్కిన విషయము లను దెల్పదు దానింబట్టి తక్కినయంశము లెఱుఁగుదురుగాక. దానిని వ్రాసిన కాఁకర పర్తి నారాయణమూర్తి మాశిష్యునికిఁ బెదతల్లి కుమారుఁడని యెఱుఁగదగు. వేఱొక పెదతల్లిగా రీతని ప్రకృతోద్యమమునకు మొదలే సమ్మతింపరు. గాని ఆవిషయమున మేమిట వ్రాయ నాధారములు లేవు. ఆధారమే యక్కఱలేదుసుఁడీ, ఏమాత్రమేని మనస్సునునది యొకటియుండెనేని కృతఘ్నత్వ దోషము నది యెవ్వరినిగాని నంత సింపనీయదు. కాన వారు పీ రననేల, మాశిష్యుఁడు కృతఘ్నుఁడేయగునేని యితఁ డొనర్పుపనులు మనుజజన్మమె త్తిన యేరికిఁగాని యసహ్యములు గాకపోవని చెప్ప సాహసించుచున్నారము అదియటులుండె.

(1913 సం॥ ఆగస్టు 27 వ తేదీ ఆంధ్రపత్రికనుండి)

ఆంధ్ర చంపూభారతము,

ఈగ్రంథమిపుడు శివికాపత్రికయందు ముద్రితమైనది. పిఠాపురసంస్థానకవులగు రామకృష్ణకవు లీగ్రంథమును సాదరంబున తమ కవితలో ప్రచురించుటయే గ్రంథో త్కృష్టత చాటుచున్నది .. .... (తిరుమలవెంకటరమణకవులు)

పైపంక్తులవలన నాకవులకు వెం॥ రా॥ లయందుఁ గొండొక ప్రేమకలదని విస్పష్టమే. వీరు మాకడకంపిన పద్యములను 176 వ పుటలో ముద్రించి యుంటిమి. వీరి కృతఘ్నతాదుల విషయమున వారికిం గల యేవము నవి పూర్తిగా వెల్లడించెడివి.

సారమేమనఁగా వీరి వాక్పారుష్యాదికమును బట్టి బంధువులేమి లోకులేమి వీరిని మందలించు తలఁపు గలవారగుచున్నారు. శ్రోతలేక వారిని వీరుమాకు మిత్రులగ నపలాపించి తమ్మాలమునఁ దమకు శత్రుత్వమును సాధింపఁజూచుచున్నారు.

(కవికర్ణరసాయనమునుండి)

క. కాకేమి తన్నుఁ దిట్టెనె, కోకిల త న్నేమి ధనము కోకొమ్మ నెనే
లోకము పగ యగు పరుసని, వాకునఁ జుట్ట మగు మధురవాక్యము కలిమిన్.

మాశిష్యుల ప్రకృతస్థితి పైపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మొదటఁ దామవలంబించిన పికత్వమే కాకత్వముగాఁ బరిణమించుచున్నది. దానిని వారింప నెవరితరము? ఇతరకారణములచే శత్రువులగువా రిట్టిపట్టుల నేవేని యవకతవకలు తమ్మునుగూర్చి వ్రాసినచో నవి త్రోసివేయనగును గాని యట్టిది లవమును లేనివారు శత్రువులగుచుండఁగా వారించుట యెట్లు? ఈ విషయమును సమర్థింపఁదగు నంశములు పెక్కులున్నను దిఙ్మాత్రము సూచించి వదలితిమి. వీరికి గురుద్రోహ మనిన బెల్లమునుంగాదు ఇది మాయెడలమాత్రమే యనుకొను చుంటిరేమో? అట్లుకాదు. సార్వత్రికము, దీనిని సూచించి వదలుచున్నారము

"భగీరథశాస్త్రిలుగారు, వీరు సత్రములు .. యీయన యింజరప్రో[illegible]కో మన్నప్పుడు భారద్వాజఘట్టములోని విశేషములు తెలిసికొనుటకై వెంకటరామ[illegible]గా రాయని యొద్దకు వెళ్ళినమాట సత్యమే"

ఇది కృష్ణకవిఁవ్రాత చదువుకొనుటకు వెళ్ళెనన్నచోఁ బయుపుపక్కువ యని యెంచి కాఁబోలు, "విశేషములు తెలిసికొనుట" కని వ్రాసి పాపపు బండికోల మొదలిడినాఁడు. ఒక విశేషము మాత్రమున్నది కృష్ణకవివ్రాతనాఁగఁ జాలకున్నను వెంకటరామయ్య తానుగూడ నిందుఁ జేవ్రాలు జేయకుండుటచేఁ గొండొక సంతసింపవలసి యున్నది. ఈగిరథవిమర్శన పత్రికరణమేమి, అట్టహాసమేమి, కృష్ణకవిగారి వ్రాలు మాత్రమె కలపియని చదువరు లెఱఁగియే యున్నారు. ఆయనయొద్దకు విశేషములు తెల్పుటకై వెళ్ళినట్లు లిఖించినను లిఖింపఁ గల సాహసి సుఁడీ కృష్ణకవి అతని కసత్యమువలన లవమును భీతిలేదు. ఈయంశము శృంగభంగాదికము వలనఁ దెలిసికొనవచ్చును. అతనికి దీటగువాఁడు చర్ల చలపతి. అతఁడతని బావమఱఁది. అతనిం గూర్చి వ్రాసినచో మాలేఖిని కెంతేని పనిగలుగఁ గలదు. "యతోవాచో నివర్తంతే" శ్లో॥ కథాపీఠిక .. ఆత్రేయపేయత॥ ప్రకృతమనుసరామః, భగీరథశాస్త్రులవారి యొద్ద జదివి కొన్న సంగతి నొప్పుకొన్నచో నావిద్యాభ్యసన కాలము ప్లవంగ సంవత్సర మగుటచేఁ దదనంతర భావియగు కీలక వత్సరములోనే వ్రాసికొన మొదలిడిన "ఉభయ

శాస్త్రపరిపీఠత్వము' బ్రతుకదు ఇందునుగూర్చి గిరతపరిభవభాగ పీఠిక ౧౫ ౧౬ పుట లలోఁ గొన్నిపంక్తులు చదువఁగోరెదము. దానిని బ్రతికింపవలయు నని భగీరథ శాస్త్రులవారి శిష్యత్వమును బ్రచ్ఛకత్వముగా మాకృష్ణనుకవి యపలాపింపఁ జొచ్చెను. తన బావమఱఁది యగు చర్ల చలపతి పెద్ద పండితుఁడని లోకమునకుఁ దెలియునట్లు కృష్ణశాస్త్రి కొంచొక యపలపించెను. అసోదెవలన నితనికిఁ బ్రయోజన మెంత యున్నది? "శృంగభంగ" "సత్యసందేశముల" కవిత్వము తనదికాదనిలోకము విశ్వసించుటయే దానికి ఫలము. ఎన్నియని చూపుదుము. ఇతఁడసత్యమునకుఁ బుట్టి ల్లు. భగవంతుఁడును, దజ్ఞాలును ఇందులకు సాక్షులు. అచలపతి వ్రాఁత కీఁత దిట్లు వ్యాఖ్యాన మొనర్చుచున్నాఁడు.

"వెంకటశాస్త్రిగారి బండారమెంతో కృష్ణకవి తేల్చుననియు, నాపిదప దిరుపతి శాస్త్రి వెంకటరామశాస్త్రులగార్ల సంగతి చూచుకోవచ్చు ననియు నందు గల యర్థము యథార్థమని మ.మ్మాటికి వారు విశ్వసింతురుగాక."

("రాను రిప్పింపఁ బనిగానరాదు మాకు")

అను నపరిస్తుత ప్రశంసావాక్యము నెఱుఁగని లోకులు దప్ప పీవృధారావము నెవ్వరు విశ్వసింతురో

ఉ॥ వేదుల రామకృష్ణులఁట? వెంకవనంట జయించునంట? యెం, దో? దురి తంపుబండి నొఁగి దోలెదు సాహసమందు, నింక నెం, దో? దుడు కందివ్రాసి పయిఁ దోఁపక మిన్నగుటంచు, నింక నెం, దో? దెలియంగరావ యది యొక్కటియే సభ తేల్చఁగా వలెః"

అది యటులుండెపోపసు! అచలపతి *క్షమాపణవ్రాసికొని నిర్దోషి యగు టకుఁ బ్రియత్నింపఁగా మరల నాతని నితఁడు దోషదూషితుని జేయఁజొచ్చెను చూచితిరా!

"చర్ల వెంకటాచలపతిశాస్త్రి. యనునతఁడు నాకు బావమఱఁదియే ... యితఁడు వ్రాసినట్లుగా వెం॥ శాస్త్రిగారి ప్రోత్సాహమువే నచ్చటి విద్యార్థులలో నెవ్వరోవ్రాసిరి.

---

* క్షమాపణ ఇది నింద్యగ్రామ్యమని వెం॥ రా॥ ల శతఘ్ని. శ్లో॥ క్షమా పణైకపదయోః పదయోః పతతిప్రియే(రసగంగాధరము) ఇందుఁ కుఁ బాశుపతముకూడఁ జూఁడదగు ఆయీసమర్థన మెల్ల "గుణిపీపుస్తక" ములలోని పొరపాటులవలన నైనట్లు వాసిడుమ మాశిష్యులను సభాస్థానమునకు రప్పించువా రిక్కాఁలిప్పున లేకుండుట కడు విచార్యము. అప్పుడుగదా నిగ్గు తేలును.

వెంకటశాస్త్రిగారి ప్రోత్సాహమంట, దానిపై నచటి విద్యార్థు లెవరో వ్రాసిరంట ("వృష్టతాడనాద్దన్తభంగః") అన్నట్లిట్లు వ్రాయు నీతనిఁ దణ్ణాలు మందలింపకుండుట కడు నయశస్కరము తక్కిన యసత్యములను బ్రిగల్భము లను నటులుంతము ఈవిషయమునేని ధ్రువపఱచుటకు నితఁడు నత్సభలో మాయెదుటికి రాఁగలఁడేమో మా చదువరు లడిగి తెలిసికొందురుగాక యని హెచ్చరించు చున్నారము. ఆక్షమాపణ చలపతి పేరుతో నితరులే వ్రాసినచో వారిని శిక్షింపఁజేయుట యుక్తముకదా? నేడు చలపతిపేర నిట్లు సృష్టించిన వారు మఱియొకప్పుడు రామకృష్ణులపేరనే వేఱొక క్షమాపణనుగాని, నోటును గాని మఱియొకటిగాని సృష్టింపవచ్చునుగదా? కావుననిట్టి పట్టుల నౌదాసీన్య ముచితముకాదని కృష్ణకవికిఁ దెలుపుదురని చదువరులను మఱి మఱి హెచ్చరించుచున్నారము. ఇక్లే "ముఖమస్తీతి" వక్తవ్యముగాఁ గొంత సోదె వెళ్ళఁబెట్టెను. దానినెల్ల నూఁచకోఁతగా ఖండించినఁ బ్రయోజనములేమి నిందు విస్తరింపమైతిమి.

"అట్టి యుత్తరములు మాయెద్ద కోటానకోట్లు గలవు."

ఎట్టియుత్తరములు? గిరతములో, తి॥ వెం॥ కవులు ప్రచురించునట్టి యుత్తరములవంటివి ఎన్ని యున్నవి? కోటానకోట్లు: పదులుగావు, వందలుగావు, వేలు నుంగావు, లక్షలునుగావు, కోట్లునుగావు, ఇఁకనెన్ని? కోటానకోట్లు అబద్ధమాడినను వింతబట్టబయలుగా నాడవలయును గాఁబోలు; పోలు పోలు? కోటానకోట్లగుగాక. అర్భవములగుగాక కృతఘ్నత్వము సుగుణమని వ్రాయు పెద్దమానిసు లేడ దొరకుదురో? ఆయంశమును బోధింపని యుత్తరము లేమి పనిచేయును? లేదా, శిష్యత్వమునేని యాయుత్తరము లవలాపింపవలెను. ఈరెంటికిని దక్కిన యంశముల నెన్నిటిని వానివలన సాధించినను బ్రకృతమున కవి లవము నుపయోగింపవనిమేము వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ప్రధానవిషయమును వదలుకొని యప్రధానవిషయములకుఁ బాటుపడు వీరి ప్రవారమువలన నీక్రింది లోకోక్తి స్మృతికివచ్చుచున్నది

"జగతి శిరశ్ఛేద సమయమందునఁ దనకుండలమ్ముల యాస గొనెననంగ"

(యామినీ పూర్ణతిలక)

వీరు ప్రచురించు నుత్తరముల స్వరూప మొక్కింత చవిచూపి విమర్శింపుట ప్రస్తుతము కాకపోదు గాన దిఙ్మాత్ర మట్లొనరించుచున్నారము

(కవితాపత్రికలోని యొకయుత్తరమునుండి)

(1) "....రసికత్వలోపమునకు జడిసి మీసముల బెంచి కవిత్వమున మావరాక్రమమునకుగా నుంచితిమన్న నెవరు సహింతురు . ."

ఇతరులు సహింపకుందురుగాక, దానికిఁ దగిన ఫలముంగూడఁ గొంతురుగాక, శిష్యపరమాణువులు సైఁపకుండుట తప్పుగదా ? అంత రుచింపనిచో లోలోఁ బరితపింపవలెఁ గాని. "మీనమ్ముల్ మెలివెట్టి" అని సత్సభలలో వెక్కిరింపు మని యేవివేకి బోధించును? పైఁగా నెవరో కొంచెకనముగా వ్రాసిన "రసికత్వలోపమునకు" ఇత్యాదియొకనక్కపుమాటలను శిష్యులు ప్రచురించుట తప్పుగాదని చెప్పువా రెవరు ? ఇంతకు విద్యానివలనఁ దమకృతఘ్నతయేమి వివర్తించినది.

(2) "మీ కింకను గొంతకాల మోపిక పెట్టిన లోకము మి మ్మాధునిక కవిసార్వభౌము లని యభినందించును.

ఆవ్రాఁతకన్న నీవ్రాఁత యుక్తమనవచ్చును ప్రసిద్ధులెల్లరు క్రమక్రమముగా గతించినపిదప వీరినేయట్లు గౌరవించఁదగ్గ కాలము రావచ్చును "దొడ్డేఁడు దొంగలు తోలుకొనిపోశే ..గొడ్డు శ్రీమహాలక్ష్మి" యనునుగదా. ఆభవిష్యత్సార్వభౌమత్వమునకు మొట్టమొదట వీరొనర్పవలసిన ప్రయత్నము గురుద్రోహమే యగునోటు ?. అందులకా యీపూనిక, బాగుబాగు ! , 1, 2, అంకెలు గుఱుతుగాఁ గల వాక్యములకు స్థానభూతమగు నుత్తర మొక్కటియేగాని. అది వ్రాసినవారు మాత్ర మిరువురు అందులో నొకరువ్రాలు తుదను "గారు" అని తగుల్చుకొన్నారు అదికూడ మామీసమువలెనే యెందులకో తగుల్చుకొనిన ట్లూహింపవలసివదే. ఇంతటి తెల్వితేటలుగలవా రేమివ్రాసినను వ్రాయుదురు అట్టివారి పేరుల నిందేల ప్రచురింపవలెను, వలయువారన్యత్ర చూడఁగలరనియు పేక్షించితిమి.

(3) "గిరతము నేతిబీరకాయగా భావించుకాలము రాకపోదు"

ఈవాక్యముగూడ, అ॥"గారి' గారిదే వీరభోగవసంతరాయఁడు పుట్టఁగలఁడని చెప్పునట్టియన భవిష్యద్వృత్తాంతమును దెల్పి రామకృష్ణుల నోదార్చి పరామర్శించుచున్నట్లు వాక్యముల శైలి చెప్పుచున్నది. పరామర్శించువారెంతో యాప్తులగనుండవలయును. కావున మా వెం॥ రా॥ లిట్టివారియుత్తరములను బ్రకటించుకొనుటస్వవచోవ్యాఘాతమని చెప్పక తప్పకవచ్చినది. మఱియు నింకెవరో మాకాప్తులుగా నుండువారే యొక సందర్భమున "పిచ్చిపుల్లయ్య" అని వెం॥ రా॥ లకు వ్రాసిరఁట ఆ వ్రాఁత యితరోద్దిష్టమైనను వయ్యది యెట్లో మాలోనొకరికి సందర్భింపనఁటవానింబట్టి వీరికేమి ఫలము గల్గెనో కాని యాసోదె కొంత వెళ్ళఁబెట్టిరి ఆయీ యనుపయోగ పరితాపమెల్ల నేసంవత్సరమునందలి దనుకొంటిరి ? మా "పాశుపతమును" ఖండింపఁ బోవుటకు వ్రాయు నుపోద్ఘాతములోనిది శాస్త్రము నుపయోగించుటకు వీలులేనియప్పుడు శామింతకన్నఁ జేయవలసిన గత్యంతర ముండఁ బోదని యా

సోదెకుఁ దాత్పర్యమనునది యావదర్థము ఏపిచ్చిపుల్లయ్యయో యేపియో వ్రాసెను. దానిని ఖండింపుట యుక్తమో? యెవరో "పిచ్చిపుల్లయ్య" అనిరిగాన మేముచు "పిచ్చి పుల్లయ్య" అని యందుమనునది యుక్తమో? విజ్ఞులకు నొకరు తెల్పవలసియుం డునా? అదియటులుండె. వెం॥ రా॥ లు, దమయజ్ఞతను విరసించువారినెల్ల నేసం బంధము లేకున్నను మాకు మిత్రులనుగా నవలపించుచుఁ దమకు శత్రువులుగా భావించుచున్నా రని యింతకుముందే ప్రసంగించి యుంటిమి అందులకిఁక నొక యుత్తర ముదాహరింపఁబడుచున్నది.

"వెం॥ రా॥ కవులు, మేము అశ్వమేధమున పద్యములు ప్రకటించితిమను దురభిప్రాయముతో కవితాపత్రిక వెనుకటివలె రు 1–0–0 కి పంపమనియు పూర్తి వెలకుగాని పంప వీలు కాదనియు వ్రాయించిరి యింతకన్న మమ్ము వీరేవిధమున సాధింపఁగలరో ." శేషాద్రిరమణులు (సోదరులు)

తమయకృత్యముకతమునఁ దమవలని లాభమునుగూడ గణింపక తమమిత్రులు తమకు శత్రులగుచున్నా రమనంశమున కింతకన్న దృష్టాంత మేమి కావలయును? ఎవరో——"భంగుమేదుత్తూరుల" తప్ప సుజనులెల్లరుఁ దమయకృత్యమున కేవ గించుకొనువారేకద. 178వ పుట 21 వ పంక్తిలోని చామర్తి జగ్గారావు తమకెట్టి బంధుగుఁడు? అతనికి గీరతము వందానక్తి యుండుటకుఁ గారణమేమి? పైఁగా నితఁడు, వెం॥ రా॥ లకు, సహాధ్యాయి. బ్ర॥ శ్రీ॥ మధునాపంతుల సూరయ్యగారి వద్ద వీరు మూగురును గాళిదాసత్రయమువఱకో, అంత కొకింత తక్కువగనో చదివిన వారలు అట్టిచో నతఁడు గీరతమునభిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువు లేమి వ్రాయఁ గలరు? 182 వ పుటలోని 16 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యముగా రెంత మర్యాద కలవారు? ఆయన మా శిష్యుని పెద తల్లి కుమారుఁడగు బ్ర॥ శ్రీ॥ ఆకొండి రామమూర్తిగారికిఁ బినతండ్రి. అట్టివారెల్ల మా గీరత కావ్యము నేల యాదరింతురో? 181 వ పుట 23 వ పంక్తిలోని, ఆకొండి వెంకటశాస్త్రి గారు, దూరదేశస్థులు, మా యుభయులకును శాఖామాత్ర బంధువులే కాఁదగు వారు. బాగుగ విచారించినచో శ్రీ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారికి దూరపు జ్ఞాతులేని కాఁదగువారు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడవక తప్పదు. వారు మా "గీరతము" నందేల ప్రేమ చూపవలయునో? ఇట్టివారికెల్ల నేదో "పక్షపాతిపదమునో" "మూర్ఖపదమునో" నివేదించి తమ మార్గమును దాము వదలక మాకుఁ బని గల్పించు మా శిష్యుల నెవరు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగు దురో కదా? వీరెల్లరును మా యొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట

కట్లు వ్రాయుచున్నవారఁట! ఆ మాటకే యొప్పుకొందము. తమవద్ద నట్టిలాభమును బొందువారుకూడఁ దమమార్గము నేల విందింపవలెనో? నరములేని నాలుక యిచ్చ వచ్చినట్లు దిరుగును. అంతియ కాని ప్రాజ్ఞులగువారు కూలికి వినమెన్నఁడును ద్రాగరు. ఉండులో నొక పుస్తక మూరక వచ్చుసంతలోఁ గలుగు ఫలమెంతటిది? అదిగాక "ఆపుస్తకమేని "శుక్కమూతి పిందె" గాని రసవత్తరమైనది కూడఁ గాదుగదా! అట్టి పాడుకాగితపు చెత్తకట్ట కాసించి యే ప్రాజ్ఞులుగాని తమ్ముమను గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచోవ్యాఘాతము కాక మఱియేమి? దానితత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు ననుమోదకులుగానుండ వెఱతురు. పుణ్యకార్యమునకో, విస్సంశయముగాఁ దోడ్పడుదురు. ఇందు లాభాలాభము లకించిత్కరములు అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి? వారలకు మహాలాభమొకటికలదు అది పుణ్యపాప సంపాదన రూపము దేవిని గోరువారు దానికనుమోదకులగుచుందురు

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః

ఇంతతో నీ విషయము ముగించి విషయాంతర ముపక్రమింతము, చదువరులారా! వీరి "కోకిలకాక" మునకై మేము వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహ పొడముట వల్లను నత్యమిదివరకే ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమయినట్లు వారివారి లేఖల వలన మామదికిఁ బూర్తిగా వచ్చుటవల్లను కాలపద్యములను దిగవిచిచితిమి అందుఁ గొన్ని మమ్ము చూపుచున్నారము.

చ "గరుసగునే వికస్వరపికస్వర" మంటివి, వారిదాచ్ఛటీ
భరభరితాంతరంబగు నభస్సు "గుభాలు గుభాల్ గుభాలు" మం
చుఱుమఁగ విద్యుదుద్యదసులుల్లసిలం గరుసౌనొ? సారెకుఁ
బిరుసగునో? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడునో?

శా గాంభీర్యంబది సున్నయంచుఁ దెలిపెన్ గాకీ పికత్వ. మ్మిదే
దంభం, బెక్కడనేర్చి తీ యనృతవాక్తత్త్వం? బెవండిచ్చె? నీ
యంభోవాహవిహారఘోరవిపులవ్యాహార బాహుళ్యది
క్కుంభిశ్రీపతిఘింకృతుల్ వినియు మీ "కోకో" ధ్వనుల్ విల్చు నే!

మ. సభలో లేవదు బావకున్ గళము, తత్స్థానంబు మౌనార్హమే
ప్రభకై లేచినవెంటనే తపులు దుర్వారం బవధ్వానదూ

---

వెం॥ రా॥ ల. గీరత విమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁదగు.

రథనం, బయ్యది నిల్వపీయదుసుమీ ః బ్రాహ్మణశ్రీవోనిష్ఠ సౌ
రథసౌభాగ్యపరంపరాగ్రహణమాత్రస్వైరసంచారులః

క కమ్మనఁగ శిరము, కుకవుల కమ్మనియను కొందమా ? "అకతియనఁ గొటి
ల్యమ్మడరు గతి యగున్ ది. ద్దిమ్మని కుకవితలదిమ్ము దింపుట తేలెన్.

కవిత్వపుఁ బోలికకు నుదాహరించితిమే కాని పై పద్యములందు నూత్నాంశము
లెవ్వియు లేవు. మాశిష్యులను గృతఘ్నతాఘము నుండి తప్పింతమనియు, దానివలన
నితరు లట్టిదోషిప తప్పని తెలిసికొందురనియు, మేమీపనికిఁ బూనితిమి కాని క్రియ
ముగా వారది బలపఱచుకొనుమంటచే నింతపఱకు మాపరిశ్రమకు సార్థక్యమే
కనుపట్టదు. వీరి విషయమున నింక నొక రహస్యము తెలిసికొన వలసియున్నది.
వీరికిఁ జెడ్డ మంచిగను, మంచి చెడ్డగను గోచరించుచున్నట్టు మఱికొన్ని వీరి వ్రాఁ
తలు బోధించుచున్నవి వీరికి వ్యాసకృతభారతము తప్పు. ధర్మరాజపాత్రుఁడు
దుర్యోధనాదులు పుణ్యాత్ములు. ఈయంశము వీరుప్రచురించిన "కౌరవ గౌరవము"లోఁ
జూడఁదగు. ఈ విపరీతజ్ఞానమే వీరు సర్వత్ర వినియోగింపఁదగువారు. దానిచేఁ
గృతజ్ఞుఁడు మహాపాపాత్ముఁడుగను గృతఘ్నుఁడు మహాపుణ్యాత్ముఁడుగను గోచ
రింపక తప్పదు. వీరి కీవిషయము ప్రకృతము గదుముఖ్యము కావున వీరు భారత
మును వదలుకొనక తప్పదు అది గురువును నిందించుట కొప్పదు.

(మహాభారత శాంతిపర్వమునుండి)

భీష్మః॥ శ్లో॥ మాతా పితోర్గురూణాంచ పూజా బహుమతామమ ..గురుర్గరీ
యాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః , ఉభౌహిమాతా పితరౌ జన్మన్యేవో
పయుజ్యతః . ఆచార్య శిష్టాయాజాతి స్సాదివ్యాసాఽజరాఽమరా॥ శ్లో॥ విద్యాం
పాపం భ్రూణహత్యావిశిష్టం, నాఽన్య స్తేభ్యః పాపకృద స్తిలోకే శ్లో॥ మాతృతః
పితృతశ్చైవ తస్మా త్పూజ్యతమో గురుః ..శ్లో॥ మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య
గురుఘాతినః, చతుర్ణాం వ్వయ మేతేషాం నిష్కృతిర్నామశుశ్రుమ

(వి న్తరస్తుతత్రై వద్రష్టవ్యః)

గురుశిష్య ధర్మబోధకము లగు మఱికొన్ని శ్లోకములు 160, 198, 199,
200, 201 పుటలయం దుదాహరింపఁబడి యున్నవి ప్రకృతము మాశిష్యు లవలం
బించినది గురుద్రోహ యజ్ఞదీక్ష. దానికి వ్యతిరేకమగు ధర్మమును బోధించునది
వ్యాసభారతము. "భారతః పంచమో వేదః" అని దానిని పూర్వప్రాజ్ఞులేమి నవీన
విజ్ఞులేమి శిరసావహింతురు గాక. ఇతర పంచమవేదములయం దభిరుచి నించి తిరు

పతి వెంకటేశ్వరాది దేవగురువింవల నొనరించు వీరికా పంచమవేద మెట్లు ప్రమా
ణము కాఁగలదు? కావుననే వారి ప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును
మాశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి

"ఓ వ్రాయఁగవచ్చు వ్యాసమునివర్యుఁడు వ్రాసినయట్టి భారతా. మ్నాయము
లోని యంశములు మార్చివికూర్చి వేఱె భారతా. మ్నాయము . నమ్మరు
గాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ)

ఇంతకుమున్ను "కుక్కమూతిపిందె" అని మాగీరతమునే వీరు దూషించి
నట్లు ప్రథమభాగ పీఠికయందుఁ జూపితిమి. ఇప్పటికి వీరికి భారతముగూడ నట్టి
దశకే వచ్చినది ఇంతతో నేమయ్యె ఇంకను వీరిచర్యలు వీరివ్రాఁతలు ముందు
చూడవలసి యున్నది "పండితులు నమ్మరఁట" కాని లేకున్నచోఁ దలక్రిందుసంగ
తులతో వీరు వేఱొక భారతము వ్రాయుదురంట!

శ్లో॥ ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానం॥

అని కాళిదాసంత మహాకవి వాక్రుచ్చినది వీరికిఁ దృణప్రాయమే ఏగ్రంథము
గాని పండితుల మెప్పునకును అపండితుల త్రిప్పునకును, నాస్పదముగా నుండఁదగు.
అయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొంతొక వివరించితిమి ఇఁక నస్మచ్ఛిష్యోప
జ్ఞకమగు కృతఘ్న మతమున కనుకూలించు నొక వ్రాఁతయు దానికి మారకమగు
నింకొకవ్రాఁతయు నుదాహరించు చున్నారము.

"ఈకాలమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వ మైనది. అతిల్లే
యామ్నాయము లైనవి. భారతామ్నాయములతోఁ దుల్యములఁట!, మూర్ఖులువానినే
యాసక్తితోఁ జదివియున్నారు."

ఇటువంటివా రిట్లే వ్రాయుట యుక్తము ఇతఁడు లేశమును సహృదయుఁడు
గాఁడనుటకా పుట్టమునందలివే యీక్రింది పంక్తులుపొచ్చెలకములు,

" .. . ఈ వాక్యములు కాదంబరిలోనివి. . ఇవ్విధమున సందర్భములేని
యుపమలయొక్కయు శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేంతాడ్లవలె ..
నొప్పారు కాదంబర్యాదులు ."

కాదంబర్యాదులే వీరసగ్రంథములని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులను
మాగ్రంథము లేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండె. సహృ
దయులిట్లు శ్లాఘించుచున్నారు.

"గిరతమహాకావ్యములోఁగాని యిటీవల గుంటూరుసీమలోఁ గాని యొక పద్య మునకు, యీ చదువరి మున్నగువారి యుపనిషదుపన్యాసము౨ తుదకు "ఆసా వాదితో్యబ్రిహ్మ" చేయించుటకై నఁ బనికిరావు. మెదడులో నేమాత్రిపు రసగ్రహణపు సిరలున్నను, సహనబుద్ధియున్నను, గిరతకావ్యము లోని శాంతింపు పర్వములో నొక్క-పద్యముఁ జదివి భారతీము క్తిసౌధ మెక్కి- తరించఁగలరు లేనిచో సన్నిపాత రోగికిఁ జక్కె-రయుఁ జేదే, యెవ్వరేమి చేయఁగలరు ?" (సుదర్శినీ పత్రికనుండి )

వా రట్లు వింధించుటకు హేతువేదో గాని పీ రిట్లభినందించుటకు హేతువిది. భారతము నకలసుకవిజనవినుత మేల యయ్యె ? కేవలకవిత్వ ధర్మమును బటియా ? కాదు. దీనింగూర్చి వ్రాసినచో వింతట నంతటఁ దేలదు భారతమునఁ బ్రిధానరస మేదియో. తెల్పుఁడన సీనాఁ డెందఱో చేతులునలుపవలసినవారు కలరు స్థూలదృష్టికి నందు వీరరసమే మో ముఖ్యమని తోఁచ వచ్చును. అది యట్టిదియే యగుచో దానికి నేతాద్రివృశగౌరవము రాదు అందలి ప్రిధానరసము శాంతము. ఈ యంశమునకు " భారతే శాంతిః", రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాది ధ్వనయ షడ్విధాః॥"

అను సాహిత్యకౌముదియు మఱియు ధ్వన్యాలోకమును బ్రిమాణములు. అట్లు కొన్నిపట్టుల వివాదప్రిధానముగా స్థూలబుద్ధులకుఁ దొడకట్టినను, మా గిరతము కూడ శాంతరసప్రిధాన మనుట నిర్వివాదము కావుననే యిది ప్రాజ్ఞుల నుతికిం బాత్రమైనది, తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః (భారతము.)

(2) శ్లో॥ బుధజన ఇవ గ్రామ్యసదసి (కాళిదాసః)

ప్రికృత మనుసరింపవము మాశిష్యులకు నస్మత్కృతగిరతమే కాక వ్యాస కృతభారతముగూడ గర్హ్యమగుచున్న దనునది ప్రికృతాంశము వీరి కెవరో కొంత అసూయాయుబకూడ నుండుట సహజమే. ఏమత మేవి యొకరితో నుండుట యెవ రును గని వినని కాదుగదా ? అది యటులుండె, వీరిమతమున దుర్యోధనుఁ డెట్టి వాఁడు ? కడుయోగ్యుఁడు

మ॥ . . దుర్యోధనుకా .గలియంశమ్మునఁ బుట్టినాఁ డనుచు వక్కాణిం పఁగాఁ జెల్లనే (కౌరవ గౌరవము)

ఇట్టి విషధయోగ్యుఁ డగుదుర్యోధనునితో పీ రొక్క-టఁ దమమతమునఁ గేవలపాత్రుఁ డగునొకని కభేదము చేసి ప్రికృతనందర్భముననందే కొంత వింధించి

యున్నారు దాని కర్థమేమో ? వీ రపాతు[్రి]డనుకొనుచున్న మావిని విషధయో గ్యుఁడు కావలసి వచ్చుచున్నదే। లేదా, దుర్యోధనుఁడపాతు[్రి]ఁడగును. విమర్శిం చుచో వీరి తప్పుడు సాక్ష్యపు వా[్రి]ఁతలెల్ల నింతటినొసంము కలవియేగద. వీరికిఁ దామొనరించిన గురుదో[్రి]హాపరాధమును సమర్థించుకొనుట కీతప్పుడు [్రి]తోవలావశ్య కము లగుచున్నవి కాని మొట్టమొదట వీరిమత మెట్టిది ? పా[్రి]చీనార్య సమ్మతమైన దియే। దానిని ఋజువుచేయుట యెట్లు ?. ఇట్లు.

శ్రీశాంకర్త్యైనమః

చ॥ కులము ద్యజించి శాస్త్రములకుఁ బ్రతికూలత సంఘటించి య
న్యులవనముల్ హరించుటకు నూహలఁ జేయుచు పొట్టకూటి వి
ద్యలఁ గవి నా స్తికత్వపు మతంబున సంచరణంబుఁ జేయు వా
రలదరిఁ జేరఁబోకుము పరాకున నైనను మూఢచిత్తమా ।

ఉ॥ యాచకపాశి కొక్కటృణమైన నొసంగక యింటి మూలలో
దాచి వృథాప్రయాసము లెవంగనఁ బోక ధనంబటన్నచో
గాచముతోడుతఁ సమముగాఁ గనుఁగొంటయె మేలు. చచ్చుచో
బూచికపుల్లయైనఁ గొనిపోదువె చెప్పుము మూఢచిత్తమా।

ఉ॥ విత్తమువెంట రాదుసుమి. వేదన తప్పదు మీ. భవంబు పె
న్గత్తులబోను మీ. నిజముగా దలపోయుమి. యిప్పుడున్న సం
పత్తు లిటుండఁబోవు సుమి. పాపము నొందెదు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ జెప్పితి నింపక మూఢచిత్తమా।

అసలుకు సరియైన నకలు. ది 27—6—03 సం॥రం.

ఓలేటి వెంకట రామయ్య.

పైపద్యములు మాశిష్యుఁడు మాకడఁ జదువుమానుకొనఁబోవు దినములలో రచించినవి. అందుల కందుగల తేదీప్రమాణము. ఆతేదీ శోభకృత్సం. ఆషాఢశుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును ఆసం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింట యింజరములో నూతన గృహప్రవేశము అంతవఱకితఁడు శిష్యుడగాఁజదువుచున్న వాఁడే. ఇందుల శాగృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే. విద్యాభ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము ఈమూడువత్సరములును అప్రస్తుత ప్రశంసలోమూడు మానములుగాఁ గృష్ణకవి యుపలపించెను దానింగూర్చి యిందు బ్రస్తావించుటకన్నఁ బ్రశంసాఖండనమునకుఁగా నేర్పడిన లోకాభిరామాయణములోనే ప్రసంగించుట

యుక్తము పైపద్యముల కాగితము మాశిష్యుని వ్రాలుంటయేకాక యతని స్వహస్త లిఖితాక్షరములు గూడఁగలది. కృష్ణకవి దీని నెట్లో యపలపింపక మానఁడు. చర్లచలపతి క్షమాపణలేఖ గన్నదీని యెక్కువ యేమి "న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి"

ఈ కారిక నతఁ డసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించు చున్నాఁడు అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని "దేవగురు నిందాత్మకమగు మతము" నకుఁ దోడ్పడవు ఈమత మిటీవల కుక్షింభరిత్వప్రయుక్తమైన "గురుమాషణము నమర్థించుకొనుట కవలంబించినదియే" దీనిపేరేమి? వివేకదారిద్ర్యము అది యవలంబించినవారికొక మతమేమి, యొక త్రోవయేమి, యొకతెన్నేమి?

"శ్లో॥ వివేక భ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః"

ఆమ భర్తృహరి బుద్ధివిహీనుఁడా? శాంతం పాపం ఇట్టి వీరి వ్రాఁతలనేల విమర్శింపవలెను? విమర్శించు మావంటి మూర్ఖులను,

"కొయ్యతోఁటకూరకును సిగ్గులేదు. కొడవటికిని సిగ్గులేదు"

అని చదువరులు విసుగుకొందురని మేమెఱుఁగుదుము. కాని మాశిష్యపరమాణువులిరువురలో రెండవమానిసి లిఖియించు నన్పతములకుఁ బారములేక యుండుటం జేసి సత్యపరికాస్తికిఁ దత్ఖండనమునకు దిగక తప్పని విధియగు చున్నది వేయేల, అతఁడు వ్రాఁతయని ప్రారంభించినది మొదలు నేఁటివఱకును ప్రచురించిన యక్షరములలోనే యొకటి రెండు విలువనో గాని తక్కినవెల్ల "హా" ప్పని యూఁదిన నెగిరిపోయెడివేకదా? ప్రకృత వివాద విషయ మటులుంతము. ఈకృష్ణకవి "అభాష్యాంతమధీతం" అని వ్రాసికొనియున్నాఁడు. ఈయొక్కమాట కీతఁడు స్వగ్రామమునుండియేని తగిన సాక్ష్యమును దెచ్చుకోఁగలఁడేమో చదువరులు ప్రశ్నింతురుగాక కౌముది చెప్పిన గురువెవరు? వ్యాఖ్యానములు చెప్పిన గురువులెవరు? భాష్యమును చెప్పిన గురువెవరు? ఆతని వ్రాఁతలో . "వీరేశ్వరాత్" అనియున్నది ప్రకృతము యశఃకాయుఁడగు నావీరేశ్వరుఁడు మాయిరువురకు నొకింతయో మఱికొంతయో శిష్యుఁడే; అతఁడీతని గురువులలో నొకరుఁడగు నారాయణశాస్త్రిగారికిని గురువు. ఆనారాయణశాస్త్రిగారికి భాష్యాంతమును జెప్పి యితనికిఁ జెప్పెనో, లేక యిరువురకును గల్పి చెప్పెనో, కాక యితనికి మాత్రమే రహస్యముగాఁ జెప్పెనో? ఈవిషయము నొకదానినేని శ్రద్ధగలిగి తెలిసికొని యతనివ్రాఁతల తత్త్వమును లోకము గుర్తించుగాక తుదకీ విషయము నకుఁ బ్రకృతము వీరింబట్టిమాకు శత్రుకోటిలో నొకరుగా నున్న నారాయణ శాస్త్రిగా

లేని యంగీకరించినచోఁ జదువరులు విశ్వసింపవచ్చును. లేదా కృష్ణకవితండ్రిగారేని "మాఅబ్బాయి రామదుగుల వీరయ్య శాస్త్రులవద్దఁగాని వేఱొకరి వద్దఁగాని భాష్యాంతము చదివికొనియె" నని చెప్పినచో విశ్వసింపవచ్చును. ఇతనితోఁ జేరుటచే మా శిష్యుఁడు వెంకటరామయ్యకూడ నసత్యతత్పరుఁడుగఁ దోఁచుచున్నాఁడే కాని వాస్తవమున కతఁ డట్టివాఁడు కాఁడు వెంకటశాస్త్రిగారియొద్ద నీవెంతవఱకుఁ జదివితివి ఎన్నాళ్ళు చదివితివి చెప్పుమని యడుగువారున్నచో నిప్పటికేని నిజముచెప్పియేతీరును పైఁగా గురుత్వ గోపన మొనర్చుటకుఁ బ్రికృతము చెప్పుహేతువులను జెప్పఁడు. కృష్ణకవి వెంటనుండుటచే నిట్టి కర్మము తటస్థించిన దనియే చెప్పును. కృష్ణకవికి వెంకటశాస్త్రి గురుపరంపరలో వాఁడయ్యును బరిగణింపఁదగినంత గురువుకాఁడు. కావున నతఁ డెవరినో పేర్కొనియెను ఇతనికిఁగూడ వారే గురువులు గావలసి వచ్చినది దానితో లోకములోఁ గలకలముదయించినది అది తుదకు వీ "రీశ్వరవేరు" లగుటకుఁ గారణ మైనది, దానివలన నింత మునిఁగినది. ఇది సంగ్రహము ఎన్ని గ్రంథములేని దీనికే పెరుగుచున్నవి ఎన్ని యసత్యములేని యిందులకే వినియోగించుచున్నారు. అసత్యము నుపేక్షించుట పాడిగాదని మేము పరిశ్రమ చేయుచున్నారము ఆయా యావిషయములు ముందుభాగములలో విస్తరించియుండును గాన నిఁక ముగింపనెంచు చున్నారము ఇందక్కడక్కడ నుదాహరించిన "గురుగీత" అను వ్రాఁతప్రతిని మాకు యాదృచ్ఛికముగా నొసంగిన బ్ర॥ శ్రీ॥ నైషధం భాస్కరరావుగారికి మాకృతజ్ఞతావందనముల నర్పించుచున్నారము. ఆయా గీరతభాగములు చదువునప్పుడు చదువరులచ్చటచ్చట నుదాహరించిన యుత్తరములయందలి విషయములను బరిశోధించుచోఁ గాఁకరపర్తికి సంబంధించినవాని నెక్కుడు శ్రద్ధతోఁ దిలకింపవలయుననియు నందునను గృష్ణకవికి సంబంధించిన దేహబంధువులవి మఱియును శ్రద్ధగాఁ దిలకింపవలయు ననియు, ఆయా యుత్తరముల కితఁడు చెప్పు తప్పుటర్థములను జాగరూకతతో విమర్శించినఁ దత్త్వము బోధపడఁగల దనియుం దెల్పుచున్నారము ఇం దుదాహరింపకున్నను మా "వేపవరాగ్రహార శతావధాన పీఠికలో" 87 వ పుటలో నుదాహరించిన "ఆణివిళ్ళ సీతారామశాస్త్రులవారి యుత్తరమును జదివితిలేని కాఁకరపర్తిని బురస్కరించుకొని కల్పించి కృష్ణకవివ్రాయు తప్పుడువ్రాఁతలెట్టివో తెలియఁగలవని హెచ్చరించుచున్నారము. అగ్రిమము పండిత గ్రామముగుటకుఁగాని, అన్నదానవిరతము ప్రతిష్ఠకుఁగుదురుటకుఁగాని, మఱియేయితర యశస్సునకుగాని మూలకంద మాణివిళ్ళవారు అందులో సీతారామశాస్త్రులవారు సర్వవిధములఁ బూర్వులను బోలినవారు అట్టియోగ్యునకు మాయెడల నెట్టి గౌరవప్రవృత్తియో, ఆయుత్తరము

చెప్పును శ్రీకృష్ణకవికిని, ఆయనఘునకును గలతారతమ్యము సర్వబంధుజనవిదితము. ఇతఁ డేయయుక్తపుఁబ్రాఁతవ్రాసి యేమిచేయఁగలఁడు కానిఆయీ పరస్పరసంపర్కము లెఱుఁగని మాస్తులకొఱకై తత్త్వనిర్ణయమునకుఁ గొంతసామగ్రి చూపవలయును. గాన దిఙ్మాత్రప్రదర్శనమునకై యీచిన్నిపొత్తములను, జిన్ని పీఠికలను మేము ప్రకటించుచుంటిమి సత్యముకొఱకుఁ బరిశ్రమ చేయుట ప్రాజ్ఞలోక సమ్మతముకదా?

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం,
యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్ (ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః నాఽనృతం వదేత్

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరులు
శతావధానులు



# ప్రకాశకులవిజ్ఞప్తి

112 వ పుటలో 17 - 18 వ పంక్తులు ఈ దిగువ విధముగా సవరించుకో గోరెదము.

"జ్ఞానలవదుర్విదగ్ధులను సంశమునకు వారి శతఘ్నియే మొదటి సాక్షి. ఈ విషయమును దెలిసికొనఁగోరు వారు "పాశుపతమును" జదువఁ గోరెదము. పాశుపత మే — "

శ్రీమత్పరదేవతాయై నమః

# గిరతము-గురుదక్షిణ

## (1) ఆశీర్వచనపర్వము

క. కౌత్సుఁడు గురుదక్షిణ యిడ
నుత్సాహంబెంతయేనియును జూపఁగ "నో
వత్సా! వల" దనియెడి గుణ
వత్సలు వరతంతు మౌనివరుఁ బ్రణుతింతున్.

ఉ. "తప్పక కైకొనంగఁ దగు దక్షిణ దేవర" యంచు వేఁడుచే
తప్పుగనెంచి శిష్యునయిఁ దాఁ గను లెఱ్ఱఁగఁ జేసి "పొమ్ము తె
మ్మిప్పుడ కొన్నికోటు"లని యేగురుఁ డానతివెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవిశేఖరుఁ డెల్లజగమ్ము నేలుతన్

తే గీ. అంత ముక్కోపి, నంత దయార్ద్రచిత్తు,
నంత నిస్పృహు, నంత ధనైకలుబ్ధు,
శాంతు, సంతోషవంతుఁగా సలుపు కౌత్సు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు 3

క. గురుశిష్యధర్మముల నెఱుఁ
గరు పల్వురు పెద్దలిపుడు కలికాలవశుల్
తిరుపతిశాస్త్రీ ! వారల
కొఱకుఁ జామీ గిరతాఖ్యగురుఁ డేర్పడియెఁగా. 4

క. గురుదక్షిణమాహాత్మ్య * శి
వరామకవి నాకు విడఁగ వచ్చునకంటెఁగా
పరమానందమొసంగెడి
రుదక్షిణ చూపె "కాకకోకిలము" సఖా ! 5

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి)

*.... అట్టి బహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తనకుంగల గురు

క * కోకిలకాకముఁ గంటివె, యేకరగా నున్నదోయిహా ! యనినగరే
కోకిలకుఁ గాకియెడ గురుతాకల్పన మెట్లు కుదురఁదగునో యకటా ! 6

భక్తింబ్రికటింపమ బ్రి॥ వేంకటేశ్వరశాస్త్రులగారి కొనంగిరి కాని వారు వీభక్తియ
వాకు వేయిమ్నాట మహారులని గ్రహింపరయిరి

ఇట్లు, గొల్లపూడి లక్ష్మణశాస్త్రి

# * కోకిలకాకము

గీ॥ బలునకు మఱంది, కృష్ణునిబావ తెట్టి। యు నగు భీమునకోడి సుయోధ నుండు। ధైర్యమును గోలుపోయియెద్దానడాఁగి ! నాఁడొ యదియొండు ద్వైపాయన హ్రదంబు గీ॥ ఆమదువుచెంత నీరసంబైన చింత। కొమ్మపైఁ గూర్మిమైఁ గులా యమ్మొకండు। గట్టుకొని యందుఁ బలుగాకి కాకియొకటి। లాఁతికవులొక కొన్ని గొల్వఁగఁవసించు క॥ కాకవులు నాఁడు నాఁడును। నీకంఠస్వరము వర్ణనీయంబని త న్నేకొని యాడఁగ నదివిజ। మేకదె! యని తలఁచి వాయసేశ్వరుఁ డెగయుణా॥ గీ॥ క్రిమముగా గర్వమధికముగాఁగ గాయ। కోత్తముఁడ నేనటంచు నూరూర దిరుగు। కాకి పఱగాకిమూఁకలఁ గలపిమెలఁసి। కడకు గాయిక బిరుదమ్ము గట్టు కొనియె॥ సీ॥ ఒకసారి పొగరెక్కి శుకశారికాదులఁ గయ్యంబునకుఁ బిల్చుఁ గాలు ద్రివ్వి। యొకపూఁటు కాకవిప్రకరంబు తనతీరు వినుతింప మ్రొత్తిల్లు విఱ్ఱవీఁగి। యొక వేళ వెడఁగుబాలకుల గాలికి మువ్వ గట్ట మిన్నులుముట్టు గంతువైచి। యొకనాఁడు తనపాటలకు మెచ్చుపక్షులఁ జేరి "కా" యని కూయు నోరుదెఱచి। వేఱొకప్పుడుతన రూప విభవమెల్ల। వారుఁ గమఁగొని యచ్చెరువాటునొందఁ। దలఁచి పటపటఱెక్కలు దులుపుకొనుచు। నొక్క యెండిన చెట్టుపై నెక్కినిక్కు॥ క॥ ఏకడకు నేగినప్పుడో। రాకామరుల శౌధశేఖరంబుల వ్రాలుం। గాకవికటంబుగా మనకాకేశ్వరుఁడంతమాత్ర గరుడుండగునే? చ॥ కొలది యెఱుంగలేని యెలకోయిల యొక్కఁడువాయసేశ్వరు న్వలతియ కాఁదలంచితన వారలఁజీరికిఁగొక ముద్దుగాఁ। బవాకునవయ్యా గానమునఁ బొండితినెక్కుఁడు సంగ్రహింపఁగా। దలఁపునఁ జేసివాయసపవంబునకేగెమదంబుపెంపు నన్॥ ఉ॥ జ్ఞానములేని వాయసుఁడు గాయకుఁడంచుఁ దలంచివానితో। గానమునభ్య సింపఁగఁ బికంబనభిజ్ఞతనేగుదేరఁగాఁ। దాను గాయకుండనవితత్వము మార్పడఁజేసి

దానికిం। గానము సెప్ప సిద్ధపడెఁ గాకము లోకమువారు నవ్వఁగన్॥ క॥ లో కోత్తరమగు గానము। కోకిలడింభకము చేమవుకొనవచ్చుట నెం। తో కులుకుచు మన్నించెను। గాకిగుణం బెవ్వఁడేని కాఁదనగలఁడే॥ గీ॥ దివదినము మేతకై దేశ దేశములకుఁ। జనుచుఁ గలవారి ముంగిళ్ళఁ గువికిపాట్లు। వడుచునుండిన విదువక భక్తితోడ। గొలుచుఁ గోయిల విద్దెపైఁ గలుగుపేర్మి॥ ఉ॥ గొప్పకునెందుఁ బోయి వను గోయిలఁ దోకొవి పోవుఁగావి దా। నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచు నుంట నేమియున్। జెప్పదు కాకి కోయిలకుఁ జెల్లి యొకప్పుడు సెప్పఁజూచినన్। జప్పవి కూఁతదక్క సరసంబగు పల్కొకఁ డైనరాదుగా॥ గీ॥ ఎన్నఁటికినైనఁ జెవులకు నింపువింపు। నొక్కపలుకేవి తెలుపదాకో। యటంచుఁ। కోకిలము పుట్టె వాసతోఁ గొలిచెఁగావి। యెప్పటికి దావికోర్కి యీడేరదయ్యె॥ క॥ ఎఱుఁగదు పికపోతము దన। గురువునకుం గలుగువిద్యకొలఁదిఁ బసితనం। బరిగినఁపిఱుందనేయ। త్తెఱఁ గంతయు దానికొయ్యఁ దెలియఁగనయ్యెన్॥ గీ॥ కాకివైఖరి మన మెఱుంగనిది కాదు। కాకిగానము కొ్రత్తదిగాదు మనకు। గందుఁ గోయిలపిల్ల యక్కాలమందుఁ బసితనంబొటఁ దెలియక భంగపడియె॥ గీ॥ చాలఁ గాలంబు విసిగి వేసారి తుదకుఁ। గాకవికి గాఱతన మెట్లు గలుగు ననుచు। దెల్లమగుటయు మిపులఁ జింతిల్లి పికము। కాకమును వీడి తనవారిఁ గలసి చెలఁగు॥ గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల మవతరింప రసాలము నధివసించి। నరసులెల్లరు మెచ్చ స్వజాతిసులభ। మయిన గానంబు కిర్ణపేయంబు సేయ॥ ఉ॥ కోయిలపిల్ల మేలు తనకుఁ లభియిరపక యుంటఁజేసి య। త్యాయత మౌనసూయ హృదయంబుఁ గలంప నహర్నిశంబున। న్వాయసమూర్తి భూమిఁగల వారికిఁ గోయిలపాటఁ జేఁదుగా। జేయుతలంపునం జెవులు చిల్లులువోవఁగ గూయు నీగతిన్॥ గీ॥ విబుధ వరులార· కోయిలపిల్లపాట। కర్ణపరుషంబు. మున్ను నాకిడనె విద్య। నేర్చె. దీని కొకింతయే నేరుపు. కల కంఠముబు గౌరవార్హముల్ “కావుకావు”॥ గీ॥ చాలఁ గాలమునుండి ముచ్చటగఁ బాడు। కాకములసొమ్ము గానము. గాని మొన్న। మొన్న నాయొద్ద నేరుచుకొన్న పికము। కలరవమ్ములు మధురమ్ముల్ “కావు కావు”॥ గీ॥ కాఁకియొవ్వఁగలేక యిక్కరణి నెపుడు। “కావుకా”వవి కూయునకాని ధరణి। నెఱుగఁరాకొ కలకంఠము నెల్లవారు। వినరొకో। దానిగానము పీమలార॥ క॥ కాకము దనకొక గురువని యే కోయిల సెప్పు. నైన నేమి! యసూయం। జేకొవి పికిముం గాకం। బేకరణిన్ నిందలాడనే తలపోయున్॥ గీ॥ కాకి యొకనాఁడు

కోయిలకడకువచ్చి యా॥ పికపోత ! నీగర్వమధికమయ్యె। తొల్లి గానంబునెల్ల
వాతోడ( జదివి। కృతఘ్నుండగవు నీకింత కేరడంబె ?॥ క॥ అంచూ గించు దనం
బున(। బంచపు(గదలించి వాయసము దన్నుకా యా। చించిన నొజ్జపోకము( బ్రచు
రించెద నని కోకిలమ్మ రేపుకా మాపున్॥ ఉ॥ లే(కువగల్గువాడు పరదేశములం
బరియించు వా( డతి। శ్లోకు(డు( వే(పపండ్లుదిని చొక్కెడు కాకవిసార్వభౌము(డే।
నాకు గురుండు నమ్ము( డనినన్ మన కోకిలపాక, మేలొకో। లోకమువారు నమ్మ
ఏది లోపముకాదుగ వారిబుద్ధికిన్॥ ఉ॥ కాకము గాయకుండ(ట। పికంబునకుం
గురువంట। తన్ను సు। శ్లోకులలోన వాకొనవిలోపము కోయిలపిల్లదంట। తా।
నే కడుధర్మవర్తియ(ట॥ యిద్ధగుణుండ(ట। వింటిరయ్య। యీ। సా(కులబంప(
జెప్పుకొనసాగిరి లోకులు ఎంతవింతగన్॥ క॥ కోయిలకుం గురు(డను నే।
నే యని యెప్పుడును జాటు నెల్లెడలను గా। నీయేరును బాటింపమి( బాయని
రోసమున( గల(తపడు వాయసు(డున్॥ క॥ ఈ యున్నతబివి గండుం। గోయిల
కాకము ననుంగు(గొ(ంగంగవి యెం। దో యొత్తిలి నగెన(ట, యది। యేయొకరంధ్రి
ముగ విగ్రహింప(గ(దొరి(గెన్॥ ఉ॥ కోకిలమట్లు కయ్యమునకు న్మది గొల్పదు
మద్దులొల్కు(గా। వాకొవి యెల్లలోకులను వశ్యులజేసినదయ్య వెప్పుడో। కాకము
నొద్ద నొక్కపరి గానమునేర్వ(గ( బోయియుండుటన్ గాకికి( గోకిలమ్మనకు(
గయ్యము తియ్యము గాక యుండుటన్॥ క॥ అదికారణమ్ముగాదు। న్నెదురగలేదని
తలంచెనేమో ? కాకం బొదిగి పికకూజితమ్ముల। వెదకివెదకి చూపసాగె వెఱ్ఱిదొనం
గుల్॥ చ॥ ఎఱు(గదుగాక కాక మొకయించుకయేనియు నాత్మశక్తి; వా దెఱవ
నవస్వరంబులుగదే। తనకుం బొడసూపు। గాయకో। త్తరకలకంఠనాదమున( దానను
దప్పులు వట్ట(జూచినన్। గరుసగునే పికస్వర వికస్వర మెవ్వరికేని యంతలోన్॥
క॥ కాకమొకవక్త్ర, కోయిల। మూకంబని మదిదలంచు మొఱకుల(దెలుపన్। లోకో
త్తర మగుపణితివి। కోకోయని కూయసాగె( గోకిలమంతన్॥ ఉ॥ చేపెదుచేత
యుత్తములచిత్తము నుత్తలపెట్టుచుండుటం। గూపెదుకూ(త కర్ణములకుం బరు
షంబుగ( దా(కుచుండుటన్। వాసియు వన్నెయుం గలుగువారలు "హం"షనిపాఱ(
దోలినన్। వాసరివారు లేరవి మె వమ్మున వాయసు(డేమిచెప్పుచున్ ?॥ క॥ కొం

సీ తాను నాయొద్ద వృధాగ శుశ్రూష చేసెనె కాని విద్దె చెప్పవఁట ! నేను
విద్దె చెప్పుటకేమి కొద్దిగానై నను జ్ఞానంబు గలవాఁడఁ గానఁ శేమ
పారబాటుచే నాదు చరణ మంటెనెకాని తా నంతమున్నె విద్వాంసుడంట !
పొట్టకై తిరుగు టెప్పుడు నాదుపవియంట ! యక్కటమ్మ నన రవంతయైన
తే గీ విద్దె చెప్పనెలేవంట ! విసిగిపోయె
నంట ! చెప్పిన ముక్కైన నంత మంచి
ముక్కగాదంట ! చప్పనిముక్క యంట !
పి పఁ దియ్యనిముక్కలు చదివెనంట !

సీ. పసితనం బరిగినపై నేను మూర్ఖుఁడ నని తాఁ దెలిపెనంట ! యంతమీఁద
భంగపడితిఁగదా ! భగవంతుఁడా యంచుఁ జింతించి చనెనంట ! యంతలోన
సంతంబు ముతువంట ! జాతిసులభమైన విద్దె యబ్బినదంట ! పీను లలరఁ
గవిత చెప్పెడినేర్పు కలిగి రసాలంబు నాశ్రియించినదంట ! యకట ! "కంచి
తే గీ. గరుడ సేవయె" కాని నాకాళ్ల ఁబడిన
ఫలము లేదంట ! యెందుకో తెలియదిట్టి
పాడు వ్రాతలు, విన్నవార్లోడువంక
దృష్టి విగిడింతురవియేవిఁ దెలియఁబడదొ !

తే. గీ ధనికులగృహమ్ములఁట, యేను గునికిపాటు
లచటఁ బడుచుందునఁట, ద్వారమందుఁ, దాను
భక్తితో నప్పుడుసుగూడఁ బాయకే యొ
నర్చునఁట సేవ, ఫలము సున్నయఁట తుదకు !

సీ. తన సిరికోర్వగ తప్పులు తన కబ్బములను బడ్డెదనంట ! యెలమి నొకట
నెట్టులేనియు నన్ను నీవు దేశికునిగాఁ జెప్పికొమ్మంచు యాచించితినట !

---

గొంగురనుచుఁ గూసెడు! కొంగను ముంగిటల మెలఁగు కొంచెప్పఁగాకిన్! బం
గారు పంజరమ్మున సింగారింపఁగ వెవండు చిత్తముఁ గొలుపుకా ! తెలిసినతాను
గానమును దెల్పినదేయగుచో! గొలువకయున్న దోనమది కోయిలపిల్ల దె కా!
తలఁపఁగరానికూతలను దత్తమెయింగక కో ! కిలమును దూటి వాయనము
కీరితిఁ జెంపునొకో !

శ్రీ పీఠికాపురసంస్థాన విద్వాంసులు, వేంకటరామకృష్ణకవులు.

తాను గోకిలమాటఁ దప్పంట కాకినౌ నను గురుగాఁ జెప్పికొనెడు నెడల ।
నయినను జెప్పుట కంగీకరించెనం, టామీఁద లోకు లీయంశము విని

తే. గీ "కాకమఁట । తాను గురువఁట । కోకిలకఁట ।
యిందులకుః గోకిలమొకింత యేవి సిగ్గు
లేక యెటు చెప్పికొనియె సుశ్లోకులకడ"
నంచు నచ్చెరు పడిరంట । యనఘులెల్ల

క అచ్చెరు విటఁజెందెడి యో, సచ్చరితులు । మీరుఁగూడ జగమునఁ గలరే ।
హెచ్చెములేక వచింపుఁడు, చచ్చెనెపుయెడలఁ గూడ జ్ఞానలవంబుల్ ?

క. గురుపుణ "గురువని" చెప్పివ, దురితమ్ము సహింపరోటు । దుర్మార్గముగాఁ
బరికించితిరే మీరలు, సరిగా వచియింపుఁ డయ్య । సజ్జనులారా। 12

క. క్షమియింపుఁడు మీరుమ లోకమునం దున్నారటంచుఁ గాంచనుజుం దో
యమలాత్ములార । యీ యకశ్రిమపుణ వాశ్రితలకుఁ జేయి కదలాట యెద్లో

సీ నాకంరరవము వర్ణవ పేయు పిరెల్లఁ గాకవులంట । యక్కటతన నాకు
గర్వం బెదిగెనంట । కాలికి మువ్వంట గట్టినారఁట । పలుగాకినంట ।
పటుతరంబుగ నేను బటపట తెక్కలిదులుపుకొంచును జరింతునఁట। యకట,
తాను నాయొద్ద విద్యను నేర్చుకో రాఁగ మన్నించి చెప్పు నెమ్మంచితనము

తే గీ గూడఁ గూడనిపని యంట । గొప్పకంట
తన్ను నే వెంటఁ దోకొని తరలు చెల్లి ।
నంతియేకాని చెప్పలేవంట ముక్క ।
యెక్క డున్నాఁడొ భగవంతుఁ, డెందు లేడొ ।

క. ఔరా భగవంతుఁడ । నీ, నేరుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభమాది యిప్పటి కీరీతి మహాత్మ్మ జగతి కిచ్చిన కతనన్ 15

క. మంతనపు పంగతుల వలు, సంతయుఁ దూచాలు తప్ప కంతయు నే సు
స్వాంతుండెఱుంగు నాభగ, వంతుండున్నయెడఁ దెలియవలయున్ని జముల్

క ఎంతో నీచ మగు తటా, కాంతరముచ నేన్గుపావ మల్లన గొనుచు
శ్చింతము నెుపలి నెఱుఁగు భగవంతుండున్న యెఁడ దెలియవలయు న్నిజముల్

క, ఇంతి దుశ్రిపవాత్మజాతి న, భాంతరముప దున్నపేను నవమానంపుం
గంతులకుఁ దావఁగల భగ, వంతుండున్న యెడఁ దెలియవలయున్నిజముల్

క భ్రాంతిఁ బ్రాఁజదువు లదఁ న్వంతునిలో డాఁచు దొంగవాని నసుర దు
శ్చింతుని గనుఁగొను నాభగవంతుడున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలసందున నరి య
ల్లంత నిఱుకుచెఱిగిఁన భగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క. సంతమసములోన మద, న్వంతునిలో నుండుకొండవ్రిక్క జరుగు వృ
త్తాంతమ్ము నెఱుఁగు నాభగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క, ఓయీ తిరుపతిశాస్త్రీ! నాయీ శిష్యుండుఁ కాకి నామము నాకున్.
వేయాఱు లిచ్చుటకు బదు, లాయుర్భాగ్యములు గోరి యర్పణఁ జేసెన్ 22

ఉ. ఏనును నీవు విక్కపుఁ గవీంద్రులమే యగు టొప్పు నేవి దు
ర్మాని మదీయశిష్యు నపరాధ మ దెంతటిదైన నేమి య
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి వినుమ్మను సద్యశఃపరా
ధీనులఁ జేయుఁగాతఁ బరదేవత శిష్యుఁ జిరాయుఁ జేయుచున్. 23

మ. మనలం దిట్టినఁదిట్టుఁగాక, తగ నస్మచ్ఛిష్యుఁడౌ నీతనిన్
ధనధాన్యాదిక మాయువున్ సిరియు విద్యాబుద్ధులం గూర్చి వృ
ద్ధిని నందించెడిఁగాత మాత, గురుభక్తిన్ వచ్చుజన్మానకే
ననుసంధించుతఁ, గీర్తియుం గలుగుఁగా కానాఁడె యవ్వారిగన్ 24

మ. కలుగుం గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపాకంపదల్ !
తెలియుంగావుత మేరికన్నఁ గవులే దేవాంశసంభూతు లం!
చిల సీతేఁ దొనరించు పుణ్యములె మాయీశిష్యు దుర్దోషపుం
గలికాలంపుఁ బ్రివర్తవం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్ ! 25

సీ మొదలంట నదుగంటి మూలమూలలనుండు వేదశాస్త్రమ్ములు వెలికివచ్చె
మనకు దిక్కెవ్వరో యనికుందు నాంధ్రికవుల కవిత్వము నేఁడు వెలికివచ్చె
నెందుకు సృష్టించె నీమమ్ము నని తిట్టువందురు ననదలవంత లడఁగె
నెట్లువిల్చెదినొకో యీపాతశాల లిమ్ములనన్న శాల లుజ్జ్వలత కెక్కె

తే గీ నెవని కతమున నట్టిమనీషిపాద
రేణుపావితసత్పథా శ్రీవికాసుఁ
డార్యసూర్య రాయేంద్రు వనర్ఘసుకృత
మగునుగాక మాశిష్యుని కంగరక్ష!

క. ఇఁక పీయవస్థవినుమా : బకమైతివి—పీవు, విన్నుఁ బకపక నెపుడో
వికవికతము పొగరున నెం, దుకొ నవ్వినవంట : యెఱుఁగుదువె,యదిసఖుఁడా!

క. అదియేకారణ మఁట : పీ, మది గలుగుఁట కక్కరమున మచ్చరమునఁ ద
మ్మెదిరింప రండటంచున్, గదనమునకుఁ బిల్చి తంట : కంటివె యిదియున్?

క. ఎదిరించెడి నేర్పదియు, న్నది యట : చదు వబ్బకున్న నపెయే పోయెన్
గదనము గురుకోఁ జేయఁ ద, గదు పొమ్మని మానెనంట కంటివె సఖుఁడా!

క. ఎంతటి తెల్వియొ చూడుమ , యంతేవాసిత్వ మాతఁ డంతో యింతో
యెంతో నా కొనరించెను. జింతింపఁగ నేఁ విన్నుఁ జెనకుఁట కనఘా! 30

క. గాంగేయు నెఱుఁగఁడో : పా, ర్థుం గనడో : భారతమున, దొంగప్రసంగం
బుః గనలేరే లోకులు, "మంగలిమాధ్యస్థ్య" మనుచు మది నెంచెనొకో!

క. నందియు మందెను సరియే, పందవలెన్ వదరుపట్ల భయ మది లేదో :
యెందుల కీవ్యాస మ్మిది, పందతనము తెలుప దొక్కొ దాలునకేవిన్. 32

క. భారతమున నున్నదొ యిది, గీరతమునయందుఁ గలదొ కేవలము గవి
ద్భారతి వ్రాసినదేకద :, మోఅకు లనరొక్కొ వివిన బుధవరులెల్లన్?. 33

క. అన్యాపదేశ మన వి ట్లన్యాయపువాఁత యగునె? యకటా, విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీరమ్మన్యులకున్ మంచిచెడ్డ మహిలోఁ గలదే :

క. ఎవఁడేడ్చెఁదన్ను, "శిష్యుఁడ నవుదును నేనని వచింపు" మని, లేదని లొం
కు విధముదీనికి నెంతో, నవిశేషముగాక యున్నె? జఁడు దెఱుఁగు నెటుల్.

చ. "చదివితి విక్కమే, గురుఁడు చప్పవిశూఁతలు సెప్పినాఁడు నే
నదివఱకే కలావిదుఁడ" నంచు వచించి వికత్వ మూని దు
ర్మదమునఁ గాకిఁగా గురువి మాటికిఁ జెప్పుటకన్న నొప్పదే
"చదివినె లే"దటన్న విది సత్య మటంచుఁ దలంచెనో కదే :

ఆ. వె వల్లకాటినత్య మిల్లు వట్టేటిలోఁ
గట్టికొన్న పగిదిఁ గానఁబడెడి
నెల్లవారు నగరె : "యిహిహి" దురాగతం
బనరె? యేరు చెప్పిరకట యిట్లు : 37

ఉ. కొంగఁగ విన్ను బేర్కొనిరి. కోరివవాఁడవు పీవు వారితో
పంగర, మందులోఁ జొరఁగఁ జాలమికిన్, "బికమేడఁ గాకితో

నంగర మేధ" మంచుఁ దెలుపఁగా లిఖియించిరి హేతు, విూతలోఁ
గొంగవు కాక వెట్లయితొ ? గొంగ యవంగను శతృవందుకో 38

క. అటుమీఁద శతృవునకుఁగా, దటకాపది మూలఁబడుట తథ్యము కాదే ?
యెటు వ్రాసి కొన్ననేమి క. పట మెఱుఁగం బడదెఱఁగము పాషాణంబే

తే. దోమ యేనుఁగుకడ కేగి దొరకువఱకు
రక్తమును గ్రోలిలవిచ్చ. భద్రిగజరాజు
నొడలు తనపాలుచేసె. నీవెఱఁగుదోమ
పాటుతుండంబునకు లేదు పాటవంబు. 40

కి నాకును దుండంబున్న ద, నేకపరాజునకుఁ గలద యని యాపై
డీకొని పోరఁగఁ బొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా ?

---

## (2) సూర్యారాయ పర్వము

సీ. అకొండివారింట నాకంతముగ మెక్కి సత్రింబు చెప్పిన జాణతనము
మధునవంతులసూరబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి సున్నయిపుడు
అటుపోఁదఁ దాఁ టీకంటై నన్నుఁగాకంబుగా వ్యాసమునుల వ్రాయుగాణతనము
ఆవ్యాసములుగూడ నట విట గోమయోపకపేషనము గోరు వెకలితనము

తే గీ. గాంచి "యేమి దురాగతం" బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా ! యని వగచుచుండ
దొటకె వొక్కఁడు మాజీపీఠ్పురమునందు
దొర, రవజ్ఞుండు, సత్కవిచరణరతుఁడు. 42

క. విరవయను సూతుకాఁపుర, మదసినవాఁడతఁడు సకలమగు కావ్యములుగా
సరిగారు వెలమలుగా ఠీ, వరు లతనికటన్న ఖడులవాకొననేలా ? 43

క. ఎఱుఁగవె ? సంస్కృతభారత, పరమార్థజ్ఞుండు రావు వంగదమున నీ
పరిసరమునఁ గలవొరలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెంచన్. 44

ఉ. వెంకటసూర్యరావు సుకవిత్వవిదుండగు రామచంద్రినా
మాంకుని స్యాలకుండు ధనమం దెటులైనను బీఠికాపురీ

పంకజబాంధవుం డనఁగ భాసిలు తేజికి ధర్మమూర్తికిన్
వెంకటసూర్యరాయనికి విందు వివేకి * యథార్థవాదియుఁ. 45

క. ఆతం డడిగెన నన్నె, నీఁక, బూతుల పంచాంగములను బొగరుల వగలున్
జాతురికిఁ దక్కు కోఁతలు మూఁతంబడు నమ్మడతఁడు బొంకుంగూఁతల్

క. "దానన్ లాభించే మని, యా" ? నీవడిగెదవు, వారి కాపై నేనిన్
జ్ఞానంబు గలుగు నటియాన్, దానన్ యశమబ్బునటియుఁ దలఁచెద సఖుఁడా !

గీ ఎఱుఁగు నీతండు నాయొద్ద నెంతవఱకుఁ
జదువుకొన్నాఁడొ, పిదప నీసాహసమున
కెట్టులొడిగట్టి పాపంపు గుట్టనెక్కఁ
దలఁచుచున్నాఁడొ, సర్వమ్ము తథ్యముగను. 48

క నాకడకు వచ్చునప్పటి, కీకవి జ్ఞానంబదెంతొ, యాదెంతయొ, నా
కాకత్వ మితవి కోకిల, పాకత్వముగూడ నెఱుఁగు భవ్యుఁ డతండే. 49

---

* "మహారాజశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి శిష్యుడు రావు వెంకటసూర్యారావు కృతానేకవందనములు ..... .నేను యిచ్చటకువచ్చి వారంరోజులుఅయినది. అదిమొదలు యిప్పటివరకున్నూ, అత్యద్భుత శతావధానుల దర్శనం చేదామని ఎంత యత్నించినమూ నాకు సందర్శించ్క పోయినందున రెండుసార్లు వారిబసకే వెళ్ళినను. సమావేశం కాలేదు. కారణంనేను వ్రాయచాలను. ఇంతకూ అట్టిలాభం నాకు ప్రాప్తించినదికాదు అని అనుకున్నాను పరిస్తుతం చాలా పశ్చాత్తాపంలోకి వచ్చినట్లు నా ఆప్తులవల్ల రూఢిగా విన్నాను. నేను వక్కసారి సమావేశమయినచో ఎంత అందముగానైనా యుండును గాని వీలుపడ్డదిగాదు. వక్కసారి సమావేశమయిన యెడల మీకు నేను శిష్యుడనై నందుకు గురురుణంబు తీర్చుకొనినవాడను అగుదును. ఆపని ఈ సమయంలో నెరవేర్చలేనందున నేమున్నూ వారివలె గుర్వువిషయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది.. .... . నా అప్తులున్నూ నేనున్నూకూడ మీగిరతమునే త్వరలో చదివి ఆనందించు కుతూహలంతో యున్నాము. గిరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్నపండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతి యావత్తున్నూ చెప్పినాను. అటువంటి గ్రంథం బయలు దేరితే లోకమునకు ఉపకారమవుతుంది అని అన్నారు. అంతా...... వేస్తున్నారట .... ." రా॥ వెం॥ పిఠాపురం. 16-1-11.

ఉ. ఏ నలనూజిపీడుపురి కేగి వధానము సేయునాఁటి కి
జ్ఞానిశిరోవిభూషణము చాతుర్రిఁడుగాఁ జనుఁదెంచెనాకు వి
జ్ఞానము బోధసేయుటకుఁగా దయ గల్గిన వాఁడు గాన, వి
ద్వానివి సూర్యరావపుడు వాత్తవపక్కఁని జూచినాఁడటఁ 50

శా. సూరిశ్రీసకలప్వవేత్త యగు ఏసూర్యందెసూః పూర్వ మ
ప్పారాయేంద్రుని సన్నిధానమునఁ గాపట్యంపు విద్యాఖనిఁ
శ్రీరామాఖ్యశతావధానివనఁ దేల్చెన్; పీఁద నాసూరి న
ప్పారావొక్కఁడె కాక తన్నగరమే వాకోదు తత్వజ్ఞుఁగన్. 51

శా అప్పారావు సవంతరమ్మునను విద్యావేదు లై నట్టి నా
రిప్పారావును, నమ్మహాత్ము సమజాం దైనట్టి సింహాద్రి శ్రీ
యప్పారావును జూడవచ్చె నితఁః దయ్యార్యుల్ "భవచ్ఛక్తిమా
కొప్పఁగ జో" దని తండ్రిశోల్కినని రామ్యుల్ తత్త్వమూహింపరే

ఆ వె. శతసజ్జమూర్తియే కాదు శ్రీకూచి
తులూఁడు నారసింహకోవిదుంసు
గూడ నెఱుఁగు నితనిగురుతయు, నాశిష్య
భావ మడుగ నతఁడు పలుకు నిజము

క. ఎవ్వారుపలుక నేటికి. అన్వయుపట్టుమ విదేల రసికులకు ? వసుఁ
బుద్విఁగఁ దిట్టిన వ్యాసమె, మువ్వుఁ గట్టికొని యట్లు మొఱుఁగుసనుండఁడన్

మ. ఎవ రీకోకిల ! శ్రీమదోతెటి కులాహీనాద్రిరాకావిధుం
డపు శ్రీ వేంకటరామశాస్త్రియను లోకాహ్లాది; కాకం బెవం ?
డెవఁడో యెట్లగు శాస్త్రిగారి గురువౌ ఏవేంకటేశుండహో !
యెవఁడీ కొంగ ? దివాకరాన్వయమణీ ! యీవేసుమీ శ్రీపతీ ! 55

సీ నాయెడఁ దాఁ గృతఘ్నత్వనామక మహాపాతకియౌట విస్పష్ట మంట !
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గమట తప్పనిదెయంట !
అంతియె కాని నాకాతఁడు శిష్యుఁ డం చని నేను జెప్పు టనవ్వమంట !
పైదానఁ దనకీర్తిఁ బ్రిబలించునేకాని నాకు యశంబు సున్న యగునంట !
తే. గీ. ఔర ! యెటువంటివేదాంత మభ్యసించె ?
"నేమి శాశ్వత మాగోడ యుంచుకంత

యవల జరిగించి పెట్టికొం"డని వచించు
వెఱ్ఱివేదాంతితన మిట "బజ్జు" మనియె. 56

### (౩) సంబుద్ధిపర్వము.

క "మావాఁడతిదుర్మార్గుఁడు, మీవాని శిరమ్మునందు మేకులు గొట్టం
దేవేళ నేమి చేయునొ, కావలమున" నన్న నీతి గనఁజేసెదవా! 57

ఉ. వేంకటరామశాస్త్రి! విను విద్యపఠించితి నంచు నొప్పుకో
జంకియుఁ గోకిలమ్మవయి చక్కఁగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "బొప్పెపెమెమ్మెమె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి; వదిచాలు జయం బగుఁగాక నీ కికన్, 58

ఉ "కాక" మటంచుఁ దిట్టుదువుఁ గాక, శ్వపాకుఁడ వందుగాక, యిం
కేకలుషంపుపేరు లిఖియింతువు గాక! స్వకార్యసిద్ధి నేఁ
జేకొవినాఁడ నేఁడుగద! చేకుతె మోదము, నీవు తిట్ట లే;
దీకవి నీతఁడే యురక యిట్టులు తిట్టుకొనెన్ గుమాసకా! 59

ఉ. "చప్పనికూఁతలే" యనుచు ఛాత్త్రుఁడవై గద! నన్ భజింపుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటి కయ్యు నీవు నీ
చెప్పును గావి నాదరివి శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టి తిట్టులకహో! యిటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే! 60

చ. "మొదట రిజిష్టరుత్తరము" మోటుతనం బగుపట్టకుండ నేఁ
గద లిఖియించి తిర్పతిని గయ్యముకై పురికొల్పినాఁడ; నీ
వది గని యెంతగా బెదరి తయ్యయొ! పాతకినైతిఁ దండ్రి! నా
యదయత పైపుమయ్య! యిఁకనైనను భీతివిమాను మప్పతా! 61

చ "తిరుపతిసింహ మొక్కమొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమువనున్న నాపయి 'గుబుక్కున' దూఁకు" నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు "నీ
శ్వర" యను పేరుసుమ్ము నిను జంకఁగఁ జేసినదేమిచేయుదున్. 62

శా. నీయజ్ఞానము నీదులోభగుణమున్ నీదౌ కృతఘ్నత్వమున్
నీయల్పజ్ఞతఁ జేసిగాక యకటా! నీమీఁది కే మంచు యు
ద్ధాయత్తుండయి రాఁగడంగు నొకఁడే నవ్వానిఁ బాత్రిణాలతో
డాయన్నిత్తునె? నన్ను నీడిగద! కట్టా! చెట్టవైతింతకున్. 63

చ. తిరుపతిసింహమున్ వరిగఁ ద్రిప్పి వశీకాంతిమొనర్ప వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీవకు నోజ గూర్చు నీ
గురునకుఁ జర్లచందురినకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్? దురు
ద్ధరం మది, నేను దానిబలుధాటికి నొక్కొకవేళ జంకెదన్. 64

ఉ. కాఁకరప త్రిపై కుఱుకఁగా గమకించె నెఱుంగుదే? "శత
ఘ్ని" కృతి సాహ్యక ర్తలను నీవును బావయుఁ బోలె "శృంగభం"
గాకలనపరిసంగ మది యజ్ఞతమై లిఖియించినట్టె వా
పోకయ వోయినట్టులుగఁ బూర్తిగ దేఁకిరి జ్ఞప్తియున్నదే? 65

ఉ. వెంకన బందు వౌకతన వేఁదుఖవారిఁత లొకింత సైఁచు; మీ
ర్థంకుటగాఁ దలంచి పెలుచం గుఱుచల్ లిఖియించుమందురి, మీ
పెంకెతనాలు సాఁగ వల బెబ్బులిపై. వెలనాఁటి సింగ మి
ట్టింకుల నింకఁజేయు నెపుడేనియు; దొంకలెసూ! శరణ్యముల్. 66

ఉ. ఏది, సదుత్తరం బతని యేత్తెలవారిఁతకుఁ జెప్పుమా? శిర
శ్ఛేదమకాదె వందె మిదె! సిగ్గు గలట్టి నృజన్ముఁడేని* "మీ
రే దెసకేని బొం" డమచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాముని పేరు పెట్టి! యపురా. యిపిరా! చవిరానిబీరముల్. 67

ఉ. "పొందల పీతికాపురికిఁ బొం డటుపొం" దని నీదుబావ బా
వొందొకలేఖవారిపె. నది యూతఁగ నయ్యెడ కేగుదేర న
వ్వందొకా పేఁడు "మీ రిటకు వచ్చితి రేటి?" కటంచు, నెందుకీ
గండతనంపువారిఁతలు జగంబు మొగంబుల నవ్వుచేటు సూ. 68

చ. "పిలిచినయప్డు రాక యటు† బెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలపతి "పీతికాపురముచక్కికిఁ బొ" మ్మనినట్టు లెవ్వరో
గిలికిన వచ్చువాఁడవె? నగించెడి నీమవరిసక్తి" యంచు న
వ్వల నల పేఁడు నవ్వలరఁ బల్కిన నుత్తరమేది పుత్రికా.! 69

* గీరతము, 1 భాగము శాఖాసంక్రమణపర్వముచూడుడు.

† శ్రీపితాపురీ రాజపుత్రోదయవిషయికపద్యత్రియము.

సీ॥ ఉదయించె రాజారావూదవ్వయోచవ్వ దళివర్ధనుండుసూర్యాంశవలన
జన్మించెసంతానశాఖి నందనకుశశ్రీ పెంపుమీఱఁ బిఠాపురమున। పెరలెఁ

ఉ. కరుణ గలట్టి మెత్తవగుకాకిని గేరద మాడినట్లు గా
దరయఁగఁ గొంగపై కరుగు టంచని పూర్తిగ బుద్ధి వచ్చియున్

---

దమానసంభవుఁడు సూర్యనందు నారాయణాంశం బున్నదంచుఁ దెలుపఁ, బొడమె నాంచాలమ్మకడుపు చల్లఁగ రాజనన్యంబు సజ్జన క్షేమ మడఁప॥ గీ॥ మంగమాంబ గణించిన మానినీయ। సుకృతపరిపాకమెల్ల నేఁటికిలభించెఁ। గంటికగపడె రావు గంగాధరోప। పదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తవిసె సాధారణం బసాధారణముగ। మఱియు వందుమ నాశ్వయు జ్మాసబహాళ। పక్షముఁ దృతీయయును శుక్రివాసరంబు। మకరలగ్నంబు సూర్యసంభవువివలవ। మ॥ గురుడుగా సూర్యుఁడుఁ జంద్రుఁడున్ గుజుఁడు శుక్రుండున్ బుధుండున్ శనై। శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యశాంతంబు వీబాలుని। నిరిదీర్ఘాయు వొసంగి, ప్రోత్తురు బుధాశీర్వాదమున్ తోడుగా। వరవిందాక్షవతుం సహాయు లయి సూర్యారాయభూపాలకా।

25-10-10 }
కాకినాడ. }

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.
శ్రీరాజా కొచ్చర్లకోట రామచంద్ర వెంకట
కృష్ణారావు బహదరుగారి యాస్థాన విద్వత్కవి

True copy of letter from the private Secretary to the Rajah of Pithapuram dated 29th October10, addressed to Brahmasree Satavadhani D. Tirupati Sastri Garu.

"I am desired by the Rajah to convey his thanks to you for your congratulatory verses on the occasion of the birth of his son and heir"

(శుభలేఖ పంపినప్పటి విజ్ఞాపనము)

మ. ఘనవంశావళి గల్గువాఁడవని చక్కన్నీదరిఁ జేరి పే। రినచియ్యెత్తిన దుర్గజమ్ముల నతికిరిడావినోదమ్ము గా।। దునియల్ సేయఁదలంచుమండినమృగేంద్రం దూరకే వచ్చిపో। యన గర్జింపవె? యెప్పుడేవి యుశఁదల్లి వచ్చు భూభృన్మణీ

తి॥ గా॥

దిరిగియు * "జార్జి" పద్దెములఁ దేఁకువమాలిదొసంగులన్ గనం
బఖువఁగఁ బూను మీకుఁ బరువా ? కరవా ? తెరువాటుదాఁటులన్.

ఉ. "ఈశ్వరపేరు లున్నయెడ శేగుఁ" డటంచొక బంధుమాతృవిన్
బశ్వపతారు నూఁతగొని పల్కితి; రాతవిచెయ్వు లన్నియుఁజా
శశ్వదుదారకీర్తుల ప్రసంగములో బయలయ్యె వింటి లో
కేశ్వరు డెట్టిచుట్టఱిక మేర్పడఁజేసె పెబాసు ; మేల్ బళీ ;

క విను సీపినతండ్రికుమా, రుని గనుఁగొమ మతఁడు చెప్పు రూఢిగఁ, దావృ
ష్టును నలతిర్పతిఁ దిట్టం గనుబూన్చితి రెంతకేవి గలవారుసుమా.

క అతఁడేల చెప్పవలె ? నం, స్కృతవిశ్లేషావధానధృతవిచారసం
గతిగతి కాఁకరపర్తి, స్థితనుకృతనేతృ మడుగఁ జెప్పవలెఁజుమున్.

ఉ. అట్టిఁడతండు కావునవె యాతనివార్తిల్ గలయుక్తరమ్ము మా
పట్టుననుండె నం చెఱిఁగి బావ "యతం † డది వ్రాయలే" దటం
చొట్టుబు సత్యముల్ గిలికి యుత్ప్రథవారిగ దూఁకఁ జొచ్చె "పీఁ
దిట్టఁడు బొంకి యాత్మనెటులేని యశం బొడఁగూర్చు" నం చొగిన్.

క తావృశులుదక్క సీ దు, ర్వాదములకుఁ దోడుపూవరా; రతఁడేవిన్
బాదాకారింతత కొడఁబడి, పీదగు నఘ మడఁచెఁ గొంతనీతి గలాఁడే ;

---

(*కవితా పత్రికలోని "అట్టహాసము" నుండి)

* ఈపద్యముల్వ్రాసిన మహాకవియెతడో యని యాలోచించుచున్నట్టున్నారు. ఈయన పోలవరము సంస్థాన పండితుండు దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారు .పరి యాచకమున కేమిగాని యీపద్యము వెనుకటిదానికన్నను దుస్థితిలోనున్నది. . ఇట్టి తప్పులతడకను బ్రకటించి నందులకుఁ గొంకియే కాఁబోలు విశేషజ్ఞుఁడనిపించుకొను చున్న వేంకటశాస్త్రిగా రీపద్యమును దోసిరాజని కృష్ణాపత్రికలోఁ దక్కిన "పద్యము లను మాత్రము ప్రకటించియున్నారు. (ఇట్టివనేకహాస్యములు)

† తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజష్టరు జాబు వ్రాయుట చేఁగాని యాతఁడు వ్రాసినట్లు యధార్థవాది యభినవ సరస్వతిపత్రికలోఁ బ్రకటించిన యుత్త రముచేఁగాని ప్రయోజనములేమ ఆయుత్తరము సత్యాసత్యములు సమయము వచ్చి నప్పుడు తేలకపోవు .

(నవంబరు 24 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

చ. కలతెలుఁగుగా లిఖించె నలకాతరుఁడక్కట! పేరుపెట్టి యె
వ్వల నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తిప్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సందియ మందఁగఁ బోలుఁ బాప! మే
కొలఁదియుఁ గాని త న్నెదురుకొన్న జగంబు మఱింతనవ్వదే!

క. తిరుపతి ధోరణి తెలిసెనె, "శర" యని పేరావకై యశస్కరుఁడతో
దరి విడినబావమఱఁదినిఁ, బొరిఁబొరిఁబలికించి కాచి ప్రోచెగా గరుణన్.

చ. అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జామి యాత్మకు వెంకననామ మీని నీ
చతరపికాభివర్ధమని ‡ సద్గురుఁగా లిఖియించె, దానిచే
నితనికి వాఁడు తక్కువని యెంచుచుఁ బిట్టితి వెంత బేలవో!
కృతమును జూపునంతటనె కేవలమీచుఁ డెవండుఁగాఁడుసూ!

చ కృతమునుజూపకుండు నరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక" యంచు నొకమాటును గల్పనజేసి నన్నుఁ ది
ట్టితి వది యేమికార్యము! కడింది యశమ్ము గడించుత్రోవయే!

చ. "తిరుపతి నాపయిం గవిపెఁదీవ్రత మద్గురువైన వేంకటే
శ్వరుని కతానగాదె" యని శాంతి యెఱింగిన నీవుతద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్య? యా
దురితపువ్రాఁతః కృష్ణుఁ డెటు దోఁచఁగఁ జేసెఁ,గుమార! చెప్పుమీ

క. వరులకు శాంతిం గఱపెడి, పరమోత్తమగురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచినదెకదా!

చ. "గురు నని చెప్పనందులకుఁ గోప మదేమిటి? కినసుల్ యశ
స్కరమగునే?" యటంటి, నది సమ్మతమే, కొమరుల్ గలారు నీ
కరయఁగ వర్ధమానులిటు లాచిరజీవులు విన్న నల్పన
త్తరుణమునందు నీహృదయతాప మ దెట్టిది యౌనో తెల్పుమీ 82

---

‡ మ. భవునిన్ భావపదారవిందభవుఁ దెల్వాప్పిళ్ళవంశార్ణవో!! ద్భవునిన్ శాస్త్ర వదంవదానహితవున్ భాషద్వయున్ సాహితీ! భవునిన్ మేఘగభీర విస్ఫుట రవున్ ధైర్యప్రభామేరువున్! గవితాసద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నెక్కాలమున్ (ఇది తి॥ వేం॥ గారి మొదటికవిత్వము, కుమారసంభవములోనిది)

క. గురునకుఁ దండ్రికి భేదం బరయంగా లేదు శిష్యుఁడనఁ గొమరుండే
యెఱిఁగినవారికి వాఁడే తిరస్కృతిన్ జూప మదికిఁ దెగులు గలుగదే.

క. ఇదిగాక నీవు సద్గుణ వనియు విచారింపఁ బుత్రికాపాదకమే
గద ! * "బా" బని వ్రాసిన నీ సదమలమగు లేఖకలను చదువుముదానిన్.

క. నీజనకు నాయనమ్మయు, నాజనకుని తల్లి యొక్క నాయనకును నొం
డే జననికి జన్మించిన, యోజనులెఱుంగుదురా ! మఱచితో ! గురునిబలెన్

ఉ. ఏ నల చర్ల బ్రహ్మయ మనీషియొకన్ గరుభక్తియున్ గృతిం
బూనినవాఁడ నంచెఱుఁగు యోగ్యుఁడ నీవని నమ్మెదేని నా
మానసమందు నున్న యిది మాత్రము నమ్మకపోవు కాన నీ
శామని సాక్షిగా వినుము సర్వము దెల్పెద నారహస్యమున్.

ఉ. ఏ నల పీఠికాపుర నరేంద్రుని చెంతను జేరి తన్నృపా
స్థానమునందు నుండుటకుఁ దద్దయుఁ గోరినవాఁడ నొచు నీ
పైని వసూయ గొంటి నని పల్కుట దేల్చితి నీవు వ్రాఁతలోఁ;
నీమది నిక్కమే యగునె ! నీవు నెఱుంగుదు నాదుభావముల్.

---

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి రెండు, భాషలలోఁ దక్కృషలఁ గవియయ్యె ననేకముల్ శతలేఖినీకవిత్వ, తంత్రముల్ పెక్కు గ్రంథమ్ము లాతని సహాయమునఁ గావించి యయ్యనఘుఁ గూడి, శ్రీపోల వరపురీ భూపాలుఁ డాంగ్లేయ భాషాప్రవీణుండు బహూకరాధు. తే గీ రంధరుండతి శాంతుండు సరసుఁడునగు, రామచంద్ర వేంకట కృష్ణరాయచంద్రు, నొద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె, లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె.

* బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుబాబుగారి సముఖమునకు ఓలేటి వెంకటాద్రిమయ్య నమస్కారములుచేసి వ్రాయు శుభలేఖార్థములు .. శుభముహూర్త మునకు సకుటుంబ పరివారముగా దయచేయగలందులకు ప్రార్థించు చున్నాఁడను.... తమరు రచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించ గలందులకు ప్రార్థించుచున్నాను. దయయుంచవలెను "

పల్లెపాలెం, ఓ వెంకటాద్రిమయ్య.

ఉ. ఎందఱు రాజు లుండిరి ! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
విందుతనంబు గల్గిన వివేకులు; వారలయొద్ద నుంటినే !
గందరగోళ మైన మది గల్గినవాఁడ, స్వతంత్రుఁడన్. ఇదా
వందుఁడనే ‡నొకానొకని వాయకుఁగా వరియించియుందునే.

ఉ. అన్నములేదొ ! వస్త్రములకై కొదవుండెనొ ! యున్నదానినే
యెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గానరాఁడు. నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రియత్వ మదేల నాకు ? నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతమువొక్కెడి దుఃఖ మెక్కెడిన్.

ఉ. విక్రమముగాఁ బితాపురికి వేఁ జనుదెంచెదివాఁడనేని వి
మ్నుక్కడఁగింపఁగా వలయునో ! నరపాలుఁడు విన్ను నన్ను నొం
డొక్కరుఁగూడ నేలుకొనఁడొట్టు ! సమర్థత లేనివాఁడొ ! నా
కక్కఱయున్న జేనికిడ కంతకుమున్ జనుదేరకుందునే ?

ఉ. ఎంతటొ భార్యలుండియును నింకొకదాని స్వయంవరంబుగా
నందమువొల్పుజాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలు ? రా
చందమునన్ మదీయకృతి చందనగంధిని గూడ మీనృపుం
డందఱితోటిపాటు తనయా ! కొని యేలఁగవచ్చు నచ్చగన్.

తే. గీ. ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు
నందు రామాదులకుఁ బోలె నద్దు పడదు;
రాము పేరిట నెందఱు ధీమహితులు
తమ కృతికుమారికల నిచ్చితనియ రయ్య ?

ఉ. అంకితినందువో ! యధిపుసన్నిధికిన్ దగ నందువో ! తరీ
యాంకణమందు నొక్కఁడును నక్కట ! నాసరివాఁడు లేఁడె "ని
శ్శంకగఁ గాకి పంజరపు సత్కృతికిన్ దగ" దందువే ! యెటుల్
బొంకెదు సర్వముం దెలిపి పుత్రిక ! తండ్రికిఁ జేటు గూర్చెదే ?

---

‡ మ. వరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించినట్టి పని నాచేఁ గాదు; నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్వ బొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ ! (కా॥౪॥)

చ. కడియములోనఁ గల్గు జనకాంతము సర్వము నెన్నిమార్లు నన్
గదెగదె కా నృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్ప ? రా
షదు లవి నేను మూఁకొనియునున్ నృపుఁ జూడమి కేమిహేతువో
కొడుక ! యెఱుంగవే ! యెఱిఁగి కొంకక "కాక" మటంచు గిల్కెదే ?

క. కడియమునకుతేనికి నె. ప్పుడు సంబంధంబు గలదు పుత్రిక ! నీయా
ర్పుడమికి తేనికిఁ గల దె. క్కడి సంబంధంబు ? చెప్పఁగంపే పాకుశా.

*క. ఎందుకు జన మానితివో, పొందుగ మాను వ్రాసినాఁడ; బొంకందువొ ? లే
కందుల కొప్పుమివో ? వా. కిందులకుఁగా జింత లేక యించుక యేవిశా.

క ఎన్నో బూతులు దిట్టితి, వన్నియుఁ గోకిలపుఁగూఁత లనుకొనియెద; నా
కున్న యభీష్టము దీర్చితి, వన్నా ! "కాకో" మన నేమి, యదియు మునంటే

తే గీ. కడుపునిండిన బేరమ్మ గావి నాకు
నేనృపాలుని జూడంగ నేమివలయు ?
నట్టిచో మానృపాలకుఁ డాతఁ, తతని
నేల దర్శింప రాకుండు నెఱుఁగఁ జెపుమ ?

‡ తే. గీ. ఎలమిఁ బిలిపించి స్వయముగ నెంతొ పేర్మి
గారవించుచునుండెనూ ! గౌరినాధ
శాస్త్రి స్కూలున నుద్యోగ వరణినుంచి
యతని విడి వత్తు నెట్టు లేనవుల కవుర !

---

* గీరతము 1 వ భాగము ఇతిహాసపర్వము చూడుఁడు

‡ శ్రీవేదమూర్తులైన శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి జంధ్యాల గౌరీ నాథశాస్త్రి అనేక నమస్కారములు . . మీ పుభయులున్నూ ప్రతిసంవత్సరం సంస్థానములలోకి వెళ్ళివస్తూ సంచారాఖ్యానం కలవారుగాన స్థాయిగా యేకత్ర వుండటం దుష్కరంగా తోచునేమో ? ఇంతకు వెళ్ళదగిన స్థలములు అయినవి వయస్సుకూడా వృద్ధియగుచున్నది. ఇట్టి స్థితిలో స్థాయిగా నిరుపద్రవమైన జీవనోపాధి యేకత్ర దొరకినప్పుడు అక్కడనే వుండితీరిక కొలది గొప్ప గ్రంథములుగాని పాండిత్యముతో చేరిన మతివకటి గావి చేస్తూ కాలయాపనం చేయడమందు మీకు తాత్పర్యం వుండ వచ్చునని నేను తలుస్తాను మీ వుభయులలో నెవరో యొకరు యీ ఉపాధ్యాయ

## (4) బందరుపర్వము.

క. గౌరీనాథ బుధుండవుఁ, గా రాజో? రెడ్డొ? చెప్పుకాకమ? యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మఠుఁడుసుమా!

క. స్కూలు కళార్థులు మాత్రై, బాలన్ యత్నించి పఠన సల్పియు మొనమొ
న్నేలాగు గౌరవించిరొ! బాలక! పొత్తమ్మునందుఁ బఠియింపవొకో?

క. బందరవ నిట్టివక్కఁడ, "సందేహములేదుబావ శాబ్దికజీవుల్"
చిందులుద్రొక్కఁజనఁగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ!

క. బందరనఁగ నిట్టిదియట, నెందఱొయున్నార యెల్లయెడ విద్వాంసుల్;
తందరపడు నవధానుల, చిందు లచట సాగిరావు శిష్యుఁడ; వింటే?

క "బందరనఁగ నెట్టిది" యని, సందేహములేదు బావశాబ్దికజీవా
వందువి బోలెదు శ్రీరా, ముందగ నొకమాఱడిగి సమూల మెఱుఁగు మీ!

క. బందరులోఁ గోకిలకవి, చందిరులకు బిచ్చమైనసాగదు; కాక
బం దిలకింతురు, కపటపు బొందల యత్యద్భుతములు పొసఁగవు సుమ్మా!

క. బందరునకె యొకపరి మీ, "సందేహము లేదు బావ శాబ్దికజీవా"
నందునినే రమ్మంటిని, జిందులు సాఁగవని యటకుఁ జేరఁడువినుమీ!

క. అప్పటికిఁ జిలుక కాలే, దెప్పుడు పంజర మనంగ నెట్టిదొ యెఱుఁగం
డిప్పుడొకసారి యడుగుము, చెప్పునతఁడు ధారణావిశేషము కలిమిన్.

క. ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద వచ్చునేమొ? కృష్ణకవీంద్రుఁ
దప్పక ప్రేరేపింపుము, చెప్పుము నరపాలుఁడేల పెల వీఁడు? మఱా!

క. సంగన్నగారు వీణా, శృంగారవతీవినోద చేష్టాహృష్టో
త్సంగులు తత్త్వజ్ఞా, లింగితులై యెటకునేని లేదే చనుటల్?

తే. గీ. ఒక్క సంస్థానమందు మీయునికికేమి,
ఏటిపోలిక వారికి నెందు మీకు?

---

స్థానమును అంగీకరించ వలసినదని నాతాత్పర్యము. మీరు కావలసిన ప్రతిష్ఠను యిదివరకే పొందినారు. వచ్చేఆదివారం తిరిగి మీటింగుచేసి యెవరినో ఒకరిని నేము అప్పాయింటు చేయవలసి యున్నది. .. అంతకంటె విళంబనము చేయజాలము. త్వరగా జవాబు పంపించగోరుతాను.

బంధ్యాల గౌరీనాథశాస్త్రి.

అక్కటా! * వీణారూపంబు నడుగఁ బోదు
చేసివదిచూచి నేనెంతొ సిగ్గువడితి.

క. ఈసిగ్గున శేషయ్యొడఁ, జేసిన యవధానమందుఁ జెప్పిన కవనం
బేసరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్,

క ఆనరపతికిని మన యవ, ధానులు గండ లవగీర్తి దవులు, నదియుఁగా
కేనాఁడు నాజ్ఞగొని విద్యావిధు లెక్కడికిఁగాని యరుఁగుటలేదే!

క. ఇది యటులుంతము; బందరు, వదనెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతపుం
బదము గలశతవధానిం, గదిసి యడిగి తెలిసికొన సకలముమ దెలుపుఁగా.

క అప్పండితు నవధానము, నప్పుడు "జడ్జీ కలెక్టు"రాదులు సభలో
నొప్పిరిసూ! వార్ "సీ" యనఁ, జెప్పెపెయని యొకినముస్సు పెట్టెనడుగుమీ!

క. ఇది యపస్తుత, మతఁడును నవయత వినుఁటోలెఁగాక చక్కఁగఁగొన్నా
ళ్ళాదిగెం గ్రాకము కడ బ, ల్లిమఁడగు మీకృష్ణసుకవిలీలన్ హేంగా

---

## (5) స మృ ద్ధి ప ర్వ ము.

క. ఇఁకఁబ్రికృతము వినుమయ్యా, పికరాజమ! వెనుకఁటోలెఁ బృథివీపతులకా
నకనకలాడెడి పొట్టకుఁ, గకవికఁ కనుఁగొను వ్రిసక్తి కిఱుగమసుమ్మా

ఉ. పొట్టలు మూఁడు మావి, సరిపోవుమ బుట్టెలు మూఁడుమాకు, వి
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొక్కొ, వీ
కెట్టులు దోఁచె, లోకులిది యెట్టులు నమ్మెదరంచు వ్రాసి తీ
చెట్టతలంపుమాట! యిటు చెప్పుట పాపముకాదె పుత్రికా!

చ నెల కొక నూఱురూపికలు నీదయకల్మి "కవీసపక్ష" మొ
ప్పు లొలుకు నాదుపుస్తకపుఁ బుత్రిలు దెచ్చి యొసంగువారు, పై
నెలమిని రోజు కొక్కొకటి యిత్తురు రూపికస్కూలులోన, నెం
దుల కిఁక దేవిరింపవలెనో? నమఁ గోరవితేండ్ల సన్నిధిన్.

---

(వెంకటరామకృష్ణ గ్రంధమాల 74 వ పుటనుండి)

* వీణాస్వరూపము, (సంగమేశ్వరశాస్త్రిగారు కోరినది)

క. వీణాస్వరూపమెన్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికుల నభినుతింపఁగ వాణియె యసమానురాలు వసుధాస్థలిన్!

ఎక్కడి కేగ కూరకయ యింటనె యుంద మటన్నఁ గావి నా
కెక్కడినుండియో సభల కెన్నియొ • జాబులు వచ్చుచుండు, నం
దొక్కసభకా బొనర్చినను నొక్కశతానకుఁ జావు లేమ ; నీ
కెక్కడియూహపుట్టె ? నిది యెవ్వరికిత్తునొ తెల్పు పుత్రికా ;

---

(1)• విధేయుడు బందా శ్రీశయిలం కృతానేక శిరస్సాష్టాంగ నమస్కారములు తమవలన జరుపబడు అష్టావధాన శతావధానములయొక్క కష్టము తెలిసి తమకు నరియైనట్టి మన్నన రాజలోకమువల్ల జరుగవలయునేగాని మాబోట్లు యేమి చేయగలమా అనే భయము ముందుగా కలుగుచున్నది అయితే చంద్రునకు నూలు పోగను సామెతప్రకారం మాయొక్క శక్తిని గనిపెట్టి తమవంటి మహానీయులు యట్లయినను మాకోరిక తీర్పడమే ముఖ్యముగా ఆలోచించవలసినదయివున్నది గనుక నా మనవి సంపూర్ణదయతో అంగీకరించి యస్పదయినను దరిశనమిచ్చి నాగృహపావనమయ్యేలాగు యీ బీదవాని గు కు విజయం చేసి కోర్కెను తీర్పగలందులకు ప్రార్థించుచున్నాఁడను.

ఆటపాక, 30-1-10 సేవకుడు, బందా శ్రీశయిలం.

---

(2) పే పండ్రింగి రామారావు అనేక నమస్కారములుచేసి చేయంగలవిన్నపములు వెనుక నేను మనవిచేసికున్నప్పుడు తమరు శతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు ఇప్పుడు తిరిగి యిక్కడ కాలేజీ విద్యార్థులు అతికుతూలముగా నున్నారు ఈవిషయమై యిప్పుడు తిరుపతిశాస్త్రిలవారి దగ్గరకు వెళ్లి వారి అనుమతిని పొందినాము కాబట్టి మాయందు దయవుంచి మాప్రార్థన కనుకూలమగు జవాబు తిరుగుటపాలో వ్రాయగలందులకు గోరుచున్నాను

చిత్తగించవలెను.

పిఠాపురంరాజావారికాలేజీ హాస్టలు, కాకినాడ, 27-11-11 } పండ్రింగి రామారావు

(3)ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సుఅవధానము చేయించెదమనిఅడుగుచున్నారు మీకును వ్రాయుదురు మీ అభిప్రాయము చెప్పుడు ది॥ తి॥

---

(4) - కర్ణాకర్ణి వినియుండి మిమ్ము నుఁబ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతి శాస్త్రిలగారి సహా మీరు వస్తారను నమ్మకముతో నిచ్చట ఏ నెల 19, 20

ఉ. ఇంతటివన్కఁ వ్రాసికొనుచే విషయమ్ము స్వకీయ మౌటచేఁ
గొంతదొసంగు, "దాత" నని కూడ లిఖింపట యెట్టులొప్పుఁ? గా
సంత యుదారతాగరిమ యంటవిశిష్యుఁబ్రిహ్మశాస్త్రి స
శాస్త్రింతరభో క్తలందుఁ గల రం చనుకోకు కుమార ! చెప్పితిన్.

---

తేదీను తమ రుభయులను శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన
మీరు తప్పక 18 వ తేదీకే దయచేసి మమ్ము నానందింపజేయ మిక్కిలిగా బ్రార్థించు
చున్నాము. తిరుపతిశాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పకవత్తురని నమ్మకముతో కొన్ని
ప్రయత్నములను జేసియున్నారము కావున తమరు తప్పక రావలయును

చిత్తగించవలెను.

ఇట్లు విధేయుఁడు

గుంటూరు 12-8-11 } రంగావఝ్ఝుల హనుమయ్య. (జిల్లాకోర్టు ప్లీడరు)
వేమూరి వెంకటసుబ్బారావు. (జిల్లాకోర్టు శిరస్తాదారు)

(5) రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రిమముఁదీసికొని పోవల
యునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలమునసే వత్తురని
యెంతును శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

(6) .తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని . తమరు శ్రీతిరుపతి
శాస్త్రిగారు ఒకసారిగా గుంటూరు దయచేసినయెడల వుత్సవరూపకముగా గ్రామము
లోనికి తమరిని తీసుకరావలయునని నాకోరిక గుంటూరుస్టేషనువద్ద స్నేహితులం
దరు తమరాకకు యెదురుచూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని నాకోరిక.
గుంటూరు, 15-8-11. మజుందారు వెంకటహనుమంతరావు.

---

(7) . తామున్ను ఆరోజుకు యిచ్చటికి దయచేసి సభ జయపగలందులకు
మిక్కిలి వేడుకగలవారమై యున్నారము. ఇట్లు విధేయుఁడు
పినపాడు, 15-9-1911. తూములూరికోటయ్య.

---

(8) 12-12-11 ఆద్దంకిలో అవధానమట వత్తురా ? సత్తెనపల్లికి వచ్చే ఆది
వారం రాగలరా ? ..
గుంటూరు, 4-11-11. రంగావఝ్ఝుల హనుమయ్య.

## (8) బ్రహ్మగురు పర్వము

ఉ ఆమ్మహనీయు పే రహరహమ్మును నీవును బావయున్ జప
మ్మిమ్ముగఁ జేయుచోఁ గృతము నీగతిఁ జేసినపాపమెల్లనున్
వమ్మయి వోవు; నట్లొనరుపం బ్రియతింపుము. రామదేవుపా
దమ్ముల వాల్చు క్షేత్రమునఁ దానమొనర్చి వొనర్చు మీక్రియన్.

చ ధవళగిరిన్ మహామహుఁడతం డొకసత్రము పెట్టి. శిష్యులం
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిం
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ, దద్గురుం
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్చుటదేమి లెక్కయా!

ఉ అమ్మహనీయునింట నెల యయ్యెడు నంతకు నొక్క పుట్టెడి
య్యమ్ము సుమారు వారుఁదమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ, మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజనమాచరింపఁ; బు
ణ్యమ్మవ బ్రహ్మపండితునికన్న మఱొక్కని చెప్ప నున్నదే!

ఉ. ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి దాని కై
న్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ
దిన్నదిగాక తా రయితు దెచ్చియొసంగుఫల మ్మదెంత హె
చ్చున్నను వీరికొక్క నెలయోపునొ, యోపదొ! సందియమ్ముగున్.

క. ఆయనపూత్మువిభార్యగ, దా యిల్లాలనఁగ! నాఖ్యయననేల? నిజం
బే యన్నపూర్ణయాపె. వృథాయుంతురె యట్టిపేరు తజ్ఞులు పెద్దల్!

ఉ చెప్పఁటిచూపుచూచి యొకశిష్యునినేనియు "నేమిరా" యటం
చు న్నిరసించి పల్కు దిది చోద్యము. దేశికభార్య లిట్టివా
రున్నది వింటిమే? మఱియునొక్కటి, లోకులు తమ్ముఁదిట్టినన్
సన్నుతిఁ జేసినన్ సమము; సాటిమఱెవ్వరు? బ్రహ్మరాణికిన్.

ఉ. "జాతకచర్య" యందు గురుసంతతిఁ దెల్పెడుపట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని చక్కఁగఁజూడఁగలాఁడ. విందులోఁ
జాతకహారి తచ్చరిత పాతము నీకును, నాకు, బావకుం
బ్రాఁతదొసంగులన్ దొలిచి భద్రములన్ గలిగింప నెత్తితిన్.

శా. ఏనేకాదు మఱొక్క శిష్యుఁడును మాయీ సద్గురుబ్రహ్మవి
ద్యానాథున్ సురభాషలోఁ దెలిపి శాస్త్రఘ్నాఘతారావహా
దీనామానవచస్కతన్ బరఁగెఁ దద్దివ్యద్వచోధార, వి
ద్యానందాత్ముఁడు, మద్గురూత్తముఁడు విన్నత్యంతము బోధిచుతన్.

ఉ ఎంతటి పాపమేని రచియించునుగాక, కృతఘ్నుఁడై బుజ
స్వాంతు గురూత్తము దెగడి వర్తిలఁగా, కలచర్ల బ్రహ్మవా
క్కాంతుచరిత్రమున్ జదివి కాఁగలఁ డుత్తముఁడంచు నెంచు ప
శ్వాంతము, తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁ జాలదో ॥

క. అతరిత వ్రాసి నతఁడును నా చినతండ్రి కొమరుఁడును నాకడఁ, దిర్వ
త్యాచార్యు నొద్ద శిష్యత, నోఁచి పిదప బ్రహ్మసేవనోఁచి రెఱుఁగుమీ ॥

క. కావనతండు సతీర్థ్యుఁడు, మా విజశిష్యుండు వగుట మాకద కల * బ్ర
హ్మసూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁడని విధేయత కలిమిన్

చ. అలచరితంబు నీకు శుభమౌపని కెంతయుఁ జాలునంచు ని
మ్ములఁ గొని కొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ, యో
గ్యులు గురుపట్ల విట్లనుమి కొందఱు శిష్యులు వ్రాయువ్రాఁత, లే
ఖలుఁడును పాడువ్రాఁతలకు గా దిగఁడం చిది చెప్ప నొప్పుగా 130

---

* శ్రీ చర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

. శ్లో॥ విద్యావాస గృహం పరోపకరణోత్పత్తిస్థలం సత్కృపో ౹ పష్కుం పుంజిత సత్త్వ ముస్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం ౹ రాజత్సద్గుణరత్న రోహణ గిరిం ధర్మస్వరూపమ్ముదా॥ విద్వద్బృన్దవతంస మాత్మవిభజే బ్రహ్మాఖ్యవిద్యాగురుం॥

శ్లో॥ గోదావరీ మండలరాజమానో పీలర్లభగ్రామవర (కటియెద్దు) శ్చకాస్తి ౹ అరాచ్చ విద్యాధరతీర్థవర్యా, ద్యత్రోఽ విరాసీ దృగవార్ కుమారః॥ శ్లో॥ ద్విజస్తస్మి న్నేకోఽవన దుపవనద్రావిడవరః ౹ ప్రసిద్ధో పీరాభోజ్యాజనిమ పగతో లోహితకులే ౹ లసచ్చర్లోపాఖ్యో నియమితమనా స్నం చ్చుచిరపి ౹ హ్రీదాలోకేకుర్వ న్దినకరనలీ ర్భక్తి కలితః॥ శ్లో॥ ప్రాణాంభోనిధిరంధ్ర వారిధిమితే స్వబ్దే స్వతీతేషు న౹ త్స్వకల్యా చిచ శాలివాహనశకే షట్ప్రాప్రమౌనీందుము కోద్యబ్దేచనహస్యమాస్యదవశే పక్షేత్పతియే తిథౌ ౹ జజ్ఞే తస్య చతుర్థమాను రిహచాఽ ముత్రాఽర్థసం సాధకః॥ శ్లో॥ ఛాత్రాణా

మువబృంహణా దుతలసద్ధర్మస్య పుణ్యాస్పదా । విద్యాయా అతవానబేదధిగతబ్రహ్మైక
భావస్థితేః యద్వా౽శేషజనోపకారక కథాశాలాది నిర్మాణతో। బ్రహ్మేత్యుత్తమనామ
సార్థకతయా పిత్రా౽స్య నిర్ధారితం॥ .... శ్లో॥ వారాణసీం ౹ జగమిషుః పరిశిష్టశాస్త్ర ౹
పాఠాయ భూసురవరస్స గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదనుప్రతస్థే। పౌరై
ప్రతీర్థ్యనివహైరపిభూష్యమాణః॥ .... శ్లో॥ కాశీవాధజుధోహి యద్గురువరః కాశ్యాంప
శిష్టాయితో। యచ్ఛిష్య స్సకలార్థవిద్గురుయశా శ్రీ బాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరి
శాస్త్ర్య సుత్తమగుణో వాక్యార్థచాప్స్వీకరః। కాశ్యాంభూవవిషేవితో వ్యజయత శ్రీరాజ
రామో బుధః॥ ..శ్లో॥ ఇతి షోడశ వాసరా నుషిత్వా। నిజగేహే స్వవివాహసంభ్రి
మేణ। నిజసోదర దుర్గపంక్తికేన ప్రతిగన్తుం ఖలునిశ్చికాయ కాశీం॥ శ్లో॥ షట్ఛా
స్త్రీషు షడంగేషు షడ్భాషా షణ్మతేషుచ। ప్రజ్ఞా యస్యస్థితా తస్మై బ్రహ్మాంతర్వాణయే
నమః॥ .. శ్లో॥ ఇద్ధ మేవన్నృపసన్నిధౌ బుధై। శ్శాస్త్రిషడ్గవపరీక్షితో భవన్॥
శ్లాఘితో బహుపతన్నశాస్త్రలే। నిర్జగామ బుధనిర్జయాయ సః॥ .శ్లో॥ మాదేణ కాం
నియమేన బహూన్ద్విజానాం। కోలాహలేన నియతాశనభోజనేన సత్రేషు భుక్తి రథితక్రమ
కారిణీతి। జ్ఞాత్వేహ శిష్యనివహాయ దదాతిచాన్నమ్॥ శ్లో॥ ఇతి జగదుపకారస్యా ప్రతి
పద మఖిలై స్తు నుత్యమానస్య। పరిణామశాలి బాహా౽ పరిణతవయసో౽పి దేశసంచా
రాత్॥ .. శ్లో॥ శవకైరగమద్విద్వాంత్స్వగ్రామం "సుకడియెద్ద" నామానం। శ్రీరామో
వనవాసా। దివసాకేతంన్నృణాం ప్రమోదేన॥ .... శ్లో॥ స్వస్యాలకః పతితుమారభతా౽
గమం యః। శాస్త్రాణి పాఠయతి శిష్యగణం స్వపశ్చాత్। విద్యార్థితాం తిరుపతిః కవి
వేంకటేశో। యాతౌచ యౌ కవితయా గురుకీర్తిపాత్రే॥ ....శ్లో॥ న కేవలం ఛాత్రి
గణాయ భోజనం। దదాతి పాంథావళయేచ సత్రతం। తత స్తదీయం సదనం సమీర్యతే
వ పాకశాలేతిన సత్రమిత్యపి॥ శ్లో॥ రాత్రౌ త్రిహోరాపమయే ప్రబుద్ధః క్రమేణ
శిష్యావళిణా ప్రబోధ్య। శాస్త్రాణి సంపాఠయితుం ప్రవృత్తః స్సమావయేద్ద్వాదశ
ఘంటికాన్తే॥ శ్లో॥ చిత్రంకేచన కావ్యనాటక మహాలంకార చమ్పూముఖః। గ్రంథా
న్వ్యాపకశిష్యవర్గ సవిధేసప్య కృతన్త్వ౽ఖిలం। సాహిత్యప్రముఖా స్తత స్సునియం
బ్రహ్మాఖ్య సూత్రే వృత్తికే శ్రీమద్వ్యాకృతి మధ్యగీషత కిమ ప్యుష్మా కృ౽లాకాంక్షిణాం॥
శ్లో॥ యాదృక్త్వేప గురో స్స్వశిష్యనివహే గుర్వ్యావ్రతో వ్యన్నతం. ఖ్యాతైః కిం
మతనిర్విశేషమపితౌ సంపశ్యతో జంపతీ, దూరే బంధుజనా న్వివాహయపితరౌ దేశంచ

విద్యార్థినాం, బాలానాం కిముపోష్యమస్తి సురవత్కారుణ్యతోఽ న్యద్భువి॥ శ్లో॥
దానం కలావమృతసాధన మిత్యవోచన్, దానే ష్వముత్తమ మితిస్మృత మన్నదానం,
ప్రత్యక్షభూతపరితృప్తి విధానభూత, మిత్యన్వహంపరిత నోత్యమికాన్నదానమ్॥ శ్లో॥
విప్రావనవ్యగతికా వితరా ద్విజాతి, విద్యార్థినశ్చ కృతదార పరిగ్రహాంశ్చ। కార్యా
మివ ద్విజనిమస్కారితా ప్రదాన, లబ్ధాతిదోష హరణాయ కరోతి విద్వాన్॥ ..
శ్లో॥మధ్యే మధ్యే కేనచిద్ధేతునాఽయం। భక్ష్యైర్భోజ్యై ర్భూరిదత్తై రన్నదానం। భూదేవానాం
సంభ్రమా త్సంతనోతి। ప్రాజ్ఞస్యాఽప్తే భూతతృప్తేః పరంకిమ్॥ శ్లో॥ చిత్రం
ద్వాదశవాసరేషు మిళితా గోదావరీ పుష్కర. స్నానార్థం ప్రతిపత్తి చోపదిశతో
విప్రాం శ్చహప్రాదికా, నాఽలోచ్య శ్రమమున్నతం ధనమయం సంపాద్య భక్ష్యా
దిభి, స్సంతర్ప్య ధితపుణ్య మాప భువి కిం దృష్టః శ్రుతస్త్వము॥ .. శ్లో॥ వికారి
నామాఽ సువికారకారీ, సమాగతష్షగ్రహ కూటతోఽబ్దః, పుణ్యోచ్ఛ్రయం బ్రహ్మ
గురో రతీవాఽ, నహిష్ణునాజ్ఞప్త ఇవాబ్దజేః॥ శ్లో॥ భూదేవాయుతతర్పణం దశదినై ర్గో
దావతీర్థోజ్వల, తౌర్ఘస్యారాఖ్యపురేఽ ప్రతిప్రవిలసచ్ఛ్రీ కోటిలింగస్థలే, క్షేత్రేప్రాద
గయాహ్వయేఽపిచ నిజశ్వే తాద్రిపుర్యాం తథా, కర్తుం బ్రహ్మసుధీ రియేష జగతః
క్షేమాయ కామాయచ॥ శ్లో॥ దశమ్యాం కృతార్థ స్థితౌ బ్రహ్మవిద్వా। నుపక్రాన్త
మన్త్రాదిశా ప్తింపహూప్య. సుభుక్తేషు విప్రేషు పశ్యత్సు తుష్యన్। పరిత్యజ్య
దేహంగతో బ్రహ్మణైక్యం॥ శ్లో॥ దివంగతే బ్రహ్మబుధేధరాఽపి త్సుశబ్దహీనా
బతధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుధాతురః పాన్థగణ స్తదాఽసీత్॥
శ్లో॥ తత్సాలః పతితాగమ స్సుగుణవా, శ్రీవిశ్వనాథో బుధ। స్థిత్వా తత్రితదార్జితావని
ఫలై ర్వర్షాశనై స్సత్కృతైః॥ విద్యార్థిప్రకరం యథాకథ మహోతత్రాత కాలాగతం
విద్యాబుద్ధియుతం కరోతిహి గురో ర్ధన్యత్వ మాపాదయన్॥ శ్లో॥ వేమూర్యు పాఖ్య
నరసింహకృతం సభక్తి శ్రీబ్రహ్మవందిత చరిత్రమిదం పవిత్రం. యావద్దివాకర
నిశాకరతారకాలి। స్తావజ్జయే త్సుఖయుతా మనుజా భవేయుః॥ శ్రీ

మ॥ కలిమానం లోకమైదువే లరుగ వేత్రస్థపత్రగ్రహ, మ్ములకున్ కాంతి
యొనర్చుచున్ శ్రమ లవమ్మున్ లేకయే బ్రహ్మమున్, గలిసెన్ బ్రహ్మ గుహాత్త
ముందు దశమిన్ గంటాప్త వారంబునన్, బలవంచారి వికారి కార్తికవశ శ్రీక
పక్షమ్మునన్.

తి॥ వెం॥

మ. గురుభక్తిన్ బహుపరిచారనిరత శుశ్రూషానిపాలనం
హరణ ప్రాప్తయశోవిశాలి జమదగ్న్యాత్మోద్భవున్ దెల్పినా
కరరే! యిట్టిఁడ వెట్లు శిష్యుఁ డయితో? యంతేవసద్ధర్మదు
స్మరణోపజ్ఞ దురుద్యమక్షపితధీ వ్రాతచేతోంబుజా!

మ. గురుభక్తి ప్రథితుల్ మహామహు లనేకుల్ పర్వలో కైక దు
స్తర విస్తారిత విస్తృతైనస వితాంతధ్వాంతవిధ్మాలవా
పరిభాస్వత్త్ర పతాస్కరుల్ వారలు విప్పట్లిఁకా వృథా నాకు నీ
వరరే! శిష్యుఁడ వెట్టులైతివోకదా, యాచార్య నిందాపహా!

మ. ఒకడుఁగా గన్పడఁడిట్టి యాకలిది నీ కోశిష్య! తుల్యుండు, పా
య కుపాధ్యాయుని గొల్చుకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా, వ్రాసెదియంత సాహసిః మదీయాథు ప్రభావంబె నిన్
వికలాత్మం బొనరింపఁబోయెనుజుమీ, పేత్రృత్వనత్తాళిపీ!

శా. నీకున్ జిక్కిన యాకృతఘ్నతను నేనే నేర్పినట్లే తుదిన్
లోకుల్ వాహమవార లేమొ? యని లోలోఁ జింత నేఁ గాంతుః వి
ద్యాకల్పద్రుమ మస్మదీయగురు లేతన్నింద రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి నను గాపాడఁగా బ్రియత్నించితఁగా.

ఉ. ఏకుటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావుః భారత
శ్లోకములిట్లు చెప్పు, వని సూరివరుల్ శిరసావహింతురిః నా
శీకచరిత్రికోఁ గను మాశికము గాఁ దలపోయఁబోకు, మో
రా. కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్

చ. గుఱుఁ డొకచో నహేతుకము కొండొక మేఁడిమి నూనఁగాక కో
ప రసము తగ్గఁ జేయుట కుపాయము లుండవె? వానిపేరుముల్
బెఱుకుట, వానిగ్రంథములు వెక్కిరిపించుట, "వేరు" లౌటయున్
జరిగెనె యెన్నదేని? యొకథాతురి నుదాహరణంబు చూపెదే?

ఉ. ఊరక యుందు వేసి యఘ మూరక యుండదు నీకు బాధకం
బై రహిఁ బీడ పెట్టుః నది యస్మదభీష్టము గాదః యిప్పుడో
కారణమొంది కాళ్ళఁ బడఁగాఁ జనుదేరక యుందు గాక నీ
హారచనన్ గుణించి మది దుఃఖము చెంది ముఖింతు పాపయిన్,

చ. ఎఱిఁగి యెఱుంగ కేయఘమునేని పొనర్చియుఁ బిమ్మటన్ జనుం
"డరరె! యఘంబు చేసితి" నటం చొకకొంత మదిన్ దపించి దు
స్తరమగు పాపమేనియును దాఁటఁగఁ జాలెదిఁ, బైకిఁ బాపముల్
బొరయుట తెల్పనేని సరిపోయె నిరాగసుఁ డాతఁ డంతతో.

ఉ. ఎన్నఁటికేని గాళ్ళఁ బడుచే నదుపాయ, మఘంబు నాఁడె పో
సన్నగిలున్, గురున్ దెగడు సాహస మూని యెదో లిఖించి నం
పన్నగృహస్థులౌ జనులమన్ననఁ గైకొన, నెవ్వరో వినుం
"డన్నుమ బాగు బా" గనినఁ బాడకు నోరికి వచ్చినట్లుగన్.

ఉ. చెప్పెడివారు నీ కకట! శ్రీయను గూర్చెడివారు గారు, నా
చప్పనికూఁతలే తుదకు సద్గతి జూపును నీకు, సూర్యరా
విప్పుడు నన్నుఁ గైకొనుటకేనియు నే విడు చప్పకూఁతలే
తప్పక కారణంబునుమి! తప్పుడుత్రోవ విఁక నేని వీడుమీ!

(7) ఆత్మవైభవపర్వము

ఉ. నన్నును గారవించు నరనాథులు లే రొకసారి పన్ని నీ
యున్న పదంబునం దెటులనో పడ నెంచితి వంచు నెంచ కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మున్నను లోక మొప్పు; నీ
వన్నను విశ్వసింపవలదా? యిలఁ దా సకలం బెఱుంగదా!

ఉ. అప్పనృపాలుఁ డింక నొక యద్దములోఁ దన వోకెఱింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారి కెటు చేసితి వార్షిక మెల్లకాలముం
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదంబగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె, నీవెఱుఁగవో సుత! కోకిల వైతివంతకే!

చ. ఎఱుఁగుదె యప్పరాయనృపు? వించుక యాతవినొమ్ము కాకితోఁ
దిరిగెడునప్డు తింట, వది తేనుపువచ్చిన యప్పుడైన న
న్నరపతి నన్నుఁ జూచెడు ఘనంబగు చూపు స్మరింపుమయ్య! త
త్పరులు కుమారు లానృపువిధమ్మునఁ జూతురు నన్ను నేఁటికిన్.

తే. గీ * ఆత్మకూరుమ గద్వాల యరయుచుండు
నాదురాకకు నేచేట; నీదురూహ

* "మీరు ఈ కీర్తిపెంపదలలో నెంతత్వరగా రాగలిగిన అంతత్వరగా వచ్చిన మా అంగలికి చాలా సంతోషము గలుగును.... ."

మా జవీను, 16-4-11. నా ఆయ్యప్పారావు

నీకు నుదయింపనేటికి నిన్నుఁ దెలిపి
బాగుపడనేల యిందఱు ప్రభువులండి ?

మ పవిగాఁ దా బెజవాడలో డిగినుమా ప్రార్థించె "మున్నిచ్చు భూ
మిని బేర్మింగొని తండ్రిగారి యశముల్ మెప్పెక్కఁగాఁ జేయుఁ"డం
చుమ శ్రీయాత్మకురు ప్రజాధిపు తనూజుం; డాతనిం బోలు వా
నిని జూపింపుము నేఁటిరాజులను నెందే శిష్యచూడామణీ !

ఉ. ఇచ్చినభూమి పుచ్చుకొనవేగని మాపయి నల్కఁ బూనకే
వచ్చిగ్రహింపుఁ డంచను నృపాలురు గూడను నేఁటి యీకలిన్

---

* TELEGRAMS.

" Starting Bezwada to-morrow morning 8-15 train come Bezwada"

Madras, 29th July 1911. Raja of Amarchinta

"Atmakur Raja coming Bezwada to-morrow evening meet Positively " Cocanada, I9—7—11

శ్రీరాజా సూరానేని వెంకట నారాయణరావు బహద్దరు జమీందారు పరగణే మయిలవరం వగయిరా దొరవారు దండం

ఈనెల 19 వ తేదీని మయిలవరం గ్రామములో ఓచే శతావధానము చేయించ దలచినాము గనుక మీరున్నూ బ్ర॥ శ్రీ॥ తిర్పతిశాస్త్రిగారున్నూ మయిలవరం మకాముకు 18-4-11 తేదీకే రాకోరుతాము.

మైలవరం 7-4-11 } R. S. V. Narayana Rao, Bahaddar

---

శ్రీ రాజా వెల్లంకి చినవెంకటరామారావు బహద్దరు జమీందారు అఫ్ నడిమితిరువూరు అండ్ వినగడప వగైరా యష్టేట్సు దొరవారు దండము.

.. ... అప్పుడు శతావధానము కూడా మీవలన చేయించవలెనని వున్నది. మేము 1 డిశంబరుకె బందరు చేరుచున్నాము ... . వెంటనే జవాబు వ్రాయించవలెను.

81-11-1912 మదరాసు } Raja Vellanky China Venkata Rama Rao Bahaddar

గ్రొచ్చుట నుండిరే ? యశముగాక మఱొక్కటి విల్వఁ బోదుః త
త్పచ్ఛిళితంబు శాశ్వతము దానము మే మది పట్టియుండినన్.

ఉ. గుంటురి వీరుహేతువున గోరిన యావరపాలుఁ జూడఁ బో
యుంటిమి, యానృపాలమణి యొందొక పైఁడినుగాక యిమ్మ; "హం"
షంట మఱెవ్వరో నుతువుమయ్య ? భవన్నరపాలుఁ దొక్కఁ ? యా
దంటయు నొప్పఁ డీనుడికిఁ దజ్ఞుఁడు యోగ్యుఁడు నే నెఱుంగుదున్.

ఉ. ఆయనయొద్ద సెక్రిటెరి యత్యమలుం డతఁడేవి యిట్లుగాఁ
గూయునెడన్ సహింపఁ, దలకోవిమదర్శన మాయె నాకు, బల్
ఛీయుతుఁ డం చెఱింగితి, విధేయుఁ డతండును "హంష" పల్కఁడో
హో ! మొవ రాదకుండివను "హంష" జవించె భవన్ముఖంబునన్.

క. గుంటురి గుంటల వ్రాఁతలు, గంటివి బల్కితి వటంచుఁ గ్రిమ్మికొనెదో యయ
ప్పంటికి గుంటురి గొంటరి, జంటలు జవియింపమిన్ బొసంగ దది సుతాఁ

తే. గీ. ఇంకెవరు "హం"షనిరా పేరినెత్తితెల్పు
మల్లవారినె మెప్పించి యుడఁతు పీదు
తప్పుకుప్రసంగమును; వృథా మొప్పివగుచుఁ
బాదువ్రాఁతలు గిల్కెదే భయము విడిచి.

శా. సన్యాసుల్ మొవ సెల్లరాజూ వమున్ పాపజ్ఞుఁగా వెంచి పే
ర్మి న్నామాటలయందు వించి యనువర్తింతు ర్గురున్ బోలె "హం"

---

Madras, 24-10-12

(శ్రీరాజా నడిమితిరువూరు అండ్ వినగడవ వగైరా యర్టెట్టు దొరగారి వద్దనుండి).

.... శతావధానముకూడా చేయించుచున్నాము .. .. 6, 7 తేదీలకు తమరుబందరు మకాములో వుండుటకు ప్రార్థించుచున్నాము .... .... షుణాబుకు యెదురుచూచుచున్నాము. చిత్తగించవలయును.

---

శ్రీమత్పర దేవతా ప్రసాదోస్తు

క. *దేవీ భాగవతాంబుధి, భావామృతము మ్మథించి భక్తవరుల నం
భావించు మీదుచరితము, పావనమై చిచ్చికడలఁ బ్రఖ్యాతి గనున్.

గీ. చక్కెర పెక్కెడి చలిచీమ వకువునఁ, దీపినీటి కెక్కు చేఁపపగిది
భాగవతామృత పానసంప్రాప్తిమ్మై, దడిది చనదదేమి దాహమహామో.

(వంమ శివేంద్రసరస్వతి) జ్ఞానానందులు

ష్టన్నా ! యెవ్వరినోట వచ్చినదొ నా కామాట వాక్రుచ్చు. వా
రి న్నే నే చని యడ్గెదన్ ఘనుఁడా సూరిశ్రేష్ఠుఁడో? భ్రష్టుఁడో?

ఉ. భ్రష్టుఁడు పల్కెనేని యలవానికి వందనముల్ ఘటింతు, న
త్కృష్టుఁ డెవండుగాని చని కేల్మొగిపింతు, వృథాగ నెందు కీ
ముష్టిప్రసంగ? మౌరవుర, మూర్ఖత యెంతకు వచ్చెఁ! దిప్పతి
ప్రష్ట నెదుర్పలేక పెలుచన్ గుణుచల్ లిఖియింతువే. సుఖా!

మ. ఘనతేజుండు దివాకరుం డనఁ * గృతఘ్నఘ్నుండు తద్దేవుపే
రున నెవ్వానికులం బిలన్ వెలసి సారూప్యస్థితిన్ వానితోఁ
బెనఁగన్ జాలుకృతఘ్ను డుండునెడ రేపే వచ్చి పాకద్విరో
చను నోడించుఁ దమస్సమూహజలదవ్వర్గావ కేతుప్రభన్

మ. ఎవరీ "హం" షనువారు? నీ వెఱుఁగుచో నేర్పాటుగాఁ జెప్పు, వా
రవనీపాలురో? మంత్రిసత్తములో? లోకాలోకపర్యంతభూ
భువనవ్యావృతదివ్యకీర్తికలనాస్ఫూర్తిన్ విడంబించువా
రెవరేనిన్ జని వారిమెచ్చు గొని నీ యీవాక్కు బంధించెదన్

మ. ఎవరా "" వాసియు వన్నెయున్ గలుగువా, రెందుండువా, రెట్టిపై
భవ మొప్పారెడువార, లేమతమువారల్ బద్ధాదరుల్? చెప్పు నీ
కవనమ్మున్ గురుభక్తియున్ మిగుల శ్లాఘాపాత్ర మం చెంచి ని
న్నవమానింపఁగ "హంషు హం" ష నిరాకో? యంతేవసద్భావ్యహో

శా. భావత్కప్రతిభం గనుంగొని భవద్వాణిన్ విలోకించి నీ
భావంబున్ సరిగా గ్రహించినయెడన్ బల్కం దొరున్ "హంషు". నీ
చేవల్ సూచిన వాని కింకొకనిపైఁ జేకాకునుం బుట్టునే?
దేవానాంప్రియతావి? గురుని నిందింతే యసత్యోక్తులన్.

మ. ఒకసందర్భముఁ జూచినన్ సకలమున్ యోజింపఁగా వచ్చు నీ
యకలంకత్వము వేఱె చెప్పవలెనే? యాయీ దురుద్యోగపే
ప్రకటించున్. పునరుక్తి కాస్పదుఁడనై భర్జించుచోఁ, "జెప్పొకం,
డౌకఁడో? సిద్ధి' యటన్న సామెతనుమీ యూహించుకొ, మ్మాత్మలో

* (శ్రీమద్రామాయణములోని ఆదిత్య హృదయమునుండి.)
శ్లో॥ కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః

చ. "గురుఁ డెటువంటివాఁడు? గుణకోటియెడన్, జరితంబుపట్ల, శాం
కరి! నను నెట్టివానిగను గన్గొన నేర్చితి? తచ్చరిత్రమున్
బరిపరి నాచరిత్రమును బట్టి వచింపు" మటన్న స్వప్నమం
దరయఁగఁ జేయునంబిక యథార్థ మటుల్ భణియింపు మీశ్వరిన్.

ఉ. ఆపె వచించు సర్వమును, నాయమ కెందును లేదు గోప్య, మే
పాపము నెట్టి పుణ్యమును బాలన చేసెడి తల్లి "హంస" దా
నీపయి నుంచునో? విను గణింపక నాపయి మంచునో? వృథా
లాపము లూన్చి కన్గొనుము లక్ష్యము తప్పక కొల్వు మంబికన్.

క. గురుశిష్యధర్మముల శం, కరుకతనన్ వినియె నాపె స్కాందమువం ది
త్తెఱఁగు కవంబడు నీకున్, దరణోపాయంబు చూపఁ దగు నాపె సుతా!

క. ఔరా! నను హంసవి నీ, సారాచారములు మెచ్చు జనులుం గలరో
క్కో? రమ్మురమ్ము పోవుద, మేరాజమ్మ కడ కేని యిది తేటపడున్

ఉ. మూల ముడింగి సారెకును ముష్టిపరిసంగము నీవు బావయున్
జాల లిఖింపవచ్చు, నెకసక్కెము లాడఁగ వచ్చుఁగాక, టా
ట్టా లెటు సాగు వేతొకయెడన్? బొనరించినలోపముల్, వృథా
పేరిలుటలున్ శిరమ్మునకు వ్రేఁగు ఘటింపక యూడఁబోవునే.

ఉ. ఎన్నిటినేనిఁ గప్పు జగదీశ్వతరం బగుశక్తి, యట్టిదే
యున్నయెడన్ గురుండెగడి యున్నతిఁ గోరఁగనేల? కీర్తికిన్
దిన్నవితోవయే కలదు, దేవుఁడు దాని నొసంగకుంటయే
యున్నిదొసంగు లిక్కరణి నీవొనరించునిమిత్త మర్భకా! 163

శా. పాపంబుల్ పలురీతు, లందెదియొ యెప్పాటన్ మనుష్యుండు తా
మాపో రేపొ యొనర్పకుండుట యసంభావ్యంబు, నేఁ డన్న, హా
లాపానాదుల పైతమున్ ఘనులె హేలన్ జేయుచున్నారు వీ
వాపాదించు కృతఘ్నతాభరమొ? త్యాజ్యంబొ? జామీ యేరికిన్.

ఉ. దీనిమహత్త్వమున్ దెలిపి తిన్నని తోవను బెట్టకున్నచో
హీనునిగాఁగ నన్ విబుధు లెంతురు, నీకును లేదు ముక్తి; దెం
దానఁ బునఃపునర్మసన నాగురుతన్ గుఱిచేసి చేసి వ్యా
ఖ్యానమొనర్చి తిన్నఁబడి కైకొనుమయ్య కుమార! భద్రముల్.

క. నిను( జెలుప నెంచినజా న, న్నను * "వేదో"కవి, యటంచును దిట్టినజా
బును జేసియొద్ది కంపిన(, బనుపడదే, నాదుకోర్కె బ్రిహ్మాండంబే ? 166

పల్లెపాలెము.

* "శ్రీగంగాభాగీరథీసమానులగు .. రావుగార్కి, నీవు వెంకటరామ కృష్ణకవులకును తిరుపతి వెం(+కవులకును తంత్రము పెట్టినట్టు విన్నాను నీకు అందువల్ల వెం(+కయైనను లాభములేదు నాపేరు వ్రాయకపోవుట మరచి వ్రాయలేదు. (బూతుమాటలతో చేవ్రాలు)

ఇందు చేవ్రాలు మాలమాదిగలుకూడ నుచ్చరింపని బూతుమాటలతో వ్రాయుటట్లుండ నిది యెవరినుద్దేశించి వ్రాయ(బడినదో వారిని దిట్టిన తిట్లకు( బరిమితిలేదు. మఱియు నీయుత్తరము కాని కార్డుపై వ్రాయ(బడినది. మొదట పెనిసిలుతో వ్రాసినపిదప వేఱొక సిరాతో దిద్ద(బడియున్నది — ఇ(క నొకమాదిరి సిరాతో(గూ(డ నొక క్రొముడియు( గొమ్మును సవరింప(బడి మొత్తము మూడు వ్రాత లుపయోగింప( బడినవి. కార్డుపైని అడ్రెస్సు మ॥ రా॥ రా॥ అని యున్నది. లోపల వేరువిధముగా నున్నది. బూతుపేరితో( జేసిన వ్రాయి కార్డుపైనిగూడ పెన్సిలుతో వ్రాసినది కలదు మరియు నిట్టిదె వేఱొక యుత్తరముగూడ నిట్టిచేవ్రాలుతో నీయన నుద్దేశించియే వ్రాసినది కలదు. విషయ భేదము లేదు గాని యందలి యంశములు మఱియుం బచ్చిగానున్నవి. ఇందు రెండుబొమ్మలు వ్రాయ(బడియున్నవి. ఎన్నో బూతు లనేకవిధముల ననందర్భములుగా లిఖింప(బడి యున్నవి అవియేవియు నిందుదాహరించుటకు రాజశాసనమొప్పదు కావి యందు( దుట్టమునను వ్రాసిన తప్పుడు సీసపద్యముమాత్ర ముదాహరణయోగ్యముగా నున్నది

"సీ॥ పురుషుండవో కలిపురుషుండవోకావి ధూమకేతువుతోడ తుల్యమగుదు భయమొకింతనులేక నిర్భయంబుగ నీవు గ్రామమృగరాజుతో తుల్యమగుదు, నీవలుకును దాని పలుకొక్కటియె కాని కూయిదెప్పు డొక్కసారిగావి
తే॥ గీ॥ యిట్టి నీ దుష్టచరితంబు యింపుమీర. వ్రాసినాడను నేను వహ్వాయనగ.

చింతగింజలవలెను.

యు మిష్టరు (అవాచ్యపు చేవ్రాలు)

యీపత్రికలు యితరులకుకూడా పంపినాము.

ఉ "ఎప్పటికేని నీవటనే సుఖముండువుగాక, నాదుపే
ర్చెప్పక యుండినన్ నృపతిచే వినిపించెదఁగాక; నీదు వా
తప్పుడు పేరు లీశతవధానమునుండి మరల్తుఁగాక" యం
చిప్పవిఁ బూనితిన్ జరిగె నిన్నియు నొక్కటి తప్పకుండఁగన్.

ఉ. ఇప్పటికేని నీయెడలనే దయ నా కధికంబు, నీదు వా
తప్పుఁ బ్రసంగ మంతగ నెదన్ జెవరింపదు, నీవు పెట్టువా

---

☞ పై యుత్తరములు వ్రాయువారు వ్రాయించువారు వీనియుంమద్దేశింపఁ బడినవారును జాల దగ్గర బంధువులు మా శిష్యులొనర్చెడి యనందర్భ ప్రసంగమును విని మందలించినందులకై వారివంకనుండి యిట్టి యుత్తరములు వెలువడఁ జొచ్చినవి వీనికి సంబంధించిన రికార్డు సర్వమును మావద్దనున్నది. ఇటీవల వీయవాచ్యపుటుత్తరములంగూర్చి బంధుసముద్రిలు కొందరు చేరి మందలింపఁగా జరిగినయంశము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

" ఈమధ్య వెంకటాద్రిమయ్య యిచ్చోటికి వచ్చినాడు. అప్పుడు యీ యుత్తరము నాకు వచ్చినట్లు ప్రసంగవశమున వచ్చినది ... .. . . ..వెంకటాద్రి మయ్య తమ్ముడు సత్యనారాయణ పెరుగక వ్రాసినట్లు దక్షిణామూర్తి మొదలగు వారియెద్దను అన్నాడట. . దగ్గరిబంధుత్వకారణమున నేమియుదలచక మాటలాడకూరకున్నారము పాపపుణ్యములు భగవంతునకే యెరుక .... .... మా మీద లేనిపోని మాటలాపాదించి ఎవరు వ్రాస్తే వారే యనుభవింతురని . . ... .... యూరకున్నారము ... ..వెంకటాద్రిమయ్య తమ్ముడు మాత్రము "మా అన్నయ్యే వ్రాయమంటే నేను వ్రాసినా"నని అక్కడక్కడ అంటున్నాడు. (చేవ్రాలు)

☞ దీనితరువాతనిగూర్చఁ గొన్ని పంక్తు లీక్రిందవి వ్రాయఁబడినవి.

"వెంకటాద్రిమయ్య తమ్ముడు నత్యము అక్కడక్కడ మా అన్నయ్య వ్రాయమన్నాడు గనుక . . రావునకుత్తరములు వ్రాసినానని చెప్పడముచేత వెంకటాద్రిమయ్యయే వ్రాసినాడేమో గాని నే తలచి మొదట మీ విరోధములు నామీదకు కూడ వచ్చినవి యని మీ పేర వ్రాసినాడను."

☞ శ్లో॥ కర్తాకారయితా చైవ ప్రేరకశ్చాను మోదకః॥ అమనాక్యో క్తింబట్టి పైయుత్తరములలోని సంగతి సందర్భములను బట్టియుఁ బ్రాజ్ఞులు విచారించి మాశిష్యుఁడుగారి గుమభక్తిని నిర్ణయింతురుగాక. ఇతఁడు చెప్పి వ్రాయిం

తప్పుడుఁ జేరు లాశతవధానము పేరును మాపుచుంట నా
ముప్పు నడంచుపొంచె నిది పూనితి నిక్కము నమ్ము మర్భకా.

ఉ. పూనిన పూనికన్ దెలిసి "పొట్టకుఁ బూనితి పైఁపుఁడంచు నా
పై నెవరుంచుఁ డంచు నొకపాటిది యుత్తర మంపికోక, దు
ర్మానపుఁ ద్రోవఁ ద్రొక్కి యపరాధము పెంపొనరించి కొంటి. వి
ద్వేనియు మంచిత్రోవఁ బడు మిం కపరాధివి కాకు వాకులన్.

ఉ. ధాత్రిత దాఁచి పేటొక యుసహ్యపు మార్గముఁబట్టి పూర్తిగా
శత్రుత వెళ్ళఁబెట్టియుఁ బ్రిపత్తికిఁ గాని ప్రిపత్తిగా గురు
ద్రోత్రము లవ్యథా సలుపఁ జూచెద, వింతటిలోనె నాయశ
ప్పత్రి మపాత్రిమౌనె ? పలుపజ్జను లుండఁ గవీంద్రు లుండఁగన్

మ "అవధానం బొనరింప లేఁ డతఁడు, నాయాచార్యుఁడుం గాఁ" డటం
చనవిన్ మెచ్చఁగఁ జేయలేవు విను మర్భా ! "తప్పు పైరింపుఁడీ
యవివేకం బొనరించినాఁడ" నన నార్యశ్రోమముల్ మెచ్చు "ము
ల్లె పెలార్పంగను గొణ్ణి గొట్టికొమటల్" లోకుల్ ప్రశంసింతురే.

క. "దానువితప్పులు దండము, తో సరి": నామాట వినుము తుచ్ఛపుఁవ్రాఁతల్
వ్రాసి కలహమ్ముఁ బెంచకుఁ మోసుత ! బుధు * లాడుమాటలూఁకొనవకటా

ఉ. గుట్టును మట్టునున్ దెలియ కోయిలపిట్టవు గాన నా యెడన్
బెట్ట యటన్న నిశ్చయము, తెకుతె నీకుఁ గుమార ! నాకడన్
జట్టమొ, దైవమో యనిన చూపున నున్న కృపాలు రెండటో
పట్టణసీమలం గలరు పల్లెలయందుఁ గలారు పుత్రికా ! 178

---

చినచో నడుగనే యక్కఱలేదు తనంతటఁ దానే యాతనితమ్ముఁడు వ్రాసి నచోఁ దమ్ముఁనింబట్టి యన్నగారి వివేక మనుమేయముకాక మానదు. అయా శ్లోకలయందలి యోగ్యతను గూర్చి భగవంతుఁడును దత్తుల్యులగు యోగ్యులును విమర్శింపఁదగువారు.

* బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిలవారి సన్నిధికి (నవరత్నమాల)

చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీతిలకుల్ విలసచ్ఛతావధా॥ నతతినలిప్పనై
శవరనాధ సభాస్థలులన్ జయంబుగాం ! చిరి వరకీర్తి దిక్తటులఁ దెంది సముజ్జ్వల

ఉ. అందఱుఁగూడ మూర్ఖు లని యాడిరి, వేగరి నోరువచ్చెనో
వందలు వేలు పండితులు పత్రిక లిచ్చిరిః యందు నొక్కఁడుగా
మందుఁడు గాని పండితుఁడు మంచి వివేకి యనంగఁ డొక్కఁ ; డీ
చందముఁ జూచినన్ దెలియు సాహసి సం చెటువంటి సందఱున్.

---

చంద్రికాపరిః స్ఫురణమూఁజూపఁ బండితులా భూరిముదంబున సన్నుతింపఁగన్॥ ఉ॥ ఆరయ సర్వశాస్త్రములయందు మదంచితమైన సాహితీ ధోరణి మేలుమే లని బుధుల్గొనియాడఁ గవిత్వవిద్య కా౹ ధారము వీరలేయనఁగఁ దద్దయుమించు పొగడ్తగాంచి యా౹ ధీరు లుదారభావమున దీపితులై విలసిల్లుచుండఁగన్ ఉ॥ వేంకటరామకృష్ణ లను పిన్న కవీంద్రులు నేఁడు వారికిన్ । సంకలఁబెట్టి వారల ప్రబంధములందు విమర్శనంబునా౹ గొంకక వ్యర్థలోపములు గూర్పుట కాతకు దగ్గునేర్పుతో౹ యింకిటఁ బండితోత్తములకెల్లను గర్హ్యముగాఁగఁ దోఁచెడున్॥ ఉ॥ పిన్నలువారు పైకొను కవిత్వమదంబున| బద్ధులేమివా౹ కొన్నను రాజబాట గొని కుంజరమేగ మృగంబులెన్నియో౹ వెన్నడికూసినన్ బరువు పీడొక్కనో కరికంచునెంచి లోఁ గన్నక వీరలయ్యెడి యుపేక్షయొనర్చుట మేలు సూడఁగన్.... ఉ॥ వేంకటరామకృష్ణయకవి ప్రవరుల్ । వినుఁడీరు సత్కవుల్। సంకలితుల్ కవిత్వరసజ్ఞులనంచెటఁగించు మీరు సాధ్యాంకములం గనుంగొనిన సన్నుతలీల శతావధానమా౹ శంకములేక చేసినవిధంబును దెల్లము సేయు మీకృతుల్॥ ఉ॥ బనమ మీకళావిభవ మంచిత చారుకవిత్వశక్తియున్ ధీనిధులంచుఁ గీర్తిగను తిర్పతి వేంకట సత్కవీంద్రులన్। మానక నిందఁజేసెడి క్రొమంబునకున్ బవిపూనినట్టుగా౹ గావఁగనయ్యెడున్ దగవుగాదిది పండితులైనవారికిన్॥ ఉ॥ పిన్నలు మీరు వారు కదుఁ బెద్దలు విద్యలకున్ బొగడ్తకున్। సన్నియగాదు మీకుఁ బెడవాదము వారలతోడఁ బూని, మీ కున్న కవిత్వశక్తి బుధులొప్పఁ బ్రబంధములందుఁ జూపుఁడీ । చిన్నతనంపుచేఁతలు రుచించవు మీకపకీర్తి దెచ్చెడున్॥ చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీమణులారః యనేక రాట్సభాం౹ తరముల మీరుగాంచిన యుదారయశంబున కిప్పు డిట్టులె౹ వ్వరు పలపించినన్ గొదవవచ్చునె సూర్యుని శేటగప్పినన్ గురువగు తత్ప్రకాశమునకుం గొఱవచ్చునె కాన పేరు బం౹ ధురమగు శాంతిభావమున నూల్కొని యెప్పటి యట్ల యుండుఁడీ॥

ఇట్లు
అడవి సాంబశివకవి.

ఉ. "కాకవు లెల్లఁ గాకవికిఁ గాలికి మువ్వనుగట్టి" రంటివే ?
యేకముగా జగమ్ము లివి యెల్లను మిగ్రింగెడి పీడుబాప "మా
క్కా-కలుపీరినట్టి కవిగండడిగా" నెటు చెప్పె నోట ? నీ
కాకవిఁ గూర్చి, తాను నొకకాకవియో, కపియో, పికంబొకో

చ "భయపడ కేమి రా" నను మఁ బల్కిఁతి జ్ఞప్తి యొకింత లేదె ? యా
శయమునఁ జూచికొ మ్మొకట స్వాంతము మండి పిలాపురంబు నా

* ...తే॥ గీ॥ అట్టిమీయొద్ద విద్యల నభ్యసించి, కయిత మల్లంగ నేర్చును గాంచి తుదకు, మీరుగురువులు కారనిమిమ్ముఁ దెగడు, ననుఁగుశిష్యుఁబు గలరని యనఁ గవింటి, క. వారలదెసఁ గోపింపక, తారూరక యుండవేఁడెదను గాకున్న ఁ దారించుక కోపించిన, వారికి సేమంబుగాదు పండితులారా ! ఉ ధర్మన మఖ్యు లోకతవధానకతాంగము ! దారిసూపఁగా, నిర్మలమైన మార్గమున విస్నల తిర్పతి వేంకటేశ్వరుల్, గూర్మివిదేశదేశములఁ గ్రొమ్మరఁజేసిరి నేడునీమదు, షక్కర్మమదేమొ యాప్పుడును గాకవులీడ్వఁగ దొర్లెదిక్కటా. క. నీకుఁగల యశము పెడదిదె, కాకవులంబాఱదోలి ఘనతిర్పతి సు, శ్లోకుఁడును వేంకటేశుఁడు, సాఁకుమనున్నారు నిన్ను జయ మగు నీకున్. సూర్యభట్ల వైద్యనాథం

. .. .... .. .........శ్లో॥ యేగీరతం ప్రతిదినం పఠంతి
విబుధాస్తుతాః, తే గురుద్రోహ పాపాత్ప్రి, విముచ్యంతే న సంశయః

ఇట్లు, రామనాగేశ్వర భక్తినప్రధాన కీర్తన శతకత్రయ నిర్వచ నాంధ్రరఘువంశ కావ్యకర్తయగు — భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, హెడ్ పాష్టరు.

మండవల్లి, లింగాలపోస్టు. కృష్ణాజిల్లా 11-12-12

Injeram 6-8-10

"....ఉ॥ పూతచరిత్రులైన తమబోఁటి మహాకవులందు వ్యర్థపుం, జాతురి మీఱ వాగ్వ్యయము, సల్పినచోఁ దమరెంతయో మహా, ఖ్యాతిని గాంతురంచు మదిగర్వముచే నిలఁగొందఱుందురా, పీతివిదూరులన్ గనిన నేరమటంచుఁ దలంచకుందురే. చ॥ కవులని పేరు పెట్టుకొని కాలముపుచ్చుచు నొక్కచో మహా కవులను ధిక్కరించుటయె కార్యమటంచుఁ దలంచువాఁడు కా, కవియగుఁగాని సత్కవిఁ గాకపి నాను మదెట్లు చెల్లు స, త్కవులకు దీనకోపమది గల్గ దొకిం

చరయకు వివాసమైనయెడఁ దత్తఱ మందవొ ? పాఱిపోవొ ? వి
శ్చయముఁగ దెల్పుమీ । ప్రతిన జార్చెద, వెంటనె వచ్చి తీరెదన్.

ఉ. చక్రముఁ బట్ట నే ననుమఁ జక్రి ప్రతిజ్ఞయొనర్చియున్ దురా
పక్రమ మేగు దేర నది పార్థునుపేక్ష యటంచు నెంచి "యీ
యక్రమ మెట్టుపేతు నన్నరాత్మఁడ నయ్యెద' నంచుఁ గొంకకే
చక్రము దాల్చె శౌరి. యది సాహస మిచ్చెదుఁ గాక నాకిటన్. 179

చుఱయెంచి చూచినన్. గీ॥ గురువులనె వెక్కిరించెదు కుమతులింక, తల్లిద
ద్రులనేరీతిఁ దనుపగలరొ, యహహ ? వారలనేమనియవఁగవచ్చుఁ, గాంమా
హాత్మ్యమని యెఱుంగ వలెఁగాక,

వెలువలి వీరశంకరమూర్తి పా॥ చింతామణి.

---

మ॥ గురువే బ్రహ్మ, గురుండె విష్ణువను, వాక్కున్దూలఁగాఁ బుద్ధియే
తెరువో మాకమరెన్ గదా యనుచు నెంతే యుబ్బి తబ్బిబ్బుగా, నరసుల్
మెచ్చఁగ నెట్టులోఁ బరమచే చాయన్ బొసంగున్ బరా, త్పరుఁడెట్లారక
యుండుఁ, దప్పని ననేతాదృశమే లేదు. మీ, రరయుండీ యిదెబోధపేతునని
సత్యం బెల్లఁ జాటింప మీ, గురుశిష్యక్రమబోధి గిరతమునాకున్ బంపుఁడీ
యొండు ... .

ది 4-3-1911 శిష్టా వెంకటసుబ్బశాస్త్రి
పొన్నూరు పోస్టు, గరికిపాడు

క॥ శ్రీతిరుపతి వేంకటకవి, నేతలకు జగ త్ప్రసిద్ధనిరుపమవిత్య, ఖ్యాతి
శ్రీనృతులకుఁ గరు, జాతత్పరులకు విపక్ష నాగహరులకున్ గీ॥ అస్మదీయభో
గీశ మహాత్మ్యమందు, గురుమణిమాలలో మిమ్ము గూర్చుకొనెవి వైభవము
పట్టుకున్నను వ్యాకరణము, గజవి ముం దేవి సద్దావి గరుణ విడరె గీ॥ వాయస
వ్యాసముఖమున వారెకృష్ణ, పక్షితకునొప్పికొనినట్లు స్పష్టమగుటఁ గోకిలలకు
రామాభిఖ్య కూడ దనుట, వారె కాకములగను గావలసియుందుర్ సీ॥ కాకం
బుపేరిడి గ్రంథంబుముందు గాఁ గప్పించి చేసిన కారణమున, "పాపిచిరాయు''
పన్యాక్యానుగతిఁ జిరజీవితకు గుఱుమాషించుకతనఁ "పులిఁజూచినక్క" యనో
క్తి నే తిద్వాచ్యబాధక నామము ల్వదులుకొనుట, బలిపేయువిభుపీఠి బయలెక్కి
నను తలల్ దక్కినపువనకవి తారియుంటఁ గీ గాకపీఠ్పద పట్టాభిషేకమునకుఁ

మ. అవధానం బొకమూల మంచు మది యేలా, చక్కఁగాఁ బద్యముల్
జవిగాఁ గూర్చి పఠింపఁ జాలుదువె ? పీచాతుర్యముల్ జూతు మీ
యవధానం బయిదే నిమేషములు నాకర్పించుఁగా, నా దినం
బెవియుం బాడక వీడకే నిలుచునట్లేఁ జేసి మెప్పించెదన్. 180

చ అయిదునిమేషముల్ "టయిము" నర్పణఁ జేసియు నైదు యామముల్,
పయి వెల లైదు, పిమ్మటను వత్సరముల్ మఱియైదు నిచ్చి "మీ
దయ" యనిపించుకోఁదగిన దార్ఢ్యము మద్గురువర్యు లిచ్చి, రీ
మెయి పది చూపుఁ గాకము పరిమేయము గల్గిన నోపికన్ నిటా. 181

చ. వెనుకటిపోల్కెఁ గాక మిది వృద్ధగురుం బని పేయ లే దటం
చనుకొనినాఁడ వో తనయ ! యజ్ఞుఁడవై కద ? కాక మంటి దా
నిని జిరజీవిగాఁ దెలుపు నిర్ణయముల్ విన వాక్కొ ? యెప్పుడా
క్కనియతినే కనంబడెడిఁ గాకము లోకమెఱుంగదే సుతా 182

ఉ. "కాకము వచ్చె" నంచు నృపకాంతునితో వచియించు వాఁడవో!
లేక "బక" మ్మటందువొ ? మఱిహంసఁ దందువొ ? తేను దర్శనం
బీక యనాదరించు నటులే ఘటియింతువొ ? త త్పథాస్థలిన్
మూకత సంఘటించెదవొ ? మ్రొక్కెదవో ? మఱి యేమిచేసెదో. 183

ఎగిన వారలు వారలే తగరు మీరు బరభృతత్వంబు "సంపన్న పద్యములను, జెప్ప
నౌనటకు ఫల మిదిసిద్ధమయ్యె ... గీ॥ మొదల శిష్యుగాఁ గొనుఁడని మొదలు
పెట్టి తుదకు నే మేమొ చెప్పఁగాఁదొడగినట్టి, తప్పు సైరించి నాయెడ దయ
మటెంచిఁ వారితోఁ బోరు చాలించవలె క్షమించి గీ॥ అహహ ! యెపరెంత
ఘనులైన నన్నృత వాదు, లగుచు గురుశిష్య మర్యాద నంతరింపఁజేయఁగాఁ
గూడదటువంటి శిష్యులేల ? యున్నకీర్తికిఁ జోటు లేకున్నమీకు. గీ॥ ఎవరి
పాటన మెట్టిదో యెవ రెఱుంగ, రెండు కసములతో వాద మేమిఫలము, పెనిచి
విషవృక్షమేనియు బెరుకరాదు. తమకుఁదెలియని ధర్మముల్ ధరణిగలవె.
ఉ॥ గీరతపద్య వర్షములఁ గింకవి పంకజముల్ ముణింగె గం, భీరవచోఘవద్య
మల పెంపునకుం గవికేకిలోక మిం, పారఁగఁ దాండవించెను మహాత్మకదంబము
టల్లసిల్లె నా, భారత మేమిలెక్క యను భంగిని గీరతమున్ జెలంగెడిన్.

బందరుతాలూకా సాధుజన చరణసేవకుఁడు
పెడన. పల్లంపల్లి మల్లికార్జునుఁడు.

ఉ. ఘూకఁగ నిచ్చుచున్నయెడఁ జూపెద నాదగు వార్ధకంబు; నిన్
జూడ మనంబువం గలదు మా సుతు; పుత్రుడుకోర్కె; చావ కీ
జాడ నెఱుంగఁ జెప్పు యొక జాబును బంపుము "పైరు" తీరు వె
న్నాదెద, శక్తిఁజూపెద వహో ! యని మీన్నపుఁ దక్కుజుం వదలా. 185

---

కూఁతలే" యనుచు సాహసమెల్లిమ వెల్లడించినా రొప్పులకుప్పలార ! జగముందు చెఱింగి యిటుల్ లిఖింపఁగాఁ। జెప్పఁగ మీకు నెవ్వగిదిఁ జేయాయు వాయియు నాదెవోగదే॥ ఉ॥ అన్నా! మీరును బండితప్రవరులే యన్పించుకోఁ గర్గి పై। నెన్నండే వొకమ్మ్యఁడుం గలిగి వాఁడుంతేని యంతీని విః ద్యన్నిక్కమ్ముగ ఏకదం బదువనై యల్పజ్ఞుఁడే యయ్యా మీః కన్నుఁగా మిన్నానటంచు మిన్నుఁ గన వెట్లో మీకుఁ జింతింపుఁడీ॥ ఉ॥ వేంకటశాస్త్రిపండితకవి ప్రిథుపాచము లాశ్రియించి విః శ్శంకముగాగడించితిమి శక్త్యనుసారము సంస్కృతాంధ్రి కా, లంకపసాహితిం గవనలాఘవముం దగు శబ్దశాస్త్రముం। జుకమయేము; మాచదువు సప్యముఁ దక్కురుణాత్తమే చూఁడీ॥ ఉ॥ పొల్పుగ సభ్యసించితిమి మువ్వర మేకముగా నవల్పమో। స్వల్పమొ శబ్దశాస్త్రమునయందు నవారిలుడీనఁ దేమనం। దెల్పఁగ నేమిశాలము ! గణించెమ వేంకటరామశాస్త్రియున్। వేల్పెఱుఁగున్ గురూత్తముఁడు వేంకటశాస్త్రి మహార్దబోధముల్ ఉ॥ అంకిలిలేని చెమ్మ కిరవైనయతం దతికాంతమూర్తివి। ష్పంకహృదఁతరుండు పిమపాటికులోద్భవుఁడాత్మవేది శ్రీ। వేంకటశాస్త్రి సద్గురువి పేర్మిమడి కెంతయుఁ బాత్రి మింక మా। వేంకటరామశాస్త్రి కెవ పేయిటి కొక్కరుఁడేని కల్గునే॥ మ॥ "గురుఁడుగా దైవములేఁడు నేఁ దకట, యాంగ్లో విద్యలవ్వేర్చుబా। టర" కంచున్ వచియించు పండితుని పోల్గొంతమ్ముగా నొక్క నేఁ ర్పరి యాంగ్లేయ కలార్థి "మీచదువునేర్వగా భక్తిచేకూరునా। నదయుం" డంచుమ మిమ్ముఁజెప్పెవఁట, యయ్యా! యాంకఁజాలింపుఁడీ। ఉ॥ ఏల వృథా ప్రియాపపద వెవ్వరెఱుంగరు మీకపిత్వపుం। బోలిక చాలికల్ తెలుపవో గురులెవ్వరో తేటతెల్లగాఁ। జాలును జాలుఁ గన్గొన నశక్యమటంచును బాలుదాప్రివు మా। జ్ఞాలము కన్నుమూఁతలిడు చందము దోఁచెఁగదయ్య యయ్యోతన్ ఉ॥ పుట్టికపున్న వేత్తలయి పొల్చినఁ బొల్తురుగాక పాదముల్। పట్టిపఠింపరే విజముపల్లుఁడు వేంకటశాస్త్రిచెంత; హా। దిట్ట లటన్న పేరు చమదెంచెనా లేదా యొకింతలోన

శా. "పీడన్ బోలక వెంటవెంటఁ బడువీ వేయింండ్లపూజారినే
వాఁడా జాచినమా బతించు" అది మాపాలిండె పాలించుఁగా
"కేఁడీ యాఁత' అటంచు నేత్రములు కెంపెక్కంగ విశాజాపుఁగా
కూడా గొప్పదైనఁ గాక నిర్భయదురుక్త్యదేశిక సౌభాగ్యముల్. 187

---

బల్చి రెక్కడఁ? బ్రికాశము పేయుఁడు దాని వై భరల్ ! చిఱుతలు పోవఁబోవఁగఁ బ్రిసిద్ధి వహింపఁగ వర్తు లక్కటా ! గరువపుఁ తెద్దయముల్ గలుగుఁ గా కవి యొందొకచోటఁ జూప కా గురువులపట్లఁ జూపఁ దొరఁకొంటిరె ? లేక జగమ్ము మెచ్చు మీ ! పరువున కల్లవారు గురుపట్టమువంద నపర్హులై రెః ఖా స్వర శరదిందు చంద్రికల చాడ్పున నెల్లెడ వెల్లిగాంచి దు స్తర మగునట్టి వారల యశంబును దాఁటఁగ, మాటుపుచ్చ మీ తరమగునేః తలంచుఁడు పృథా కృధ విపకుఁడయ్య ! అయ్యోఁ బో! జరిగినదానికేమి సుమిశాల మనస్కతఁ జింతచేసి యి పృరుసున వింక దండుగ వివాదములన్ మతి వమ్ముచేయ కా! తిరుపతి వెంకటేశ కవిధీరుల శిష్యుల మంచు మించు సం! బరమున నాత్మశుద్ధిమెయిఁ బక్కినమే ల్కవితావ ధూటి మీ! వరపంయా యింపునింపు, గురువర్యులకుం దగు శిష్యులంచు మి! మ్మర యుదు రాదరింతుర్రి పరిజ లందఱు, దాన యశంబు పొతుఁ జే కుఱు. గురువర్యు లగా మిగులఁ గూరిమిమీఱ మిముం దలంతు, రీ శ్వరుఁడును మెచ్చు, మేముఁ గరు నందరముం బడువార, మేమియుం! బొరయును బొచ్చెమం గలుగఁబోదు యథార్థముఁ జెప్పినాఁడ న! క్కఱగొని వాదు పల్కు విన్నఁగల్గిరయేనియు నాఁట నాఁట దు! ష్కర నిరవద్యహృద్యశతఘంటమహాకవితాలతానవాం! కురములు వాడిపోక చెలఁగున్ మెలఁగుం పలు తావులందు ముమ్మరముగ వల్లివిల్లిగొని పంజాలపుం జిగురాకులెత్తి క్రొం! బరిమళముల్ వెలార్చు కుసుమమ్ములఁ బేరిమి గాంచి మిమ్ములం ! బరిణత సత్ఫలమ్ముల వనాతరముం దనియించు చుండెడుగా.
మ॥ "తల కెక్కెం గరువమ్ము వీఁ డెవఁడురా ! ధైర్యమ్ముమై మాకుఁ ద! ప్పులు నొప్పుల్ గణుతింపఁబూనెఁ దలవంపుల్ కావలెగా వీని" కం! చలుకం జూపఁ దలంతురేని యొక లెక్కానే ! మహోధ్యాయునిం ! దలదాఁటందలపెట్టుమీతు ఖయ మందగా రామకృష్ణాహ్వయుల్. శా॥ శేటల్ దేరిన సత్కవిత్వమునఁ గీర్తిం గాంచుచున్నట్టి మీ ! బోఁటుల్ యత్కవితామృతాంబుధికి సంతోదంబులై రాపిరా ! మాటుల్ తిర్పతి వేంకటేశ్వరులకుం గారాపు శిష్యుండ నామాటల్ కొంచెము వీనులగా బోనుపుఁడీ మన్నింపుఁడీ వేఁడెదన్.

క వృద్ధుఁడ నవి, పరికటించితి కుర్రధుం డగు భీష్ముముందు "కోణాకిన్క" గణ
శ్రద్ధుండు కర్ణుఁ డేమగు ?, శర్ధమేయిఁకా భారతమ్ముఁ జదువు కుమారా !

తే. గీ ఒక్కనీవు నన్నాడెడి యూషరోక్త
లెన్ని భూషణోక్తుల జనియించఁజేపెఁ!
గాక నేనెంతవాఁడ నక్కవిగణంబు
నన్నుఁ బొగడుట కో యవినయధురీణ! 189

ఉ, పంచల లెక్కయే మకట ! వారక లక్షలు వచ్చుఁగాక యే
పంచయుఁ దండ్రిపేరు గురువర్యుని పేరును మార్చి చెప్పఁ, డీ
చందములం బొకానొకటి సాధ్యముగాఁ గనుపట్టెనీకు; ము
న్నుండిఁకనొక్క టింక నొకమోజుకు సాధ్యము చేయునోకదే! 190

మ "అల నారాయణశాస్త్రి నీ వెఱుఁగుదే?" యన్నంత నవ్వారికిఁకా
దల పంకించి యెఱుంగుటన్ దెలిపెనో, "తన్మాను నేఁడ న్నే" నటం
చెలమిన్ బల్కెడో? చెప్పుమయ్య! యటులే యూనన్నుఁ బ్రశ్నించినఁకా
దలపంకించెదవంట ! "శిష్యుఁడనె" యన్నఁకా లోపమే పుత్రికా ! 191

---

వ. తిరుపతి వెంకటేశ ఫణిదేవుల కీర్తొనని రామకృష్ణ "శీశ్వర! మణి
వేరులై తి" మని పల్కఁగ "పీశ్వరవేరు" లన్నయ! ట్లనసి యథార్థమూని శర
జార్థుల వ్యర్థులగాఁ దలంతురే ! తిరుపతి వేంకటేశ్వరులు దీనశరణ్యులుగారె
నక్కవీ! చ॥ తిరుపతి వేంకటేశ్వరులు దేశము లన్నియు గెల్చియుండియుఁకా! నర
సుఁడు పీఠికా నగరనాథవరిం గలరామకృష్ణ థీ ! చిఱతపుఁబాత్రియపుం గవిత
చెప్పఁగ నేర్చుట కా మెచ్చింగియుఁకా ! దుర మొనరింప రమ్మనుచు దూఁకఁగ
ధర్మమె సుంతయైన మా ! నరపతినైనఁ జూడ వలదా వలదా మరియాదలేరికిఁకా.

ద్విభాష్యంపుల్లకవి

గోదావరిజిల్లా, పిఠాపురం డివిజను, దుర్గాడ.

(మఱియు సీసుకవి శ్రీరాజావారి సన్నిధికంపికొన్న పత్రికృతవిషయపుఁ బద్య
ములలోఁగొన్ని)

.... .. . ...చ॥ తిరుపతి వేంకటేశ కవిధీపులు వేంకటరామ కృష్ణధీ, వరులు
కవిత్వ సంగతుల వాదములాడఁదలంచి పత్రికల్, జరుపుచుఁ గయ్యముల్ పెనుప

ఉ॥ జనకుని పేరు దాఁచినను సత్పథనంతగ శంక రాద, త
ద్దినమునఁ దండ్రి యెట్లొ సత దేశకుఁ దట్టెదె? యెట్లు దాఁపఁగాఁ
జను గురు పేరు? నీకెఱుక దాలక కీర్తి కిట్లు దాఁచితే
ట్లును బయలెక్కెఁ గన్గొనుము లోకము మూయను మూకుడున్నదే।

---

పొగిరి శామదిగాంచి తీర్పుఁడీ. మఱవక రావువెంకటకుమార మహీపతి సూర్యరాట్ప్రభూ .. ... ఉ॥ గానికి మూలమన్న? మొనకాదిది, నోటికి వచ్చినట్లుగాఁ గూసెదరేమొకో! యనినఁ? గోవిదగోష్టి. దురంతకృత్యముల్ దోసములన్న సత్కవు లౌరఁబని, రాజసభాంతరంబులం, ధీనభ సేయ నొప్పమికి హేతువు లెవ్వియులేవు భూపతీ! క॥ మనరామకృష్ణ కవులును, ఘనతర విద్యా ప్రవాహ గాంభీర్యులు ర, ధ్వను గెల్తురు గెల్వకపో, యిన మాత్రముచేఁ గళావిహీను లగుదురే! ఉ॥ ఈకవి కూరవైరము మహీపతి విన్నమ గంటకోపలగా, దాపకయుంటునే పతి వినంవగు యత్నమునల్పు మంచునగా, లోకులు ప్రోత్సహింప జనలోలుఁడనై చరితపర్చు కొంటిఁజా, మ్మా? కవిపాల వేంకటకుమార మహీపతి సూర్యరాట్ప్రభూ?

| | |
|---|---|
| దుర్గాద<br>గోదావరిజిల్లా | ఇట్లు, విన్నవించుకవి, రాజవిధేయుఁడు<br>ద్విభాషి పుల్లకవి. |

ఉ॥ మోకగమన్న నాఁడు గవి ముచ్చటచే రసముంచి పెంచితీ! వోకవిరాజ! సద్గుణాకళోదయశాలివి నాన దావికిం! పాక సమూహ్య వృద్ధి గనుపట్టునఁ దాఁగనుపట్టె నెట్టవన్! నీకెదివిపోలకున్న నిఁక నేర్తురె? యన్యులు మిన్నకుండఁగగా. తే॥గీ॥ ఉభయశాస్త్రములవి కాక యుపరిశాస్త్ర! మొందు నుపదేశమాత్రిన యూహసేయఁ జాలియును జాలమింతకు మేలిగురులఁ! దిట్ట వోరెత్తుకోయిర దిట్టతనము .. ఆ॥ వె॥ శోత్రియుండు పుత్రుఁజూడరా వాఁడతి! కారియగుటదోడి ఘను లడిగినఁ! దనకుఁ దెలియునవ వితని తల్లి నరయుఁచీ రను చతంతు వల్కెననఁగ వినమె.... ఆ॥ వె॥ మగని మంచివాఁచి మన్నించుఁ గోమయొద్ద! గురువి దొఱఁగి లాతి గొప్పసేయు! శిష్యుఁడింక నెద్ది సేయనో వఁడు కలిఁ! గూడదీ జగడము గురువ రేణ్య. శా॥ నీ హంసత్వము గాంచి యెల్ల బుధులున్నినా నవోల్లాసిగా! మాహం తేర్చిరి యొల్లుకా కవియనగా మోతించి వద్భావ భూ! షాహాసిత్వమె కాంతుప్రికక్కాఁ

శా. ఏఁ దిట్ట న్నను నీవు దిట్టితవుగా ! యేసీమలోఁ జెల్లు నీ
వాదం బేగతినెగ్గు ? నేలవికి యెవ్వారేని వ ర్తింతురే !
లేదే ! శిష్యుఁడు దేశికుం డమనెడిఞా లేశంబు భేదం బహో !
పాదంబుఞా శిరమొక్కఁడౌనె యరరే ? ప్రాజ్ఞుండ విట్లాడెదే. 193

ఉ. చప్పవికూఁత కాకికడ సంగ్రహణంబు బొనరించు పట్ల వి
న్నెవ్వడుఁగావి తిట్టుటయొ యుంచుక మొట్టుటయో తటస్థమౌ
బొప్పఁగదా ! పరాపరిగ నొజ్జను దిట్టితొ ? మొట్టితో ?ద గన్
జెప్పఁగదయ్య ! యుప్పు డటు సేఁతకు సిద్ధపడన్ గడంగెదే ! 194

---

రుల హంసమ్మమ్యలఞా. గ్రాంకృతి ! వ్యాహారోద్ధతుల స్మరల్తు రిఁక నేలా వారితో వాదముల్. చ॥ సిరియును వాణియు న్నిను భజించెను మున్నె యనన్య యుక్తిఁ దు క్కొఁడు లెటులాడనేమి గుణకోటిఁ దలిర్చితి రాజులెల్ల జా ! పరములదాబ్ధి భూషలిడి మాటికిఁ గొల్చిరి యప్పనంబు గూ ! ర్చిరి యసమానతక్ష యటఁ జెల్లనె? తిర్పతి వేంకటేశ్వరా

ఇట్లు,
తాదేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, చందవోలు.

---

ఆ॥ వె॥ గుమఁడు కాకమనుమఁ గోకిలమవి తాను ! విజ్ఞవీఁగ కేవురు బేవరి బెవరి ! తిరుగుమంచి గానవరములఁ బాధించెఁ ! త్యాగరాజ రాజయోగవిదుఁడు.
హరి నాగభూషణం వ్రాలు.

## హితోపదేశము.

ఆ॥ నవశతావధాన కవిలోక మణులార ! రామకృష్ణులార ప్రాజ్ఞులార ! శిష్ట హితుఁడు గాదె శ్రీ జగన్నాథము ! చేయు హితము మీరు చేకొనవలె. తే॥ కాక కోకిల వ్యాపంబు, గడఁకవ్రాసి ! గురుల వింపించినా డసీ ? కొంత కింత ? మీరు విద్యా విశారదుల్ సార్థమతులు ! కారె మిమ్ము నేమంచు నేమాయవాఁడ. క॥ ఎఱుఁగడి వారికి బుద్ధులు ! గఱపుట మఱి దిద్దుకెందుఁ గరము సుకరమౌ ! వెఱఁగియు వెఱుఁగ గవివారల! తెఱఁగున బరియుంచు మీకుఁ దెలుపఁ దరమే ! క॥ అవధానంబవిషయాశక ! కృపవివ్యలు నేర్పు వెంకటేశ్వర గురుతో ! విపరీతబుద్ధిఁ గలహం ! బు పెట్టికొంట

ఉ. కాకము మీఁదఁ బెట్టి యటుకొట్టుల మీటుటకన్నఁ జక్కఁగా
"నాకు గురుండెయాతఁ" డని నమ్మ వచించినయంత విన్న సు
శ్లోకులు కొట్టరే ! నృపతి సూరిగ నొప్పఁడె ? యిప్పుడేని యీ
పాకము నేర్చికొమ్ము గుణవంతుల మెప్పును గొమ్ము పుత్రికా ! 195

---

దగడెందు. మున్నుగుఁజూండీ .. చ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులఠంబెను మీరు పాండితీ ! గరిమను గొప్పవారొ ? మఱి కారొ ? యెఱుంగమగాని వారితో ! సరిగఁ గవిత్వమున్ నెఱపఁజాలినవారని యెన్నఁజాల నీ ! తెరవునఁ బల్కనాఁడనని, తిట్టకుఁడీ భవదీయపుత్రికా. మ॥ అరయన్ దేశికదేవ ధిక్కరణ శ్రేయస్కాము లైనట్టిమె ! వ్వరికిన్ గూడదటంచుఁ జెప్పవలెనా ? పక్షిణావిశేషంబునన్ ! గురుఁడే చూడఁగ వేంకటేశకవి యోగ్యుల్ మెచ్చ మీరింక మీ ! గురుపాదంబులుపట్టి బాగు పడుఁడీ, క్రోధంబులో మిగ్రింగుచున్....ఉ॥ శ్రీపద కృష్ణమూర్తి కవిశేఖరు సన్నిధి మీగురుండు వి ! ద్యావతనంబు చేసినది యావయ మాసచతుష్కమయ్యు నం ! చీపిత బుద్ధి నాతనిని దేశికుఁ డంచును జెప్పుమండు "నే ! నేపగిదిన్ గురుండగుదు నీకని" కంచు వచించు నీతఁడున్ .. . .

బరంపురి నివాసి,

గాదె శ్రీ జగన్నాధస్వామి.

---

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర శతావధానుల సన్నిధికి,

తమగిరతి ముచూచి శ్రీరామకృష్ణకవులఁ గూర్చి యీక్రింది పద్యముల వ్రాసి యభినవ సరస్వతీ పత్రిక కంపియుంటిమి తాము చిత్తగింతురని సమ్ముఖమున కని పితిమి "...మ॥ అరుదెంచెన్ గన రామకృష్ణకవులారా ! సర్వదిగ్దేశ ఖా. స్వరసాంద్రా ఈశవిశ్వకీర్తివిజయశ్యామామనోహా రులై, వ్వరో ఆ తిర్పతి వేంకటేశకవితా ప్రారంభ ద్ధమర్మజ్ఞత్తమై, పరఁగంగాఁగల గీరత పత్రిదర మఖ్యా ! యెట్లు వైరింతువో ? . సీ॥ గుణకాత్రియంబుకోఁ గుంటు శశమ్మిని బాటుబతంబడై పాటఁదోలె, కవితాబిమర్శన ముండనమ్మునకు సర్వాంగముండన మద్దె యల్లుకొనియె, కాకవి గాజు పింగాణిబుద్ధుల దీల్చుబెండుపేకుంతోఁ బీఁకుటాయెఁ ఏదేశమిష్టమో యెంతఁగింపఁ దీపథ, కవ విరుత్త రమువఁజమటయయ్యె.

ఉ. వంకరశాస్త్రివ లెన్నఁటికి వంకరశాస్త్రివలె యందుఁ జొచ్చెనా.
శంకరుఁదేవిఁ జేరుగనఁ జాలఁడు; చక్కనిశాస్త్రివఁ బోవుమీ
వెంకవగారి పట్టుదల వేళ్ళల పైతము త్రిప్పఁ జాల రో
వెంకటరామశాస్త్రి ! యవివేకి వెఱ్ఱైతి వెఱింగి సర్వముఁగా. 196

ఉ. శ్రీ కలచోట నప్పుగొని చెచ్చెర దీర్చక మానెనేని త
ర్పాకము గారణంబుగను ధర్మహ మందెటులో జనించు నన్
వాకుల సత్యమయ్యెఁ జామిః నాఋణముఁన్ వసఁ గాకిఁ జేసి నా
వాకిటఁ గోకిలంబ వయి వహ్వారె ! తీర్చితిః ముష్టిఁ బాత్రకా. 197

క. అప్పుగొని తీర్పకుండిన. యప్పురుషుఁడు కుక్క యగుట యనుభవసిద్ధం
బిప్పుడు కోకిల లగు టిది, తప్పదు కలికాల మాత్మ ధర్మంబు సుతా. 198

## (8) గీరత ప్రశంసాపర్వము.

ఉ * గీరతమన్న యిట్టి కృతికిన్ భవదీయ విజృంభణంబె సూ !
కారణ మయ్యె విక్కృతనఁ గల్గినలాభ మవారి నాకు, పీ
పేరిటఁగాదె యిట్టి సుకవిత్వము చెప్పితి, నాకు నే ఋణీం
దారును దీనిబోలె నెఱదాత యటంచును దోఁచ దన్యకా. 199

---

గీ॥ శక్తిలోఁ దారతమ్యంబు చాటనయ్యె. కవితలోఁ దారతమ్యంబు గాంచనయ్యె.
ఇంక నీమాఱువేసంబు లెన్నివేసి, విజము దాఁపఁగ నుంటిరో సుజనులార.

ఇట్లు సోదరులు, దూపాటి తిరుమలశేషాచార్యులు.
వెంకట రమణాచార్యులు

..* గీరతము కొంతభాగమయిన నచ్చుపడి యుండినచో నొక ప్రతి పంపఁ గోరెదను.

ఆనందబాగ్ పేవరి
మదరాసు 19-12-11

చిత్తగింపుఁడు,
జి. రామయ్య

శ్రీరాములు.
శుభమస్తు

సీ. అవధాన విద్యామహోశాబ్ధి నింతింత వారి నెక్కించిన ధీరమణులు శత
పత్ప్రబంధ నిర్మాణ చాతుర్య ధుర్యుల నెల్లరనుజేయు లలితకవన, బుద్దంత

క. ఒకకంటి నేసువాఁడెపెకి, చకచక కొంకపత్త్రంబు దాలదునీకుఁగా
బకబకలాడుచు వాదము,నకు దిగకుము మంచిదోవ వదువుముపుణ్యా. 200

క గర్వియనుచు లోకులు వను, నిర్వచనము పేయవిమ్ము; వినుచోలెడి గం
ధర్వుఁడు శిష్యుఁడు దొరకిన, గర్వివి బాలకుఁడఁగూడఁగావచ్చుఁగదా ! 201

---

భాషా ద్వయోద్దామ సాహితీ పతుల నెల్లరఁ జేయు బొంగిర గురులు, బహు, చమత్కృతి యుక్తభాష ణోపన్యాస పటిమ నందజేసిచ్చు పటువచస్కు, లరయఁ దిరుపతి వేంకటేశ్వర కవీంద్రులే యటంచు మహర్లోక మెల్లనుడువ, వావిఁగాంచిన కవితావిలాసులార, దివ్యతర భవ్యకావ్య వర్ధిష్ణులార ! మ అతినీతిపద్దమై రసప్రచు రమైయాహ్లాదసంధాయియై, పతిమత్సరక్క విహ్వత్కజాక్క సమమై, మాయాంతా ప్రాభవ, స్థితిమారించబయి యొప్పు గీరతము భక్తిగా మొక్కునాకిప్పుడీర్ కృతి కృచ్ఛేఖరులార ! పంపుఁడు దయా శ్రీచేతఁబై రీతిగాఁ,

ది 21-7-1912 } ఇట్లు విధేయుఁడు.
గరికిపాడు } శిష్టా వేంకటసుబ్బశాస్త్రి.

---

శా॥ బాపట్లాదిసమస్త పట్టణములన్ బ్రాంజ్ఞాల్ మిషున్ వేఁడఁదా, మేపట్టో గ్రహియించి గీరతమునం దించించు కేవెల్ప నే. నాపట్లన్ విని నీతిబోధక కథావ్యాహారమౌ గీరతం, బీపట్లఁగా దయచేయ వేఁడెదను స్వామీ వీ పి గా గ్రుక్కునన్.

ఇట్టు సుధీకవి విధేయుఁడు

25-5-1912. శ్రీరామకవి పుత్రుఁడు జమ్మలమడక కోటయ్యశాస్త్రి

. క మీయతంటి మహనీయులె, యీయెడ గీరతము వ్రాయకెడగానున్నఁగా.
గూయవె గుంటలు సైతము, బాయవె తలిదండ్రులన్న భావములైనఁగా.

కొండపాటూరు 30-7-12. వలివేటి వేంకటనరసింహము,

. . ...ఉ (వంచపాది) తిక్కనసోమయాజికవి ధీవరకల్పితమైన భారతం. బొక్కటి దక్క వింకొకటి బోధనసేయునె నీతులంచు నే, నెక్కుడుగాఁ దలంచ నొకవెచ్చెలి యిచ్చటికేగుదెంచి నీ, వెక్కుడుగాఁ దలంతువది వెల్లడియయ్యెను గీరతంబునం దెక్కుడు ధర్మమార్గములు, తేటతెలుంగవి తెల్పనంతటఁగా .. ..

12-7-1912 తెనగల గోపాలకృష్ణయ్యవారిలు
పెసనందిపాడు.

క. "ఎవ రిచ్చిరి కవితకు నీ కవనీపాలకత" యంచు ననవత్తువె : తా
తెవతిడిరి సింగమునకు న, టవికో రాజ్యమ్ము మృగపటలములనీఁదన్ : 202

క. "గర్వం బెదిగెనుగా:" నా, గర్వము చూపెదవుగాక, కాపీరాదే :
సర్వాహంకృతివారణ, దూర్వహ మగుసభ నొకండు డులిపెద తిక్క౯. 203

క. "ఎవరిచిరి జోదుకాగద, అవివీతుఁడ : నీకు" ననిన "యాముదపుంజే
విని యొనఁగె" ననుమఁ జెప్పినఁ యవివేకిఁగాకి నెఱుఁగు,మన్న యటంచున్

---

శ్రీశివాయనమః

......తిరుపతి వేంకటేశ కవిధీర వతంసములార : మీకు నే, నెరఁగి తెల్పు యా విధిగా బుధహృదీప్సితలక్షణ లక్ష్యభార సం, భరితము ప్రీతిదాయకము ప్రాజ్ఞ గురూత్తమ శిష్యవృత్తి సం, స్ఫురణ ధురీణసంఘటన సన్నుతిపాత్రి మరితప్రపా తిరస్కరణచణపరిచారణము సారసవర్థ నమర్ధశబ్ద సం, చరణము తత్తదుత్తమ రసప్రతిభాగతిభాసితంబునై, పరఁగెడుగీరతమ్మొకఁడు బంపఁగ మిమ్ము నతమ్ము వేఁడెదన్.

బాపట్లతాలూకా, బాపట్లపోస్టు, విధేయుడు
కొండపాటూరు జమ్ములమడక శ్రీరాములు.

శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి వారి సన్నిధిని వున్న ఆస్థాన పండితుడు దేవరం మహాదేవ శాస్త్రిగారున్ను, యింకావున్న శ్రీస్వామివారి సదస్యులున్ను, మీగ్రంథములు అన్ని చూచేనిమిత్తం కుతూహలులై యుండి అందులో గీరతమందు చాలా ఆశక్తితో వున్నారు .. తప్పక ప్రస్తుతం గీరతము పంపించ కోరుచున్నాను.

- చామర్తి జగ్గారావు, బెండపూడి.

.... .. క॥ ఘంటాశత ప్రతములం మం, చంటాసఁట : లోకమెంతకైనఁదగును ము, క్కంటిని నేనని యొకఁడిటు గొంటె ...... బొట్టుపెట్టి గోలయొనర్చెన్ .. . శా॥ గంగోత్తుంగతరంగఘుంఘుమరవాకారామకార్యార్పటీ, భంగిగా దాక్షిణ్యగుణచ్ఛవిస్ఫురితరసప్రచ్ఛన్నవేషంబు నీ, సాంగత్యమ్మునఁ బొల్చు వక్కవితకే చంచంబునన్ సాటి? భూ, మిం గ్రీగంటిపరిపాక భవ్యకవితా సీనాక్ష లాహింపగా ......

ఇట్లు జూపూడి హనుమచ్ఛాస్త్రి, శతావధాని.

చ. ఉడుగక వ్రాసి తెందులకొ యొజ్జలఁజూచిన్, "గురుఁ డాకఁ, డంపు నే
నొదువక యున్న శిష్యుఁ డని మాటికిఁ గోటికిఁగూడ నీవు చె
ప్పెదువది చాలదే" యనుట పెంకితనం బిది. "యింటివాఁడు పే
రిడి యిది గొడ్డుగేది" యన వింకొకఁ డాడునె పాకి గేదిగా 205

క. కల రెందఱేని శిష్యులు, కలిగో నాకుబలె నితరకవులకు; మఱి వా
రలకుఁగా వారికిఁ గలహము, గలుగని దెటు నీకు నాకుఁ గలిగినదెట్టుల్ ?206

సీ. నారాయణాఖ్యమ్మునకు నమస్కారమ్ము శ్రీకృష్ణుఁ డానాఁడుచేయలేదె ;
భీష్మసాయకవహ్ని బిట్టేర్చి మండంగఁ గృష్ణుని ప్రతిన వెట్టెక్కలేదె ;
పదునెన్మిదవ నాఁటి పదుముపాఁజునిబారి కెదఁగొంక పాఱఁడేకృష్ణుఁ డెటకొ ?
సైంధవవధకు నాచార్య మ్రొక్కించఁడే శ్రీకృష్ణుఁ డా నాఁడు క్రీడిచేత ;
తే॥ గీ॥ విజయుగా నాపసామ్యంబు నీదుబావ
మఱఁది కృష్ణుఁడున్న మమ్మహితుగుణము

... ... చ॥ చదువుదు సూరనాది కవిచంద్ర పటుత్వ కవిత్వసారమున్, మున
మెన మారుచుండ మును మున్నుఁక నెప్పుడు గూడ నల్లె నా, హృదయము గీర
తామృత మొకింత చవిఁగొను వాఁడుఁగోలెఁ బా, యమరుచి సర్వకాల మవురా ?
కివనం బిటులుండు టొప్పదే. ఇట్లు విన్నవించి నమస్కరించు

ఆర్యాపురము, విధేయుఁడు
రాజమహేంద్రవరము 18-1-13 భమిడిపల్లి సీతారామయ్య.

..... నవీనముగా రచింపబడిన పంచమ వేద ప్రతియానంబగు గీరతంబును దయ
చేయించ గలందులకు ప్రార్థనచేస్కున్నాను
సా॥ వెలగదుర్తి, తణుకుతాలూకా, నరసింహదేవర గవరయ్య

(1) .... కలకత్తాచేరినాను. తమగీరతము ఏరవలయునని యిచ్చటి యాంధ్ర
విద్యార్థులందఱు మవిశ్చలూరుచున్నారు, కాన యీజాబు చూచినవెంటనే తమ
గీరతము పీక్రింది విలాసమునకు పంప ప్రార్థించుచున్నాను.
(2) .... గీరతమును శిరసావహించితివి ఆగ్రింగ్లరాజము నొక్కపరి చదివి
తనివిదీరక యావకాశము చిక్కినప్పుడెల్ల నందలి భాగముల మాటిమాటికింజదివి
యానందించుచుంటిని,

191 Bow Bazar Culcutta Dantu Subbavadhany

గూడ నున్నవ గీర్తి చేకూఱునీఁడు
ఎట్టులో విన్నుఁగాపాడి యేమిఫలము.

సీ సకలాగమాంతసంచారి యాకృష్ణుండు సక లాగమాంతసంచారియితఁడు
పరమసత్యాసక్తభావుఁ డాకృష్ణుండు పరమసత్యాసక్తభావుఁ డితఁడు

---

.. ..గిరత సందర్శనార్థమై చంద్రికకోర న్యాయముగా వేఁడుచున్నాడను. వేగిర మంపకోరెదను. చిత్తగించవలెను.

K. V Kristna Rao.

.. . గిరతము అనుమహాగ్రంధమును ఒకటి నాకు పంపకోరుచున్నాను. యీ గిరతము నేను చదివి జన్మసాఫల్యము చేసుకొనుటకై వ్రాసుకోవడమైనది.

చీరాల ది 30-6-12 తెలప్రోలు సుబ్బారావువ్రాలు,

... ...మ॥ వెన్నుంబోలిన మీకవిత్వ మొకటల్ వింవయ్యె మిమ్మిప్పుడే, గన్నా రంగవి నే భవన్మధుర వాగ్వాధాన్యవాలోక, నో, త్పన్నానంద విచిత్రచారు మణి సౌధంబెక్కఁ గాంక్షింతు ర, మ్మన్నన్ వచ్చెద, చెళ్ళపిళ్ళ వంవంశాగణ్య ముక్తామణీ. సీ॥ అష్టావధానశతావధానము లనువవి చిన్ననాఁడె నేర్చినదికాదె। వాగ్వాదమందు విద్వాంసుల గెల్చుట కరతలస్థామలకమ్ము కాదె। రసవత్ప్రబంధ నిర్మాణ చాతుర్యమ్ము తమకు స్వార్జితమైన ధనముకాదె। దిక్ప్రవనంచరత్కీర్తి మీకొక స్వయంవరలబ్ధయౌ ధర్మపత్నికాదె? గీ॥ యనుచు నుతులను సామాన్యజనమెకాదు, వైరులకునైనఁ జేయకతీరదనుచు, నాకుఁదోఁచెను సత్కవిలోకతిలక, వేంకటేశ్వర కవివర్య। వినుతచర్య. చ॥ మఱియొక చిన్నవిన్నపము మన్నవ చేసెద రంచునెంచి యి, త్తెఱఁగున వేఁడుమంటి భవదీయకృతి వ్రజమందు సత్సుధా, కిరదకలంకనంఘటిత గిరతముం బఠికింప వేంకటేశ్వరకవివర్య। మీకృతులు సర్వముఁ జూడఁగ వేడ్కఁ యయ్యెటిన్.

ఇట్లు ఆకొండి వెంకటశాస్త్రి
బొబ్బిలి సంస్కృతపాఠశాలాపండితుడు

...... ఆ. వి పి. సంతోష పూర్వకముగా 1-8-0 చెల్లించి పుచ్చుకొని గిరతం చదివి పరమానందమును బొందినాను, రెండవభాగముకూడా త్వరలో అచ్చువేయించి పంపించగలందులకు కోరుచున్నాను మ॥ రా॥ శ్రీ. వెం రా॥ గ్రంథమాల ద్వితీయగుచ్ఛకములో శృంగభంగమందు "కౌముదీ జేత బట్ట" యను పద్యము మొదలు నాలుగు పద్యములు చదివినంతనే వారివ్రాతలయందు

గాంగేయగౌరవాకార్యింతుఁడా కృష్ణుండు గాంగేయగౌరవాకార్యింతుఁడితఁడు
పూతనానాశనస్ఫీతుఁ డాకృష్ణుండు పూతనానాశనస్ఫీతుఁ డితఁడు

తే. గీ. అర్థభేదమ్ము దక్కలే దతని కితని
కెందు శబ్దంబు లోకగతినే పొసంగు
నేర్చికొను మాతనిగొనాలు నీకు విహవ
రంబులఁ బ్రతిష్ఠ కళ్యంతరంబులేదు 208

క. గోవర్ధనుఁ డాతం డా, గోవర్ధనుఁ డితఁడు నీవి కుచ్చితమే వి
న్నీవిధికిఁ ద్రిప్పెఁ దప్పుడు, తోర్లివలు నీవింత మును పెఱుంగ వెఱుఁగుదున్

---

సంచే హముతో నుండిన మమ్మును మీ గీరతమువల్లను సంశయనివృత్తిచేసి నందుకు చాలా సంతోషముగా నున్నాము.

Baruva Post }
Ganjam District. } P Janardanam Naidu.

..యీ గీరతంలో సర్వాంశములున్ను వున్నవనిన్నీ బహుబాగా వున్న దనిన్నీ, చూచినవారు చెప్పడంచేత నాకు చాలా కుతూహలంగావుండి యీ వుత్తరం వ్రాసినాను గాన ముఖ్యముగా పంపింపకోరతాను.

ది 14-10-12. ఆ॥ సుబ్రహ్మణ్యం

.... .గీంతము ఇప్పటివరకు కొంత చదివితిని. యింతవరకు నాకు తీసి వేయవలసిన పద్య మొకటియు కనపడలేదు ఇది నాయొక్క విశ్వాసమైన యభిప్రాయము (తమయొక్క) గీరతములో 34 వ పేజీలో "కృతి" యన్న కంద పద్యములో పొరపాటునదియు నాకుదోచినది.

నూజవీడు, 28-7-12, నారయ్యప్పారావు.

అయ్యా! 12-7-12, చిత్రాడ.

తమరు పంపించిన గీరతము అందినది. గ్రంధంబు చదివినకొలది మాయు ల్లంబుపరిమితానందవార్ధిన్ దేఁదుచుండె పంచమవేదం బనంబడు భారతంబురీతి మీ గీరతపుస్తకంబు పెక్కుపికులచే విరాజిల్లుచుండె తక్కిన భాగంబులుకూడ అచ్చుపడిన వెంటనే పంపించగోరెదను. తమరు కావించిన శతావధానగ్రంథము లన్నియు వి. పి. గా పంపింపకోరెదను, ఇట్లువిధేయుడు

చెలికాని లచ్చారావు

ఉ. ద్రావిడులందు మాగురుగదా ? గుణవంతులు, నేను బావయు౯
నీవును నర్దుకొందము; "మనీషుణ నవ్వెడికూళ" తిప్పతిన్
జేవయెటుల్ ఘటించు ? గురుశిష్యవినోదము లింత చక్కఁగా
నావలె నీవలెన్ దెలియునా ! వెలనాఁటి శతావధానికి౯. 210

శా. శ్రీకృష్ణుం డుదయించు హేతువున సుశ్రీమించె రేపల్లె, నీ
యా కృష్ణుం డుదయించు హేతువుననౌ ! యాకారవల్లీ సమా
ఖ్యాక గ్రామము దుర్యశోభ్యుదయపారావారము౯ దాఁటలె.
కేకాకారతఁ గుందుచుండెఁ గనుఁగొంటే శిష్యచూడామణీ, 211

శా॥ అయ్యా ! మీదగు శిష్యకోటికిఁ బ్రశిష్యప్రాయుఁడౌ వీరమ ల్లయ్యా ఖ్యుండు వచించు విన్నపము మీయాంతర్యమందుం గొనుం డయ్యా ! యీయప మానకథ తమకోంట్లా పూను ? టా రామకృష్ణయ్యల్ పిన్నలు సర్వధర్మములఁ నేర్చైన౯ గృప౯ మానుఁడీ॥ ఉ॥ వారలతప్పు తొల్త గురువర్యుల నెన్నక యుంట, విమ్మట౯ ! దూఱుట, రెంటిలో నొకటి దోసముతప్పని వారెయొప్ప రా ! వేఱొకదోసమో ? తమదు వేసము పోషణ సేసికొంటకా ! దారిఁ బోయి రందుకుఁ దగ్గ చివాట్లిడిరంత చాలదే .

Bezvada. 12—1—1911,

ఇట్లు విన్నవించు భవద్విధేయుఁడు,
కాశీనాథుని వీరమల్లయ్య.

---

31-1-1911, గుంటూరు.

శుభము.

(1) ..క॥ శ్రీ తిరుపతి వేంకటకవి ! భూతేశుఁ డనుఁడు నాయపూర్వప్రమనవి౯ ! మీ తెలుఁగు గీరతమ్మొకఁ ! డీతఁడె నాకందఁజేయుటే వీ. పీ. గాన్॥ క॥ అప్పటికాశ్చర్యమిఁక ! నిప్పటికీ గీరతంబు నెన్నో విషయాల్ ! చెప్పఁగ వెలువడెననియెవ ! రెప్పుడుచూతునొ యటంచు వే వనుకొందున్..... ......

(2) ...గీరతము కడవఱకుఁ జూచితిని సత్ప్రమము, సధర్మము, సందర్భమునై యున్నది. ధారాస్వారస్యాదులకు మెచ్చనివారు ముందు పుట్టవలెను.

ఇట్లు శిష్టాహనుమచ్ఛాస్త్రి, గుంటూరు,
తెలుగుపండితుఁడు, టౌనుహైస్కూలు

ఉ. కాకరపర్తి శేఖరము గాంచి నదుత్తర మేదిలేమి వా
ర్నాకు సమీప బంధు లవివశా జగమొప్పెడి వంచు నెంచి, యా
సాఁకున దూరదేశగతసజ్జనులన్ గిఱరింప నెంచెదే ?
యీకపటంబు కృష్ణకవిదే యగునో ? మఱి నీదియో ? సుకా. 212

(1) ...గీ॥ మీ కవిత్వమువలా బహు మిన్నగునఁట ।। బహుకవులచేత సమ్మతుల్ వడసినదఁట ।। వ్రికృతులంగూడ సంతోషపరచినదఁట ।। భారత మునకుఁ బ్రితియగు గిరతంబు.

(2) .. మీరంపిన గిరతమందినది. దానిని సమగ్రిముగా జూచినాను, మీగిరతమంధు మాకు తెలిసిన విషయములు వారివిషయమై వినుండు. (1) గురు వుమ మఱచుట, (2) రిజష్టరుత్తరం త్రిప్పివేయుట (3) చాటువవద్యములల్లుట. (4) వ్రాసినమాటకు బదులు వ్రాయకుంకుట, (5) శృంగభంగము వ్రాయుట మొదలయినవి గ్రిహించితిమి, మార్గముఁ జూపినను తెలిసికొనలేనివారితో నేమి సార్థకము ... తెలికేపల్లి రామకృష్ణయ్య. వేలూరు, చిల్కలూరిపేటపోస్టు

ఉ॥ గిరతమన్న సర్వగుణ కీలితమార్దవ పాకసార మ॥ వ్వారిగఁ జూచి దానిపఠితివర్ణనసదప్రసపూరమానఁ ద॥ ద్వారత మై ఖరిం దెగడెఁ దక్కినభాగము లన్ని పూర్తిగా । గూరిచి వేగమంపుడిది గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా,

18-11-12 సోమవారం గుంటుపల్లి గోపాలకృష్ణయ్య.

అయ్యా ।

'తమరు వేసిన గిరతము చాలాబాగావున్నదనిన్నీ, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్నీ, మీవాక్కు అనేసరస్వతికి ఈగ్రింథము ముఖ్యస్థానమనిన్ని వింటిని, చర్ల సూర్యనారాయణవార్లు,

(1).... గిరతము 1 ప్రతిన్ని.... ఈనాల్గుప్రతులు వి. పి. గా పంపవల యునని నిత్యము నమస్కరింపుచున్నాను.

(2).... గిరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది కలియుగ భారతమనుటకు యేమిన్నీ సందియము లేదాయెను.

పేరేచర్ల హనుమంతరాజువార్లు, ది 6-9-1912.
- కాకాని, వంతమాగులూరుపోస్టు,

* శా॥ ఏమేనత్త కొమారుఁడే తెలిపె ? వావింగూర్చ నా బంధు వం
చేమేనిఁకా లిఖియింప నేరుతువె ? మీకృష్ణుండు నీతండునుఁకా
పామాన్యంబగ వన్నదమ్ములసుతుల్; సత్యంబునందొక్కఁ డు
ద్దాముం, డింకొకఁడో ? యసత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ॥ 213

---

ది 13-9-10.

గొల్లకోట భైరవశాస్త్రి అనేకనమస్కారములు .... ఆూమధ్య తమరు అచ్చు వేయించిన వాదపత్రిక నాకు వినదమందుచాలా కుతూహలముగా నున్నది ఓతా పురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు ..యీ పత్రికయున్ను పంపించితే దానిఖరీదులు దాఖలు చేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి

........ఉ॥ ఏంటివి గిరతమ్ము మున వేదమె యానవి ధర్మబోధయం : దుంటివి, వచ్చుబెడ్డౌయని యోగురు శేఖర : గిరతమ్మునే : దంటివి వేదమే యమని వారవి యీ రనపెట్ కవీంద్రు, వకొంటివి వీ ఏ గా నొకటి కోరిక నా కొకఁతంప మిమ్ములఁకా.

ఇట్లు
శిష్ట్లా హనుమత్ శాస్త్రిలవారి శిష్యుఁడు.
మంత్రాల కామేశ్వరరావు

---

.... ...శ్లో॥ శ్రీమద్వెంకట రామకృష్ణకవిభి ర్మిత్యావరిలాపాత్మకో, యుష్మ ద్గ్రంథ విదూషణాత్మకతయా గ్రంథస్త్ర యో విర్మితః. దృష్ట్వాతం బహుథా వివిశృత తియా మస్మిన్ప్రిణానాంవచ కృత్యాకించిదపి, పరివక్తుమలన స్తద్గిరతా దర్శనాత్॥
శ్లో॥ యుష్మత్సిరాపూత కవిత్వపాటీ, సముజ్జ్వలాపాంగ యశోయుతీంతాం, సభామువిస్తా రయితుం మనోమే, వితీక్షితుం కాంక్షతి గిరతంతు.

ఇట్లు తమవిధేయుడు, పేకువరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం

* .... తమ గిరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దానిశైలి యుక్తిదాని వర్ణించుటకు తగినంత సామర్థ్యం తమ్మునందును యివ్వలేదు ...చెప్పట్లపర్వ ములో మా సూర్యనారాయణ శాస్త్రిలను వారి అల్లరి అంతకే కారకుఁడుగా వ్రాయించినారు. అది అన్యాయమని నేను దలంచుచుంటిని. అతడు వెంకటాద్రియ్య

ఉ. వేదుల రామకృష్ణునకు వేమలవారును, జర్లకున్ స్వదా
యాదులునున్ విరుద్ధులయి యర్భక ! సత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టఁగాఁ దది ప్రమాదములోఁ బడు వారిఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట సుమ్మి పుత్రకా ! 214

చ. ఒకఁ 'డెవఁడో వివేక విరహాం దుదయించిన నంతమాత్ర స
త్ప్రికరపరంపరాజని పవంబుల వంశము లప్రతిష్ఠచేఁ
గకవిక గాంచఁబోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగమ్ము గ్రహించుఁ గాపుత్రకా 215

---

వలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు వీరుభయులున్నూ మీయందున, మీ కవిత్వమందున, విశేషమైన భక్తి కలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యిటీవల భక్తిలేని వాడుగా మీకు కనుపించు చున్నాడు అతనిని గురించి నేను వ్రాసినను వీలు లేదు. గాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీ కవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తి గలవాడే అని నేనేకాక మా గ్రామమంతా కూడా యెరిగిన సంగతియే. మా సూర్యనారాయణ శాస్త్రియో ఏ విషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడు ప్రసంగము చేసినవాడు కాడు. యితనిని శృంగభంగంలో పీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయం వస్తే నిజం చెప్పేవాడే కాని వేరుమోస్తరువాడు కాడు. యితడేకాదు వాళ్ళువ్రాసిన సాక్షులంతా ప్రమేయం వస్తే, ఆవేళను జరిగిన పని తప్పుడుపని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తి శాస్త్రులుగారి తమ్ముడువల్లనే అని మా గ్రామంలో చెప్పనివారు వక్కరు వుండరు. యిట్టి స్థితిలో మా సూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అనితాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలావిచారముగా నున్నది. యీసంగతి అతడుచాలాసార్లు నాతో ముచ్చటించి నాడు. శృంగభంగము తప్పుడు కూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొని వెళ్ళుట ఆనాలోచన పనిగా తమరు నమ్మవలెను, ఇటీవల అవధానము లలో తమరిని గురుస్తుతిగా నుతించినాడు ఆ పద్యము నాతో చాలాసార్లు విన మని చెప్పినాడు ఆ పద్యములు ముందు అచ్చులో నున్నవి, చూడగలరు. ఆరెండ వనాటి అల్లరి సభలో కాకరపర్తి వెంకటశాస్త్రి యున్నూ; నారాయణ శాస్త్రి గారున్నూ, వీరికి సంబంధించిన వారున్నూ కాక మిగతా వారి యుద్దేశం కల

చ. ఎఱుఁగని వారి కన్నుల నెఱే నిసు మూరక చల్లవచ్చు, ద
గ్గఱఁగల బంధుజాలపు మొగంబులు మూయఁగ నేర, పూరకే
పరుగిడ కిచ్చుదేనియు పెటానవిపింప కొనంగ యత్నముఁగా
బొరయుము; కృష్ణసత్కవికి బుద్ధిని జెప్పి మరల్పు మచ్చుకా! 216

---

వారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతా దురుద్దేశం కలవారలే అని అను కొనియుందురు. యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్ళను తప్పించుటచే మాకాయర్థము స్పష్టమవుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్న ప్పటికి దురుద్దేశము కలవాడు కాడు, యితడు మీగీరతంరాకకై యెదురుచూ చుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు వచ్చినతరువాత మిక్కిలిగా సంతోషించిన భాష్యకారశాస్త్రి వగైరాలతోపాటితని నొక్కనిగా భావిం చుచు రెండవకూర్పులో యితనిని సవరించెదరని నమ్ముదును . మరుదిన మందు పశ్చాత్తాపపడని వారేలేరు ఒకనాడు మారామచంద్ర పెదనాయన గారు, మారామకృష్ణమ్మను చీవాట్లువేయగా నేనువిన్నాను యెవళ్ళు యెంత దాచుకున్నా సంగతులు తెలియకపోవు కోకిలకాకములో "కావు. కావు. కావు. కావు. అను కల్పనయె యిప్పటికిని మీ కవిత్వమందు వాళ్ళకు భక్తికల దని చెప్పుచునే యుండును సీ॥ ఇవి రాజసుతులు చేయవలసిన పనులుకావు కావంచు గాకమ్ములఱచె" అను బుద్ధచరిత్ర సీసపద్యమును జూచినవారికి విస్ప ష్టమే: లోకములో సత్యమును గ్రహించేవారు పలువురు వున్నా అన్యతివు వ్రాతలు వ్రాసేవారు వ్రాయకమానరు. వేమవరంలో తమకు జరిగిన సన్మానమును తమరు అక్కడ జూపిన అసాధారణశక్తియు ఒకవిద్యార్థి అక్కడ స్వయంగా చూచి వచ్చి మావూరిలో నాకు చెప్పినాడు. శ్రీ శితారామశాస్త్రి, మరియు మొదలైన వాళ్లు చాలాసంతోషించినారు. విచారించే కూటములో వారుగూడా కొంతమంది వాదగ్గర సంతోషించినారు. యిటీవల నేను యేలూరు వస్తిని అక్కడ ఆంధ్ర పత్రికలో కామేశ్వరకవి వ్రాతచూస్తిని, ఆవ్రాతకున్నూ నేనువిన్నదానికి సంబంధములేదు. ఆ వ్రాతలు ప్రకటించిన పత్రికాధిపతి తెల్వితేటలను గూర్చి నాకు చాలా విచారకరమైయున్నది, ఎప్పుడున్నూ దుర్మార్గులు చెడుపనులు చేస్తూనే వుంటారన్నందులకు, ఆవ్రాత దృష్టాంతముగా యున్నది. యీవ్రా తల నిజము మావాడు యెరిగిన్నంత కూడా యెదో పేరుపెట్టి ప్రకటిస్తూయుం టాడు, యిట్టి వ్రాతలవలన గాని, వట్టికోతల వలన గాని మీకీర్తికి యిసుమం

చ. సకల మెఱింగి నా కవయశం బొరఁగూర్పఁగ నెంచి వెట్టి దు
ష్ప్రకటనముల్ పొరింబొరిగఁ బత్రిక నించెదె ? కొండవీటివా
రికి మఱి బానటయ్యెదె ? యథాప్రకరంబు లిఖించు దుర్వచః
ప్రకరము పొత్తమందుఁ గాని పత్రిక్లదముల్ లిఖియింతువే సుతా ! 217

ఉ. పుట్టినదుత్తమాన్వయము, వోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె. పీ

---

తయి లోపంబురాదు .. ... .. ...బ్రహ్మణవందశాస్త్రి వ్రాసినట్టుగా మాగ్రామములో కొంతమంది కోతిమూకవున్నది . . ...వుంగవుల కొరకు గుంటూరిలో మూడుమాసములు వసించిన మీరు మాగ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలియకపోవునా, చల్ల చలపతి వ్రాసిన క్షమార్పణ వుత్తరం వల్లనే తమకు గోచరించి వుండవచ్చును .. పిడుగువంటిది తిరుపతిశాస్త్రిగారి వుత్తరం వచ్చినతోడనే ఆతనికేతాము అపక్షములో పెద్దతలకాయలనుమ గుండెజలజలవించె మీఘాటికి వారెవరు వీరెందు లోవారు, మహాగజాః పలాయంతే మశకానాంతుకాకథా, యిది పిచ్చుకపై వజ్రాయుధమన్నట్లు యున్నది. అయిన నది ఒకమిషచేసుకొని మీరు మాబోంట్లందరికి గురుశిష్య ధర్మాలను వుపదేశించుటచే లోకోపకారమని చాలామంది పెద్దలెల్లరు మనువగా నేను విన్నాను. ఈ గీరతమునుజూచి నారాయణశాస్త్రి కూడా సూర్యనారాయణశాస్త్రితో "ఏమ్మా కొంకువిగా వ్రాసినారు. గాని యింత చేసిన మమ్ము యేమియు దూషణవ్రాత వ్రాయనేలేదుగదా, బాగుగానున్నదే" అని పకవారు అనివున్నారు ... రెండవ కూర్పులో సూర్యనారాయణశాస్త్రిని తిప్పక నిరపరాధినిగా సవరణచేస్తారని నానమ్మకము యివియే అనేక నమస్కారములు.

సాపవేద్ల సూర్యనారాయణావధానులు వ్రాలు.

పాకిన్ కాకరపర్రు.

---

## క్షేమము, ఆశీర్వచనములు.

మీరు మావూరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్ళిపోయినారు. మీరు యెంతగొప్పవారలయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు. మావూళ్ళో యెవళ్ళో అల్లరిచేసినారని మేమంతా

కిట్టిమరూహ పుట్టుటకు హేతువు గానఁగలేక సారెకుఁగా
గట్టితి విన్ని పద్దెము లఖండయశమ్మును నీకొసంగితిన్ 218

ఉ "ఎంతటివాఁడో శిష్యుఁ ? డతఁ డెంతటివాఁడుమ గాఁడయేని దు
ర్దాంతుఁడు వేంకటేశ్వరుఁడు "తమ్ముఁ దలంపఁ" డటంచు వింతగాఁ
జింత వహించనే ? మఱియుఁ జెప్పనె భారతమంత గ్రంధ" మం
చెంతురు లోకు: లెట్లయిన నేమి, కృతార్థుఁడనైతి వర్ధకాః 219

ఉ. ఎందఱు శిష్యులో కడు నహీనునిగా ననుఁ గొల్చుచుండ నీ
యందునె పట్టి పట్టి టని యారయ నీదు పురాకృతంపు భా
గ్యేందిరకాక యిందు నొక హేతువు గల్గనె ? ధన్యమూర్తి నీ
వందఱు శిష్యులందువను నవ్విక ! నందియ మిందులేమ సూ 220

ఉ "శృంగపు భంగముగా" గని యిపీ ! యని కొందఱు రాజపౌరు లీ
వెంగలివాఁత వ్రాసిన పఠివీణల ప్రజ్ఞను సత్పథామహో
త్సంగమునందుఁ జూత మని జాబును నీకు లిఖింపనెంచి న
మ్మిం గవి పల్కుఁ వారల నమంగుల నేమ మవల్చితిం జుమీ. * 221

## (9) సంకీర్ణపర్వము.

ఉ * పాపము ! వా రెఱుంగుదురె పాండితి నీయది ! వత్తువంచు ని
న్నోసికఁ బిల్వ నెంచి రెటులో నిక ! యా నొక సాహసన్ని యా

దానిలో వాళ్ళనే అని వూహించి మామీద కోతకన్నేయుట ధర్మముకాదు. రామ
కిష్టమ్మ వ్రాసిన తప్పుడువ్రాతకు మావూళ్ళో పెద్దలెవ్వరూ హర్షించడములేదు.
రామకిష్టమ్మ తండ్రిగారుకూడా కొడుకుచేసిన తప్పుపనికి చాలా నొచ్చుకోవడము
నేను వినియున్నాను. తండ్రే మెచ్చుకోనప్పుడు యితరులు మెచ్చుకొంటారని మీరాలో
చించడము తప్పు. అనిమళ్ళ సీతారామశాస్త్రిలు వగైరాలు మీరు వెళ్ళినతరువాత
రామకిష్టమ్మ వగైరాలను చాలా మందలించినారు. గ్రామానికి అప్రతిష్టతెచ్చే
పనులు పెద్దలెవ్వరూ సమ్మతించరు. నేను చదువక పోయినా మీకుమీకు వుండె తేడా
పాడాలు యెరుగనివాడను కాను. తాతపూడి భానవ్వవార్లు.

* పుత్తరం....శ్రీ శ్రీ....లు .... చిత్తగించినారు. ఇంతమాత్రముచేతను
వారినన్నుకు తృప్తిగాలేదు. . . సభచేయించి తగు పండితులను ఆహ్వానం

భూపులఁ జిన్నఁబుచ్చెదవు పొచ్చెము పన్నుట కీవు నేరవే ?
దాపున బావ లేఁడె ? యిది తజ్ఞులు దక్క జగం బెఱుంగునే ! 222

ఉ. కోయిల యెల్లకాల మొకకోటరమందె వసింప, దొక్కటొ
తీయని మావిగున్ననె గతిం దలపోయదు, మావిగున్నలం
దేమెఱ సంచరించు టది యెవ్వ రెఱుంగరె ? యొక్కసారి పైఁ
బోయి స్వశక్తిపద్ధతుల పొంపిరివో విహరింపు మర్పకా !

ఉ. కాకులబాధ బాల్యమునఁ గాని యవంతరమందు మంద దీ
పాకము నీవెఱుంగవాకా ? ప్రౌఢత గల్గిన కోకిలంబుతో
డీకొనవెందుఁ గాకములు దేకకు మూలల, సత్వబాష్పలికా
బాల్కటశక్తిఁ జాపుము ప్రపంచకమెల్ల విజం బెఱింగెడిగా. 224

ఉ. అల్లెదు పద్దెముల్, సరిగ నయ్యవి యుండెకి, సందియంబు లే.
దల్లెడియంతనే జగము లల్లన మెచ్చునె ? యెన్నిశక్తురో
వెల్లపితంబులైనయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెన, రప్పుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభమె యో పిక ! యోపికనెంచి చూడుమా ! 225

ఉ. విద్దుర వోవుమోము, గణనీయము గాని గళంబు, మేటియా
పద్దళ దెల్పుధార, విన వాంఛ జనింపనివాక్కు గాక యే
విద్దియగాని నేర్చిన వివేకుల నత్సభలోవివారలన్
దద్దయు మెచ్చఁజేతు రవి తజ్ఞులు దెల్పుదు రీ వెఱుంగవే ! 226

ఉ. పెద్దలు వచ్చునక్కాలఁటి బిట్టుగ విస్మృతమౌ శరీరముగా,
గద్దరిమూఁకఁ జూమనెడఁ గంతెదు పెంకెతనమ్ము, వాక్కులం
బెద్దరికంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు వొల్చు జాణయే
తద్దఁ బ్రపంచపున్నతికిఁ దాఁ దగు నమ్యలనర్హులే సుమీ 227

ఉ. పెంకెకుఁ బెంకె, పెద్దకును పెద్దగ నెవ్వఁడు పంచరించున●
లంకకు వాఁడు వోయిపను లక్ష్యము లేక జయించి వచ్చు, వి

---

చేసెదమనిన్నీ వుభయపార్టీలకు పల్లీకువుత్తరములు వ్రాయించెదమనిన్నీ యీ
వుత్త్రం అందినతోడనే ఒకరోజు శల్యపుచ్చుకొని రావలసినదిగా శెలవుయిచ్చి
నందున విన్నవించెదము. ది 11-8-11 (చేవ్రాలు)

శ్శంకుని నాజవేయు విట సాక్షిగఁ గైకొను, మాతఁ డెంతయో
పెంకె సురారికోటి యెడఁ, బృథ్వితనూజ యెడన్ వినమ్రుఁడే. 228

ఉ ఈ వచియించులక్షణము లిన్నియుఁ గల్గినవార లెందఱో
భూవలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
సూ॥ వెలయంగలార. లివి చొప్పడెఁ జూ శివరాముసం దెవో
దైవవశమ్మునన్, వృషగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పునే 229

ఉ. దూఱుము నన్ను సారెకును దూఱుకొలంది యశమ్ము నీకు నేఁ
జేరఁగఁజేతు, నూరక ప్రసిద్ధిఘటిల్లుమనున్న యప్పు డీ
వేసికి నేల జంకెద॥ విదే యొక విద్దెగఁ జేసికొంటి వౌ
ధోరణి మేలు॥ మేలు॥ గురుదూషి యశమ్ము వహించి తౌ బళి॥ 230

మ॥ * "అవధానంబని చేయరేమ శివరామాఖ్యుండు తద్దేశకుల్
శివరామున్ గని జేసి వారె పనులన్ చేసేతఁ గావింపి" రం
చు వివేకం బలరార వ్రాసితి వహో॥ కుంతల్ ప్రసంగించు దు
ర్వ్యవసాయుంబుల నీకు సాటిరాకా॥ నీవవ్వానికిన్ మాఱెదే 231

చ అతఁ డతివర్ణితప్రతిత నాటికూఁతల పైఁచినాఁడు, ప్రా
జ్ఞతగలవాఁడవే నతనిప్రజ్ఞ గనుంగొను, మింతయేల ఫీ
యుతుఁ డతఁ డొక్క పద్దెము నౌపహో యని లోకము మెచ్చఁదాదు, నా
చతురత నీర కాదు చుమి సాధ్యముగా దది యెట్టిదిట్టకున్.

చ అతనికి నీకుఁ బోల్కి యగు నంచును దజ్ఞుఁ డెవండుగాని సూ
నృతమును బాడుసేయని మనీషియెమేని వచింపఁబోఁడు॥ నీ

(అట్టహాసమునుండి)

* . ..కృష్ణ— ఇప్పుడు తిరుపతి వేంకటకవులు తమపుస్తకముల జాబితాలోఁ
గలిపి ప్రకటించి యమ్ముకొనుచున్న యవధాని మదియేనా యేమిటి॥

దేశమాత— ఔను. అదియే. మొదటనుండియుఁ బాపము॥ వారు దానివిష
యమై చాలా శ్రమ పుచ్చుకొన్నారు.

కృష్ణ— సరే॥ తెలిసినదిలే శివరామశాస్త్రిగారనఁగా విదారోపాఖ్యాన
కర్తయేనా॥

ఆంధ్రకేసరి— (పరిహసించుచు) ఆఁ. ఆఁ, ఆయనయే (చెవిలో) ఇట్టు లిట్టుల్లు.

కుతుక మదెట్టి? దెవ్వఁడును గోవిమఁ డుండనెకూడ దొక్కొ? నీకా
బతితుఁ డటంటి సమ్మతమె. పాణ్ణిజ్ఞాల నన్న్యల దూఱనేటికిన్? 233

ఉ. చూడుము శక్తియున్నయెడ సూరిహితం బగు సత్సభాస్థలిన్
వాఁడె ఘనుండొ? నీవు మఱి బావయు వానివిమించు మిన్నలో?
రాఁడమకోకు రాఁగలఁడు రమ్మన, వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. 234

ఉ. *శ్రాఁకరపత్రి రమ్మనెదొ? కాఁకరపత్రికెవచ్చు. శృంగభం
గాకలనంబు పల్వఁగల యయ్యలు తోడుగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురే యతని? నాలుక వచ్చిన యట్టులెల్ల నే
ల్లోకలహమ్ము సల్పెదరె! యోగ్యులు లేరె? నిజమ్ము తెల్పఁగన్ 235

ఉ. మామఁడు వ్రాత లింక, నవమానపువ్రాఁతలు వ్రాయు దొంగదు
ర్నామల నెల్లఁ బట్టుకొనిరాఁదగు శక్తిని దేవుఁ డిచ్చెఁ జా!
సూనృత మాఁగ శక్యమె? సుషుప్తిని లోకము సర్వదా రతిన్
బూనదు. మేల్కొనున్ నిజము పూర్తిగఁ దానెఱుఁగుంగ్రిపమ్ముగన్.

ఆ వె పత్రికాధిపతులు "జాబో! పత్రిమానసం"
చన్నవ్రాఁత మాని యన్నృతకల్ప

---

(తాలుకుట్టనమునుండి)

*చ॥ శివుఁడనొ లేక రాముఁడనొ చేసెదనొమఱి చేయలేనొ నా. కవనముచూడఁగాఁ దలఁపుగల్గిన జాబులిఖింపుఁ డూరకే. మిమిసుమిఁ గ్రొక్కుపద్దెముల సూరులు నన్న లిఖింపనేల? యే. కవితయె తేరగా నొకటి గల్గుట కున్ ఫలమిట్టి దానొకొ? మ॥ సభకున్ రావలె నోరువిప్పవలె మీసామర్థ్యమ్ముం జూపి వాగ్వైభవన్ గాంచవలెన్. వృథాగ నొక చక్కన్ దాఁగినానాఁట దాపథముల్ గోఁకిన పాడువ్రాఁతలకు దాసత్వమ్ము గావించు మీకు భయంబా? మఱి భక్తియా? యుకకెవో ఘోషింతురిచ్చాగతిన్. ఉ॥ వచ్చెద రమ్మటన్న నృపవల్లభు నాజ్ఞను బొంది మీరలే వచ్చిన నింతకన్నను శుభం బిటుసేయుఁడు లేదనేని యే. పిచ్చియొ వెఱ్ఱిఁ గ్రొక్కుకుఁడు పెద్దలు నన్నుచునన్న వారు మీ, కుచ్ఛితపుం బ్రసంగములకుం జెవియొగ్గఁడు పాణ్ణిఁ దొక్కుఁడున్ (విస్తరమా గ్రంథమునందే చూడఁదగు)

నమునఁ జేయుబావనాయిక కొకచంద్రి
హార మిత్తు. నెదుటఁ గనుపఁగఁగంటె ? 237

చ. కందొక కొంతతెల్వి, యది గాదని నేనన, నంతమాత్రిచే
విని సకలమ్ము మోనమునవే మునిఁగింపఁగ నెంచి యేదియో
గిలుకుమేఁ * "వేటభారతము" గీరతధోరణి నద్దునంచు వా
క్కుఁకు పరిమళింపనేల ? వినఁ గూడని పోకలు కట్టిపెట్టుఁడీ ! 238

చ తిరుపతి వేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టి పద్దెముల్
గురువరు విందు నల్పినను, గొండొక చక్కఁగ నున్నవంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను విప్పికవిత్వము కాదుగాన వా
విరి నవి బైటబెట్టుఁడు, బ్రిపీణత కయ్యవి సాక్ష్య మిచ్చెడిన్. 239

ఉ తిట్టిననేమి ? న న్నరక దేవునిఁ జేసితి వంట ! దాన నో
దట్టుఁడ ! దేశికత్వమును దాఁటినమేల్పద మబ్బఁజేయు నా
తిట్టులు నాకు దీవనలె. తిర్పతివెంకనపేరు నాకు మున్
బెట్టిన యందుకీవు సరిపెట్టితి వంచు నుతింతు నిన్నిఁకన్. 240

ఉ ఊరక యిచ్చినఁగా గొనని యుప్పని చప్పనికూఁత లెల్ల నె
వ్వారలొ "కర్పు" లిత్తురని వారక యమ్మనఁ గ్రిచ్చనేల ? దు
ర్వారరసప్రసారగుణ బంధురదివ్యతర ప్రబంధసం
సారులు గందు, వర్ధిల్లుదు, జాడ్యము మాని సుఖింపుఁడింపుగన్. 241

ఉ బీజము లేని వ్రాఁతలని పెంపువహింపవు. మీకు బీజ మే
యోజఘటిల్లు ? "మే మురకయున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నాజడుఁ దూరకుండక యహంకృతిఁ జూపె" నటందురోటు ! మీ
బీజము దెల్పినట్టులె వివేకులకున్ బొరకట్టెడిన్ జూఁడీ 242

మ. యతులుగా ప్రాసలు పెట్టి యెట్టులో కవిత్వాదంబరం బూని తి
ట్టితిరే యందము, దాన లాభ మది యట్లేఁ గల్గఁగాఁబోదు. పం
డితు లాధోరణి మెచ్చుకొన్న, వల గోష్ఠిఁగా సత్యవాక్చాతురీ
వితత ప్రాజ్ఞత చూపకున్న వితయా వేయేల ! చాలింపుఁడీ ! 243

* .. మన పిఠాపురపు వారు "వేటభారత" మొకటి వ్రాయుచున్నారట ! ....

6-2-12 మందరరావు

* ఆ వె. రాళ్ళబండి శతవధాని వ్రాసినట్టి
పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
త్రోవకున్ రండు, వేశకద్రోహచింత
వలవిదోసంబు ననుతాపభరము మ్రింగు 244

తే. గీ ఏమిసార్థక్య ? మేదియో యీవు వ్రాసి
వెంటనే యేను ఖండించివేసినంత;
సత్యమె జయమ్మునిచ్చు, యశమ్మునిచ్చు
సత్యమునఁ బొమ్ము మంచి యశమ్ము గొమ్ము. 245

ఉ వెంకటశాస్త్రి నేరా యవివేకులు తిట్టి రటంచుఁ గాని, యే
కుంకయొ సత్పఖాస్థలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంపకుంటయే
పంకము, నమ్మచో ముద మపారముగాంచుట చెప్పనేటికిన్ ? 246

---

* ఉ. గిరత మేగుపెంచెఁ దమకీరితిఁ బూరితిఁజేసె నాపుమా
కార సరస్వతీ యుగముఁ గాఁదనఁ జాలెదు ఖాతిగుండె యే
ఛీరునకుండెనో ? వెదకి తెచ్చుకొనుందు వృథాప్రగల్భముల్,
నేరిచినంతఁ బత్రికల నింపుటగా దిది, సప్రమాణమా"

ప నరులే న్మెచ్చఁగఁ బోరు మీచెయిది. నేనారయ్య పీచయ్యలో
గురుపద్యంబునఁ గూర్చినారనుచు, మీకుంజాల మోమోడి యే
కరతల్ బిట్టువచింట్రిగాక యవి నిక్కంబంచుఁ జిత్తంబులో
నరయంబోకుఁడు వారుపీరు విపు దేమైన న్నివారింతురే ?

మ. ఒక రాజా ? యొక పండితప్రవరుఁడా ? యోజింపుఁ డీమద్యభూ
మికి లోమున్న యశేషమానవులయం బెంపార నవ్వారి మై
త్రికొ ? శైష్యమ్ముకొ ? కోరుచుండెదరె, యుక్తిం గాన లే కిర లే
టికి, మృత్పిండము వఃప్రపుందుమకతో డీకొన్న నేమయ్యెడున్

మ కలిలోనం బడిపోదు రేమిటికి ? లెక్కన్ నాల్గొకో ? మూడొకో
నెలలే కా దొక రెండు రోజులయినన్, నిక్కంబుగా మీరు శి
ష్యులరే న్వారికి పీక్రుతప్పుతను మూమూడంగఁ బోరాదు, కే
వల మాచార్యతఁ జూపకుంటిరి సరే ? పైఁ దిట్టు లింకేటికిన్

మ. శివ ! సత్యంబిది "శృంగభంగ" మొకఁడుగా సృష్టింతురే ! యేటి తేఁ
కువ ? యీలాటి మొగంబులా ? "కుకవిరాట్కుంభీంద్రకుంభస్థలో
ద్భవ ముక్తాఫలమాల్యాలంకృత వక్షోదంచత్సుపంచాస్య మా
హవసంగమ్మున గర్జిలన్ విని చోరాడించు పోరిదల్ బళా !

సీ. ఆత్మకూరు నృపాలుఁ డసమర్థుఁడా ! వీరికే చంద్రహారమ్ము లిచ్చుటేమి
గద్వాలపతి చేతకానివాఁడా ! వీరికే పెద్దకానుక లిచ్చుటేమి
ఆనందభూపాలుఁ డవివేకియా ! వీరికే జయపత్రిమ్ము నిచ్చుటేమి
వేంకటగిరిరాజు వెఱ్ఱివాఁడా ! వీరికే వేయినూటార్లు నిచ్చుటేమి

తే. గీ. చిన్న రాయనరేంద్రుండు వెఱ్ఱివాఁడ
వీరికై తనె సతతంబు కోరు టేమి
చేయఁగాలేకపోయెనో ! "శృంగభంగ"
మింత మొనగాండ్రు వారల చెంతలేరొ !

మ. చినుఁగుల్ మూసినయట్టు లెట్లొ కవితం జెప్పంగ నుంకించునీ
మనబోఁట్లందఱు "శృంగభంగ" మొనరింపం జాలువారైన క్షో
ణి వీఁకం "దిర్పతి వేంకటేశ్వరులు" తేనే లేక పోదుర్గదా !
మన మీకార్యముఁ జేసినా మనిని నమ్మం డెంత యున్నాసెయున్

మ. "కలరేరో గురు" లంచు మీరు పలుకంగా వింటిమే ! వారు గీ
ర్వలనంతోషిత భూపగోపతి కరాబ్జద్వంద్వ నిర్ ద్వంద్వసం
కలితాంధ్ర్యంగ దనాదదోహద విధాకానద్యశోవల్లరీ
లలిత "శ్రీపతి వేంకటేశ్వరులఁ" బోలన్నేర్తురే చెప్పఁడీ !

శా. సూర్యారాయనృపాలు కట్టెదుట మీచూపించు వాధాన్యమే
యార్యుల్ "తిర్పతి వేంకటేశ్వరులు" మీకాచార్యు లంచాడెదున్
శౌర్యం బేటికి ? మీవచించు గురుసంతానంబులోఁ జూపుఁ డీ
కార్యంబుం బొనరింపఁ జాలిన సుధీకంజాప్తులే యున్నచో

మ. కవితాపాకము కేమిగాని, యెటులో కష్టించి యాధారణా
ది విశేషంబుల సంగ్రహించితిరి, యేదిన్ లేక యెట్లొప్పు ? భూ
ధవుఁడేగా, "తిర్పతి వేంకటేశ్వరుల" ధాత్రిత్వంబు గావంచుఁ బె
ద్దుక్కువివాదమ్ము లిఁకేల ?. పట్టి టక బొంకుల్ మెప్పువారుందురే !

మ. "గురు"లంచు న్నుతిసేయకుండినను దిక్కుద్యత్ప్రదేశావరో
ధి రహస్సంచర కాకపిందత్రి కుయశ స్త్రీవాత్రింధకారచ్ఛటా
హరణప్రస్ఫుట చంద్రికాయిత తతఖ్యాకోచకీర్త్యంగనా
గురు' లంచైన నమస్కరింపఁ దగరో ? గూటింపు లింపౌనొకో ?

మ. ఎవ రేమూలలఁ బొలుదాఁ్రవినను "మేమే, యేంమ వేకవ్యహం
యువు లేరోఁకటే పాట పాడిసమ వే "ర్హూ"యన్నఁ జంచద్యశః
కవచ శ్రీపతి వేంకటేశ్వర సుధీకంఠీరవద్వంద్వ స
త్కవితా వైభవ మెందలేరుచుఁడి, శంకాతంక మిం కేటికిన్

శా. ఏ పద్మోద్భవునాఁటఁ బుట్టినదొకో ? యీపౌర్విక ఖ్యాత శై
ష్యోపాధ్యాయిక, రూపుమాసినది మీ "హూహూ" లతోఁ జాలు నీ
లోపం బిప్పటి కేరఁజేయ రకటా ? లోకానువాదంబునం
దే పాతిత్యము, మిమ్ముఁ జుట్టికొన దిప్డేన్ వారిఁ బ్రార్థింపుఁడీ

క "హూహూ" లేమియొనర్చును. బాహాబల మేమిసేయుఁ? బరిపంథి సుధీ
వ్యాహారబర్హిరాస్య ధు. నీహృద్యమహా ప్రవాహ నివహము పొంగన్

సీ. మాలకాకులదాలు గీలుకొల్పిరిగదా ? వైష్ణవార్యుని కీర్తివనితనుదుట
బొగ్గువన్నియలోని నిగ్గుఁ బూసిరికదా ? కాశినాధుని కీర్తికాంత మేనఁ
గటికచీఁకటిచాయఁ బటిటనార్చిరిగదా ! రావుగారి యశఃపురంధ్రి మొగము
కాటుకకన్నీరు గాఱఁ జేసిరిగదా ! కొప్రఁపుం గీరితి కొమగవదల

గీ నసరె ? "తిరుపతి వేంకటేశ్వరు" లనంగ
దోమలో. చీమలో గాఁగఁ దోఁచినారొ
బేలతనమేల ? కుకవి శుండాలగండ
మండలవిదారి చండప్రచండహరులు

శ్లో॥ ప్రౌఢా శాదృశసాహితీసు కవితా పీయూషనిష్యందినీ
వాణీ ధిక్కృతగో స్తనీ పరజనాఽ సాధారణా ధారిణా
వృత్తిర్హై మవతీపదప్రణయినీ ధారాఽపగాఽఽ కారిణీ
శ్రీమ త్తిర్పతి వేంకటేశ్వరసుధీ ద్వంద్వస్య నిం ద్యేత కైః

ఇట్లు
రాళ్ళబండి వెంకటసుబ్బశాస్త్రి, శతావధాని.

తే గీ కతుర్వకునేని యాపద వైఁవరాదు
పైవి సంతసపడు చెంత పాతకంబు ?
పరమకతుర్విలు గిలికెడి పాదువార్రిఁత
లౌర ! పుస్తకమంచు వార్రియంగఁ జనునె ? 247

తే గీ. అంతయో యింతయో యశరాస్యులైన
మీకుఁ బారమ్ము లేవి నామీఁద నశ
రములె నేరని వారేమి రాఁ దలంతు ?
రింతమాత్రము తెలియ విఁకేమనందు 248

క మిముఁ బట్టి కొవ్వరము కొ, వ్రిముఁబట్టియు మీరు తప్పువార్రితలు గిలుకన్
శ్రిమ మొకటి దక్క వెంకన, కమరునొకో యప్రతిష్ఠ యరయుఁడిఁకైనన్.

క బ్రివోత్సవములతోడఁ, బ్రిహ్మండం బగుబాగీర్తి ప్రబలించెకి యో
జిహ్మగులారా ! మీ"యం, బ్రిహ్మతకు విచారమేల పడవలె నకటా !

శా మీయజ్ఞానము కొంత్రిపుందెలివియుఁ మేల్గూర్చెడి న్మాకు, మీ
రాయానం పడకుం దనత్యములు వార్రియంగా ప్రియత్నింపకుం
డోయీశిష్యుఁడ ! "వేఁడిపీక్సకు గృహం బొక్కింతయుఁ గాల" దా
హా ! యజ్ఞానపు టట్టహాసముల దుర్వ్యాపారపారీణతల్, 251

ఆ వె. అట్టహాసమంట ! అద్దాని వింఁద
వ్వడుప్రినంగమంట ! పుడమి తేఁడు
చూచియుండఁడొక్కొ ? చూచియు వారింపఁ
డొక్కొ ? జూడఁడనుటె యొప్పవలయు. 252

ఉ. చూచిననూరకుండఁ "డిది కుంతప్రినంగము మానుఁ" డంచు బి
ట్టేచి చివాటులఁ గొలుప కెట్లును మానఁడ, ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత సమ్మతించు ? నవనీపతి విక్కము చూచియుండఁ డీ
తోఁచియుఁ దోఁచరాని నుడి తోవ్రలు తేవికిఁ జూడ నేటికిన్ ! 253

చ. ఎవరు చివాట్లు పెట్టఁ బని యేమి ? గురుండను నేనె చాలు, దు
ర్వ్యవహృతి పూర్తిగా నెఱుఁగు పండితమండలి చాలు, బుద్ధి చె
వ్పవలసివచ్చినన్ గురుఁడుఁ బండితవర్గము, వీరిపైని బా
ధ్యపుఁడు పచింపఁ గావలయుఁ, దేఁకువ గర్గినవీరె చాలరే ? 254

ఉ. తప్పుడు వ్రాతలందును "శతఘ్నవి" వ్రాసెడునంతదాఁక వ్రా
లొప్పగఁ జేసితి, విపుడొ యొక్కఁడె బావయ చేయుచుండె. నీ
కిప్పుడు బుద్ధివచ్చినదియే? వచియింపు "శతఘ్ని" యూరకే
"ట"ప్పని పేర్మి పాశుపత ఘాంకృతి కుప్పునుగాక మర్గిగుటన్. 255

ఉ నీ కటు బుద్ధివచ్చుటయె విక్రమమేని వచింపు మింకఁ దె
న్వీఁకఁ జరించు బావకు వివేకము గూర్ప యతింతుఁగాక ; యా
కాఁకరప త్రివాసికి నఖండమృషావచనప్రతాపికిన్
బ్రాకటధర్మముల్ వఱకు పద్ధతి వేఁడుసుమా ; కుమారకా ! 256

ఆ. వె. అకట ! పాశుపతము నడఁచఁ బరా స్త పా
శుపతమనుచునొక్క "శౌంతికాయ"
వ్రాఁతఁ వ్రాయు బావ వైఖరి గనియు నీ
వేలయూరకుంటి వెఱఁగఁ జెపుమ ? 257

క. అందుఁగల యన్నృతధోరణి. "సందేహము లేమి బావ శాబ్దికజీవా
నందువి" పారము తేల్చెవి. నెందుల కా పిచ్చివ్రాఁత లెఱిఁగింపు ముతా ;

శా ఏదో వ్రాసెడివానిపోల్కి నెదియో యింతింత పంపంగఁ బై
"నేదో వచ్చుఁగదా ?'' యటంచు నకటా కృష్ణాఖ్యపత్రంబు గై
కో దూఁకెన్, బయి సిగ్గిలేన్ జూమి, వృథాకుంఠీభవచ్చౌర్యదే
శాదౌర్భాగ్య వచఃప్రచారకలనాగర్వాంధ్య మిట్లుండునే ! 259

ఆ. వె "వ్రాఁత యట్టులుంచు పాశుపతమ్ముపైఁ
బాఱు పేరునీకుఁ బట్టుపడెనె ?''
అంచు బావతోడ నాడు మీ; నాకునై
గురుని కింత వలుపు చరణసేవ 260

క • బావ వచనములు వినకుము, భావవచనములను వినుము బాగుపడుము సం
భావించి భవుఁడు చెప్పిన, భావుకవచనములు భావవచనములనఁగన్. 261

---

• స్కాందోత్తర ఖండస్థ గురుగీతనుండి.

శ్లో॥ అత్రినే త్రశ్శివసాక్షా ద్ద్విబాహుశ్చహరిస్స్వయం, అచతుర్వదనో బ్రహ్మశ్రీగురుః కథితః ప్రియే . శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మవిష్ణు మహేశ్వరాః సామర్థ్యమగమన్ సర్వే కేవలం గురుసేవయా ... శ్లో॥ నగురో

గీ. అల్లకృష్ణుంపు సంధికి నంకపీక
పార్థుల నపార్థుల నొనర్చె. బావమఱఁది
యంచుఁ గృష్ణునిబోఁధల నాలకించి
తావృథుఁడ వీవు కాకు వృథావిధముగ. 262

ఉ. అన్యులతోఁడ మాకు నెపుడైనను వేరొకకారణమ్మునన్
జన్యము సంభవించునెడ సాయము వారల కాచరించి నీ
పు న్యశమున్ గలించుటకు బుద్ధిని దిప్పితి వెంత వెఱ్ఱివో॥
ధన్యత లేనివారలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. 262

మ. ఒకచో గుంటురి కీవు పోదుపనుకొమ్మో వెఱ్ఱిశిష్యుండ । శా
ఖకునై వారలు విన్ను నిట్టిగతిగాఁ గారింప యత్నింత్రు, నీ
కకటా ! దిక్కెవ్వరున్నె ? నాకొ మఱి నీవా. కాదు, నీవంటి వా
రొక వేమైనను లెక్కలేదుసుమి యోగ్యుల్ పండితుల్ స్నేహితుల్.

ఉ. వారలె లేకయున్నయెడ వాండ్రిను నీపును గూడి దబ్బఱల్
సారెకువ్రాసి యెట్లయిన సాయముపట్టక పో. రసత్యపున్

---

రధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనతి శ్శివశాసనత శ్శివశాసనతః॥ శ్లో॥ .గురువిందాంక రోతియః , సయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥ శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞ శ్శిష్యైఃకదాచన, గురోరగ్రే నవక్తవ్యమసత్యంతు కదాచన, గురుం తుం కృత్య హుం కృత్య . . నభవేద్బ్రహ్మరాక్షసః॥ శ్లో ॥ .కాలమృత్యుభయాద్వాపిగురు స్సంత్రాతిపార్వతి॥ .... శ్లో॥ గురుదేవార్పణం యత్తుతేనతుష్టో స్మిసువ్రతే . ...... శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామితే। ధన్యామాతా పితా ధన్యో గోత్రంధన్యం కులంభవం, ధన్యాచవసుధాదేవి యత్ర స్యాద్గురు భక్తతా ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః. తాస్సర్వాస్సఫలా దేవి గురుసం తోషమాత్రతః శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యోగురుం నైవమన్యతే, శ్వానయోని శతంగత్వా, చండాలేష్వభి జాయతే॥ ... శ్లో॥ సప్తకోటి మహామంత్రాశ్చిత్త విభ్రమకారకాః, ఏకఏవపరో మంత్రో గురురిత్యక్షద్వయమ్ .. .. శ్లో॥. కవిత్వాది గద్యంసుపద్యం కరోతి,గురోరంఘ్రియుగ్మే మనశ్చే నలగ్నం తతః కింతతః కింతతః, కింతతః కిమ్ (విస్తరస్తుతిత్రైవద్రష్టవ్యః).

భారము మోయుపశ్రిజ్ఞగల పండితులౌ కతనన్ యథార్థవి
ద్యారసికుల్ భవత్కృతుల నడ్డుదు రేమియొనర్ప నేర్తువో. 265

ఉ. కావున విప్రదేవియు వికారపుఁ జెయ్వులు మాని పాశ్రిజ్ఞులౌ
ధీవరు లాడుపల్కులను దెల్లముగాఁ దలపోసి సత్యపుం
దోవకురమ్మ, విక్రమగు ద్రోహము నీవొనరించియున్ బుజ
శ్రీవిలసిల్లు హేతువున శిష్యుఁడ ! మంచియశమ్ము గల్గెడిన్. 266

క. మనువచనమ్ములవివి తగ, మను, మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివో! మనుమార్గ, మ్మనుమానమ్ముడిగి పట్టుమది యఘమడఁచున్

మ ‡ త్రివిధేయుండు త్రిలోకజేతయనుచున్ "త్రిష్వ ప్రమాద్యన్" మను
ప్రవచస్సారము తెల్పునీవు కడగా వర్తిల్లు చున్నట్టి యా
హవనీయాగ్నిని గాలఁ ద్రొక్కియును వత్సా ! మూఁడులోకమ్ము లా
హవరంగమ్మున గెల్చుటన్ హృదయ ధర్మాధర్మదుర్మర్మముల్ 268

శా. † ఆజన్మంబు గురున్ భజించునెడ బ్రహ్మప్రాప్తి కర్తుండు గా
యోజించున్ స్మృతివాక్యముల్, మృషయసుమ్మో వత్స ! యమ్మాట నీ
కీజన్మమునఁ గొంతపేనయును "హీహీహీ"లు "హూహూ"లు త
ద్రాజద్బ్రహ్మ సమాజమాన్యతకుఁ బాత్రత్వమ్ముఁ జేకూర్చుటన్ 269

---

‡శ్లో॥ తఏవహి త్రయోలోకా స్తఏవ త్రయ ఆశ్రమాః తఏవహి త్రయో
వేదా స్తఏవోక్తా స్త్రయోఽగ్నయః॥ ౨౩౦ పితావై గార్హపత్యోఽగ్ని, ర్మాతాగ్ని
ర్దక్షిణస్మృతః (గురురాహవనీయస్తు) సాగ్ని త్రేతాగరీయసీ॥ ౨౩౧ త్రిష్వ
ప్రమాద్య న్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ॥ ౨౩౨. (మనుస్మృతి ద్వితీ
యాధ్యాయముచూడుడు)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

† శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం, గురు శుశ్రూషయా
త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ ౨౩౩. శ్లో॥ ఆసమాప్తేశ్శరీరస్య యస్తుశుశ్రూష
తేగురుం, సగచ్ఛత్యంజసా విప్రోబ్రహ్మణ స్సద్మశాశ్వతం॥ ౨౪౦ (మనుస్మృతి
ద్వితీయాధ్యాయము చూడుడు)

మ. * తనయార్జించిన క్షేత్రముఖ్యధనముల్ దాతవ్యముల్ ముందుగా
దనయాచార్యునకంచు జెప్పుస్మృతి, తద్ధర్మంబు గప్పెట్టి నో
తనయా! నీయెడ నెట్టులన్న విను దుర్ధర్మంబుత్వద్విత్త మా
త్తనయా! నాయెడ దొల్తనీవు విసియుక్తంబౌట సూచించుటన్. 270

శా † ధాత్రిస్వార్జితవిత్తమందునొక షష్ఠంబంశమున్ గైకొనం
బాత్రుండంట! గురుండు వింటివె? భవత్ప్రజ్ఞార్జితాచార్యదు
కృతుత్రిత్వాఖ్య ధనంబు సర్వమును నన్మత్స్వాత్కృతం బయ్యె; నే
మాత్రింటో యిద కంతయున్ జెరిపు నిమ్మాడ్కిన్ గురున్ జేర్తురే 271

మ. • అత్రిదూరంబయినన్ స్మృతిీదవిలె నెచ్చో నీస్థితుల్ "నిత్యము
ద్ధృతపాణిత్వము" చెప్పెగా? మనువు, నీధీమత్తదేదాని నా
దృతమున్ జేసితి; నగ్రిమం దగపడన్ దేలంజుమీ నీదును
ద్ధృతపాణిత్వవలమ్ము, స్మార్తమతవర్తీ! నీకగున్ ధర్మముల్. 272

క † భారతవచనమ్ముల మది, జేరుతమని బావనడుగు శ్రీరతులున్ వ
ద్దీరతుల నీదుపద్ధతి, ఘోరతరం బనెదరీతి గొనకు మిఁకైనన్ 273

* శ్లో॥ స్నాస్యంస్తు గురుణాజ్ఞ ప్తశ్చక్త్యా గుర్వర్థమాహరేత్, క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనం, ధాన్యం శాకంచ వాసాంసి గురవేప్రీతి మావహేత్ ౨౪ అత్రవాక్యా॥ స్నాస్యన్ను నర్గురుణా దత్తాజ్ఞోయథాశక్తి ధనినంయా చిత్వాఽపి ప్రతిగ్రిహాదినాఽపి గురవేఽర్థ మాహృత్యాఽశ్యందద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

† శ్లో॥షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽ నందాత్మరోనర॥ ఏకంతుగుర వేదద్యాత్ . . .

• శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యా త్స్వాధ్యాచారస్సు సంయత॥, ఆసత్యామితి చోక్తస్సన్నా సీతాభిముఖంగురో॥ (మను ౨ ౫ )

(భారతాది పర్వమునుండి)

† కశ్చిదృషి ర్ధౌమ్యోనామ... తస్య శిష్యాస్త్రయో బభూవు రుపమన్యు రారు ణిర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణిం పాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛకేదారఖండం బధానేతి . యస్మాచ్చత్వయా మద్వచన మనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయోఽవాప్స్యసి సర్వే చవతేవేదాః ప్రతిభాస్యంతి సర్వాణిచ ధర్మశాస్త్రాణీతి .... తంచోపాధ్యాయ.

క. గురుశరవహ్నికిఁ గృష్ణుం, డఱిముఱి భీతివడు ధర్మజాదుల సత్య
స్థిరుల వసత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవొకో 274

క. నిజమైన తిట్లు తిట్టుము, గజగజ వీకేల ? లేని కార్లపకుము ఘా
పత్రిజలు సహింపరు లోలో. * స్వజనంబేనియును దప్పు పైఁబ దెఱుఁగుమీ.

---

ప్రేషయమాస" వత్సోపమన్యో గారక్షస్వేతి .. మయ్యానివేద్యభైక్ష్యం నోపయోక్తవ్యమితి . . భో ఉపమన్యో క్వాఽసివత్సైపీతి, స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ .. కూపేపతితోఽ హమితి, తముపాధ్యాయః ప్రత్యువాచ కథం త్వమస్మిన్ కూపే పతిత ఇతి, సఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వాఽంధో భూతోఽ స్మ్యతః కూపే పతిత ఇతి. తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వినౌస్తుహి . త్వాం చక్షుష్మంతం కర్తారా వితి. అశ్వినౌస్తోతు ముపచక్రమే. అశ్వినావాజగ్మురాహతు శ్చైనం. ప్రీతౌ స్వ ఏషతేఽ పూపోఽ శానైవమితి, ... సత్వహమే తమపూపము పయోక్తు ముత్స హే గురవేఽ నివేద్యేతి. . తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వ స్తవానయా గురుభక్త్యా. .... చక్షుష్మాం శ్చభవిష్యసి శ్రేయశ్చా వాప్స్యసీతి. .... లబ్ధచక్షుః . ఉపాధ్యాయ మభ్యవాదయత్. ... ఏషాతస్యాఽపిపరీక్షోపమన్యోః. అథాపరశిష్యః వేదోనామ .. గౌరివవిత్యం గురుణాధూర్షుని యోజ్యమానః. తస్య మహతా కాలేవ గురుః పరితో షంజగామ, తత్పరితోషా చేయ స్సర్వజ్ఞతాంచావాప, ఏషాతస్యా పి పరీక్షా వేదస్య ...

(విస్తరస్తు తత్రైవద్రష్టవ్యః)

రాజమండ్రి.
ది 28-8-13

* తమరు కాకరపర్తి వెళ్ళినప్పట్లో "లోకములోని కవులందరు నా జందములోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్ని పిమ్మట తప్పుఅంతయును కాకరపర్తివారిదే అనిన్ని శ్రీ ఆ॥ వ్యాసలింగ శాస్త్రిలవారు నాతో చెప్పినారు.యింకా కొన్ని సంగతు లున్నవికాని విస్తరించుటకు స్థలములేక వ్రాయలేదు. .... రామకృష్ణులు ముందుభారతము ప్రచురించెదరట. వారు యెన్నిరాసినను గురుద్రోహమును బయపరచేవే అని శ్రీ. ఆ॥ వ్యాసలింగశాస్త్రిగారు అన్నారు.....

జె. కొండయ్య వ్రాలు.

క. చదువెఱుఁగఁడవియుఁ, గంతము, మృదువైనది గాదటవియు. నేరికి విద్దెల్
గుదిరి వచింపఁడవియు నా ? పదరి జగము మెచ్చుగోరు పద్ధతి చెప్పుమా.

క. "నాయొద్ద జదివినదె" యని. కోయిల నీవాయసంబు గూయుటతప్పో
నే ? యరయుమయ్య ! కావమె, వ్రాయన్ వలె, నీకుఁజేయి రాదిటువ్రాయన్.

క ఇరువురచేవ్రాళ్ళుండుట, యరసియు నీకిట్లు వ్రాయు టది కావియే
పౌరఁబడితీఁ గొంతకాలము, పరమాత్ముఁడు రామమూర్తి పలికెడిదమితన్.

చ. తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు, నాకు మిత్రుఁడు
న్నతుఁ డనృతం బతండు జననంబుసు బొందిన వంగదమ్మె యా
కృతయుగ మాదిగా నెఱుఁగ; దిప్పుడు నీకయి నేర్వఁబోడు; సూ
నృత వశనుండు నీ కతనవే విని నాకు వచించెనప్పుకా । 279

చ కుతుకముతో నొకానొకట "గోకిలకాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పనాఁడవఁట ! యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము, శ
త్రుతకలిమిన్ వచింపఁడు బుధుం డతడేదొ ప్రసంగమందు సం
గతమగుటన్ వచించె నదుగం దగు నందియ ముందెనేనియున్. 280

చ. అనయుఁడవై వృథాగ నెపుడాఱడివ్రాఁతలు వ్రాయుచున్ విజం
బు నడఁచి నేఁటికేనియు సుబుద్ధివికాక పరాక్రమించు వి
న్నను సుజనున్ బొనర్చుట కనుంగుజెలిన్ ఘనరామమూర్తిగా
రిని నొకసాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింపతుండునే 281

ఉ. అందఱునాకు బందుగులె యంచు లిఖ్ఖిచెద వింతసాహసం
బెందుకు ? దూరగుల్ బలెనె యింతర కాఁకరపత్తు వాసుబవ్
బొందఁబడంగఁబాడె యిటు బొంకఁగనేటికి ? రామమూర్తి నే
మందువొ చెప్పుమా యకట ? యాతఁడు నాపెదతల్లి పుత్రుఁడే. 282

శా. చాడీలన్ వచియించువాఁడొ ? జడుఁడో ? చండాలపుంబుంత లే
నాఁడున్ ద్రొక్కినవాఁడొ ? త్రొక్కఁగలఁడో ? నాబోఁటులెక్కేమి యే
పోఁడల్ నెత్తిని బెట్టుకోఁదగిన సత్పుణ్యుండు, గణ్యుండు తా
నాడంబోయెనొకో యసత్యము ? కుమారా ! విమ్ము వంచింపఁగన్.

శా. ఆడుంబో యనృతంబు నీకొఱకు వ్యాసాకొండి యెప్డేని, బొ్రి
ద్దాడంగాక మఱొక్కచోఁ బొడమి కామాకొండిచేఁ బిల్లవం

బాడింపంగలదేమొ చూచెదముగా కంచుకా బత్తికార్థమై
ష్టేఁ డిచ్చో నాకసాక్షిగా వతని వర్ణింపగా బ్రిప క్రించెఁ జా 284

చ ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేరునో ?
తనలిపి యంచుఁ గొంకుఁజూమి తథ్యమెఱింగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె పేశొకండిపుడు దా ధవళాద్రి వసించు; నాతఁడున్
ఘనుఁడు తదంబయు న్మిగులఁ గందురు నేఁటికి వన్నెఁ బేర్మితోఁ గా. 285

క. † కృతమీవు మఱచితివి పీ. కతవంగద ? వారు నాకు ? గదుఁ గూర్తురు, పీ
కతికతుగ్రిఁడు వారలకే. గతిఁ బేర్మివాన్పదుఁడో ? తెలుపఁగాఁగలవె సుతా.

క. గురుఁ గాకముగానడివిన, దురితపువ్యానమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరో మెచ్చిరనియు వ్రాసెన, వరరే ! యిటువంటియోగ్యు నవనింగంరే.

క. ‡ శత్రులు మిత్రులు సైతము, పుత్రా ! తలయూఁచిరనుచుఁ బొంగెఁగదా ! మీ
పత్రిక, యూఁచుటకర్థ మ. పాత్రవ్యాప మని చేయుపవి గాదుగదా ?

క నీకవితాప్రాశస్త్య. శ్రీకతనఁగా గలుగు యశము చెంపెవి నను, నీ
కో ? కృతముమఱచు పాతక. మే కడకున్ మిగులు సారమిదియె కుమారా.

క. ఎందుకుఁ బెంచెద వఘమిది ? యందఱకు న్నిజముదెలిపె, నాఁగునె కిస్తూ
రిందాఁచినఁ బరిమళమది, బొందఁబడకు నిజము నుడివిపొందుము శుభముల్.

## (10) మంగళపర్వము.

చ. తిరుపతి ! నాకు వింతటి విధేయుఁడు శిష్యుఁడు గర్గె వాని సం
చరణము లీశ్వరున్ దెగడు సాహసమూనెడి, వట్టివానికిన్
గురువన నెంత ? తాదృశుని గొంచొక యోగ్యునిఁ జేయ వేంకటే
శ్వరుఁ డొవరించె ధర్మపుఁ బ్రసంగ మెవంగు వ్రసంగసంగతిన్. 291

---

ధవళేశ్వరము, 28—8—13

† . . శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మీశ్రేయోభివృద్ధినిగోరుచున్నవారలు. కాశి నారాయణమూర్తి.

(కవితనుండి)

‡ కోకిలకాకము, ఇది కోకిలమును గాకమును గూర్చిన యొకచిత్రకథ శత్రుల మిత్రులుగూడఁ దలయూఁచిన పద్యములు.

చ. తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టు వానికిం
దిరుపతి? వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టుటెంత? యే
మఱిజన దైనను న్మనకు మంచికిఁ ద్రిప్పు ప్రసంగమేదియో
జరుపుట యొప్పువాని కిది సాయముఁ జేసినఁ జేయకుండినన్. 292

చ. హితమువచింపఁ దావసఁగు నెవ్వఁడు వాఁడెపఁడున్ వినండ. భా
రతమున నేమి, తిక్కన పురాణములందున నేమి, యెవ్వఁడే
హితముగ్రహించె? నట్లని మతెవ్వఁడు చెప్పుటమానె? చెప్పుచే
చతురుని కోయగున్ గణనసల్పి కృతార్థుఁడు వేఱొకండగున్. 293

ఉ. కావున నేరార్చినను గష్టము లోకముకోసమే యశ
శ్శ్రీ విపులీకృతోజ్జ్వలదశేషవిశేషదిగంత రాళ రా
ధీవరులెల్ల లోకమునఁ దేలవలెన్ బరిశుద్ధలోకసం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులున్. 294

ఉ. లోకము మెచ్చుగాంచు నతిలోకుని యాదవపట్టభద్రు ద
ష్పాకుఁడు మద్దయుందు శిశుపాలుఁడు పట్టుకతిట్టె దానిచే
నాకతివేల్పు పూజనము లద్దెనె? పాశికలోక మెన్నఁడుగా
లోకములోనఁ జేర, దరిలోకపు శోకము కీర్తికే యగున్

సీ. ఖరముఖాసురకోటి కిహూకహొప్పిటిలేక రామకీర్తికి నట్టి రాణ యెట్లు?
శిశుపాలదుర్విపాత్రుకుపన్నళలు లేక కృష్ణకీర్తికి నట్టి తెలిస మెట్లు
కనకకశిపు దుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
కలినృపాలక హలాహల హాహాహాళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?

తే. గీ. ఎంతవాఁడేని విమతులొక్కింతసాయ
మాచరింపక పేరెక్కఁడట్టులగుట
విరత సత్కీర్తిదాతల విగ్గణస్వ
రూపుల నుతించి గీర్తి బేర్రేపవలయు 296

ఉ. నుతియింతున్ మనరాచకృష్ణకవులన్ నున్నార్యధర్మైకస
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథాదంభాశుఘోషావృత
శ్రితులన్ చాదృశకాపప్రుంగవుల, నశ్లీలాపవాదప్రద
ప్రతిభాదూతల వారిపీరిహితులన్ బ్రాంచద్యశోదాతలన్. 297

మ. దయకై కొల్పుటకన్నఁ దిట్టుటయ మేల్ దైవాదులన్, బూర్వమే
జయుఁడున్ శ్రీ విజయుండు శాపహతులై శాసించిరీతోవ, త
ద్దయు సౌకర్యము దీవియం దగపడున్, దైవ్యంబు గప్పెట్టి, దా
శ్రియణక్లేశము నున్న, తుల్యము ఫలైశ్వర్యంబు యోజించివన్. 298

మ. కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప యత్నించు ధీ
రులకున్ మంగళమస్తు విస్తులవచోరూఢిన్ గలివ్ దుర్మించు నా
ర్యులకున్ మంగళమస్తు వేదమతశాస్త్రోక్తార్యధర్మైకవ
ర్తులకున్ మంగళమస్తు గిరతవచో దుగ్ధాబ్ధికిన్ మంగళమ్. 299

గద్య

ఇది శ్రీ .తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు గిరశామ్నా
యమ్మునందు గురుదక్షిణ యను ద్వితీయభాగము

సంపూర్ణము



* విగ్రహారాధనము *




తృతీయ భాగము

# ఉపోద్ఘాతము



చదువరులారా!

("వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః")

అను భర్తృహరిసుభాషితమున కుదాహరణముగ నుండునట్లు మా "దైవవంచితులు" ప్రకటించిన "తిరుపతి వేంకటేశ్వరార్థ శతకమును" జదివియుందురు చదివిన మీలోఁ గొంత తెట్టి యేవమును బొందిరో ఆసందర్భమును దెల్పు నుత్తరములు గొన్నిటిని 263 వ పుటలో నుదాహరించి యుంటిమి లోకముచే నట్లు గర్హింపఁ బడుచున్న తప్పుడుఁగూఁతల కుత్తరము వ్రాయుట వ్యర్థమని మే మెఱిఁగియుఁ బ్రసక్తాను ప్రసక్తముగాఁ గొన్ని లోకోపకారములగు సద్ధర్మముం దీ వ్యాజమునఁ బ్రమరింపఁ దలఁచి యాతప్పుడుఁగూఁతలనే గౌరవించి "విగ్రహారాధనము" అను పేరితో నీగీరత తృతీయభాగము ముద్రింపించితిమి. ఇంతకు మున్నిది గీరత చతుర్థ భాగముగా ముద్రింపించెదమని భ్రమరించి యుంటిమి కాని గుంటూరిసభలో దీనియందలి పద్యములు కొన్ని విన్నది మొద లిద్దానికై నిత్యమును వచ్చు నార్డర్లమితములుగా నుంటంజేసి లోకాభిరామాయణముకన్న దీనినే ముందు ప్రకటింపవలసినవార మైతిమి. అనేక మహావిషయము లిందున్నవి. అవి చదువరులే గ్రహింపఁగలరు అక్కడక్కడఁ గల విశేషముల నేకత్రి చేర్చి సమన్వయించుకొనువారికి బోధపడిన ట్లిది యితరులకు బోధపడదు. కానఁ జదువరు లప్పట్ల జాగరూకులుగ నుండఁ గోరెదము. ఇది యిటు లుండె. ఈయనర్థశతకమును జూచి లోకు లెల్ల నిష్ఠీవన మాచరించుచుండఁగా నీమర్యాద చాలక కాఁబోలు "రామకృష్ణమ + హాభారత" మనఁదగు ధోరణితో "రామకృష్ణ మహాభారత" మను నేతిబీరకాయ నొకదానిని మన దైవవంచితులు లేవఁదీసిరి ఇది పడుచు, లేచుచు, చచ్చుచు, పుట్టుచు "చచ్చి చెడి చేయఁగల విన్నపములు" కావించుచున్నది. ఇప్పటికి 128 పద్యములు, 24 పుటలు 7 పర్వములుగాఁ దలచూపి రోచన సంఖ్యాపర్వఽసమాప్తిలో నుండఁగనే మరల నాఁగిపోయినది. అప్రగాల్భ్యానృతవచః పూరితమగు నియ్యది వెలువడి నది మొదలు ప్రాజ్ఞలోక మిట్లు గౌరవించుచున్నది.

"తిరిగి యీనడుమ 'కవిత' పత్రికలో విదివఱకు కృష్ణాపత్రికయందుఁ బ్రచురించిన 'పరాస్తపాశుపతమును' బ్రచురించుచున్నారు 'పాడిందే పాడరా పాచిపండ్ల దాసరి' అను సామెతకుఁ దగియున్నది. మీగీరతమునకు మరల "భారతమును" వ్రాయుచున్నవారలు. ప్రారంభపర్వముమాత్రము వ్రాసిరి. వ్రాసినను మీరువయచేసి వానికి ఖండనముగా గ్రంథములు వ్రాయక యేవియో కొన్ని వ్యాసములు వ్రాసిన బాగుండును. కారణమేమనఁ వారు వ్రాయుదానియందు విషయ విమర్శన ముండదు కాఁబట్టి"

సికింద్రాబాదా (డక్కన్) చివుకుల అప్పయ్య. 24-9-13.

---

19-5-14 సికింద్రాబాదు. సెకెండుబజారు

"గీరత" ద్వితీయభాగమందలి సంబుద్ధిపద్యాదులను జూచిన రామకృష్ణసతీర్థ్యులఁక శాంతింతు రేమో యనుకొంటిని మరల వారు తమ చేటభారతమందు, తొంటి యవివేక ప్రసారమును గ్రుమ్మరించు చున్నారు. వదలుకొననిండు యీ దేశమందు వారినిగూర్చి యేవపడని వివేకులులేరు,

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు.

---

(1) ఆబ్ధ్యే!. "శతపర్వభారతంబఁట ? మతిమంతులు వ్రాసిరంట ?" ఇత్యాద్యుక్తులు కొంతవట్టు క్రాలుచున్నవి స్థాణువు పల్లవశోభ నందవచ్చును గాని మనవారు త్రోవకు వచ్చునట్లులేదే ? ఇది కలిమాహాత్మ్యము కేవలము వారి లోపము గాదు.

మ కలికాలంబ ? భవన్మహత్త్వగిరిశృంగస్థానశృంగాటకో
చ్చలదత్యద్భుతచర్యపుణ్యజనవాదాకీచకస్వానని
ష్ఫలసత్యప్రతిబంధకల్పనకు సంతోషించి భక్తాగ్రగ
ణ్యులు మ్రొక్కుల్ పదివేలు మ్రొక్కెదరు మాయోపాయసంధానమా ?

అని వేఁడఁ దగియున్నది. "బ్రహ్మోఽపి వరం వరంజయతి" కోటిలోనికి వచ్చినది .... శ్రీ॥ హ॥ 1-9-13.

(2) "కవిత" జూచి యుందురు. అందు శ్రీ "వారి" భారతము బయల్పడినది ప్రారంభపర్వము ముందుదారిని సూచించుచునేయున్నది. తత్త్వము లోక మెచ్చినపిమ్మటఁగూడ వీరి క్రీప్రయత్నములు శుభకరములు కావనియే ప్రాజ్ఞసంఘము నుడువుచున్నది . . శ్రీ॥ హ॥ 20-9-13

"ఉ॥ "శిక్షయొనర్చి, యక్షరము(జెప్పి, ప్రియోజకు( జేయు నొజ్జనే।
దక్షి(డనై తినంచు(, గురు( దానవమానమొనర్చు(గూళ" అని శ్రీసూక్తి వసుచరి
త్రాకిత, రామకృష్ణకవులు మున్నగువారే, వయసంగతికి నాధార మగుదురు. వీరి
శృంఖలగావి, బృహద్వారతముగావి, భవత్రుతిభాయళః ప్రసరణములకు, ప్రతి
బంధకములు కా(జాలవు తాము మనుష్యమాత్రులుగా, నేపాత్రిజ్ఞలచేతను దల(
ప(బడుటలేదు. మీ ప్రబంధరాజములను అందు మరియు మీగీరతామ్నాయము(
జదివిన విద్వత్కవులు, సాక్షాత్తుగ, మీరు తిరుపతి వేంకటేశ్వరులే యని, భావిం
చుచుండిరి "

జాపట్లతాలూకా — జమ్ములమడక శ్రీరామకవి.
పెదనందిపాడు పోష్టు, — కొండపాటూరు.

---

అతి విస్తరమేల "పువ్వు పుట్టినతోడనే పరిమళము — పుట్టినతోడనే
కంపు" అను సామెతకు మన సువిపేకుల భారతము ప్రధమోదాహరణము. అది
యింతవఱకు( గొంచెము తక్కువగా నేడుపర్వములు వెలువడిన దని వ్రాసి
యుంటిమి, ఏడుపర్వములలో( దుట్టతుదిపర్వము పేరు 'పునరుక్తిపర్వము' దీని
లోని యీ పద్యముంబట్టి చూడ నయ్యల కప్పుడే నాడి వెనుకకు లాగుచున్నట్లు
మూర్ఖులకు( గూడ సుగమమే

గీ చాటుపద్దెము లెద్దాని జాటితెలిపె
శృంగభంగమునందెద్ది చెప్ప(బడియె
సత్యసందేశమును దేనిసంప్రతించె,
నదియె వివరింపవలసె భంగ్యంతరమున"

ఏడవపర్వమునకు( బెట్టిన పేరుం బట్టియేమి, పైనుదాహరించిన పద్యపువా
లకముం బట్టియేమి యయ్యల భావిగతి సూచితమగుచున్నది. చాటుపద్దెములగతి
నెఱు(గవి వారెవరు ? శృంగభంగ సత్యసందేశ ముల దుర్గతి నెఱు(గవి వారెవ్వరు ?
ఆ ప్రల్లదములుతప్ప గతిలేవి దేవయ్య లంత పెద్ద పేరుతో వ్రా(తకు దిగుచెందు
లకో ? ఇప్పటికివి శృంగభంగ సత్యసందేశములను గూర్చి సత్యాన్వేషుల మరల
మరల( బ్రియుత్నించి విఱమరసి "తస్య ప్రిహారణములను" దగిలించుచునే
యున్నారు. చూడు(డు.

పినపాడు. 6-11-13

"నేను యీ నెల, 2-11-13 తేదీని కాకరపర్తిదగ్గర నున్న "వదలి" అనే గ్రామమునకు కార్యార్థినై వెళ్ళి యుంటిని. అక్కడికి కాకరపర్తి చాలా సమీపమని తెలిసినది కాకరపర్తి తగాదా విషయమై ఎవరినైనను కనుక్కుందామనే కుతూహలముతో నుండగా, 3-11-13 తేదీని సాయంత్రం. 7 ఘంటలకు కాకరపర్తి నివాసులగు బ్రి॥ శ్రీ కూచిభొట్ల మహాదేవయ్య, అనేవారు తటస్థమైరి. వారిని మీ తగాదా విషయమై నిజము యెంత వరకు. అని ప్రశ్నించితిని. వారు యీ క్రిందివిధముగా చెప్పిరి. మీరు కాకరపర్తిలో సభ చేసినప్పుడు తాను కూడ అక్కడ నున్నాననిన్ని తమరు ప్రతమంలో గ్రంధము (గీరతము) చదువుచుండగా అందరికీ చాలా సంతోషంగా నుండెననిన్ని తరువాత అక్కడ వారు యెవరో రచించిన పుస్తకమును మీకు చూపి మీ అభిప్రాయమును కోరగా అది మీకు నచ్చదన్నట్టున్నూ అక్కడనుంచి అక్కడ నున్నవారందరు అనేక విధములుగా మిమ్ము అవమానించవలయు నని పట్టు పట్టి నట్టున్నూ అట్టి వాండ్రిలో తనకుమారుడు కూడా వుండి నట్టున్నూ, వానిని వారు మందలించి నట్టున్నూ, చెప్పినారు. తమ యందు మాత్రం ఏమీ లోపము లేదనిన్నీ, లోపము వాండ్రిదే ననిన్ని మిమ్ములను ఎట్లాగైనా అవమానించాలని వాండ్రందరు అదివరకే అనుకొని వున్నట్టుగా కూడా వారు అభిప్రాయము కనపరచినారు. యింకను బ్రి॥ శ్రీ॥ రామ కృష్ణ కవులలో కృష్ణకవి అనే వారు తమదగ్గర శుశ్రూష చేసి అవధాన రహస్యములున్నూ .... మీవద్దనే తుద వెగ్గించుకొన్నట్లు సెలవిచ్చినారు. అంతేకాక మీ కవిత్వముతో అవూరిలో ఎవరి కవిత్వమున్నూ సరి తూగచాల దనిన్ని మిమ్ములను జయింపలేరనిన్ని బ్రి॥ శ్రీ॥ పెద సీతారామ శాస్త్రులవారు పదిమందిలో చెపుతూ యుండగా తాము విన్నా ననిన్ని చెప్పినారు. వారి సంభాషణ వల్ల ముఖ్యపరిపోద్దు ఏమనగా, మోసము రామకృష్ణ కవులదనిన్నీ. అవూరియందు యింకా కొంతమంది దనిన్ని. తేలినది. అప్పుడు నేను "లోపము ఎవరియందు వుంటే వారిని మీ వూరి పండితులు మందలించరాదా" అని అంటిని. అందుకు వారు రామకృష్ణకవులు అక్కడి వారికి చాలా దగ్గిర బంధువులు కావడమువల్ల ఏమీ అనుటకు వీలు లేకున్నదనిన్నీ, తిరుపతి వేంకటకవుల కీర్తి యితరులవల్ల పొమ్మేది కాదనిన్నీ. మావూరియందున్న పెద్దలు వూరకుండి యున్నారు. అని సెలవు యిచ్చినారు. మీరు గీరత

ములో న్యాయముగా వెళ్ళినట్టు వారు చెప్పిన మాటలవల్ల నామనస్సుకు (శోచి), చాలా సంతోషించినాను "

T. KOTAYYA

ఈ టి కోటయ్యగారి గ్రామ మెక్కడిది? గుంటూరు డి॥ లోనిది. సత్యాన్వేషణ తత్పరత్వము తప్ప నీయన కీ పరిశ్రమమేల? సత్యజిజ్ఞాసువులు చేయు పరిశీలనమున కెన్నాళ్ళు చావక యసత్య జీవనుల వదరులు నిలువఁగలవు? అట్టిచో నా పాడుఁగూఁతలనే మరల మరల నేల వదరవలయునో? పైవిషయమును గూర్చినదే మఱియొక యుత్తరము.

"నాలుగు దినములక్రిందట బ్ర॥ శ్రీ॥ చెళ్ల రామశాస్త్రులుగారును వారితో బ్ర॥ శ్రీ॥ అణివిళ్ళ సీతారామశాస్త్రిగారును యీగ్రామము లౌక్యసం॥ కార్యముమీద విచ్చేసిరి మమ్ముల జూడవచ్చిరి. పేరు వినుటతోడనే, బ్ర॥ శ్రీ॥ పీ॥ శా॥ గారివి "శృంగభంగపు" వ్రాతలను గురించి ముచ్చటించితిని అందు బాలిర చేష్టలును, తా ఋచటి కేగుట మొ॥ సంగతులు చెప్పిరి. తమయందు మంచి తాత్పర్యం కలదు"

1–7–13 ఏలూరు మై॥ కృ॥

---

ఇ ల్లెందఱచేతనో ప్రతిక్షణమున విమర్శింపఁబడుచు నిగ్గు తేల్పఁబడుచు పి. యని రోయఁబడుచున్న తనకుకల్పనయం దింకను రామకృష్ణమ్మకు నాశాభంగము కలుగనే లేదు. పైఁగా నా, శృంగభంగ సత్యసందేశములలో రెండవదానిని మేము మా గీరతమునఁ గైకొననే లేదఁట? కైకొన్న "శృంగభంగము" వలనఁ దనకుఁ గలుగుచున్న మర్యాద చాలదా? పునరుక్తిప్రాయ మగు దానిం గూడ నేల కైకొనవలెనో? ఆ ద్వయమే యననేల? ప్రకృత విషయమునఁ దా నేది వ్రాసినను నయ్యది యప్రగల్భానృత మయముగానే యుండె ననుట యెవ్వ రెఱుంగనిది? శృంగభంగ సత్యసందేశముల కర్తృత్వ మెవని నెత్తిని బలామఁబడినదో యా చర్ల చలపతి వర్తనముం బోలె నాయీ ప్రకటనములను వెలుఁగఁ గల పని తలఁపని ప్రాజ్ఞు లెవరు? చర్ల చలపతి వర్తనము కొంత గూఢముగా గురుదక్షిణలో 143 వ పుటలో సూచింపఁబడినది మఱికొంత తెలియఁగోరువారు మా శిష్యుఁడు వెంకటరామయ్య కొక వ్రేలు విడిచిన పినతండ్రియగు బ్ర॥ శ్రీ॥ ఓలేటి నారాయణశాస్త్రులవారి సరిక్రొత్త యుపానద్ద్వంద్వమును బ్రశ్నింపఁ గోరెదము. అట్టి యుత్కృష్టునికి స్యాలకుఁడగుట కర్మవశ

మూగవి అందులకు దుఃఖింపక యవ్వానితో క్షీరనీర న్యాయమున నుండి కుకల్ప నలు ప్రకటించుట తత్తుల్యత్వ సంపాదకము కాక తీరదు కావుననే దూర గులు పైతము ప్రత్యయము చాలక రామకృష్ణుని వ్రాఁతలు ప్రతిపదమును విమ ర్శించి తజ్ఞులవలన గుట్టుమట్టులను గనిపెట్టి త్యజించుచున్నా రనునంశ మింతకు మునుపే సిద్ధాంతీకరింపఁబడినది. దానినే బలపఱుచు నతని స్వయంకృతాప రాధబోధకము లగు నక్కరములు మఱికొన్ని చూపఁబడుచున్నవి.

(రా॥ కృ భా. కథావతారపర్వమునుండి )

చ ఒకతఱి రామకృష్ణకవులొద్దకు వెంకటశాస్త్రి చూడ ను
త్సుకుఁడును బోలె వచ్చి "తగుచోట ననుంగొని మీగురుండుగాఁ
బ్రకటన సేయఁ గోరెద భవద్గుపతాపవలబ్ధి నాకుఁ గొం
డొక యుపకార మామతిలెడున్ భవదీయ నృపాలసన్నిధిన్.

ఉ వేసవికాల మేగుడును వెండియు నేమరుదెంతు మింతలో
మాసడి మీనృపాలుని సమక్షమునంయఁ బ్రసంగమార్గముం
జేసి వచింపుఁ డేను నృపశేఖరుదర్శన మబ్బ యత్నముల్
చేసెద"నంచుఁ జెల్మి మెయిఁ జెప్పెను దత్సమయోచితంబుగన్.

ఉ మంచిది "వేంకటేశ్వరుఁడు మాకు గురుం డని పల్క మీకు లా
భించెడి దున్నన ట్లె కలిపించెద" మంచు వచించి యాతనిం
బంచిరి రామకృష్ణు,లటు పాత్రిమనోరథుఁడౌట నాతఁడిం
చించుక సంతసంపడియు నీపును పీడఁడు లేశ మేనియుః

ఇట్లు వెం॥ శా॥ తమ్ము నాశ్రయించినది నిక్కమే యగునెడల నీయం శము "లపర్తుత్తి ప్రశంసలో" వ్రాయమానుటకుం గతము పూజ్యము వెం॥ శా॥ రాజదర్శనార్థియే యగుచో వీరి నాశ్రయింపవలెనేమి ? అసత్యమాడు పట్టులఁ గూడఁ గొంత తెల్వి యుండవలయును. అదియే యున్నచో నీమా "దైవవం చిత" రీయంశమునుగూడ స్వాప్నికపర్వములోనేవిఁ జేర్చుకొనినఁ గొందఱు కాకున్నఁ గొందఱేని "పాపము వారికట్లు స్వప్నము వచ్చియుండబోలుఁ" వని యనుకొనుటయైన దటస్థించునేమో ? ఎట్లు తటస్థించెడిని ? వాది ప్రతివాదులలో నొకరుఁ డింకొకఁడు చెప్పినట్లు తన కనుకూలించు సంగతులను గిలికి "ఇట్లాతఁ డెప్పుడుచెప్పె" నను ప్రశ్నము పచ్చినప్పుడు "స్వప్నమునం" దని యుత్తర

మిమ్ముచో నమ్మ తీర్పరు లెక్కఁడనుందురు ? కావున నీస్వప్నసంగము కూడ మా "దైవవంచితులు" శుద్ధసత్యములను వదరు వికృష్టులనిలోకులకుఁ జెప్పక చెప్పుట కేర్పడినదియే యని మేమింపు వేఱుగ వ్రాయనక్కఱలేదు- స్వప్నములో వెం॥ శా॥ చెప్పినట్టు లెన్నో సంగతులు కల్పింపఁబడినవి అందు రామకృష్ణమ్మకు గల రిక్తమనోరథమును దెల్పఁదగు నొక యపరిగల్పుఁబద్దె మిట నుదాహరింపఁబడుచున్నది.

ఉ॥ పగ్గెకు మిమ్ము గెల్తునని పల్కుచునుందును గాని కృష్ణుతో
నెగ్గఁగలేము తిర్పతియు నేనును నాతని పేరు విన్నచో
దిగ్గురనున్ మనం ? బెపుడు దృప్తమృగాధిపడింభమో యనన్
దిగ్గనఁ బైబడంగ నరుదెంచునొయంచు భయంబుఁ జెందుదున్ "

పాపము వీనికెంత కోరికయున్నదో ? అవును

శ్లో॥ ఉత్పద్యంతే ప్రలీయంతే దరిద్రాణాం మనోరథాః
బాల్య వైధవ్య దగ్ధానాం కులస్త్రీణాం ఇవ
"రిక్తుని మనసుకోరికలు పెద్ద"

అది యటు లుండె ఇట్లని వెం॥ శా॥, వెం॥ రా॥ లతోఁ బల్కిన దెప్పుడు ? స్వప్నమునందు స్వప్నఫల వేత్తలిట్టి పట్టున నర్థ మెట్లు చెప్పుదురు ? "ఇట్టిమాట వెం॥ శా॥ వలన నీవెన్నఁడును వినవేరవు" అని చెప్పుదురు అట్లేల చెప్పవలె నందురా ? వేఱొకప్పుడు వెం॥ శా॥ యెదుటికి రాఁగానే విలువునఁ దమ యుసురు లెగిరి పోయినట్లు కల వచ్చె ననుకొనుఁడు. అయ్యది యట్లు జరుగ వలసినదియే యగునోటు ?

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి)

శ్లో॥ నిద్రయా చాల్యతే చిత్తం భవన్తిస్వప్న సంభవాః నానావిధ మనో భేదాః . శ్లో॥ మృతం పితామహం స్వప్నే పశ్యతి స్వ గృహాగతం ... భ్రమోఽయ మితి నిశ్చయః॥

దీని కిన్ని ప్రమాణము లెందులకు. నిజముగా స్వప్నము వచ్చియే, వెం॥ రా॥ లట్లు వ్రాసినను నది వృథా, వీరలకట్టి స్వప్నమే రానిచో నిఁకఁ జెప్పవల సిన దేమి ? స్వప్నము గాదుగాని యిది యొక జాతి ప్రలాపసన్నిపాతప్రయుక్త మగు వికారమైనఁ గావచ్చును. ఈవికల్పములకేమి, "రామకృష్ణమ్మకు, తి॥వెం॥

కవులను జయింప వలయునను మనోరథ మున్నది. అట్టి శక్తి భగవంతుఁ డియ్య లేదు. అందుచే నిట్టిపాటులు పడవలసి వచ్చుచున్నది." ఇది సారము. పైమనో రథ మెట్టి భయముతోఁ గలసి మెలసి వర్తించుచున్నదో, అభయ మెట్టి తెల్వి తక్కువ పరిసంగమును జేయించుచున్నదో, యీక్రింది సాకులవలనఁ దెలిసికొన వచ్చును

(రా॥ కృ॥ మ॥ భా॥ పునరుక్తి పర్వమునుండి)

"చ॥ . . తారు తుల్యపరభాగులె మే మెసరేఁగి కాఁకఁగ॥
క. నమశీలోద్యోగులకున్, సమవిజ్ఞానులకు సమసుచారిత్రులకు॥
దమలో సఖ్యమును వివా. దము దగు నని వ్యాసభారతమ్మునఁ లేదే."

ఇందుచేత తి॥ వెం॥ కవులు పిల్చినను వెం॥ రా॥ లు విద్యావివాదమునకు రారఁట ? సత్యమే కావచ్చును. వేదుల రామకృష్ణమ్మకీవిషయమైన పట్టుదల పూర్తిగా మున్నట్లు బలవత్తరమైన సాక్ష్యమున్నది గానఁ బై సంగతి విశ్వసించి తీరవలయును ఇతఁడు చర్ల చలపతితో వివాదమునకుఁ గాకున్నను వివాహము నకును స్నేహమునకును నంగీకరించి యశ మార్జింప యత్నించుట లోక విదితమే ! శీలాదులయం దితని కతఁడు సముఁడు "సర్వం సంపన్నం "ఇఁకఁ దైవద్యమునకు బీజభూతమగు భారతశ్లోక ముదాహరించి కొంచెొక చర్చింప వలసియున్నది

శ్లో॥ యయోరేవ సమం విత్తం యయోరేవ సమం శ్రుతం
తయో ర్వివాహ స్సఖ్యంచ నతు పుష్టవిపుష్టయోః

ఈ శ్లోకమునకును ఆ పద్యమునకును విశేషభేదమున్నను బ్రికృత మది యంత గణ్యముగాదు పైవాక్య మెవరిది ? ఎవరివి గూర్చినది ? ఈవక్తకుఁదుట తునకుఁ బ్రాప్తమైన గతియేమి" అనునది ప్రస్తుతము. పైవచనము రాజ్య మదాంధుఁడగు ద్రుపదునిది. ద్రోణునుద్దేశించి పలుకఁ బడినది ద్రోణశిష్యులచేఁ బట్టుబడుటకు వక్తకుఁ దటస్థించిన దుర్గతి సర్వవిదితము కావున దానినమకరించు వాండ్రగతి విచారింపనేల ? బొరా ! దైవవంచితుల ప్రమాదములు ! "పీదయా, పీదయా, విప్రియా" ఇంత తెల్వితక్కువలో నున్న తమరస ? †ఉన్నతస్థానమం

† ఉ॥ క్రిందుగ నున్నవాఁడు ... తెగియించు . ఉన్నతిం బొందినవాఁడు .. . సందియమందు... ॥ (రా॥ కృ భా పునరుక్తిపర్వముచూ.)

దున్నారట॥ తి॥ వెం॥ కవులట॥ అధస్థానమున నున్నారట॥ వీరి కోడినను గెల్చినను లాభమేనట॥ తమకో? యోడిన నష్టమట॥ కావున విద్యావివాదమునకు రారట॥ అంతియేకాని సామర్థ్య మేమో చాలా నున్నదట॥ ఏమీ యున్నతస్థానస్థితి. సిగ్గుసిగ్గు

"ఎన్నఁడు నెఱుఁగనివాని కేగాని దొరకితే యెందులోఁ బెట్టనే కందులబుట్టా."

అది యటు లుండె. ఇప్పటి కచ్చయినంతవఱ కా వీరి నేతి బీఱకాయ భారత మిట్టియప్రగల్భా నృతోక్తులతో నిండియున్న యది. అందినంత వఱకు, దెల్పిన కథాంశమేమియును లేదు. "కథావతారపర్వమని ప్రారంభించి అందు మాశిష్యుఁడు చదివిన గురువులను గొందఱఁ పేర్కొనిరి. అందు వెం॥శాస్త్రిని మొట్టమొదట వదలిరి. పదునడి జ్ఞప్తికివచ్చి కాఁబోలు.

ఉ. చెళ్ పిళ్ వేంకటేశ్వరా,

శ్యాకునితో నెటో చదివెఁ గౌముది నిర్వదినాళ్లు పత్రముల్

అవి యొకచోఁ దప్పుడుఁగూడ నొకదానిని గూర్చి ఈకూఁత కర్థమే లేదు. లేదన్నందులకు * అపరిస్తుత పరిసంకలో వ్రాసిన "ప్రీపరిత్యయాంతమే" అనునదియే సాక్షి. ప్రీపరిత్యయాంతము 24 పుటలలో నిమిడియున్న కౌముదీ సంపుటములో కానరాదు చదివినది ప్రీ పరిత్యయాంతమును గాదునుఁడీ! దానికి గౌముదిలో నెన్నియక్కరములు వచ్చునో అవి యన్నియు వెం॥ శాస్త్రి కిక్షయే యది పంచభూతములను సూర్యచంద్రులను దక్షులను నెఱుఁగుదురు కాన విస్తరింపఁ బనిలేదు. ఆయీ పరస్పర విరుద్ధాప్రగల్భావృత వాక్కులతోఁ గాగితములు చెఱుపు మా దేవయ్యలకు జాగ్రత్పన్నిపాత మంకురించిన దని యనుమానింపఁ దగు నంశములుగూడ నా నేతిబీరకాయలోనే కలవు. అందొకటి వృథాగా పింజరగ్రామమును బట్టుక పడఁదిట్టుట. దీనింగూర్చి యాగ్రంథము తుట్టతుదను గొందొక విమర్శింపఁ బడి యున్నది. 271 వ పుట మొదలుకొని చూడఁదగు మఱియు నాయా యీ పర్వములలో మా "దైవవంచితులు, వ్రాసిన సంగతులు సంగ్రహముగాఁ దెల్పుచున్నారము. "వెం॥ శా॥ గారికి శాస్త్రము

* "వెంకటశాస్త్రి గారివద్ద వెంకటరామశాస్త్రిగారు వ్యాకరణము ప్రారంభించి కొన్ని మాసములకుఁ గౌముదిలో ప్రీపరిత్యయాంతమే —— ఎంతైన నేమి, చదివిరి. (అపరిస్తుత పరిశంసచూ.)

రాదు. మాయకవిత్వము వచ్చును. శ్రీవఱానంద, పాణిగృహీతా, నానారాజ సందర్శన, పాండవాశ్వమేధములు పదికిమాలిన చెత్తపుస్తకములు. గీరత మిన్నిటి కన్నఁ బాదు దీనిని జదివినవారికిఁ బాపము. వెం॥ శా॥ గారి యాజ్ఞ మీఁదనే పేమీభారతము వ్రాయుచున్నారము. స్వప్నములో వచ్చి, వెం॥ శా॥ తాను దోషి నని యొప్పుకొనియెను. వెం॥ శా॥ వ్యాసమూర్తిశాస్త్రిలవారికి మున్నె పుడో విందు చేసి విలువగల నూతనవస్త్రములు కట్టఁ బెట్టెను. కావున వ్యాసమూర్తిశాస్త్రిలవారు చాల గొప్పవారు వీరి కతఁ డొనర్చిన విందు శబరి శ్రీరాములవారి కొనర్చిన విందువంటిది." ఇత్యాదులు వ్రాయఁబడినవి. ఇందులో నీవిందుమాట మాత్రము సత్యము కాని శ్రీ శాస్త్రిలవారికి శబరివలె వెం॥ శా॥ యెంగిలిపదార్థములను బెట్టెనని వ్యంగ్యమర్యాదచే స్ఫురించునట్లు వ్రాయుట దండ్యమగు దోషము. మఱియు నీవిందు వ్యాసమూర్తిశాస్త్రిలవారు పెద్దలు పండితులు బంధుసముద్రిలు అను గౌరవము వెం॥శా॥ కిఁ గలదనుటకే బోధకమగును గాని వారి కవిత్వమన్న నతని కేవము లేదని తెల్పుటకుఁ బనికిరాదు. వారి కవిత్వమునందు లోకుల కెంత గౌరవమో. వెం॥ శా॥ కిని నంతియ యని విజ్ఞ లెఱుఁగుదురుగాక అదియటులుండె. ఇట్లే అనుచ యుక్తములగు మఱి కొన్ని సంగతులు వ్రాయఁబడియున్నవి, అనునది ప్రకృతము. ఆవ్రాసిన సందర్భములలోఁ దక్కిన విమర్శనకు నాఁగని యసత్యము లగుట యంత తప్పుగాదు గాని పింజరదూషణ మపానత్ప్రయోగార్హ మని లౌనవివా రుండఁగూడదు. ఆభాగము ప్రచురించునెడల సంతవఱకు వచ్చుటయు, దానిపై నది కొన్నిమాసములాపి తుట్టతుదకొక సీసపద్యములో నాగ్రిపుష్ఠులలోఁ గొందఱను భూషించి "చెంకాయపిచ్చికొండ" చేయుటయుఁ బలువు రెఱుఁగుదురు మఱియు నాయీ తప్పుదు భారతములో వెం॥ శా॥ గారి మీసములనుగూర్చి తాము వెక్కిరింపలేదనియు, నేమో యనియుఁ గొంత ప్రలపింపఁబడినది. "రాను రప్పింపఁ బనిగానరాదు మాకు" అనుదానికిఁ దెల్వి తక్కువగా వ్యాఖ్యాన మొనర్పఁ బడినది. దానివలనఁ దేలు సారము "మీరు వచ్చునెడల మేము మిమ్ము రప్పింపము గాని మిమ్ము జయించుట కే ప్రదేశమునకేని మేము వత్తుము. వచ్చుట మాత్రమే కాదు. విధిగా జయింతుము. అనునది, అగుచో నొకపరి బందరు పట్టణమునకే వచ్చుట యుక్తము. ఇందును గూర్చి, గీత 1వ భాగము 43 పుటలోని "తే॥ గీ॥ బందరేవచ్చి" అను పద్యము చూడఁదగు. ఎప్పుడువత్తురో తెల్పునెడల సభ యేర్పఱచి వారి రాకకై ప్రతీక్షింపఁ బడును. చేవయే

యున్నచో శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తికాహ్వానింపఁ బడి "వత్తు" మని యంగీకృతిం దెల్పి కూడఁ బలాయనమంత్రము స్వస్తి చెప్పుటకుఁ గత పేమో యెఱుఁగనివా రెవ్వరు? "పిల్లి కనులు మూసికొని పాలు ద్రావిన" పది దాఁగుటెట్లు. ఇందుఁగూర్చి యావాత్తమున 273, 274 పుటలు చూడఁదగు ఆయీ సందర్భములెల్లఁ బరికించువారికది "రామకృష్ణమ + హాభారతముగా" గన్పట్టక యెట్లుమానెడిని అది యటులుంచె గీరత ముత్తమగ్రంథమని తెల్పఁదగు మత్తరము లెన్నో. 1, 2, భాగములలోఁ బ్రాపఁబడినవి దిఙ్మాత్ర మీభాగమందును బ్రచురించితిమి. కాని యెన్నో యుత్తరము లింకను విల్వయున్నవి. కొన్ని యిటఁ బ్రాపఁబడుచున్నవి.

(1) ఉ॥ శ్రీపతి వేంకటేశకవి సింహములార! శతావధాన వి ద్యావర భాగధారనకలాంధ్రధరా ధరసత్ప్రభాప్రభా! దీపకకీర్త్యుదంచితవిధిప్రవణాత్మకులార! సత్కృతి! స్థాపకులార. నేఁ దమపదంబులకుం బ్రణతుల్ ఘటించెదన్॥ చ॥ చరితములందు గీరతము చాలరసాకరమయ్యె నీతి! విస్ఫురణము గాంచనయ్యె, గురుసూరుశమన్నన హెచ్చనయ్యెనేఁ! దరుదుగ "పీమ" యుక్త చరితమార్యులు తాము రచించినట్లు నేఁ నెఱిఁగి లిఖింతు నొక్కప్రతి సీమొక కుందయపేయ వీ. పి. గాన్॥ క॥ అద్యతనోభయకవులం! దుద్యత్కీర్తిప్రతాప యుక్తులకలవన్! హృద్యులగు తమకు నే నవ! వద్యప్రణతిం బొనర్చి ప్రసుదము గాంతున్. 6-3-13

(2) తాముప్రచురించిన "గురుదక్షిణను" జూచితిని. ఇంతకు ముందటిప్రథమ భాగముం జదివియుంటిని. ఇక్కాలమున శిష్యహితోపదేశము చేయ నింతటి స్మృతిగ్రంథముమ రచియించి, లోకోపకృతిబొనర్చుచున్న తమ్మును సహస్రథా కొనియాడుచు నొక్క గురుదక్షిణను వీ. పీ. గా దయచేయఁ బ్రార్థించుచున్నాఁడను.

గుంటూరు. పెరవలి పార్వతీశశాస్త్రి.
16—11—13 ఏ. ఈ. ఎల్. ఎమ్. కాలేజీ, సహాయాంధ్రోపాధ్యాయుఁడు.

---

పెద్దింటి హయగ్రీవస్వామి అనేక ప్రణామములు పా॥ ఆర్యవటం-గొల్లపాలెంపోష్టు. కాకినాడతాలూకా. గోదావరిడిస్ట్రిక్టు. తాము చెప్పిన గీరతము నాకు వక ప్రతి వెంటనే వీ. పీ. గా దయచేయించుటకు ప్రార్థించుచున్నాను.

చదువరుల కపరిమితానంద దాయకమని మన పెప్రిపిదెప్పి యంతయు కీర్తివిస్తరిం చెను. గాన నదరు గ్రంథము చదువవెంతో వేడుక కలిగి యీ విజ్ఞాపనపత్రిక వ్రాసినాను. ది 16-11-13.

---

తమ రిదివరకు రచించిన గ్రంధములు కొన్ని మాత్రము నావద్ద నున్నవి. అందు, సర్వజనోపయుక్తంబై, కల్పభూరుహంబువలె సకలార్థదానశాలియై, కాలమేఘంబుచందంబున గంభీరధ్వని విరాజితంబై, భారత కథావిధంబున, నానా వర్ణ సమస్తపదభూయిష్ఠంబై, యొప్పారుచున్న గీరత ప్రథమభాగమును జూడ నాడెందం బమందానంద తుందిలంబయ్యె. మల్లాది వెంకటసుబ్బయ్య. గుంటూరు.
14-3-1913

---

19-1-13.

తమ గీరతము నామూలాగ్రముగఁ జదివితిని మిక్కిలి యొప్పుగ దెలుపుచు నానంద మొనఁగూర్చుచున్నది.

పురాణం, రామచంద్రశాస్త్రి. ముక్త్యాల (సంస్థానం) కృష్ణా డి॥

---

సీ॥ నరవిఁ గృతఘ్నుల జక్కాడి జయమొంది ప్రభవిల్లు మీపాండవతము గంటి ...భారతప్రతిభమైఁ బండితకోటిని దన్పెడు మీగీరతమ్ము గంటి ."

దార్వేముల వెంకటశేషశాస్త్రి 22-3-14
గోపువారిపాలెం, వీపూరుపోస్టు, వినుకొండ తా॥ గుంటూరు డి॥

---

ఇట్లెందఱో నిర్వ్యాజముగా నుతించు గీరతమును వెం॥రా॥ లెట్లు తిట్టిన నేమి ప్రయోజనము? అదిగాక వారేని స్వస్థచిత్తులై వ్రాయువ్రాఁతలలో నిందించుచున్నారా? పాపము! గీరతమును జదివి ఆవసరముం బట్టి ఖండింపనెంచి వీలు లేక చేయు "హాభారతము" లోఁగదా తిట్టుచున్నారు. దుఃఖసముద్రములో మునిఁగినవా రేమన్నను నది విజ్ఞులు పాటింపఁ దగదు. అదియటులుండె, చూచినంతలో నీ "హాభారతము" సత్యమునకుఁ జాలదూరముగ నగపడుచున్నది. కాని యతిప్రాసాదు లనుకూలముగ నున్నవని చెప్పుటకు సందియము లేదు. అందీక్రింది పద్యమును, వెం॥ రా॥ లెందుకో వ్రాసికొనియుండిరి.

క. "ఒకపండితుఁ డొకపామరుఁ డొకలోకంబైన నేమియో యనవచ్చున్
సకలమ్మం దముఁదెగడిన, స్వకీయదోషమును దెలియఁజాలరు సుకవుల్."

లోకులు వీరిప్రవృత్తిని గుఱించి యేవపడుటమగూర్చి గీరతమెల్లఁ బలు ప్రమాణము లిచ్చియుంటిమి. అవి చదివి యీ పద్యమును జదివికొన్నవారి కిందుల కుదాహరణమును వేఱుగ వెదకవలసి యుండదు గదా? ఇఁక వసత్యవర్తనుల ప్రతిజ్ఞ లెట్లుండునో తెలిసికొనఁదగునొక యుదాహరణము మాత్రము వెం॥ రా॥ ల "హాళారతము" నుండి చూపుచున్నారము.

తే గీ "అనృతవిషయమ్ములెల్ల సత్యములుగాఁగఁ
జెప్పి మెప్పులు కొనుట మాచేతఁ గాదు
ఉన్నదున్నట్లు వ్రాసెద నొప్పుఁ దప్పుఁ
జెప్ప రారయ్య పండితశ్రేష్ఠులార."

పండితశ్రేష్ఠులు రావలయునఁట!, పాప! మెంతధైర్యమున్నదియో, అస్తు ఇందలి వ్యంగ్యమువలన గీరతమును లోక మెల్ల మెచ్చె ననుటకుఁ బ్రతిపక్షులుఁ గూడ నొప్పికొనక తప్పక వచ్చినది యని విస్పష్ట మగున్నది అందనృత విషయమే యున్నదో సూనృతమే యున్నదో తెల్పవలసిన యావశ్యకత లేదు. ఈ యంశమును సాధింపఁదగు లోకాభిప్రాయము లుదాహరించి విసివితిమి కాక. "ముంజేతికంకణమున కద్దమెందులకు" జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమెందులకు" "నీరుపల్లమెఱుఁగు నిజముదేవుఁడెఱుఁగు" కొన్నిటి యందలి నిజమును గనిపెట్టుటకు దేవునివఱకుం బోవలయును గాని "పట్టపగటి దొంగతనపు" వ్రాఁతల యందలి సత్యమును గనిపెట్టుట కెవ్వరేనియుఁ జాలుదురు. అట్టి వ్రాఁతలను వ్రాయుచు మా వెం॥ రా॥ లు లోకమును విశ్వసింపఁ జేయవలయు నని విశ్వప్రయత్నము చేయుచున్నారు. వారెన్ని యొట్లు, యసత్యములు, కావించి సంగతిసందర్భములు ప్రకటించు చున్నను నయ్యవి గని లోకు లేవగించు కొనుచునే యున్నారు. అట్టిస్థితిలో వారొనర్పఁ దగిన దేమి? పాపము స్వయంకృతాపరాధము వలని ఫల మనుభవింపవలసినదే. ఒక యసత్యమునకై తొంబది తొమ్మిది యసత్యములను లిఖించి వానివలన లోకులచే గర్హితు లగుటకన్న దుర్దశ యొండుండెడినా? ఉండదు

శ్లో॥ అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల ముచ్యతే॥

అనుట కింతకన్న దృష్టాంత మేమి కావలయును. ముందు గురుత్వమును దాఁచి "పినప ఫ్రీప్రత్యయాంతము వఱ" కని బొంకి పదపడి 24 పుటలు మాత్రమే యని "నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టు" గాఁ బాట్లు పడుచున్న మా వెం॥ రా॥ల కష్టమును భగవంతుఁడే పాలింపవలయును. ఫ్రీప్రత్యయాంత

సన్నప్పుడు సుమారు, సగమును. ఇప్పుడు మరల నా సగములో సగమును లోపింపఁ జేసిరి దీనివలన వెం॥ రా॥ గురుత్వ మేమో క్షీణించు నని తలఁచు చుండిరి గాని యయ్యది "యాదవ కులపు ముసలము" వలె నెంత యఱుఁగఁ దీసిన నంత వి స్తరించి చేయఁదగు సని జేసిమే తీరునని మాత్రము గుఱుతింపఁ జాలకున్నారు. "స్త్రీప్రత్యయాంతము" కొన్ని ప్రతులలో 68 పుటలు, కొన్నిటిలో 58 పుటలు, కొన్నిటిలో, 48 పుటలుగను గానవచ్చెడిని. ఇందుఁ దక్కువ సంఖ్యను గైకొన్నచో 24 దానిలో సగభాగముగఁ బరిణమించెడిని. యింతలో నజంత స్త్రీలింగములు ప్రారంభ మగును. తక్కిన సంగతు లెటులున్నను వెంకటరామయ్యకుఁ గౌముదిలో శబ్దాధికారము గూడఁ దుదముట్ట లేదని పై వ్రాఁతల వలనఁ దేలును. అగుచో నితఁడు "శాబ్దికజీవుఁ" డెట్లగునో? ఈ "శాబ్దికజీవ" త్వమునకై వ్యాఖ్యానాదుల నటుకుఁ బోకున్నను గౌముదిలో నింకెంతయేని చదువ వలయును గాన నాభాగమునకు గురువులను వెదకవలయును. చర్లనారాయణశాస్త్రి గారినే పేర్కొందు మన్నచో నాయన యొద్ద లఘుకౌముదిమాత్రమే చదివి నట్లు వ్రాసినవ్రాఁత బాధించును. (చర్లనారాయణబుధేంద్రు సాకతమునఁ। గావ్య నాటకాదులు లఘు కౌముదియును) (రా. కృ. మ. భా కథానకానపర్వము చూ ) ఇఁక—

క. "గణుతి గలవ్యాసముఖబుధమణులపై" (రా. కృ. మ. భా. క. ప. చూ )

నన్యాయముగా నీభారము మోపవలెను, గాని యిందులకు వారును నంగీకరింపరు. పైగా——

("తటస్థించినపుడు . క్షణశఃకణశః." (రా. కృ. మ. భా. క. ప. చూ)

అను "గోఁడమీదిపిల్లి, వ్రాఁత" యంత భారమును మోపుటకుఁ దోడ్పడను. ఇఁక నెవ్వరి యందీభారమును మోపవలెనో చదువరులే విచారింప వలయును వెంకటరామయ్య కౌముదిలో 24 పుటలు మాత్రమే కాని స్త్రీప్రత్యయాంతము మాత్రమే కాని చదివె ననునది సత్యదూరము. అంతకన్నఁ జాల నధికమే చదివెను. గురువునుమాత్రము వెదక వలెను. యెంతవఱకుఁ జదివెనో లోకాభిరామాయణ పీఠికలో వివరింతుము. ప్రకృత మీ యసుకపాఁతలు పని నుండి యింతతో విరమింతుము. వీరి యసత్యములను జూపుట కింతవఱకుఁ దెంచవలసి వచ్చినది గాని ప్రస్తుత మగు విగ్రహారాధమునకును దీనికిని బొత్తిగా సంబంధమే లేదని మే మెఱుఁగుదుము

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరులు
శతావధానులు

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

---

## విగ్రహారాధనము

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం,
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం,
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో, బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః. 2

శ్లో. అపుత్రాః పుత్రిణ స్సన్తు, పుత్రిణ స్సన్తు పౌత్రిణః
అధనా స్సధనా స్సన్తు జీవన్తు శరదాం శతమ్. 3

శ్లో. మఙ్గళం భగవాన్ విష్ణో, మఙ్గళం మధుసూదన
మఙ్గళం పుణ్డరీకాక్ష, మఙ్గళం గరుడధ్వజ. 4

శ్లో. నీలాచలనివాసాయ, నిత్యాయ పరమాత్మనే
సుభద్రాప్రాణనాథాయ, జగన్నాథాయ మఙ్గళమ్. 5

శ్లో॥ ఉపనయతు మఙ్గళం వ, స్సకలజగన్మఙ్గళాలయ శ్రీమాన్
దినకరకిరణవిబోధిత। "నవనళినవశేక్షణో రామః" శ్రీ. శ్రీ శ్రీ 6



## గ్రంథప్రారంభము

ఉ. కర్దమలపరిభూతమధుకైటభమాతుకదుష్కృతఘ్ను శౌ
దుర్దయహారి శౌరిఁ దలఁతున్ మధుసూదను వేంకటేశ్వరా
భ్యర్థనమాత్రవిద్యు, రచితాగను, వేంకటరాము, దుర్వచః
పూర్ణముఖాంతరున్ వినయపుంజసమంజసుఁగా నొనర్పఁగన్. 1

మ. సరియౌ నుత్తరమొండు లేమి వసురాచారుండవై వేంకటే
శ్వరునిం దిట్టఁ దలంచి స్వాంతగతవిశ్వాసమ్ముఁ బోమర్చి యీ
శ్వరమీారంబగు దుష్కృతం బొకఁడు సంపాదించి యౌరౌర! ము
ష్కరవాక్యమ్ములు వెళ్ళఁగ్రిక్కెదె, కృతఘ్నా గ్రామచూడామణీ! 2

మ. అమృత మ్మన్న గుడమ్ము నీకు, గురుదేవామ్నాయవిందాప్తి జీ
వనమే నీకుఁ, గుమార్గవర్తన మనన్ స్వారాజ్యమే నీకు ని
న్నన నేమున్నది? జన్మకాల మటు సవ్యాసవ్యభేదమ్ములం
గనఁగా నీక కలంచుచుండె, నెటు శక్యం బట్టిచో నర్పకా? 3

ఉ. వెంకనఁ దిట్టిపోయ నల వెంకననోర నభేద మొండు నీ
కంకెను. రామకృష్ణులను నట్టు లభేదము చేసి తిట్ట నే
జంకఁగనేల? కైతయది సాగదొ? లేఖిని వ్రాయదో? వృథా
పంకమునందు బ్రుంగుటకుఁ బ్రాజ్ఞుఁ డెవండు కడంగు నర్పకా. 4

ఉ. ఏఁబది చెప్పి యుంటి, "విఁక నేఁబది చెప్పఁగ నుంటి" వంటి. వీఁ
డేటను లెన్ని చెప్పఁగలఁ దిట్టియభేదము పట్టెనేని యో
శాబక! యుద్ధరంగమున శాతకృపాణిక పాణి నూని దు
ర్దీబహుశారికంఠములు ద్రెంచునొ? త్రెంచుకొనం దలంచునో. 5

శా. తిట్టన్ రాదని కాని యట్టి దొకసందేహమ్మొ లేకున్నచో
నెట్టో చెప్పుము రామకృష్ణులకు నిర్భేద్యత్వసంసిద్ధి? తి
ర్గుట్టన్ బొల్పెడి వేంకటేశ్వరున కేరుగా దోసమున్ వీసమున్
గట్టంగా వినఁబోము కృష్ణున కటుల్ గాఁదెంచువా రున్నచో. 6

సీ. జారుం డనఁగవచ్చుఁ జోరుం డనఁగవచ్చు
బావిసమగఁ డంచుఁ బలుకవచ్చు

స్త్రీఘ్నుం డనఁగవచ్చు గోఘ్నుం డనఁగవచ్చుఁ
బసులకాపరియంచుఁ బలుకవచ్చుఁ
గల్లరీఁ డనవచ్చు। గొల్లతేఁ డనవచ్చుఁ
బల్లెవాఁడని చుల్కఁ బల్కవచ్చు
ఉత్తముం డనవచ్చు నత్తముం డనవచ్చుఁ
జాఱుఁబోఁతని నొక్కి పలుకవచ్చు
గీ. చాకివాఁ డని యనవచ్చు నన్న "బొంగు"
పెసవిఁజేర్చెడివాఁడని వదరవచ్చు:
ఏమనివనేమి భక్తి యొక్కింతగల్గి?
యేమనక యేమి యది లేని హీనజనుఁడు?

సీ. చెడుకంపు గొట్టెడి చేపవాఁ డెల్లదో?
శాబేలని వచింపఁ దప్పు గలదొ?
పంకానఁ బొరలాడు పంది వాఁ డెల్లదో?
అరమానిసి యటన్ననతుకదొక్కొ?
బలినాశ్రయించిన పాఱువాఁ డనరాదొ?
మాతృఘాతుకుఁ డన్నమాట తగదొ?
తండ్రి "పోపొ"మ్మన్న ధన్యుం డనఁగ రాదొ?
త్రాగుఁబోతనుమాట తగనిదగునొ?
గీ. తిండిపోతన్నఁ జెల్లదో? మొండిజగ్గఁ
డన్న సరిగాదొ? కలికిగా నాడరాదొ?
ఆతని పూర్వోత్తరమ్ముల నరసి భక్తి
గల్గియేమన్న దొసఁగొండు గలుగఁబోదు.

సీ. విధవవాజి యటన్న బుధులొప్పరో? పిషా
శ్రియుఁడన్న సత్కవీశ్వరులు వినరొ?
ధీరహితుం డన్న సూరు లొప్పరొ? యశో
దాదారకుం డంచు వేదు లనరొ?
నరకాభిగామి యన్న మహాత్ము లొప్పరో?
స్థిరగడుండన విపశ్చితులు కనరొ?

హాతశిశుపాలకుం డనరాకో విన్నలా ?
గోత్రోద్ధరణుఁ డనుకొనరా కవులు ?

గీ ఎందుఁ గురుకులవిద్వేషి యాతఁ డనఁగ
వచ్చు నీతనక మ్మనవచ్చు; విచ్చ
భక్తియొక్కింత యేనియుఁ బాదుకొన్న
వాఁ, డితరుఁ డేమి యన్నను వమ్ము వమ్ము. 9

గీ. తల్లికి మగండు, * లంజకు దమ్ముఁడు, నోట
మన్నుగొట్టికొనినవాఁడు. మామగారి
కొంప గూల్చినవాఁ, డత్తఁ గొసరువాఁడు
లోనగు పదంబు లెన్నియునేని గలవు. 10

తే గీ అన్ని పదములు భగవంతునందుఁ జెల్లు
నన్నిశ్లేషలు వానికి నన్యథా స
మంజసార్థప్రదము లయి మలయు; వాని
పేరు ధరియించుచోటఁ జేకూరుటెట్లు ? 11

తే. గీ. మంచిగందపుఁజెక్కలసంచి రాస
భంబు లెటు లట్ల యా భగవంతునామ
మందఱును బేర్మి ధరియింతు; రంతమాత్రఁ
దత్తదుచితంబులు గొనాలు దవులఁ బోవు. 12

క తిరుపతి వెంకనయనఁగాఁ, దిరుపతివెంకనయె యనుపఁ † దెగఁబొగడిరి కొం
దఱు, నీవో తెగఁదిట్టితి, వివుతముల దేవతాత్వమేన న్నెనపెః. 13

---

* లంజా, లక్షిః, (ఏప్టి, నిఘంటువు చూ.)

† తిరుపతి వెంకటేశ్వర నామము తమకు సార్ధకమేయగుచున్నది. . ఇమ్మహాకలియందు దేవవారు నామమాత్రమునచే గాక ... యు ...ము.... ము . .మును....విచారించిన శ్రీ తిరుపతి వెంకటేశ్వరుని భాతిఁ జెలంగినన్న నెంతయు నొప్పిదమే యగుచున్నది....."

వేలూరి సుబ్రహ్మణ్యం, అమరవరం, భద్రాచలంపోష్టు. 4-8-13

☞ షరా.— ఈవిషయమున కెన్నేని యుత్తరములున్నను విస్తృతిచే నొకటి మాత్రమే యుదాహరించి యున్నకుంటిమి

ఆ. వె హితుల సుతులకే మహితుఁడవయ్యును నీవు, నన్ను దేవుఁ జేసినావుగాన
నతనియంశ మేదొ యధిక మందఁజూకన్న, నన్నుఁ జెంచినట్టు లెన్నవలయు

ఉ. తిట్టిన నేమి, నీమదువు తిట్లు మహత్తకు సాక్ష్యమిచ్చెఁ: నా
"రొట్టియ నేతిలోఁబడియె," రోసముతోఁ బని లేదు గాని నీ
పట్టినపట్టు తప్పు, పలుపాపము లక్కఁటినం బొనర్చుచు
న్నట్టుల నాకుఁ దోఁచు; నది యద్దెద శక్తికొలంది వందుచే 15

ఉ. ఏదియొ హేతు వుండవలె నించుక, తిర్పతివెంకటేశు మ
ర్యాదకు వీఁడు పాల్పడుట యన్నది యూరక యెట్టులబ్బు? వీఁ
డేదెసవాఁడు? తిర్పతి మఠే దెసవాఁ? డెటు లిర్వు రేకమై
రో? దురితపరిచారులకు నూరక గోచర మేల కావలెన్. 16

ఉ. అందుకె కాదు, పూర్వకృతమన్నది యెందులకేని తప్పు: దే
వందయొ తక్క నీమదికి బద్ధుఁడు గాని వివేకి లేఁడ, యిం
తెందుకు? నీవు దేవగురుహేళన నల్పుటకేని యేసియో
కందు పురాకృతం బొకటి కల్గియ తీరవలెన్ గుమారకా. 17

ఉ. కర్మవశంబ కాక యిటుగాఁ దెగియింతువె? బుద్ధియెప్పుడుం
గర్మము నంటి పోవు, నది కార్యముచే ననుమేయ మయ్యెఁ: నీ
కర్మము త్రిప్ప నాతరము గాదని కొంత యెఱింగియుండియున్
ధర్మము గామిఁ గొందొక వృథా ప్రలపింతు భవద్ధితార్థినై. 18

ఉ. కాన సమస్తమానవులు గర్మపుదాసులు. విక్కమింత, య
ద్దాని కతాననే యెటులొ దక్కెను దిర్పతివెంకటేశు నా
మానఁ బ్రసిద్ధి చెందఁగల మాన్యత నా. కిఁక నీకొ? దక్కె న
ద్దాసినె వేంకటేశగురుదైవతపై రకృతాపచారముల్ 19

గీ ఒకఁడు వేంకటరాముఁ డింకొకఁడు రామ
కృష్ణుఁ డీరెంటిలోఁగొంత గిలుబుఁజేసి
ప్రాఁకినా రెట్లొ వేంకటరామకృష్ణ
పదవి; కీపాట్లు మాకుఁ జొప్పడవు తనయ! 20

ఉ. వేంకటనేతఁ దిట్టినను వేంకట నామము మోము ద్రొక్కె నీ
పంక మడంచుమన్నయది; బాలక! "వేంకట" దీసికొన్న ప

ర్వాంకము రామకృష్ణునిదె యౌ: నొక "రామ" పదమ్ములోన,మీ
రింక నడంగఁగా వలయు నిర్వురు భావుకు లెంత కష్టమో? 21

ఉ. "వేంకటరామ" లోనఁ గల వేంకట శబ్దముఁ దీసి, రామకృ
ష్ణాంకములోని రామ పద మట్టులె యూడఁగఁ దీఁకి, రామకృ
ష్ణాంకము దాల్చినట్ల గురునియాకృతి బేరునఁ దోఁపకుండు. మీ
రింక నటుల్ పొనర్పఁజను "హేయవు "వేంకట" నామ మేటికిన్? 22

ఉ ఏ యవివేకియోయొకరుఁ డెట్టులో * మీసములం దగిల్చి "పి
న్నాయనః" యంచుఁ బిల్చెనఁట నాయన చెల్లెలి. నట్లె వెంకనట్ల
బాయఁగఁ దోఁచి నీవు గురుపట్టపుఁ బీఠమునందుఁ జర్లనా
రాయణు నిల్పుపూనికయుఁ బ్రాజ్ఞులకుం గనుపట్టునప్పుడు? 23

ఉ. ఏయొక లేశమో నొడువుచే నిజ, మంతనమీకుఁ జర్లనా
రాయణుఁ డొజ్ఞయై యొరుఁడు రాయియు అప్పయు నమ్మెనేమి? నన్
దాయఁగ వచ్చినప్పు డొకటట్ల మున కాఁకరప ర్తిఁ జర్లనా
రాయణుఁడే పచించెఁ బామి యర్పక; తద్గురు తాల్పు తాగతిన్. 24

క. ఏకాక్షరపద్రాతృత. చేకొనియుం గురువిగాఁగఁ జెప్పికొనఁగ నౌ,
నాకిది యక్కజ, మీతని. నేకతనన్ దోఁపియఁగల్గి తెలిఁగింపవనా? 25

ఉ. వేంకటశైల దేవుపయి పేరము పుట్టుటఁజేసి వానిపా
పాంకము దాల్చు వెంకనయు నట్టిఁడ యయ్యెను? బాగుబాగహో!
"వేంకట" యన్ పద మ్మరిది, పీడుముదాని; † నరిప్రతిష్ఠితం
బంకము పెట్టుకోఁదగని దందురు పెద్ద లెఱుంగు మర్పకా.

గీ. "కాలుపట్టుక పడలాఁగఁగాఁగడంగఁ,
జారుపట్టుక పేర్లాడు" తీరుదోఁచె;
"బొంగరి బజానఁ బెట్టుక పొమ్మటన్నఁ,"
బోక వెంకన నీపేర దేఁకుఁ గంచె 27

* "పి. మేనత్తమూతికి మీసములంటించి పిన్నాయనాయని పిల్చినట్లు."

† హోష వదాద్యంత రంతస్థం. (అనరిప్రతిష్ఠితం) . నామ కుర్యాదితి నామకరణ సంప్రదాయవిదో యాజ్ఞికాః.

ఉ పేరది మార్చికొమ్ము, పయి వేంకటనేత భయంబు నీకు దు
ర్వారము గాకయుండు(, గులపద్ధతి మున్ను( గొన్ని మార్చుకో(
గూరిన నీకు( బేరొకటి కొండొక మార్చిననేమి పోవు ? వి
స్పారవు( ద్రోవద్రొక్కెదవె ? చాలు నికన్ విడు మీదురంతముల్

ఉ ఎట్టికులమ్మనెన్ బొడమి, తెట్టి యపాత్రపుద్రోవ( బాపపుం
గుప్పెగ(బా(కుచుంటి ? ఏది గూడదుసూ కని గర్జనేని నా
దిట్టము మిన్నకుండెదను; దేవుని( దిట్టకు, మెల్లలోకముల్
దిట్టి శపించు ని, న్నొకట దే(కుదు నంచనుకోకు మర్త్యకా ! 29

ఉ. ఎందులకేని యేగవలె నెక్కడకేనియు. "వీ(డె వీ(డె యా
వెందకు(," యంచు వ్రేలికొన నిన్ గనిపించుచు నొండొరుల్ పౌరిన్
ముందఱ వెన్క నాడుకొన ముచ్చముడుంగుట యెంత కష్ట ? మే
వెందకు పై(చినన్ తిరుపతి వెందకు పైప రెవ్వరున్ 30

☞ షరా — చదువరులారా ? ఈ పైని వెం॥ రా॥ వా॥ తిరుపతి వేంకటేశ్వ రార్ధ శతకమునుండి గొన్ని పద్యములనెత్తి చూపుచు వానికి సంబంధించిన మాసిద్ధాంతములను దెల్పు పద్యములు నెలకొల్పుదుము వెం॥ రా॥ ల యయుక్త ప్రసంగము సర్వమును జూడ(గోరువారు, వారి యర్ధశతకము పూర్తిగా( జూడ గోరుచున్నాము. తి॥ వెం॥

( ..సకలాంధ్ర జగమ్మున కీవవేల్పవై వెలయ(గ లేదుగా )

శా. నాకున్ దేవు(డె, నీకు దేవు(డె సుమీ నాయన్న ! వెంకన్న, యే
లోకుల్ వానివి సన్నుతింతు రఘువల్లల్ దెంపు(గా, నాంధ్రపున్
లోకంబం దొకకొంత గాదు పదునాల్గున్ లోకముల్ గూడ వ
య్యేకాకారుని గొల్తు రేరొ విమతుల్ హీనుల్ జడాత్ముల్ వినా. 31

( ఏరాజమహేంద్ర మందిరవరమ్మున నీకు( బ్రతిష్ఠ గల్గె .)

ఉ. రాజమహేంద్రమందిరవరాన( బ్రతిష్ఠయె లేదుగా ? మహా
రాజనతాంఘ్రి వేంకటపరాత్పరమూర్తికి(; * బీఠికాపురీ

---

*(1910 సం॥ 1-2 సంచికలుఆర్యమతబోధినినుండి)
శ్రీ తిరుపతి వేంకటేశ్వర మాహాత్మ్యము.
"శ్లో॥ స్రగ్భూషాంబర హేతీనాం సుషమావహ మూర్తయే, సర్వార్తశమ నాయాఽస్తు వేంకటేశాయమంగళం." (వేంకటేశ్వర స్తోత్రం)

రాజమహేంద్రి మందిరవరంబునఁ గల్గిన పూజకూడ నీ
కో జడబుద్ధి ! సుంతయిన నూహకు రా దదియేమి కర్మమో 32

(పాపమరులైన దానవులు బ్రహ్మరథమ్మును బట్టి దేవతా గ్రామణిపీవి యంపును ముఖస్తుతి సేయుచునుండ్రు)

ఉ. "పాపరులైన దానవులు పట్టిరి బ్రహ్మరథం" బటంటి, వా
నాపము లెట్లు వ్రాసితి వనాథజనంబుల పట్టినప్పు ? డీ

ఈకలియుగములో వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షదైవమై యున్నాఁడు. కావుననే పెద్దలు "కలౌ వేంకటనాయకః" అని నుడివి యున్నారు వేంకటేశ్వరుఁ డార్తత్రాణ పరాయణుఁడు ఈతఁడు నతజనుల దాసుఁ మాన్ప. తిరుపతిలో వేంకటాద్రియందు వేంచేసి యున్నాఁడు నిక్కమైన భక్తితో నీదైవమును గొలిచిన డింగరీంద్రు సర్వవిధములగు బాధలనుండియుఁ దొలంగి సుఖపడుదురు కావునఁ బ్రతిసంవత్సరము వేలకొలఁది భక్తులు తిరుపతి వేంకటేశ్వరుల దర్శనము నకుఁబోయి యార్తిరహితులై గతకిల్బిషులై తమతమ నిలయంబులకుఁ జనుచుం దురు ఇయ్యది యాస్తికులగు హిందువులకెల్ల బాగునాఁ దెలిసిన విషయమే యైనను నిప్పుడు మన హిందువులలోనే కొందఱు క్రీస్తుమత వికారమగు బ్రాహ్మమతమును గల్పించుకొని యీ ప్రత్యక్ష దైవతముయొక్క మహిమను గూర్చి సందేహించుచున్నారు. సందేహింపుటయేకాదు, భక్తితో వేంకటేశ్వ రుని సేవించు సామజనంబుఁ బరిపరివిధముల నిందించుచున్నారు ఇట్టి వారికిఁ గూడఁ దన మహిమ బోధపడి వారు కూడఁ దనభక్తులై తరింపవలెనను పత్సలత్వ ముచేఁ గాఁడోయి గాఢముగా నీ బ్రాహ్మమతప్రభ సప్రకాశించుచున్న బ్రాహ్మసామాజిక శిబిరములలోనే తన దివ్యమహిమను శ్రీ వేంకటేశ్వరులు చూపుచున్నారు ఈ నడుమనే యీక్రింది మహాద్భుతము జరిగినది.

పిఠాపురపు సంస్థానాధిపతులై శ్రీ వేంకటేశ్వర పాదభక్తులై యాస్తిక శిఖామణులై కీర్తిశేషులయిన శ్రీ రాజారావు గంగాధరరామారావు బహదరు వారి భార్యలలో శ్రీరాజా భావయమ్మారావుబహదరుగా రనువారొకరు పిఠా పురపు సంస్థానాధిపతుల యింటనే యున్నారు. వీరొక సంవత్సరమునుండి యజీర్ణవ్యాధిచే మిక్కిలి బాధపడుచుండిరి, ఏమి తినిననుఁ యిముడుటలేదు. మం చినీళ్ళు పుచ్చుకొనినను దత్క్షణమే వెళ్ళిపోయెడివి. దాన దేహము చాల

వేసఱితోఁ గొ? బ్రహ్మరథ మెవ్వరు పట్టిన సార్థకంబొ వా
రే మఱి పట్టి ,యూర కరు లేచ్చి కృశించిన నేమగుఁ? సుశా 33
చ ధనికడ దాస్య మూను నొక దాసరి, వేంకటనాథుపావనం
దనమున దాస్యముల్ సలుపు దాసులు పామరు లంచుమాఱుటల్.

---

శుష్కీభూతమై పోయినది. ఇప్పటి సంస్థానాధిపతులుతమ కామెయందుగల భక్తిచే ననేకవిధ ఘనవైద్యులచే వైద్యము చేయించిరి. అలోపథీ, హోమోపథీ, మున్నగు పథములెల్లనయినవి ఆయుర్వైద్యశిఖామణులగు పండిత గోపాలాచారిగారిని చెన్నపురినుండి రప్పించి వారిచేవైద్యము చేయించినారు కాని యేమియుఁ గార్యము లేకపోయినది. మానవప్రయత్నమంతయు నీవిధముగా విఫలముకాఁగా నప్పుడా సాధ్వీమణి తనకు దైవమే శరణమని నిక్కముగా నమ్మి తమ యిలవేల్పగు వెంకటేశ్వరుని "అన్యథాశరణం నాస్తి త్వమేవశరణం మమ" యని యంతరంగమునఁ బ్రార్థింప మొదలుపెట్టినది భక్తవత్సలుఁడగు వేంకటేశ్వరుఁడు తన్నునే నమ్మిన యీభక్తురాలిపైఁ గరుణకలవాఁడై యొక నాఁడామెయం దావేశమై "నాకొండకు వచ్చి నన్నుదర్శించినయెడల నీయుగ్రత నివారితమగు" నని పలికినాఁడు అప్పటికి వ్యాధి మిక్కిలి హెచ్చుగానున్నది. కొండకు వచ్చెదనని మ్రొక్కికొనినని మొదలు వ్యాధి నివారించునని వేంకటేశ్వరులు వచించిరి ఈవార్తను పిఠాపురపు సంస్థానాధిపతిగారికిఁ దెలిపిరి. వారు బాధ నివారణమగునెడలఁ దప్పక యట్లుమ్రొక్కుకొనవలసినదే యని మిక్కిలి సరసముగాఁ బలికిరి ఆమెయందుగల భక్తిచే వారా మ్రొక్కును చెల్లించుట కంగీకరించిరి. వారిమాటపై యాసతి యట్లుమ్రొక్కికొనినది అదియేమియమృతమో! ఆవేంకటేశ్వరుని ప్రభావమెట్టిదో! గాని మ్రొక్కికొనినదాదిగా నారోగమంతయు మటుమాయమై పోయినది. తినిన పదార్థములెల్ల వెళ్ళిపోకుండ నిముడఁజొచ్చెను ఈశుభవర్తమానము సంస్థానాధిపతిగారికిఁ దెలుపఁగా వారాశ్చర్యనిమగ్నులైరఁట! ఆమెభుజించువేళఁ దాను చ్చుట నుండి భుజించినపిమ్మట గంటవఱకును నచ్చటనే యుండి తినినపదార్థమిం దుటను గని యామెను వెంటనే మ్రొక్కికొనినప్రకారముగాఁ దిరుపతి పంపించిరి. ఆమె తిరుపతివెళ్ళి స్వామిని దర్శించివచ్చెను. ఇప్పుడారోగ్యస్థితియం

కవిన వివేకి సైఁపఁడు, విహారికనవ్వు, నహో · ధనంబు* దం
ధన మని తిట్టుఁ, బాయయు ద్రవ్యపునాసు, లౌపస్ వివేకులే 34

---

దుండినని ఇక్కడ నామెరక్తి, శ్రీ వేంకటేశ్వరుల మహిమ, శ్రీపిఠాపురపు రాజాగారి సరసతయు చాలవర్ణనీయముగా నున్నవి నిక్కమగు భక్తియెట్టిఁ టికిని వృథాగాఁబోదు "సర్వార్తి శమనాయాస్తు వేంకటేశాయ మంగళం"

---

(1911సం ॥ 1, 2 సంచికలు, ఆర్యమతబోధినినుండి)

(వేంకటనాయకుని మహిమ)

కలికాలదైవతమగు వేంకటనాయకుఁడు తనమహిమనంతను నిప్పుడు పిఠాపురపు కోటలోఁ జూపుచున్నాఁడు కీర్తిశేషులయిన వెలుగోటిపిఠాపురపు రాజాగారి రాణులలో నొక్కరు బహుకాలము తీవ్రవ్యాధిచే బాధపడి తుదకు వేంకటేశ్వరుని దయచే నారోగ్యస్థితి నందెనని వ్రాసియుంటిమి. ఈ రాణిగారికిప్పుడు మరల రుగ్మత కలిగినదంట అంత దానికిఁ గారణము నారయఁబోఁగా మరల నామెయందు వేంకటేశ్వరు లావేశమై యిప్పటిరాజాగారికిఁ బుత్రలాభము కలిగినప్పుడు తనకు 1116 రూపాయలు ముడుపు చెల్లింతునని వాగ్దానము చేసియుండు చెల్లింపనందున నీరోగము మరల నంకురించెనని సెలవిచ్చెనంట అపుడు కుల విప్పటిరాజాగారు రాలించి బహుమానసహితముగా 1116 రూపాయలను వేంకటేశ్వరులగుడికిఁ బంపఁగా నీరాణిగారి రుగ్మతయంతయుఁ దృటిలో నివారితమయ్యెనంట। ఆహా! వేంకటేశ్వరుని మహిమ చాలవర్ణనీయముగదా నిక్కమగు భక్తిగలచోట దైవమహిమ కాన్పింపకపోదు

(శ్రీ వేదాంతదేశిక స్వామివారి శ్లోకములు)

* శ్లో. శరీరపతనావధి ప్రభునిషేవణాపాదనా
అబింధనధనంజయప్రశమదం ధనం దంధనం
ధనంజయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనం
సుసాధన మబాధనం సుమనసాం సమారాధనం

శ్లో నాదాయ నీచం కమనీయవాచా, మోచాఫలస్వాదుముచా న యాచే
స్థితేఽకుచేలే శ్రితమాకుచేలే, దయాకుచేలే ధనవత్కుచేలే

శ్లో సిలం కి మనలం భవే దనల మౌదరం బాధితుం
పయఃప్రసృతిపూరకం కిము న ధారకం సారసం

ఉ కూఁతున కత్త పేరిడి రగుల్కొను కోపముకల్మిఁ గుంపటిఁ
బాఁతినరీతి నెందుకొ పాడునుడుల్ జగదీశుఁ బల్కి నీ
వాతి వివేక మే మనఁగ వచ్చుఁ గుమార ? విభుండు ని న్నెటో
నీతికిఁ ద్రిప్పి దోసము గణింపక నాకయి ప్రోచుఁగావుత౯ 35

మ "గురులఁ దూఱుటక" ప్పటంచు సుజనుల్ గొందాక, "లెక్కేమి ? దే
వర నే దూఱెద నే" నటంచుఁ గవితన్ బాటించు నీతెల్వి కె
వ్వరు శోకింపరె ? నీకు శ్రేయమెటులో ప్రాపించుతన్ వేంకటే
శ్వరుఁడే నాకయి పేర్మిఁ జూపుచు భవద్వాచాలతల్ సైఁపుత౯ 36

సీ వేంకటేశ్వరుఁడు నీవెకలితనం బోర్చి రక్షించుఁగాక మాపక్ష ముండి
యతని దేవేరి మహాలక్ష్మి పతికోప ముపశమింపించి ని న్నోముఁగాక
ఆదేవు రెండవప్రెడలి భూదేవి క్షమ నిన్నుఁజూచి శ్రేయ మిడుఁగాక
యతని పేర్మిడిచాన యాత్మజబుద్ధి నీపై నుంచి నీఁ కాపాడుఁగాక

తే గీ అతని కావాసమగు వేంకటాచలంబు
నీదొసంగు లడంచి మన్నించి "వేంక
టతి" యనెడుమాట సార్థకగతి నెసంగ
సద్యశముఁ బొందుటకు నిన్ను సాఁకుఁగాక 37
("దేవుని గొట్టవై బయలుదేఱుదు తిర్పతివేం ")

ఉ "దేవురగా" ట్టటంచు నలదేవుని దిట్టెడి నీదునాల్కకున్
శ్రీవిభుఁ దల్లకుండుత, స్వసేవ యొసర్చెడి నాకునై సదా
నీవెటు పేర్మినిఁ సయిచి నీకు శుభం బొదఁగూర్చి నన్ను సం
భావన సేయుతన్ జగతిఁ బండితమండలి మెచ్చునట్లుగన్ 38

మ "ఎగనై నఁ వగనై నఁ బ్రాణభయముఁ బ్రాపించియైనన్ సదా
భగవన్నామ మెదం దలంచుటయపో భాగ్యంబు, ముక్తుండు వాఁ
డగు" నంచుఁ పచియించు గ్రంథములు, నీ వద్దేవునిం దిట్టియే
ని గడింపంగల వమ్మహాత్మపదము న్నిక్క మ్ము సుమ్మర్భకా ! 39

మ "చిరకాలమ్ముగఁగాని భక్తిమెయి వాసిం గొల్చి పొందంగనే
రరు తద్దేవుని పాదదర్శనము, వైరంబానుచో శీఘ్రమే

---

అయత్న మలమల్లకం పథి పటచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధాహ్యహహ కుక్షితః కుక్షితః

యరయం జాలదు" రంచు వింధు, మది తథ్యమ్మైనచో నీ కగున్
ద్వరిలోఁ దిర్పతివేంకటేశ పదపద్మప్రాప్తి యాత్మాశ్రితా. 40

(నీవదివఱ కీశ్వరుండవఁట ? . నీకొకయయ్య వైష్ణవంబిడినవాఁడఁట)

మ హరుఁడే కా, యల వేంకటేశ్వరుఁడు ము ? న్నట్లేయగుంగాక నో
రఖుగణా దిట్టితి రుష్టుఁ డయ్యె నతఁ, డీయత్యాహితం బాఁగ నీ
గురుముఖ్యుండె గలండు, దేశికుని కెగ్గుల్ గట్టి రుష్టత్వమున్
బొరయన్ జేసెద వేదిదిక్కు ? * శివుఁడున్ బూనండ యిప్పట్టునన్.

మ హరుఁడే దేశికునట్టఁజాలఁ డనుచో నన్యామరశ్రేణికిం
దరమే ? వారలయంశ మింత గల ధన్యమ్మన్యసంసారు లె
వ్వరికేనిం దరమే ? శరణ్యమెదియో వ్రాకుత్తు నీ వేంకటే
శ్వరుఁడే సూ ! యల వేంకటేశుఁడును గావన్ లేఁడ యిప్పట్టునన్ 42

ఉ "దేవుఁడె లేని మానిసికి దేశికుఁ డెక్కడినుండివచ్చు" నం
చీవల నింతకాలమున కించుక బోధకు వచ్చె, మేలు ! నీ
చేవ, సెబాసు ! నీపదను, సీ ! వహవా ! భవదాస్తికత్వ, మీ
తోవను బోవు సాహసికి ద్రోహము చేయఁగ రాని దుండునే. 43

ఆ వె అమ్మ చెవులుదెగ్గించు నమలాత్మలకు నెందుఁ
బిన్న తల్లిచెవులు బిఱపూలు
గావు" దేవుఁ డిట్టుగదుసు మానిపి కుపా
ధ్యాయుఁ డిట్టు లెంత తప్పిదంబు. 44

(తాతికి అప్పకు మొక్కఁజెల్లునే)

చ తొలి నతఁ డీశ్వరుం డగుచుఁ దోఁచియు వేంకటనప్రసక్తిఁ జె
న్నలరెను వేంకటేశుఁడుగ, నజ్ఞులరజ్ఞులకేమి, సోమయా
జులు మును గొల్చు వేల్పువలెఁ జామ్మతఁడౌ హరియున్ హరుండు, మూ
ర్తుల కతఁ డొక్కడాయియు నగున్ దలదిమ్ము వదల్చుపట్టునన్. 45

ఉ. రాతిని దిట్టి తా "నొకయరాతిని తిట్టితి" నంచు నెంచ నే
నీశవయుందు, వాఁ డొకట వేము భారము గాఁగ నెత్తితో

శ్లో॥ * శివకోధ్రాద్గురుస్త్రాతా, గురుకోధ్రాచ్ఛివోనచ॥ (గురుగీత)

రాతిని బిట్టు మట్టియు "నరాతివి మట్టితి" వంచు నెంచుఁ జూ
మ్మోతనయా ! వివేక మిటు లూరుచు నున్నది నాఁడు నాఁటికిన్.

ఉ రాతి కరాతి వైతి, వలరాతిని దేవుఁడె యున్నచోఁ బురా
రాతి కరాతి వైతివి, భరం బది మైనముఁ బోవ దమ్మురా
రాతి కరాతి వైతివి, పురాతనవిజ్ఞులు రోసినట్టి దీ
భూతిమతంబు, దీనఁ బరభూతియు వక్త్రవిభూతియుఁ జెడున్ 47

చ తిలకము లేనిమోము పితృదేవత లావటఁ జూచి "యక్కటా !
తిల + కము మాకు నున్న" యని తిట్టి శపింతు రటం చెఱుంగ రే
యలఁతులు, వారితోఁ బ్రవఁబడి యన్నత ! చక్కని యన్వయంబు తి
ప్పల కెరఁ జేసితంచు వగవన్ వలసెన్, దెలిసెఁ భవన్గతుల్ 48

(దేవుఁడ వాఁడువేవి వేంకటేశ్వరా)

ఉ "దేఁవుడ వాడువేవి" యని దిట్టతనాన నెదో వచించి, తా
దేవుని కింతమాత్రమునఁ దీవ్రత పుట్టదు, ముందు మ్రొక్కి కొ,
మ్మా వెనుకఁ నిరావరణ కర్గము గ మ్మపు దేమి యౌనొ ? యా
దేవుని దేవతాగరిమ తెల్లమగు న్నిముసమ్ము లోపలన్. 49

శా నేనే యింతకు చర్చ చేసితిని నీ నేరంబు వారింప, నీ
వేకోరో యెం వొందు తెప్పుకొని యెంతేఁ బేర్మి, మావేంకటే
శానుం డీయఱపుల్ గణింపఁడు, శిరాసౌజన్యమే చూపు నీ
పై, నేమందువొ?* "యాదృశీ" యనెడివిన్యద్వాణి దుర్వాణియే 50

(మహమ్మదు విగ్రహపూజ గాదనెన్)

ఉ స్వచ్ఛపువంశమున్ గణన సల్పవ పెద్దలమాట లెక్క లే,
దిచ్చకు వచ్చినట్టులగ నేవియొ ప్రల్లదము ల్లిఖించి యే
మ్లేచ్ఛమతంబొ పట్టి పయిమిక్కిలి దేవునిగూడఁ దిట్టి సం
పచ్ఛకలంబుకోస మిటు పాటుపడందగునే కుమారకా 51

(విగ్రహారాధన సేయరెవ్వరు)

ఉ విగ్రహమున్ ద్యజించి గురువిగ్రహమున్ దలకెత్తికొంటి, నీ
కాగ్రహచార మెట్లయిన నావలకుఁ జనదయ్యె, నిన్ను నే

---

తిల + కము, తిలోదకము,

*శ్లో॥ యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ.

దోగ్రిహ మొందు చెడ్డదయి యోగ్యతకుం గదు దవ్వొనర్చె, నీ
వాగ్రిహతృప్తి కీ మతము నందితి వంతయు నేనెఱుంగుమన్ 52

(శంకరపాదుఁ డర్చికోపాసన నీసడించెను)

ఉ కావలె భార్య పుత్రులను గావలె, ద్రవ్యము గావలెన్, మఱిం
గావలె సౌఖ్యముల్, మఱియుఁ గావలె సర్వము, విగ్రహమ్ము వోఁ
గావలెనే కుమార ? సరిగా విను "విగ్రహపూజనమ్ము మూ
ర్ఖావళి" కిందువేని యెటు లార్యులు శంకరముఖ్యులొప్పిరో 53

(వ్యాసమతంబు నేఁడు క్రొత్తగాఁ జేసినదారిగా దిది)

ఉ వ్యాసునివారు సూత్రముల బ్రహ్మముఁ దెల్పి పురాణమందుఁ ద
ద్వాసుర చిద్విలాసముల భంగులు దెల్పినవారు, సూత్రవి
శ్వాసము చూపి తక్కుఁగల సంగతులన్ ద్యజియించువారు స
న్న్యాసులు, భ్రష్టు లౌదురు గృహస్థులటుల్ చరియింపఁ బూనినన్ 54

ఉ. అన్నిటి కేకవాక్యతగ నారసి చూచిన విగ్రహంబు సం
పన్నగృహస్థుకోస మనుభావము దేలెడి, నిర్గుణాత్మ నె
ట్లెన్నఁగ నేర్చు వీఁడు ? గుణమే కడుముఖ్యము గాఁ జెలంగు నీ
సన్న యెఱుంగ రూరకయ జందెము ద్రెంపెడి గేస్తు లక్కటా. 55

ఉ వ్యాసులు బ్రహ్మముం దలఁచి యాతని విగ్రహరూపమం దెడో
ాసముఁ బూని తిట్టు మవిరో ? విని రోయుదు రిట్టిత్రోవ వి
జ్ఞాసువు లర్భకా ! యిటులు కాసుకుూసర బోధసేయఁడా
వ్యాసుఁడు, వీని నింక నొకవ్యాసు నుపాసితుఁ జేసి నేర్చితే ? 56

ఉ వ్యాసమతమ్ముఁ బట్టి యలబ్రహ్మముఁ గొల్తుపుగాక, యేడ దీ
ాసుమతంబు ? దేవగురుకోపమహాపదవాప్తసర్వస
న్న్యాసకృతంబు, వీపలుకులర్థములేని వపార్థపర్దనా
భ్యాసపు వ్యాసముల్ గిఱుకువారలకాఱు లసారముల్ సుమీ.

శా వ్యాసుం డీమతి మొప్పెనే ? కటకటా ! వ్యాసాశయం బెట్లు ? స
న్న్యాసుల్ వోవు పథంబు గేస్తులకుఁగా వ్యాసుండు శాసించునే ?
దాసీదాసకళత్రపుత్రవితతిన్ దౌదిప్పులం దోలకే
లా ? సంసారికిఁ గర్మబంధ మది వాలాయమ్ము డీ లయ్యెతిన్ 58

ఉ. శంకరు లొప్పినారు మతషట్కము, విగ్రహపూజయందు ని
శ్శంకమె షట్కముల్; జడులసంగతి విప్పటియట్ల పాపపుం
బంకముగా జగంబు నిలుపన్ గమకించినయార్యుఁ డాతఁ డీ
శంకకుఁ బోఁడు, వ్యాసమతసర్వరహస్యవిదుండు గాఁడొకో 59

క. శంకరమతమ్ము గా దిది, సంకరమత మైన నగును; శంకరుఁ డెట్లా
శాంకరిని బీరమున ని, శ్శంకమ్ముగ నుంచి పూజ సల్పెఁ గుమారా. 60

మ. తల బోడిం బొనరించి, జందెములు తద్దం డెగ్రించి, "సన్యాసిపో
కలు గాఁ బోదు" మటందు రెవ్వ రలవా ర్కంజాక్షులన్ వీడ, రే
తలఁపుల్ మానరు, "దేవళం" బనిన నిందల్ సేతు, రీచెట్టపో
కలు నీ కేగతి నబ్బెఁ దుట్టతుదకున్ గార్హస్థ్యసంచారికిన్ ? 61

శా. ఏకర్మమ్మను వారు మానరుసుమీ ; యీ కర్మమే తక్క, నీ
వీకర్మం బన నేమిగాఁ దలఁచెదో ? యేకర్మ మార్యుల్ బుత
శ్లోకుల్ శ్రీకరు లప్పదీక్షితముఖుల్ శోధించిరో వేదవి
ద్యాకంజాతభవావతారు, లది యేతచ్ఛద్ధతో బోధ్యమౌ 62

శా. జ్ఞానప్రాప్తి కనేక మార్గములు విజ్ఞానుల్ ప్రసంగించి ర
య్యానందాత్ముని కిన్ని మార్గములు తుల్యంబుల్ సుమీ విగ్రహా
ధీనుల్ గొందఱు గల్గుమాత్రమునసే దేశంబు గోసెత్తెనే ?
జ్ఞానంబూరక కల్గునే ? యదియు నంగల్లమ్ము క్రియ్యామ్మొకో ; 63

మ. ఎవఁడో యొక్కని కబ్బుగాక శ్రమలేకే జ్ఞానసంపత్తి, యిం
కవనిన్ దక్కినవారలెల్లరును వట్లౌవారె ? యవ్వారికై
శివవిష్ణ్వాలయముల్ చెలంగుత, మెటుల్ శిష్యండ ; నీకబ్బె నీ
యవివేకంపుమతంబు? దేవగురునిందానందసంధాయియై. 64

ఉ. వేదములందు లేవనుచు విగ్రహపూజన మొప్పరంట; యీ
వాదులు గొంద, అయ్యదియ వాస్తవ మందము, మూఁడుపూటలన్
సాదము మెక్కి కుల్కుఁ దని సారెకు వేదము లేప్పుచున్నవే ?
లేదట భుక్తికిన్ విధి, యశీరము గా దది మాన రాదొకో, 65

శా. ఏమీ, వేదము నంతముల్ దెలిసియే యీ మెట్టవేదాంతపుం
బూమె ల్వ్యాపైనె? దీనికిన్ ఫల మెదో పోవిమ్ము యోజింత, మా

ర్యామోదం బది తప్పిపోవుట, యుపాధ్యాయాగ్రిహాోఏగ్రిసం
గ్రామారంభము నెత్తిపైఁ బడుటయుంగా కన్యముం గిల్గునే? 66

చ తిరుపతివేంకటేశ్వరుని దిట్టితివే యను, మట్టితిట్లకుఁగా
దురకలు మూవెకుల్ మఱియుఁ దొల్లిటిపెద్దలహద్దు లెట్టివో
యెఱుఁగనిమోఱకుల్ గద సహింతురు, పిరిలమెచ్చు సత్కవీ
శ్వరులకు వారిశిష్యుల కసహ్య మెఱుంగుదువో, యెఱుంగవో? 67

చ ఇతరకులస్థుఁ దేమతమునేని గ్రిహించిన నంత నష్టిలే
దతులము బ్రాహ్మణాన్వయమునం దుదయించి పితామహాదులుఁగా
బిరుదులు వోవుమార్గములు పిప్పిగనెంచి స్వతంత్రులై శ్రుతి
స్మృతిధృతిదూరమైనగతిఁ జెందినవారియవస్థ శోచ్యమౌ 68

క రామానుజాచు లందఱు, నీమాత్రము తెల్వి లేకయే విగ్రిహపూ
జామంత్రము లొప్పిరిగా?, యేమీ సాహసము తుడు విందుదిగితివే

(సలాముఁ జేసి గుడిమూరెదు తిర్పతివేంకటేశ్వరా?)

చ లలి మనవేంకటేశుఁడు "సలాముడు" నంటి, "సలాం" పదమ్ము వేఁ
దెలియఁగ నయ్యో "మల్క" కని, దేవుఁడు వానికి నల్గఁడే చు..
"మలక పదమ్మ సాచి తను మిట్టుడు నప్పకుఁ గొట్టెవేవి" యన్
పలుకు రెఱుంగవే తనయ? భ్రిష్టులతోఁ బనియేమి సామికిన్ 70

(తలఁకుచు దండము పెట్టగవచ్చువారినే తలగొఱిగించి చెప్పుతో
గొట్టెదవు)

చ. తలఁకెడివారికే విభునిదండన, మేనుఁగుఁ జూచి భీతిమై
దలరెడిమానవుండె యొకతప్పున ముప్పున కగ్గ మౌనుఁగా,
కలగజరాజుమార్గమున నట్టె చలింపక యుండుతాటియా
కులచెదు చెత్తముక్కలకుఁ గుంజరిరాడ్భయ మేడదర్పకా 71

చ. అవుర ! విచిత్రి, మెంతటియనార్యమొకో కలి, బ్రిహ్మవక్త్రిసం
భవులకువంట ! పల్కులో యపాత్రిపుఁగూఁతిలు గీతలంట ! హా

---

(రద్దేహిందూనుండి)

సీ॥ కోతిరూపంబైన పోతుహనుమంతునూ వేపార్లు దైవమని వేడుకొనిరి..
అడ్డబొట్లంపరూ "హరాహరా, బల్కుచీ సుద్దబొట్లంత హరి పెద్దయనిరి, ..

శివశివ! రామరామ! హరి! శిష్టవిగర్హితమైన మార్గముం
దవిలిన శిష్యునిం మనిచి ధర్మ్యపథమ్మునఁ బెట్టి పోవరే 72

ఉ. సారాచారవిచారదక్షమగు వంశమ్మందు జన్మించి ని
స్సారుల్ మల్కులు వోవుమార్గముల నిచ్చల్ నించు నీచైదిచే
ధీరుల్ మాఱక యుందురే కటకటా! "దీనామావులా" వారికిన్
వీరల్ దాసులు, వారిబాస తుదకబ్బెన్ వీరికంచున్ సుతా!

(లభించినమాయకీర్తికిన్ భంగమువచ్చె నీమహిమ పాడ్వదె)

చ తిరుపతి వేంకటేశ్వరుని దేవళ మూడినమీఁదఁగాని యీ
తిరుపతివేంకటేశుని ప్రతిష్ఠకు భంగములేమి తేలె.నెం
దఱు మలకల్ ప్రయత్నపడి త్రవ్వినపిమ్మటఁగూడ దేవళా
లొరుగక నిల్చియున్నయవియో వినియుండవుగాక యన్నకా! 74

---

కొంచెలంచలుగూడి కృష్ణ దనిరి సీ॥ పంచితము పేడలే బహుశుద్ధి అను
కొని యిల్లువాకిళ్ళెల్ల వల్లుకొనిరి, భగవతాభక్తులు బాపుగామానుకొని విగ్ర
హపూజలే యిష్టమనిరి, మలమూత్రమే దోషముు తీర్చునుకొని పేడ ఫుండలు
పంచితాలు తినిరి శిలయ బొమ్మలు మిమ్ము రక్షించగలవా . సీ॥ పార్వతీ
దేవిపై భస్మాసురుడు మోహించి దాని మొగునుని చంప తిరిమినాడు యింత
ముండల బోతును యీసురిదనక, కొల్వవలెనయ్య అల్లాను క్రిమముగాను
సీ॥ . గీ॥ భిడియపడరయ్య దైవమునకు ఝడియరయ్య మిద్దిపూజలు యికనైన
మానివేసి, ....౯॥ సీ. భాగవతమునుబట్టి పసుగు కృష్ణునిచెరియ విజమువ్రాసి
తినర్యా సుజనులారా ౩౦॥ సీ॥ రామాయణమురంకు భారతంబేదొంకు గొల్ల
భాగవతంబుపొల్లుమనుచు, .. తే॥ ఇహములోయొక్క ఖురఆను హెచ్చు
యనుచూ, సత్యపురుషులు చెప్పిరీజగతియందు ॥ ౩౧ సీ॥ మొహమ్మదు .
దేవతులనైననూ రాళ్ళనైనా పూజించకూడదని బోధించి చెప్పినామానలేదు,
. ॥ ౩౩॥ సీ॥ కుడిసిరాగ్రంథమే ఖురఆను ఘనమయా యితరగ్రంథములన్ని
యెడమనుంచి,....॥ ౩౯॥ సీ॥ గోమాంసములు మాకు గోమయంబేమీకు పాలు
మాకు మ పంచితాలు మీకు॥ . ౪౨ ॥ ... గీ॥ శంకరావాతి
చేసె మీ సంకరంబు, ౪౫॥ .. (మక్కి మక్కి నకలు)

(ముంగలివారు దైవ మటంచు నిన్ గొనియాడువారలవి నేఁటికి
బూటక మయ్యె)

చ. ఎఱిఁగియు నోర్వలేనిజడు లేవియొ మోగినయంతమాత్రనే
"తిరుపతివేంకటేశ్వరు ప్రతిష్ఠకు భంగముగల్గె" నంచు నీ
వెఱచె దపాంగమై జలధియంతయు, గల్లనుకోకు మయ్య ! ది
క్కఱి గతినేమి యద్దు భషకప్రకరప్రకటారవావృటుల్ ! 75

శా అప్పాయీ ! నినువంటివాఁ డొకఁడు మర్యాదల్ దిగం ద్రావి మే
కబ్బంటో యొకఁడల్లినంత నది నిక్కంబై జగజ్జాలముల్
తబ్బిబ్బైనను బోనికీర్తి గలభూధ్రస్వామి కెగ్గౌనె ? యే
ఓబ్బా ! సూర్యుని బుగ్గిచే నడఁమదేవయ్యల్ ధరన్ గల్గిరే 76

తే గీ అర్ధశతకమ్ము తుదకు ననర్ధశతక
మగును సంపూర్తిఁ జెందిన యట్టికతన
నప్పుడును గూడ నీజోలి కతఁడు రాఁడు,
భయపడక తిక్కసగ మెల్లొ పాడు మబ్బ !

ఉ తీతువుపిట్ట యభ్రము శితింబడకుండఁగ నాఁగునంట ! విం
టే ? తనయా ! యటుల్ సుమి నగేశుయశంబవి వోకయుంటకై
కైతయొకింత దాఁటునను గర్వపుఁ బల్లవముల్, యథార్థమౌ
ఖ్యాతియయేవి దుర్వగుల కాఋలు దాని నడంప నేర్చునే 78

(నీకుఁ గలట్టిపోధిమం బంచఋలోన మెప్పుకొనునట్టి యకాలముసంభవించె)

ఉ మందఋ మెప్పు మెప్పులవి ముప్పులుగా నెఱుఁగం దగున్. యశం
"బందఋలోన మెప్పుకొని" నప్పుడయా, నెటువంటి పందను
న్మందఋ "మేల్ బళీ" యనియు, మోమటు త్రిప్పి "యపాత్రుఁడీతనిన్
గందుమయేని పాతకముగల్గు" నటందుసుగాదె పుత్రకా

ఉ. చిందులు ద్రొక్కి "నేను గురుశేఖరుఁ డిట్టుట కిట్లు దేవతా
వందఋఁ బూనుకొంటి" నన నీకడనే "సరిగా" దటండ్రు పో
కొందఋ, కొంతతో మొగము కొండొక ద్రిప్పినమీఁద నేవగా
నందురొ నీ వెఱింగిన రహస్యమె నే వచియింప నేటికిన్. 80

ఉ మానసమే ప్రధాన మగు మానిసి. కందలిభక్తి భక్తి. యం
దూనినపూజ పూజ. యది యొప్పినమె చ్చది మెచ్చు. దాని కిం
పై నది యింపు. దీనికి నమస్తజగమ్మును సమ్మతించు. నీ
మానసమేని యొప్పుః నది మాత్రము బ్రహ్మ సృజింపకుండెనే 81

మ మునుకొన్నాళ్లు త్రికర్ధిగా నతత మమ్మూర్తిగా బ్రశంసించి నేఁ
డనిశమ్ముగా మదినెంచుమగా బయికి నన్యాయమ్ములన్ గిల్కి యీ
యనయ మ్మేరికొ కట్టి పెట్టెదవెః నీయాంతర్య మట్లౌనుఁగా
కనఘుల్ తక్కినవారి కట్లగుట కే మత్యాహితం బర్పకాః 82

(నవ్వుఁడు నీవు డైవత మన న్నగువారలు)

క నవ్వుండు గాఁడెః శిష్టా. కవ్యగ్రిపే హనుమదాఖ్య గలబుధుఁ. డెటు సం
స్తవ్యుఁడగ వేంకటేశ్వరు. నవ్యయు నుతియించెఁ జెప్పు మర్పకః నాకుగా 83

(1934 సం॥ ఫిబ్రవరి అభినవ సరస్వతినుండి)

# తిరుపతి వేంకటేశ్వర తత్త్వము

చ "తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁ"డని తిట్టుచున్న యా
పురుషుల పై తముగా ముడుపుమూటలు కట్టునటుల్ పొనర్చి నీ
గిరి కరుదేర బుఱ్ఱగొఱిగించి పదంపడి చెప్పుదెబ్బ లే
ద్రెఱ నపరాధశిక్షగ విధింతువు తిర్పతివేంకటేశ్వరాః 1

ఉ. నీమహిమంబెఱుంగని వినీతుఁడు కొందఱు విన్నదూఱుచో
సామము చేతనో. భయరసంబుననో మనలించి వారికిం
గామిత మీఁగడంగెదవ కాని నిజంబుగ నీవ యల్గినన్
భూమిపులైన భస్మమయిపోరొకోః తిర్పతి వేంకటేశ్వరా। 2

చ. ప్రజలకులొనర్పరేని తుదవల్ పొనరించెడి దుష్టచేష్టలం
గణనయొనర్పఁబోకుమి. యొకానొకఁ డట్టులొనర్పకున్న న
గ్గుణరహితున్ సహింపకుమి. కోవిదులేరును దాన విన్ను దు
ర్గుణుఁడనఁబోవ. రీపథ మెఱుంగుము తిర్పతి వేంకటేశ్వరా। 3

ఉ. భక్తులయందు నీకుఁ గలపాపిములేని కృపారసంబు సం
రక్తియుఁ జూపు పొంటె నపరాధుల నేరము వారినోట సా
మోక్తులచేత ముందు వినకున్న భయోక్తులచేతఁ విమ్మటగా
వ్యక్తముఁజేసి మ్రొక్కుబడు లందెదు తిర్పతి వేంకటేశ్వరా। 4

చ అవమతి నీకుఁ జేసెను దురాత్ములగర్వ మడంప నెల్ల మా
నవులును బూనియుందు తరుణమ్మునఁ దప్పు మేల నీకు? వా
స్తవమిది; సేనగల్గు నృపసత్తముఁ డెవ్వఁడయేని తాన శా
త్రవుల వదల్చు పూనికను దాల్చునె తిర్పతి వేంకటేశ్వరా! 5

ఉ దైవమవైన నీయెడలఁ "దప్పులు గల్గె"నటంచుఁ బల్కు బ
ల్కావలులైన వారివయిఁ గారుణికత్వముఁ జూపఁబోకు మ
య్యా! విధిగానఁ జెప్పితిని, నాగ్రహమొందకుమయ్య! నేతకున్
సేవకులైన వారలు వచింపరె తిర్పతి వేంకటేశ్వరా! 6

చ ఎఱుఁగక నీపరితాపము, సహింపక నీఘనగౌరవంబు, కా
ర్లఅమమఁబతిరికావకుఁనంపియు నీను ఒవధ్యనస్ఫుర
త్తరళగవీపరంపరతుఁ దాకి చొచ్చిరి సూర్యమండలో
పరిపథమందు దైత్యకవిపక్షులు తిర్పతి వేంకటేశ్వరా! 7

ఉ. వేపుని విన్నుఁదిట్టు దురదృష్టులులేరొకొ మున్ను! దానిచే
నీ వహి తగ్గెనే? యపు డనేకులు తావక దివ్యజంఘికా
పీవర కేశలేశమును బీకఁగలారె? భవత్ప్రతిష్ఠయుం
బోపుట యాజగంబు సరిపోపుట తిర్పతివేంకటేశ్వరా! 8

ఉ భావమునందుఁ జంచరతఁబాయఁగ దేవుని రాతియందు సం
భావనచేసినారు మును పార్జ్ఞులు, కావి నవీను లట్టి సం
భావనసేయఁజాలరఁట! భార్యయుఁ, దల్లియు నంచు భేదసం
భావన యెట్లుచేసెదరొ వారలు తిర్పతి వేంకటేశ్వరా! 9

చ "గురుపును దైవముగా మనకుఁ గూడ" దటంచు వచించువారికిం
దిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁడు, యథార్థవస్తు త
త్పరులగువారికిన్ గలఁడు దైవము తిర్పతి వేంకటేశ్వరుం
డంమరలేక నీ పరయుమా యిది తిర్పతి వేంకటేశ్వరా! 10

ఉ. దేశికుఁడంచు నిన్ను వినుతించెడివారివయిం గృపారసా
వేశముఁ జూపుమయ్య! యొకవింబరగొట్టు నుతింపఁడేని నీ
వాశతునిన్ సహించిన మహాత్ములు నవ్వుదు; రట్లుగాన నో
యీశుఁడ! తగ్గశిక్ష విధియింపుము తిర్పతి వేంకటేశ్వరా! 11

చ. తెలియక నీప్రతాపము, మదిందలపోయక నీమహత్త్వముం
బలువలు తిట్ట, నాపదలు వచ్చినవేళల నీపదాబ్జముల్
గొలిచెదునట్లుచేసి కడకున్ దరిచేరఁగఁదీసి వారలం
దలఁగొఱిగించి కొట్టు మిదుదౌతలఁ దిర్పతివేంకటేశ్వరా! 12

చ యశమువహింపఁ దత్తవిధి నబ్బిన నీ ఘనముద్రిదాల్పుటం
బకవులుగూడ గోపతిసమాఖ్యవహించి చరించెదున్నికం
కుకగతి సంస్కరింప నలగోపులఁ గావున నేఁడు నీకృపా
వశుఁ మహత్త్వముం గనవివారలు? తిర్పతి వేంకటేశ్వరా! 13

ఉ. నీయభిధానముగ్రి గమనించెదుగోపతి కెవ్వఁడో సురా
పాయియొ, జామఁడో, తులువ, పాపి, శరాత్ముఁడు, కుంత ముక్కువారి
ద్రోయఁ దలంచుఁగాక, యటువోయఁగశక్యమె? శక్యమే నిలం
జేయుల వారి నీవు నిరసింపవె తిర్పతి వేంకటేశ్వరా! 14

ఉ పేరునునూరులేని పెఱవేల్పులనామము లుగ్గడించినన్
జేరెఁడుముష్టియుం దొరకఁ జెల్లదు గాని భవత్పుటుండు నీ
పేరుపఠించుచున్ బయలువెళ్ళిన భుక్తికి లోటులేదు, నీ
పేరుమహత్త్వ మెంత వినిపింతుము? దిర్పతి వేంకటేశ్వరా! 15

ఉ. ముంగలివారు నీచరణపూజ యొనర్పకయున్నఁ దావకాం
శంగాను రామకృష్ణులనుపై తము పూజయొనర్పఁబోపువా
రుం గటుగంగఁబోరుగద? రోయక వారినిఁగూడ నీవు నీ
బొంగు బుజానఁ బెట్టి కొనిపొమ్మికఁ దిర్పతి వేంకటేశ్వరా! 16

ఉ నీపదముల్ భజింప నవినీతు లనేకులు దెల్పవచ్చి వా
రాపని మానిరంట! యిదియంతయు విక్రమమేని పాప మా
పూపలు రామకృష్ణులకు బొంగుబుజంబునఁబెట్టి త్రోవయుం
జూపుచుఁ బొమ్ము నీవరుగుచోటికిఁ దిర్పతివేంకటేశ్వరా! 17

చ. "వరమును మీర లందఱు నుపాసన చేయుఁ" డటంచుఁ జెప్పి, "య
ప్పరమవు నీవ" యంచనిన వ్యాసునిపై నిఁకఁగోపమేల? "యే
పరమును నీవుకా" వనుచు వాకొనువారల నొంచఁగా నికం
తరమగుదీక్ష నెల్లపుడుఁ దాల్చుము తిర్పతి వేంకటేశ్వరా! 18

ఉ. జ్ఞానవిహీన గోష్ఠి, యదిసైతము నీకథ వ్రాసెఁ నింక వి
జ్ఞానముగల్గుపూరుషులు మానుదురే? మఱి గోష్ఠికన్న నుం
జ్ఞానములేనిమర్త్యుఁడు రసాస్థలమం దెవఁడేనియున్నచో
వీనికిఁగూడ గాథ వినిపింతును దిర్పతి వేంకటేశ్వరా! 19

ఉ. "వ్యాసుఁడు కొలచేరుఁ"డని వాకొనుచెట్టిదొ "రామకృష్ణు ల
భ్యాసముచేసినారు సురపానము జారత" యంట యే ముప
న్యాసమొ, "గంగిరె" ద్దని మహాత్ములు విన్నను టట్టిదే. విప
ర్యాసముగాఁ దలంతురి జను లయ్యది తిర్పతి వేంకటేశ్వరా! 20

చ కలవు రసప్రవాహము లఖండఘనాగమశృంగగౌరవం
బులుఁ గల, వద్భుతాద్భుతవిశేషణజాతమహాఫలంబులుం
గలవని యెంచి నీకలిమి గన్గొని తిర్పతికోడ. దాని మూ
ర్ఖు లెఱుఁగలేక గుట్ట యనుకొందురు తిర్పతివేంకటేశ్వరా! 21

ఉ కనఁబడు చిత్రధాతువులు, గన్పడు సిద్ధపదంబులున్, సుదృ
గ్జనగణనీయవస్తువులుఁ గన్పడు. దృశ్యములెల్లఁ దిర్పతిం
గనఁబడు బుద్ధిగల్గి సరిగా గుఱిగా గురుపాదసేవ సే
సిన యనఘాత్ములందఱికిఁ జిత్రము తిర్పతి వేంకటేశ్వరా! 22

చ "తిరుపతిఁబట్టి నీకుఁగల తేజ" మటంచును. "నిన్నుఁబట్టియే
తిరుపతి" యంచు మూర్ఖులు వదింతురు, దంత్రము లెన్నియేని యే
ర్పఱచినఁగాని మీర లవి పాటియొనర్పరు, బ్రహ్మచేఁత కె
వ్వరు ప్రతిసేయఁగాఁ గలుగువారలు? తిర్పతి వేంకటేశ్వరా! 23

ఉ, "తాయియు అప్ప"యంచు నిను నవ్వయొనర్చుచు, "నీకుఁ దేజముం
బోయె" నటంచుఁ జెప్పు నెఱమూర్ఖులు తిర్పతి గ్రామసింహముం
జేయఁగ నీకు గొప్ప మహనీయత గూర్తు; రెఱుంగరేమొ యీ
న్యాయము "రాత్రిభార్య పవ" లమ్మని తిర్పతి వేంకటేశ్వరా! 24

ఉ. ఏగిరియందు నీవు వసియింతువొ, లీలలు చూపుచుందువో,
యాగిరి పల్లెయైన జను లందురు తిర్పతియంచు, దానితో
యోగమె కాని యేటికి వియోగము నీకు ఘటించు? "వీడినఁగా
భోగములేదు నీ" కనుట మూర్ఖత, తిర్పతి వేంకటేశ్వరా! 25

చ. గురువగునిన్నుఁ "గా"వనుమఁ గూయుటయే యొకతప్పు,దానిపై
గురువునుబల్కరాని పలుకుల్ పలికించు టఁకొక్కతప్పు,దు
స్తర మగుపాప మిప్పగిది సారెకుఁ జేసెడివారికోస మే
నరకము క్రొత్త దేర్పఱచి నాఁడవొ! తిర్పతి వేంకటేశ్వరా 26

చ ఎవఁడు దశావతారముల నెత్తెనొ వాఁడవు నీవ, తత్కలా
భవులనికాదె వ్యాసుఁడు ప్రబంధములం దల రామకృష్ణపుం
గవుల నుతించు, టీవునొక కంటను కన్గొనుచుంటఁ బీతికా
భవనమునం బ్రతిష్ఠ కనుపట్టుట తిర్పతి వేంకటేశ్వరా ! 27

ఉ "దేవుఁడ" వంచు నీకు వినుతిం, బ్రణతిం బచరించువారెవో
కోవిదు, లట్టి కోవిదుల కోసమె నీవిభవంబు సర్వమున్
గావలె నంచుఁ గోరుదువుకాని కటా ! తెగనాడఁజూతువే,
కావలనైన వార లది గానరు తిర్పతి వేంకటేశ్వరా ! 28.

ఉ రాజితరాజరాజనగరంబు లనేకములందుఁ జెందితీ
వోజమెయింబ్రతిష్ఠ, యది యుండఁగని, మ్మటుమొన్న పొంది తీ
రాజమహేంద్రి మందిరవరమ్ముల మిన్నగు పీఠికాపురీ
రాజమహేంద్రిమందిరవరంబునఁ దిర్పతి వేంకటేశ్వరా ! 29

ఉ ఎల్లరు "నీవ యాదిపతి వీత్రిజగంబుల" కంచు నిన్ను వే
నోళ్ల నుతింపుచుండఁగ, జనుల్ మఱికొందఱు "నీకుస్తోత్రమే
చెల్ల"దటంచు నిన్ను విరసింపఁగసాగిరి. స్వామి ! యేమి యీ
యల్లరి ! పెట్టినీవు చెవినైనను తిర్పతి వేంకటేశ్వరా ! 30

ఉ కర్ణమునందుఁ బెట్ట వనికాదు సుమీ. వచియించు టింతగాఁ
బూర్ణముగాఁగ వించితివి ము. న్నదిచాలక యిప్డు తిర్గి వ్యా
కీర్ణత నొందుచుండిరి వికృష్టులు వారలు తృప్తిలేక. వి
ద్యార్ణవ ! తృప్తిసేయఁదగదా ? యిఁకఁ దిర్పతి వేంకటేశ్వరా ! 31

ఉ సేమముగోరి తిర్పతి వసించి ప్రసన్నతఁదాల్చి సేవక
స్తోమసురద్రుమంబ వగుమశా విలసిల్లెడి నిన్ను రామరా
మా ! మహి నేరొ దూఱుమరఁ ! టంతటి మాత్రన నీవు పక్కపై
రోమముగూడఁ బోచని యెఱుంగుము తిర్పతి వేంకటేశ్వరా ! 32

ఉ కింకరులై భవత్స్తవ మొగిం బచరించెడి భక్తకోటి కే
కొంకును జంకులేవి కలుగుందవ మొక్కఁడొసంగి, వైరితా
టంకపతీమనోహరవిటాలతటాలక కుంకుమప్రభా
పంకముఁ బాపుశక్తి విడువాఁడవు తిర్పతి వేంకటేశ్వరా । 33

ఉ "సంబినవేడ్క నిన్ గొలుచు పార్థివు లజ్ఞు"లటంచు, నీకు న
ర్థంబు లొసంగువార లపధంబునఁ బోయెడివార"లంచు నై
చ్యంబు ఘటింతురి పాలకులయందునఁ గొందఱు "తిన్నయింటి వా
సంబులు లెక్కపెట్టు" సరసం బిది తిర్పతి వేంకటేశ్వరా । 34

ఉ ఆదట గల్గి నిన్ను, భవదంశసముద్భవులైన రామకృ
ష్ణాదుల కెందునైన జగమందున ముందు సపర్య చేసి యా
మీఁదను "నీవులే"వనఁగ మేకొనుదుర్మతు లుండ, రున్నచో
మోదఁరె యోగ్యులెల్లఁ బనిముట్టున దిర్పతి వేంకటేశ్వరా । 35

ఉ వందలు వేలు పద్యము లవారిగ నిం బడఁ దిట్టుచుం గటా ।
క్రిందును మీఁదుఁ గానక లిఖింతురు పత్రికలందుఁ గొంద, ఱీ
చందముఁ జూడ వారిది దొసంగని తోఁచమ, వారికట్టి శ
క్తిం దయసేసినట్టి తమదే యది, తిర్పతి వేంకటేశ్వరా । 36

ఉ "దాసులు సేసినట్టి పలుతప్పులనైన సహింతు" వంచుఁ, "జే
ర్మోసినవాఁడవీ" వనుచు, మోరకులేగతి నిన్ను దూఱినన్
రోసముఁజెందకుండుట "విరుద్ధమటం" చెపరేనియన్న నీ
చేసెడుకార్య మేమఱుఁగఁజెల్లదు దిర్పతి వేంకటేశ్వరా । 37

చ శరణము నీమనోహరయశస్స్వర నీరుహవైరిమూర్తికిన్
శరణము నీమనోహరకనచ్ఛవిదంతురమూర్తికిన్, నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం గయి మోడ్చుచుం బుర
స్కరణము నీమభక్తుల కొసంగెదఁ దిర్పతి వేంకటేశ్వరా । 38

ఉ. మంగళమయ్య నీదు మహిమంబున కాయలమేలుమంగకున్
మంగళమయ్య నీవు కడుమాన్యత గూర్చిన యెమ్మెలాఁడికిన్
మంగళమయ్య నీగుడికి మంగళమయ్య భవద్భటాళికిన్
మంగళమయ్య నీ కొకనమస్కృతి తిర్పతి వేంకటేశ్వరా । 39

ఉ. సేమము నీకు, నీయనుఁగుశిష్యులకుం గుశలంబు,నీదువి
ద్యామహనీయపద్ధతి కనామయ, మార్జితసర్వదిక్తట
స్తోమనిరంకుశప్రబలసుందరకీర్తిలతానతాంగికిన్
సేమము, నీమభక్తులకు సేమము తిర్పతి వేంకటేశ్వరా ! 40

ఉ పాలకుఁ డాత్మకూరునవపాలుఁడు గ్రంథము వ్రాయఁజేసియే
వేళను నీమనామము జపించుచు నిన్ను సదా భజించుచున్
గాలము వెళ్ళఁబుచ్చుచు సుఖంబుగ భోగములందుచుండె; వి
న్నోలి భజింప లోప మొక టుండునె? తిర్పతి వేంకటేశ్వరా ! 41

ఉ "ఈవొక రాతిబొమ్మ" యని యెంతురుకాని విఙంబుగా మదిన్
భావనసేయుచో బయట వస్తువు దివ్యదఖండమై భవ
చ్ఛ్రీవిజయస్వరూపమును జేకొని, మున్నొక పండితుండు నిన్
*దీవరపెట్టఁగా దలపు దీయవె తిర్పతి వేంకటేశ్వరా ! 42

ఉ. నీప్రతిబింబచిత్రము లనేకము లుండనియిండ్లు లేవు. నీ
సుప్రథిత ప్రబంధములు చూడనియోగ్యులు లేరు. వేల్పులన్
బ్రప్రథమంబు నీచరణపద్ధతికిం దల యూనివారు లే
రప్రతిమప్రభావ ! జగమందునఁ దిర్పతి వేంకటేశ్వరా ! 43

ఉ. పూచిన మావిగున్న గతిఁబొల్చెడి నీమనవజ్రకంచుక
శ్రీ చెలువారువిగ్రహము చెల్వు గమంగొనలేక నోటికిన్
దోఁచిన ట్లు పేర్లిడుదురు ధూర్తులు, వారలపాపమేమొ సం
కోచములేక చెప్ప వినఁగోరెవఁ దిర్పతి వేంకటేశ్వరా ! 44

ఉ చిత్రమునందు శిల్పులు రచించిన బొమ్మలు తల్లిదండ్రులన్
బుత్రులు మిత్రు లంచుఁ దలపోసెడునిప్పటివారు దివ్యచా
రిత్రుని దేవు విగ్రహమురీతిగ భావనసేయలేరఁ టే
చిత్రము వింటివే! మిగులఁ జిత్రము తిర్పతి వేంకటేశ్వరా ! 45

ఉ, రాజుల విగ్రహంబు గజరాజులపై నిడి యుత్సవంబులన్
బూజలు సేయు నిప్పటిజనుల్ గుడిలోఁగల వేల్పుబొమ్మకున్

*శ్లో॥ ఐశ్వర్యమదమత్తోఽసి మాం నజానాసి దుర్మతే
పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవస్థితిః॥

బూజయొనర్ప రాదనుట బోలదు. గావునసెప్పుడేనియుం
బూజలు విగ్రహాంబులకుఁ బోలను దిర్పతి వేంకటేశ్వరా ! 46

ఉ. తిట్టెనినోటికేని విను "దేవుఁడ, దేవుఁడ" యన్న తిట్టెగ
న్పట్టునుగాని వేఱుగనుపట్టదు మార్గము. కానమూరకే
పట్టప్రలాపముల్ పలుకువారల తిట్లఫలంబు వారినే
కొట్టెడు కాల మీవు కనుఁగొందువు తిర్పతి వేంకటేశ్వరా ! 47

ఉ. ఎప్పటినుండియో భువి వహింపుచునుంటివి కీర్తి, యెందరో
కప్పము విచ్చువార లధికంబుగఁ దావక నామధారులై
యొప్పెడివారలెందరో, యహో ! యెటువంటివి నీయశఃప్రభల్ !
"పెప్పెపె మెమ్మెమే"లు పెకలింతురె? తిర్పతి వేంకటేశ్వరా ! 48

ఉ. ఈవునిజంబు దేవుఁడవయేవి భవన్మహిమంబు సర్వభూ
మీవలయాలయంబులను మేటితనంబు వహించెనేని దు
ర్దీపళు లొచు విన్నుఁ జెడఁదిట్టినవారలమీఁదఁ జూపుమో
దేవరః తీవరంబు వెనుదీయక తిర్పతివేంకటేశ్వరా ! 49

ఇట్లు, శిష్టాహనుమచ్ఛాస్త్రి

---

చ "తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁ"డని నీవు."కాదు.దే
వర" యని నేను. "లేదు, పలుబండలలో నొకబండ" యంచు నీ.
వ్వరక యిదేటిపోఁత? మునుపొక్కట నాస్తికునోరు నొక్కఁగం
కరుఁ, దది*"నాస్తిచే" త్తనెడి కారిక దానిఁ బఠింపు మర్పకా. 84
(త్వత్కఠార్థముల్ శ్రావ్యములై విపశ్చితుల సంతస పెట్టవు)

ఉ. † ఏమననేర్తు, నేమనిన నేమగుదొక్కొ? నృసింహభారతీ
స్వామి విపశ్చిదగ్రణియొ? జంతుసమానుఁడొ? యమ్మహాత్ముఁడెం

---

(*శ్లో॥నాఽస్తిచే న్నాఽస్తినోహానిః రస్తిచే న్నాఽస్తికోహతిః)

(†శ్లో॥ శ్రీశేషశైల సునికేతన దివ్యమూర్తే, నారాయణాఽచ్యుత హరే నళినాయతాక్ష, లీలాకటాక్ష పరిరక్షితసర్వలోక, శ్రీవేంకటేశమమదేహి కరావలంబమ్ ... ... ..శ్లో॥ తాపత్రయం హర విభో రభసాన్మురారే, సంరక్షమాం కరుణయా సరసీరుహాక్ష, మచ్ఛిష్య మన్వహమదివం పరిరక్ష విష్ణో శ్రీవేం, ...... ..)

తే మునివర్యు లీగుణములిట్ల వినుతించె, విపశ్చిత్సంపరా
గాములొ ? "విపశ్చి" దధికారుడు, కాఱు లివేల పుత్రికా । 84

(ప్రాజ్ఞులు మతింవరు)

శా ‡భారద్వాజుఁడు మ్రొక్కె, గౌతముఁడు సంభావించె, వాకశ్యపుం
డారాధించె, యజించె నత్రియును, విశ్వామిత్రుఁడర్చించె, మో
కారించెన్ జమదగ్ని. తక్కుఋషియున్ గావించె జోహారు, వం
దారుల్ సప్తఋషుల్ బ్రపన్నజన మందారుం డతం డర్భకా । 85

శా *మార్కండేయు నెఱుంగుదే మునిమణిన్. మారారి లింగార్చనో
దర్కుండాతఁడు విగ్రహార్చకుఁడు కాలాభీలపాశావళీ
కార్కశ్యంబు తృణీకరించె నల సత్కర్మిష్ఠుఁ డాపుణ్యసం
పర్కున్ వేంకటనేతఁ గొల్చెనలఁతుల్ వాపోవ నేమయ్యెడున్ ? 86

ఉ ఉక్కునయందు సింగమొకఁ డుద్భవమందుట నమ్మెదేని "ఆ
యెక్కడ దేవుఁడెక్క"డను నెగ్గులు బొగ్గు లగుం గుమార ! లే
దొక్కటికూడ దేవునకు నుండఁగ రానిప్రదేశ, మందులో
నొక్కొకచోటు ముఖ్యమను నుక్తికి ‡గీతలె సమ్మతించెడిన్ 87

ఉ ఉక్కుననుండి, సత్కవుల యుక్తులనుండి, జలమ్మునుండి, సల్
దిక్కులనుండి, పావనుల దేహమునుండి, స్వతఃప్రభూతముల్
ఋక్కులనుండి దేవుఁడు ఉరీహాళికై యవతార మెత్తు, దు
ర్వాక్కులె కాకయుండినఁ బురాణము లాగమపుందుకాణముల్ 88

క. గతిలేక లుపకు‡"జీవన్మృతమత మొకఁ డాశ్రయించి మితిమీఱి దురా
గతమెదిగట్టిన వినుఁగవి, క్షితి పగవనియోగ్యు నొకవిఁ జెప్పంగలవే ? 89

(తిర్పతి గ్రామసింహము)

చ తిరుపతి "గ్రామసింహ"మని తెల్లమయెల్లరకున్ మకారముం
దురుసుతనానఁ జేర్చితివి; నోరది పూర్తిగ *మూఁత వెట్టున

---

‡(సప్తర్షికృత-వేంకటేశ్వర శరణాగతి స్తోత్రము చూ.)

(*మార్కండేయ కృతవజ్రకవచము చూ )

(‡ భగవద్గీతాదశమాధ్యాయము చూ )

‡ శ్లో॥ యస్యధర్మా త్వరి శిష్టో వృద్ధైశ్చైవ బహిష్కృతః, సజీవన్నేవ లోకేఽస్మిన్ మృత ఇత్యభిధీయతే॥ (విష్ణుపురాణవ్యాఖ్య చూ.)

(* వకారస్యదన్తోష్ఠం. ఉపూపధ్మానీయానామోష్ఠౌ కౌముది చూ )

క్కసమగుఁగాక యేమి చెడుఁ ? గారుణికత్వముకల్మి వేంకటే
శ్వరగురుపాదరక్ష యది సాఁగఁగఁజేయుత నో ర్వారింటొరిన్. 89

ఉ. ఎందుకుఁ బేర్మిలె బూర ? కిఁకనేనియు నోటికి బుద్ధిఁ జెప్పికొ;
మ్మందఱు నీమొగమ్ము గనినప్పుడు చేసెడి చేఁత యేమొ నే
నింపు లిఖింపనేల ? యని యింతకుఁ బూర్వమె నీకు స్వానుభూ
తిం దెలియంగ వచ్చు, గురుదేవవినిందకు సైపఁ రెవ్వరున్ 90

(వేఱురీతి నెపు దీక్షితార్థము)

చ. తనపవాదలం బలికి తాండవ మాడుమనాక యలఁ దా
యన, నగుమందు "వీఁదెపెఁడురా !" యని మున్నిటులాడి *తత్సవ
ర్శనమున కగ్గమై శిరము సర్వము ముండిత మైనసేఁచ మొఱ్ఱి
క్కినజడు లెందఱా గనఁ దకించనులన్ మనవెంకఁ దప్పకా ! 91

(వందన మాచరించెదము)

ఉ. వందన మాచరించెదరె ! బాగది మంచి యుపాయమే, విభుం
డందికొనందు వందనము లట్టివికావి యెఱుంగరే ము మే
చందపు శీర్షముల్ మొగిచి సామి కెఱంగుట యొప్పునో యటుల్
సందరిసించి వందనము సల్పఁ దపం బిదియెల్లఁ బొల్లగుల్. 92

(భక్తితో వెంట్రుకలే నొసంగఁ గృపవెంచెదవు

ఉ. ఎవ్వని ‡రెండు వెంట్రుకలు కృష్ణుఁడు రాముఁడు గూడ నయ్యె న
ప్పువ్వులకాని తండ్రికి "నమో" యనునట్టున నెత్తినున్నయ
క్రొక్కెవ్వలఁ గావలెగా గనుకఁ గొందురు ముండన మండనంబు, నీ
విప్పివరం బెఱుంగమి నెటే వదరం దొరకొంటి వర్పుకా. 83

(బోధములేనికాల మది పోయెను)

ఉ. "బోధము లేనికాల మదిపోయె" నటంటి, వెవండు నమ్ము ? స
ర్వాధమమైన యిక్కలికి నక్కట, బోధము బాతనేద ! యే

(* వెంకటాచలమాహాత్మ్యము 2, 3 అధ్యాయములు చూ.)
(‡దేవీభాగవత చతుర్థస్కంధద్వావింశాధ్యాయము చూ )

గాథలయందు నీతనికి ‡గణ్యతసున్న, భివాదృశుల్ మహా
సాధువు లిక్కలిస్థితికి సర్వధనంబు సుమీ కుమారకా . 94

మ కృతగుర్వంఘ్ర్యభిషేకు, లుద్ధురుకుధీశ్రీకుల్, బుతశ్లోకు, లా
దృతనవ్యాగమవాకు, లుత్తపితృమాతృప్రీతిసంధాకు, లూ
ర్జితసత్యవ్రతిభాకు, లాచరితసుక్షేత్రక్రియాతాత్రికు లి
ప్పతియందొకలికిం విరోధులు సుమీ ; భ్రిష్టుల్ కదుం బంధుగుల్. 95

శా ఏకాలమ్మును బాపకార్యములనే యీతండు పేర్మేమ, స్వ
ర్లోక మ్మన్నను, జన్న మన్నను, దదారాధీం బ్రివర్తించువే
దైకదర్శిషులు శిష్టులన్న నిత, దత్యంతమ్ము ద్వేషించు దు
ష్పాకుం డీంలి, వీని యాకృతియుం *బాపపాత్రియ మోయర్భకా. 96

ఉ ఆకృతిఁబట్టియే గుణము లబ్బెడి నందురు పెద్ద లిట్టిభ్రి
ష్టాకృతి కెట్లు మంచిగుణమబ్బెడి ? ద్వాపర మేగె, నంత దు
ష్పాకుఁడు వీఁడు వచ్చెఁ, బసిపాత్రియ మెటో చనె, బాల్య మేగు వి
ప్దీకలి కెట్లు బోధ మది యీతని కాలమునం జనించెరిన్ ? 97

మ భారతమందుఁ దేర్కొనెడి పాతకులన్ బ్రిథముండు దుర్గుణ
శ్రీరమణుండు కౌరవకులేశయశీతకరుండు దుర్యశ
శ్చారి ‡ సుయోధనుం డితనిపాలమొ యేమనుకొంటివో ; యెటుల్
గూయ సుబోధ మిక్కలికిఁ? గొందొకవృద్ధి ఘటిల్లు నియ్యెడం 98

చ కలికలుషం బెఱుంగని యకాలపువెఱ్ఱుల బోధమున్ మదిం
దలఁతురు బోధ మంచు, విబుధప్రివరుల్ జడబుద్ధులైన య
య్యలఁతులఁ జూచి "యక్కటకటా ; కలినాఁకి లోఁగి వీరు త
ప్పుల కెరయైరిగా ;" యనుచుబొక్కుచు రేమియుఁ జేయనేరమిం. 99

ఉ వీనియనంతరమ్మునఁ బ్రివేశమగుం † యుగరాజు వానిలోఁ
దానెగడున్ సుబోధము, కృతజ్ఞు లెఱుంగుదు రీరహస్య, మా

---

(‡విష్ణు పురాణ షష్ఠాంశము చూ.)
(* శ్రీనాథనైషధ సప్తమాశ్వాసము కలివర్ణనము చూ.)
(‡శ్లో॥ దుర్యోధనః కలేరంశః) (దేవీభా ౪ స్కం, ౨౨ అ, చూ)
(† విష్ణుపురాణ చతుర్థాంశము చూ.)

శ్రీనిధి ముమ్ము మిన్నయుఁ బ్రసిద్ధుఁడయ్యుఁ నొకంట విప్పు దే
మేనియుఁగాక యుక్తసమయేక్షణ తత్పరతన్ వసించెడిన్ 100

చ కనుతఁ గలిన్ ప్రబోధమది కల్గమి నిక్కువ, మీవు పూర్వపు
న్మనుజపుటంబు కోసితివి, మద్గుఁడవైతి వటంచుఁ దేలె, ము
గ్ధుని కొనరింపరాని దొక కూర్రత యుండునె ? యమ్మ దిట్టుఁ దే
వుని తెరఁడిట్టు, దేశికునిఁ బూర్తిగఁ దిట్టెడిఁ, దిట్టుఁ దండ్రినిన్ 101

మ. కలిదోషం బిది, దైవసృష్టి నతఁ దొక్కం, దాతఁడేనిన్ జడా
త్మలయం దాదెడునట్లు పండితులయందుం దాండవంబాడఁ, డీ
యలఁతిన్ వారలు లెక్కసేయుదు, మహోగ్రాచారపారంపరీ
స్థలదాచారుల వానిదాసులయి చక్కన్ బోవు రాచక్కకిన్. 102

మ కలి సంపూర్తిగ నైనవేలరిగె, సాంకర్య మ్మెటుల్ దప్పు ది
వ్యులయమ్మందును * నిశ్చలాత్ములకు దుర్విజ్ఞానముల్ పుట్ట వి
ప్పలు కావ్యాస మహర్షి దేసుమి ; వృథాపాణిగల్భ్యధౌరంధరీ
తులకో సిప్పి యుగమ్ము లొక్కటియె సంకోచమ్ము లే దర్భకా.

సీ అకులీనుఁడగువాని నాశ్రయింపంగ విద్వజ్జనంబెపు డపత్రప వహించు
హద్దుమీఱిన తనయానుజాదులవృద్ధి కెపుడు శిష్ట కులమ్ము లిచ్చ రోయు
స్త్రీపునఃపరిణయవ్యాపార మెపుడు నీచాతినీచమ్ముగా వరయు జగము
ఎపుడు కృతఘ్నుమో మీక్షించి విజ్ఞ లంబూకృతిపరివజనతాముఖరులౌదు

తే గీ రదియమీ కుఱ్ఱ, బోధమున్నట్టికాల,
మదిగతించి యెన్నే నేఁడులయ్యె, నెఱుక
దాలని భవాదృశులకు నిక్కాలమకట ;
బోధముగలట్టి కాలమై పోలుపుమీఱె.

ఉ బోధములేనికాల మది పోవుటచేతనె సూ ; వితంతువిం
బాధరలన్ వరించు సుగుణాఢ్యులు, వారల పుమ్ము పేరికుల్,
శీఘ్రరతుల్, గుణారతులు, శిష్టజనేతరు, లెందు విగ్రహా
రాధక దూషకుల్ ధరఁ బరంగిరి మున్నిటు లింత నేర్చిరే ; 105

(*దేవీభాగవత షష్ఠస్కంధము చూ.)

సీ. తొలి ధనాఢ్యులకెల్లఁ దలలోని నాల్కలై యెందు నాస్తికులు పెంపొందిరెలమి
మును ధనంబిడువారు ధనదాతలెల్లఁ "గళ్యాణంబు విధవానుయాయి" కన్న
బ్రహ్మవిద్వేషసంబంధమాత్రమున ముఖ్య జనులెల్ల మ్రొక్కి రెవ్వనికి నేవి
అంత్యజాచార్యమతావలంబనమును వెనుకటివారు గైకొనిరి తలఁప

గీ యిప్పుడును నట్టి యుత్సాహ మెల్లయెడల
వ్యాప్తిఁజెందెఁ జెందుమనుండె వ్యాప్తిఁజెందఁ
గలదు. సరిపెట్టుకొంద మిక్కలుష మిట్లు
కాక శోకించి చేసెడి కార్యమేమి 106

(వేరురీతి నీదుభోగముల్ నమ్రత వహింపఁగ)

చ తిరుపతి భోగి, యగ్గిరివి దీప్తినెసంగెడిసామి భోగి, నీ
మయక భోగముల్ గినిసి యాడఁ దొడంగితి "వేఱురీతి" నీ
*దురితపడంగు శంకరునితో యజనేత్రి స్మరింపు మాపె పా
దంబుజము శ్రీవిరాజితము ధన్యునిఁజేసిన జేయు విన్నిఁకన్ 107

ఉ బమ్మమతంబు నిప్పటికిఁ బట్టితి. నాకదనున్నయప్పు ద
య్యమ్మ ప్రసాదమే గతి యథార్థము చెప్పుము! యాపెయాలయ
మ్మి మ్ముగనుండి మంత్రజప మేగతిఁ జేసితి విట్టినీవు మొ
త్తమ్మున విన్నుఁ బోలెదుకృతఘ్నుఁడు లేఁడుసుమీ జగమ్మునన్ 168

ఉ. భోగము భోగి, భోగినులు వొల్చెడి శంకరు నర్ధమూర్తి. యా
భాగిని మందభాగి విను భక్తునిగాఁ దలపోసి సత్కలా
భోగిని గాన జ్ఞానలవభోగినిగా నొనరించె. నిప్పు డే
లాగున దూష్యమయ్యెను శిలాప్రతిమార్చన మోకుమాపకా. 109

మ భవితవ్యంబు నెఱుంగ నేరవు. భవత్పాపోదయం బిట్లు పం
డవలెం గావున వేంకటేశ గురుఁడన్నా! ‡ భోగిపీఠాగిమై
భువి నెందున్ వినుతింపఁగాఁ బడెడిఁ దప్పుం గూఁతలం గూయు తా
కవి కీలాటిమహారహస్యము లెఱుంగన్ శక్యమె ట్లయ్యెతిన్. 110

---

( *దేవీభాగవత షష్ఠస్కంధము చూ.)
(‡వేంకటాచల మహాత్మ్యము. ౧ ఆ చూ.)

మ మరిశం బీ వొశెఁగట్టినప్పుడు భవద్ద్రోహమ్ము సర్వమ్ము నే
నెఱుఁగం జాలిన యంతవట్టు నొడువన్ హేయమ్ముగాఁజూడ రె
వ్వరు. నట్లైనఁ గృతఘ్నతాఘ మొకఁడే వాకుర్తి త్తనన్యాఘమో?
‡పరకీయాననసేగా. మూరక వృథాభారమ్ము నాకేటికిన్? 111

చ *గురుపితృమాతృ దేవులతగుల్ వివరింనఁగ రాదు. భోగముల్
తిరుపతివేంకటేశ్వరుఁడు తేలనివాఁడని కాదు. దాన నీ
గురుతకు భంగమేమి? యిదికొం చెతనంపుఁబ్రిసంగ. "మేల కొ
బ్బరితరు వెక్కె" దన్నఁ "దృణభారముకోస" మటందువే సుతా? 112

చ "తిరుపతివేంకటేశగురుదేవుఁడు 'భోగి' యటన్నఁ దప్పొ? 'చి
త్తర మలవాఁడు దేవయ కృతఘ్నుఁ' డటన్నది తప్పొ? సుంత నీ
వరయఁగలేకపోతి"వని యాడుదు రీకవనమ్ము చూచి త
త్తఅపడిఁనాద వెయ్యదియు దారిగనంఁటకో యమాయికా 113

(నీపదము లేఖిఙియించెడివారు గూడ మున్పటివలె విన్నుఁగొల్వరు)

చ "తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుడు మ. న్నిపుడట్లుకాఁడుకొ
ల్వరు పమంది' యన్నదియె లాఘవమో? 'కృతిముం దిలంపఁడ
మ్మెఱ' కనలాఘవంబొ? కనఁబోదితిఁ" దందురు లోకు. లెంత త
త్తఅపడినాఁడ వెయ్యదియు దారిగనంబడ కోయమాయికా 114

ఉ "దురితములెని? కృతఘ్నత. సరివచ్చెడి? దానిఁ బెంచసాఁగె నితడు వే
డుఱుపాఁ" దండురుసుమి; త. త్తఅపడితివి దారియొండు దగులకపుత్రా.

కి. తిరుపతివెంకటభోగము. లెఱిగించితి యశము నురిఁగెనే? యింతట, నె
వ్వరొ తక్కఁ గీర్తిపరులం, దొరకరె తావృథులు విబుధ ధూర్వహులెందున్

చ ఇదిగద. నీవు పర్లిల్లదము లెన్నిబరించిన దేల సారః మీ
చదువుని గొ్ర్రిత్తగాఁ బెడు యశమ్మది లేశము లేవ. చాపమై.

‡ శా. చెల్లా రెడ్డికిఁ వేసికట్టయితిమాచీ? మాటలింకేటికిశా (ఈపద్యపాద మెవరికవిత్వమో. దీనిప్రసక్తికిం గలనంగతి సందర్భము లెట్టివో మాశిష్యులు వెం॥ రా॥ లే చెప్పవలయును గాన వలయువారు వారివలన నెఱుఁగఁదగు.)

*శ్లో. భవానీశంకరాదీనాం పితౄర్వా కేశవర్ణనమ్. (ఇత్యాదినిషేధస్తా వదలంకార శేఖరాద్యాలంకారికగ్రిన్థేషు ద్రిష్టవ్యః)

చదరయి నిల్చి యిప్పటికిఁ జాలదినమ్ములు వోవుదెంచె, ని
య్యదిగని యోర్వలేని జడు లంతయునుండిన ంతమేద్దో ,  117

ఉ కావున నున్నకీరితికె కావలె బోలెఁడు చోటు, నీవు నిం
డేవిధి నేవిఁ గొంత గొ ఖ మీఁగలఁ దాతఁడు, నీకొసంగఁగా
నావల నిల్చినట్టిదియె యాతనికిఁ సరిపోవు, మాసియే
పోవునొ ? పోవనీ, యశముపో, గడుఁ గాఱియ హేతు వచ్చెకా  118

క. *తఱుఁగు నిఁకఁగీర్తి యనుకొని, పొరిఁబొరి లిభియించితీవు బూతులు,దానం
బెరిఁగెడినని భయపడు నతఁ, డరసితివే హేతు ? వచ్చెతా ! యిప్పట్లన్,

చ మును హరిశాస్త్రిగారి నొకమోటకు, నీవల వేంకటేశ్వరుఁ
గనలి యవాచ్యముల్ గిలుకుకై వడి, నేవియొ పేర్మిల దానితా
యన "జగమింత యుండ నను నాయలఘుం డటు దూఱుటే ...
ఘనతికు నొప్పకొంట" యని కైకొనె మోసము నాఁగవింటివే  120

సీ భోగినీరతుఁడయ్యు, భోగినీరతుఁడయ్యు భోగినీరతుఁడె యప్పుణ్యమూర్తి
విభ్రమద్గతియయ్యు, విభ్రమద్గతియయ్యు విభ్రమద్గతియె యవ్విశ్వమూర్తి
అచలానుగతుఁడయ్యు నచలానుగతుఁడయ్యు నచలానుగతుఁడె యయ్యచలమూర్తి
శృఙ్గసఙ్గతుఁడయ్యు, శృఙ్గసఙ్గతుఁడయ్యు శృఙ్గసఙ్గతుఁడె యాజిష్ణుమూర్తి

తే. గీ సానుగతుఁడయ్యు నతఁడు దాసానుగతుఁడె
వేశపరుఁడయ్యు నాత, డావేశపరుఁడె
భీరహితుఁడయ్యు నాతఁ డాభీరహితుఁడె
ఏమెఱుఁగు దీవఁ గలభావ మెద్దెజనుఁడు  121

(మాసె భవత్ప్రతిష్ఠ యిదె మాయుచున్నది. మాసిపోవు)

చ. అటిమటి నేవియో గిలికి యంతన "దేవళముండఁ బో దిఁకఁ
దిరుపతి" నంచునెంచు భవదీయవివేకము "వార్ధి దోఁయిటన్
బురపురఁ దోడి లోఁగె" నని పొంగెడివావివిధమ్ము దెల్పె, సం
బరపడు. మేల నీముదము పల్చన చేయవలెన్ ? గుమారకా !  122

---

*శ్లో॥ భాగ్యవన్తం ప్రసూయేథా, మాశూరం మాచపండితం, శూరాశ్చకృత
విద్యాశ్చ మమపుత్రావనంగతాః" (ఇతి ద్రౌపదీం ప్రతికుంత్యా ఆశీః)

ఉ మాయను సూర్యుఁడున్, శశియు, మాయఁ జరాచరజంతుజాలముల్,
మాయను భూమియుఁ, దివియు, మాయను సప్తకులాచలమ్ములున్,
మాయని వస్తువేది ? వినుమాయది. తిర్పతివేంకటేశ్వర
శ్రీయుఁ బ్రతిష్ఠయుఁ మిగులఁ జేవకుఁ దావయి పొల్చు నెప్పుడున్

గీ. జగమఖిల మప్ప్రతిష్ఠావశమున మునుఁగు
నయ్యవసఁగూడ నచలమై యలరు శేష
* శయ్యపైఁ బొల్చు వేంకటేశ్వరుప్రతిష్ఠ,
దాని మాయింప నొకరికిఁ దరమె పుత్రి ! 124

(ఊరక లేనిపోనికార్లండ్రు భవద్గుణం బెఱుఁగ నట్టిసు)

ఉ "కొందఱు తద్గుణం బెఱుక గూరక యూరక లేనిపోని కా
ర్లందు" రటం చెఱుంగుదువ, యంతయొ, యింతయొ గాక పూర్తిగా
నెందుకు సర్వమున్ దెలిసి యేవపుఁగానలము ల్లిఖించి గో
సందెదవో ? యెఱుంగ నకటా ! వికటంబులు నీప్రచారముల్ 125

(వికృతము వల్క సెపింతు వంచు)

చ అతఁడు "శపించు" నంచెఱుఁగు దట్లగుచే ధ్రిప మేని మూఁడును
ర్గతియునెఱుంగు, దేమనుచుఁ గాఋలు నూఱెవో, పెంకెకొయ్యపై !
యతని దయార్ద్రభావమకదా ? విను నింతకుఁ దెచ్చె, నింక స
ద్గతి యిహమందు పేఖొకటఁ గల్గుట కేతెరువోయి, పుత్రికా ? 126

మ గురు విద్వేషమె త్రోవయో ? యనృతవాక్ప్రాచిత్వమే త్రోవయో ?
తిరుపత్యద్రిపతిప్రకృష్టతను విద్వేషిత్వమే త్రోవయో ?
చిరసంరాధము వేదవిస్మృతము "విస్సీ" యంటయే త్రోవయో ?
పరిపూర్ణమ్మున కేది చూచుకొని డంబాల్ గొట్టెదోయీ, సుతా ! 127

(తులువా తులువా యని నీవు బల్కెద వన్యుల నావహించి)

చ. ఎవకో నీదగు తుల్వచెయ్యులకు నెంతే లోనఁ జింతించి నీ
యవివేకమ్మును రోసి "తుల్వ" యని ని న్నామంత్రితుఁ జేయ, వా
రివచో ధోరణి వేంకటేశ్వరుఁడు ప్రేరేపించిన ట్లెంచెదే
సువివేకీ ? యతఁ డేమిసేయునుర ! నీకుంతత్వ పర్యాప్తికిన్ ? 128

(* దేవీభాగవత 3 వ స్కంధముచూ )

ఉ. తా నొనరించుకర్మ మది తమ్ము ఘటించి కలంచుపట్ల న
జ్ఞాని యటంచుమీ. వృథగఁ జాల దురుక్తులు వల్కఁ దేవు. సు
జ్ఞానియొ కర్మమును దలచి, కష్టము నెట్టులొ పైఁచి, వచ్చుజ
న్మానకుఁ గూడఁ బెట్టుకొనఁగా గమకించు సుకర్మపుంజముల్ 129

(ముష్టిచెంబుంగొని ..బొంగు బుజానవేసుకొని పోదురు)

ఉ. "బొంగు బుజానవైచికొని పోయినఁ" బోదురుగాక, "ముష్టిచెం
బుం గొనిపెట్టు" మంచదురుగఁ బోయినఁ బోదురుగాక, "గంగిరె
ద్దుం గొని దేవుఁ డంచుఁ బలుత్రోవలఁ బోదురు" గాక, దేవనిం
దం, గురునింద పేయరుగదా, యవివారల కేల యగ్గెదో ? 130

ఉ. శక్తుఁడవేవి దేవగురుసంస్మరణం దిగఁద్రోవి. † పై విక్ర
షోక్తులు పేర్మిలు దుర్మదుల యుల్లములం బగులింపు. ధర్మశా
స్త్రోక్తులు సమ్మతించు విధిః యూరక తీరికకల్మి నేటి య
వ్యక్తత, బక్కదానవరుల కల్గెదు పీసరులేమి కైసరా ? 131

(బొంగు బుజానవైచుకొని పొమ్మిక దిర్పతివేంకటేశ్వరా)

ఉ "బొంగు బుజాన వైచుకొని" పోఁడు, వరాంగముమీఁద నెక్కి మా
ర్దంగికరావ ముప్పతిల "దద్ధ దదిందక దద్దడోం దదోం
దోంగిణతక్క తక్క" యని తొల్లిటి కాళియమర్దనంబు జ్ఞ
ప్తిం గొలుపుంజుమీ. తుదకు వేంకటనేత వదారవించముల్. 132

(మాసినమూవపేరుగళమందనము . .నీవేసముసూతు నెవ్వరికివేడుక)

ఉ. దాసువివాసికిశ సరిగ దైవము తత్తదుపాధిరూపముల్
భాసిలఁ జేయు. నీకు నగపత్తెను దేవునిగిరివనక్కటా ।
"మాసినమూవపేరు"; కనుమాయని వజ్రిపుతోడు గల్గ శ్రీ
వాసుఁడు నీకుఁ గన్పడఁడు వాస్తవరూపముతోడఁ బుత్రికా. 133

ఉ స్వామి ధరించు * వజ్రికవచమ్ము నెఱుంగుదె ? యెన్నికోటు లౌ
నో ? మహిపాలుఁ డెవ్వఁ డిడెనో ? యటువంటి వివేకు లెల్లరున్
బామరులా ? దురుద్యములపద్ధతుల న్నెగడింప నొమ్ము వ
మ్మౌమరియాద కొప్పెడి ధరాధిపతుల్ సువివేకులా సుతా ? 134

(† స్కాందోత్తరఖండము చూ)
(* వేంకటాచల మహాత్మ్యము 6 అ, చూ)

(శౌర్యము లేనివాఁడుగద శంకరుఁడు)

ఉ. ఈశునకష్ము కృష్ణుఁడయి యీశుఁడు పూత్రితయం బటుల్ వారి
న్నాశము సేసినాఁ డనుట నమ్మెడిచో నెటు "శౌర్యహీనుఁడౌ
రాశికి రానిమాట జనరంజకమౌ ? మదిలోన నర్ధనా
రీశుని బెట్టి వ్రాసితివొ యీనుడిః దానఁ గవిత్వభంగ మౌ. 135

ఉ. "శౌర్యములేనివాఁడుగద ? శంకరుఁ" డంచొక బొంకు బొంకి, తే
యార్యులు విశ్వసింత్రు ? "నిటలాక్షుఁడు శూరుఁడు గాఁ" డటన్న, నీ
ధైర్యమదేమొ ? దేవగురుతత్త్వముపట్టునఁగూడ బొంకులన్
గార్యమకార్యముగా మఱచి క్రొక్కెడ, వెక్కడిపాపమక్కటా !

(ఏం దిరుపతివేంకటేశుఁ డనఁ వీరదు తిర్పతివేంకటేశ్వరా)

చ. "తిరుపతివేంకటేశుఁ డనఁ దీర" దటం చొకవాక్కు డొక్కెడ, పైఁ
"దిరుపతివేంకటేశ" యని దీక్షము నేమని తీసికోయి ? యే
మఱితొ ? విడంబమో ? యది ప్రమోదమొ ? హాస్యమొ ? తప్పుమాపికో
నఱిముఱి? బాచితమ్ముగఁ దదాహ్వయమున్ స్మరియించుటో సుతా, 137

(దాసరుల్ తిరిపము నెత్తువేళ వినుఁ డెల్పఁగ)

చ. తిరిపము నెత్తువార లొక తిర్పతివేంకటదేవుమాత్రమే
స్మరణ యొనర్ప, రొక్కొక రుమారమణుగా, మఱి రాముఁ గృష్ణు నం
స్మరణయొనర్తు, రేటి కివి సాఁగనికల్పన ? లింతమాత్రనే
వరదుఁడు వేంకటేశ్వరుఁడు వైభవశూన్యుఁ డెటుల్ కుమారకా ? 138

ఉ. ఎంచికనంగ లేదుకద ? యెన్నఁడు నర్పక ? * నారయప్పరా
వంచును "సామిసన్నిధి" యటంచును "బైబె" యటంచుఁ దంబురాఁ
గొంచుచుదెంచు భిక్షుకుల, గొందొకతేవి స్మరింపరేమి ? య
య్యంచితువాసి గాసిలుట కౌనొకొ ? మానములిట్టిగానముల్.

---

హిందూస్థానీ కీర్తన.

* అప్పారావు, దునియామే, నైరాజా, అప్పారావు స్వామిసన్నిధి బైబె, ' అప్పారావు వైకుంఠమేగై రాజా, అప్పారావు కాశీమే యినకటిరే॥ పల్లు॥ ఖానే లడ్డూ దియా, పీనే తింబల్ దియా, హాత్మే లకిడీదియా, సోనే కింబల్‌దియా, దునియామే నై రాజా, అప్పారావు। ౧॥ పీనేలోక్కురాజా,

ఉ. ఎవ్వని పేరు చెప్పికొన వించుక ముష్టియుఁగూడఁ బుట్ట దా
గవ్వ నెవండు పాడుఁ? దిరిజగమ్ములు మోసినవానిఁ దక్క, నీ
నవ్వున కర్థమేమి ? యల నారయభూరమణుం దలంతివే ?
యెవ్వరు నీకుఁ జెప్పఁ గల ? రేవియొ పేర్రెదు తోచినట్లుగన్. 139

చ. అతని చరిత్రమున్ వినిన నాన్నపుఁబాడిన, నావధాన్యు దా
తృతకు నమస్కరించినఁ, దదీయ యశమ్ము పఠించు భిక్షక
ప్రితతిపదస్ఫురద్రజము ఫాలమునన్ ధరియించినన్ భవ
త్కృతము కృతఘ్నతాభర మొగిన్ శమియించు. నటుల్ పొనర్పుమా 140

హుంకా దియా రాజా, గుడ్డుడ్ దియా రాజా, చిమ్మిడియా రాజా, గంజాయి దియా రాజా, చిష్టా దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥ ౨॥ బైఠ్నే చెత్తర్ దియా, సోనేత్సత్తర్ దియా, యేబూర్కే, యేక్ బడా సత్తర్ దియా, దునియామే నైరాజా, అప్పారావు॥౩॥ దూప్కే ఛత్రిదియా, పాంకు జూతీ దియా, సిర్కే టోపీదియా, ఛడ్నే ఘోడీ దియా, దునియామే నై రాజా, అప్పారావు॥౪॥ రోటీ ఖానేలోక్కు, రోటీ దియా రాజా, ధూ త్పీనేకో క్కు, ధూ, ద్దియా రాజా, దునియామే నై రాజా॥౫॥ బామన్ లోక్కు రాజా, ఏక్ సత్తర్ దియా, ఆమ్లీ దియా రాజా, బైగన్ దియా రాజా, డాల్, దియా రాజా, ఛై, చియా రాజా, ఘీ, దియా రాజా, నమక్ దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥౬॥ కాశీకోట్టు దియా, జగన్నాద్ రోట్టుదియా, మదరాస్ రోట్టుదియా, ప్రియాగోట్టుదియా, గయాకోట్టుదియా, దునియామే నై రాజా, అప్పారావు స్వామి సన్నిధిలై చే॥౭॥ శ్రీ శ్రీ శ్రీ.

(షరా.— ఈ మహాపురుషుని పుణ్యకార్యములు విదే రీతిని బైరాగులుగూడ గానము చేయుచుందురు ఇయ్యనఘుఁడు సాక్షాద్భగవద్భక్తుఁడై జనులపాలిటికి భగవంతుఁడేయై యుక్తాయుక్త వివక్షణత నెఱిఁగిన దాతయై నెగడెనఁట! ఈతని యుక్త దాతృత్వమును గూర్చి యొక మహాకావ్యము వ్రాసినఁగానియింతతోఁదీఱ వదిగాదు. ఛస్మాహూతిప్రాయముగ సొమ్ము వమ్మొనరించు వేఁటిదాతల కనేకుల కీయనఘుని చరిత్రము నీతిగఱపఁగలదని యెంచి కొలఁది దినములలో నీధర్మాప్ప రాయల పుణ్యచరిత్రమును వ్రాయ నెంచి యిప్పటికి గ్రంథవిస్తరభీతిచే నింతతో విరమించుచున్నాము)

(తిరుపతి వీడి వేఱొకప్రదేశముఁ జేరితివేని నీ నరపతి యెంతయున్నదియో
పైఁబడుఁ దిర్పతి వేంకటేశ్వరా)

చ తిరుపతివీడి వేఱొకప్రదేశముఁ జేరిన వేంకటేశుఁ డే
నరపతి నుండెనో యెఱుఁగు వాంఛ జనించిన దేమి ? చూడుమా
* కురుపతిపర్వత మ్మరిగి కొండొక యచ్చటనున్న వేంకటే
శ్వరు, మది నంపియం బుడుగు సంశయముండుటనష్టి పుత్రికా ! 141

చ. కురుపతి పర్వతంబు గనుఁగొం డెటులందువొ ? యాత్మ కూర్ప్రభున్
బరిచితుఁ జేసికొ, మ్మతని పట్టణసీమకు నుత్తరమ్మునన్
బరఁగెడు నాగిరీంద్రి. మట భాసిలు వేంకటనేత, వాని న
న్నరపతి యింటివేలుపుగ నమ్మి భజించు ననేక భంగులన్. 142

శా. దేవబ్రాహ్మణభక్తిపోత్రి వచటి పృథ్వీనాథుఁ, డెంతేని స
ద్భావుం, డాగమదేవదేశికులవిందన్ జేయు నవ్వారిఁ గ
న్గో వాంఛింపఁ దెఱుంగఁ జెప్పితిని నీకున్ వైష్ణవగ్రామణీ
సేవాతత్పరుఁ డానృపాలుఁ గన నేజేఁ జూచినట్లుండెడిన్. 143

మ. సిరిఁ జెన్నారు మొగమ్మునన్ దిరుమణిన్ శ్రీచూర్ణముం బూని శ్రీ
హరినామమ్ము జపించి, సాపడి యథార్థాలంకృతుల్ దాల్చి, భా
స్వర విద్వత్కవిగాయకు ల్గొలువ నాస్థానమ్మునన్ బొల్చున
న్నరనాథున్ గనుఁగొన్న దేవగురు నిందాపాపముల్ రూపఱున్. 144

ఉ. చేయఁ దపాత్రిదానములు, చేయఁ దవర్ణనమస్కృతుల్, మఱిం
జేయఁ దవైదికార్చనలు, చేయఁ దవిద్వదుదారసత్కృతుల్,
శ్రీయు యశంబు దాతృతయుఁ జేవయుఁ బొల్చెడివాఁడు, సత్కవి
ధ్యేయుడతండు, పండిత విధేయుఁ డహేయు డెఱుంగఁ జెప్పితిన్. 145

ఉ ఏగితివేని నీదుమత మెట్టిదొ కన్గొని, నీకుఁ గల్గు వి
ద్యాగరిమమ్ము తేల్చి, యుచితం బగు సత్కృతిఁ జేసి, మీఁద న
య్యాగమవేద్యుఁ డున్నగిరికంపు సహాయుల నిచ్చి, యూరకే
వాఁగుటె కాని నీ వెటకు వారక పోవఁగ లే దెఱుంగుడున్. 146

---

* (ఆంధ్రికృత శ్రీనివాసవిలాసము ౧, ఆ, చూ.)

మ. ఆసహాయమ్ముగఁ బోకు. మేగునెడ నయ్యాదిప్రిందర్ప్రిమం దెందు *వ్యా
ఘ్రినమాజమ్ములు "గాంధ్రుి గాంధ్రు" మనుదుం గర్జిల్లు నందెందు బ్రి
హ్మసమాజంబుబునేసమాజములు సేమం బీయ. వీడోసముల్
పని గట్టంగల వామెకంబు లచటన్ భవ్రింబు సూ పుత్రికా 147

ఉ భక్తులనేకులమ్యెడకు వచ్చుచుఁబోవుచు నుండుర్ప్రి. వారిపై
ర క్తిగ నుండునంట యవి. బ్రిహ్మసమాజము భ క్తదూరమౌ
రి క్తిమతమ్ము గానఁ జెలరేఁగఁగఁ వచ్చునటంచు నెంచి సు
వ్య క్తముఁ జేసితిన్ దగినయ ట్లటకుం జనిచూడు వెంకనన్ 148

క కురుమతియవి కుర్మతియవి కురుమూర్తియునాఁగ మతియుఁగుర్మూర్తియనన్
బరఁగెడిగిరి యది. యచటం గురుమూర్తియె నీకుఁదోఁచు గురువిభవముతో

చ "తిరుపతి. వేంకటేశ్వరుని తేజమునన్ యస మందె" వంచు ము
న్నతిముతి వ్రాసి. తిప్పు డిటు లందుకు భిన్నము గాఁగ వ్రాసి. తే
మతితివా ? బుద్ధి కీడ్వదెనొ ? "మాపిగమంచవుఁ" గుక్కి-యో ? యెదో
యెఱుఁగఁగ రాదు. సంకరము లీవు లిఖించునుదుల్ కుమారకా ! 150

చ తిరుపతి వేంకటేశ్వరుల తీ రది యర్పక ! చంద్రిచంద్రికా
స్ఫురణము భాస్వదాతపవిభూతి జ్వలజ్జ్వలనప్రిభాధురం
ధరమును గా నెఱుంగుదురు తజ్ఞులు. మోఱకులో. యెటేవియుం
దిరిగెడి వారినాలుకలు తెర్లును గావు సుమీ కుమారకా. 151

ఉ. అంబ నెఱుంగుదే ? మహిషునాగడ మాఁగినతల్లి. యాపెసిం
గంబు నెఱుంగుదే ? దితిజగర్వము ఖర్వ మొనర్చి పేర్చె. నా
యంబయు సింగమున్ విడిగ నాకృతులన్ ధృతిమాలి యున్నె ? యా
వెంబరగొట్టుపోఁడుముల వేదబము ల్లిఖియింతు వేటికో. 152

(కాసుల పూరుషోత్తముఁడు శ్రీకకుళాంధ్రిదేవుపైఁ జేసినయట్లు మేమును
రచించితి మీశతకార్థము)

ఉ. కాసుల పూఁషోత్తముఁడు గట్టిన పద్దెము లెల్ల భ క్తి కా
వానము. లీవుగట్టినవి బ్రిహ్మసమాజనమాశ్రియత్వపుం

* వాఘ్రినమజ ఇతితుయుక్తం. తథాఽపీదం కేవలస్వార్థమాత్రితత్వరత
యానవ్రివ ర్తతఇతి కృత్వానమాజఇత్యేవ ప్రియుక్తమితి తు రహస్యమ్

దోసము వెళ్ళఁగ్రొక్కుటను దుండగపుం జెఱుగంప, లద్దిరా
కాసులతోఁ్రివ కూసులగు కాసుల కూరక దేవుఁ దిట్టెదే 153

ఉ కాసుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెములందు రామునిన్
రోసెను. గృష్ణురోసె. మఱి ‡ రోయఁడ తిర్పతివేంకటేశు. నీ
యీసునకున్ సహాయుఁ డతఁ డెట్లగు ? వారలకీ వభేవమున్
జేసెదొ ? నీదురుక్తులవి నీదు శిరస్థలి నెక్కి తొక్కెడిన్ 154

ఉ "దేవుఁ దిట్ట రా" దనియె తెల్పుదునో ? "గురుఁ దిట్ట రా" దటం
చే వినిపింతునో ? వృథయె యీయుపదేశములెల్ల నెంతదు
ర్భావుఁడు గూడ నీపను లపాత్రములందు నెఱుంగు. నట్టిచో
నే వచియింప నేల ? ఫలమెయ్యది కోటి యిటుల్ వొనర్చెదో. 155

ఉ "పెట్టికి నేదియో ఫలము చేకుఱు" బోలు నటన్న సామెతం
బట్టితినా ? యథఃపతనభాగ్యము తప్పద. పట్టకుంటినా ?
తిట్టెద వింతకన్న. నిను దేవుఁడె యిందుకుఁ బుట్టఁజేసె. నే
నెట్టుల బాగుసేయఁ గల ? నేమయినన్ వచియించుమందెదన్. 156

(వివరించెద మింతకుమించి నేయపఖ్యాతిని దక్కు స్వామి శతకంబున)

ఉ ఇంతకు మించి తిట్టఁగలవేమి ; యదెట్టిదొ యింక నొక్కమా
ర్గాంతది విప్పుమా ; భవదకుంఠిత నీచతరప్రసంగవా
గ్దంతురతాప్రభగ్నతరకాంతహృదంతరసౌమనస్యవ
త్సంతతులే భవద్ధృదయ సౌకరిసాకిరులై చెలంగుతన్ 157

ఉ. ఈవటకే "యపాత్రు" లని యెల్లరు ; మీనుడి యెత్తికొంచు వి
క్షిపనముల్ వొనర్చగతి చేకుతె నొఁగద ? యింతకన్న దు

‡సె అప్పనంబుఁ గొను నఖిలదిఙ్మండలేశ్వరుఁడచే వేంకటాచలనివాసుఁ
డరుదుగా నణువదాఱవసరంబుల మహాభోగంబుగొను నీలభూధ్రవరుఁడు
పానకంబాఱుసాబాల భక్తులకిచ్చి యెసఁగును మంగళాద్రీశ్వరుండు
పుట్లకొలందిమై పూఁతగాఁగొను మంచిగంధంబు సింహనగప్రభుండు
తే. గీ సాటిసాములరీతి విచ్చేటనీ వు
మూర్తిమత్వంబుఁ జూపక కీర్తిగలదె. చిత్రి॥

• (1) "ఈమధ్యను జూన్. జూలై. కవిత. సంచికలో మరల తిరుపతి
వేంకటేశ్వరవిందల గన్పట్టినవని వ్రాయుటకు దురపిల్లుచున్నవాఁడను. ఏతద్గ్రంథ

ర్వావపు గూఁతలన్ వసరి పాౖమికొనంచగుభాగ్య మేమొః పు
త్రాః వెరపేల ? పండితసనస్సున కించుకవచ్చి తెల్పుమా ! 159

కర్తలకు మఱి యెన్నఁటికిని బుద్ధిరానేరదని నాయభిప్రాయము ."
విజయపురి, 1—9—13 K. S. Raghuramaswamy.

(2) చెట్టెక్కినవారింతతో శాంతిఁ బొందిన సరసముగా నుందును. ఇప్పటికే యపయశస్సు లెస్సగా వ్యాపించినది చేయుపని యెంతమేలు చేయుచున్నదో గమనించుకొను ప్రతిభకూడ సామాన్యము కాదుకదా !
గుంటూరు, 2-8-14. శ్రీ॥ హ॥

(3) "నేను స్వగ్రామము పక్కకు వెళ్ళినప్పుడు వీరి యర్థశతకావె ప్రశంసను జెప్పఁగా యోగ్యులెల్ల "రిది యేమియన్యాయము ..చదువుకొంటిమని తమంతటఁ దామే యొప్పికొనియు నన్యాపదేశముగనో మఱి యెట్లో యింకను దిట్టి తిక్కనుబడుచు దర్పార్కులు దైవవంచితు లగుచున్నారే' యనియే వగవసాగిరి వారికి మనవిగఁ గొందఱుఁ వ్రాసికొంచుమనియుం జెప్పిరి మొత్తమున వీరి ప్రశక్తికి నంతసించువారులేరు శాపథమున కెవరభిముఖులగుదురు ?" శ్రీ॥ హ॥

(4) శిష్యులు గురునిందాపరులైరని, తాము మందలించుచుండఁగా వారు "అదేమి చూచెద విదిచూడు" మన్నట్లు కవితలో వేంకటేశ్వరునిఁ దిట్టి దిసంతుబు గొట్టసాగిరి. దేవా ! పురాకృత పుణ్యవశమున నిట్టి శిష్యులలభించినందులకు సనుకొనవలెను గాని వేతేముందును కొనిందు సాధారణముగా ధర్మచ్యుతి కల్గెనే యీయుగంబున మీగిరత ధర్మ సంహితత త్తద్దోష నివారకంబై మహాశయహర్షదాయకంబై! వెలుంగుఁగాక . బృందావనము నరసింహాచార్యులు.
పొన్నూరుపోస్టు, గరికిపాడు, బాపట్లతాలూకా.

(1913 సం॥ సెప్టెంబరు 30 తేదీ మంగళవారముకళలేఖనుండి)

శ్రీరామకృష్ణకవులు, విగ్రహారాధననిరసనము

అను పేర నేఁబదిపద్యములు రచించి తమ కవితారత్నములఁ బ్రకటించి యున్న సంగతి పాఠకులంద ఱెఱింగినదే వానిం జదివిన వివేకులకు శ్రీరామకృష్ణ కవులు సర్వలోక గురు తిరుపతి వేంకటేశ్వర పూజానిరసన రూపమునఁ దమ గూఢశత్రువుల నెవ్వరినో దూషించుచున్నట్లు బోధపడకపోదు అయినను వారుంచి నినామమునుబట్టియు వ్రాసిన టిప్పణమునుబట్టియు జనసామాన్యమునకు , విగ్రహా

రాధన నిరసన మనియే తోఁచుట నిశ్చయము. కానఁ బామరజనాళి బాగును గోరియు "స్పర్ధయావర్ధతే విద్యా" అను నార్యోక్తిని దలంచి పండితులను గవిసత్తములను నగు శ్రీరామకృష్ణకవులతోడి ధర్మవివాదమువలన నాకు విద్యాభివృద్ధి యగుననియు నమ్మి వారు రచించిన విగ్రహారాధన నిరసనము మాత్రమే యించుక నిరసింప మొదలిడుచున్నవాఁడను గాన సనయహృదయులగు చదువరు లిందలి యుచితాను చితముల నారయుదురుగాత ..

శ్రు॥ "దేవపితృకార్యాభ్యాం నప్రమదితవ్యం," అనిశిక్షావల్లి, దేవపితృకార్య ములవలన బ్రమాదము చెందకుము. అని యర్థము దేవకార్యమన దేవతాపూజ యని మనము తలంచవలయును (పరాశరమాధవీయము 41వ పుటయందు) "సంధ్యా స్నానం జపోహోమో దేవతానాంచ పూజనం'' అని పరాశరుఁడు చెప్పియున్న వాఁడు, ఇందువలన దేవకార్యమన దేవతాపూజయని స్పష్టపడినది దేవతలనేకులు కలరు మనమే దేవుని బూజింపవలెను ? దేనియందుఁబూజింపవలెను ? ఇదివఱకె వరు పూజించిరి? అని ప్రశ్నలు కలుగకపోవు వీనికన్నిటికిఁ బ్రత్యుత్తరములు గలవు వినుఁడు "సర్వజ్ఞశ్చహిమాధవః" అనివ్రాసికొనియున్న బ్ర॥ మాధవాచా ర్యులవారు తమపరాశరమాధవీయమున 68 వపుటను ఆగ్నేయేపి, శ్లో॥ అర్చనం సంప్ర వక్ష్యామివిష్ణోరమితతేజసః, యత్కృత్వా మునయస్సర్వే పరం నిర్వాణ మాప్నుయుః, ఇందుఁజేయవలసిన పూజ విష్ణుపూజయనియు విష్ణునారాధించి ముని లుముక్తిని బొందిరనియుఁ దెలియవచ్చినదికదా ? ఇఁక నీపూజ నెందుగావింపవలె నను విషయముంగూర్చి ముచ్చటించుకొందము పై శ్లోకము వెంటనే "అప్సుగ్నౌ హృదయే సూర్యేస్థండిలే ప్రతిమాసుచ, షట్స్వేతేషుహరే ప్సమ్యగర్చనం ముని భిస్స్మృతం . .

ప్రత్యహ్నం స్నాత్వాదేవర్షి పితౄత్య ఉదకదానం ప్రతిమాదిషు హరి హరాదిదేవపూజనం, ఇట్లు శ్రుతులు స్మృతులు పురాణములు విగ్రహారాధన గావింపుఁడనఁగా, మునులట్లుచేసి ముక్తిపొందఁగా, నది తెలిసి యాచరించిన కుల్లూకభట్టమాధవవిద్యారణ్యాది వ్యాఖ్యాతృ శిరోమణులు బోధించియుండఁగా బాతాళలోకము (అమెరికా) వఱకు వేళ్ళు దిగిదిగంతవ్యాప్తి నందియున్న యీ విగ్రహారాధన పాలవృక్షము శ్రీరామకృష్ణకవులవంటివారు చేయు నల్పవిమర్శన చికోరిదములయాఁపులకుఁ గదలునా ? కదలదు. ఇంతియేకాదు. వీరి బోధలచే రాజులవలనను బండిత పామరులవలనను నిరంతరము పూజలు గైకొనుచున్న

ఉ. కీ ర్తి వసంతసేన. యది కేవలమున్ గుణర క్త దానికై
యా ర్తి శకారుఁ డూని యది యాత్మపరించిన బారుదత్తునిన్
ధూర్తుఁడు తిట్టితిట్టి యల తొయ్యలిఁ జంపఁగడఁగి యయ్యన
ద్వర్తనుఁ డేమి దామిడికెఁ ? దద్గతి నీకుచితంబె పుత్రికా ! 159

(ప్రజల్ పరమేశ్వరుఁ గొల్వనేర్చి యీవెంగలి రాతిబొమ్మలను వేఁడరు)

చ. "పరుఁ డొకఁడున్నవాఁ" డనిన భాగ్యము లేమనుమీ, కుమార ! య
ప్పరువికృతుల్ గురుండు మఱి పార్థివుఁడున్ జనకుండు; నిందు నొ
క్కరు దిగఁద్రావినఁ బరువిఁ గా దని యంటమె వేదశాస్త్రముల్
మొఱ లిడు నిట్లు. దాని నొకమోఱకు "గా" దనినంత నే మగుఁ? 160

(1) బ్రిహ్మముఁగొల్వ దైవవిశ్వాసములేదు వీరికని ..దూతెదవేమి)

చ. పరుఁ డన నెవ్వఁడో తెలియు భాగ్యము లేకయె పోవుఁగాక, త
త్పరుఁడయి పెద్దలంగొలుచుభవ్యుఁడు భవ్యము లందఁగల్గు. న
న్నరునకు విగ్రిహమ్మునెడ, నాయనపట్టున, నమ్మచోట, భూ
వరుకడ, నొజ్జచాయఁ గనుపట్టుఁ బరాత్పరుఁ డేక రూపియై 161

(జీసనుక్రీస్తునుం బ్రితిమ సేవను రోసెను)

మ. పరుఁ డెవ్వారికి లేఁడు ? బౌద్ధులకు, నవ్వారేనియున్ దేశికా
దరముఁ బీడరు. క్రైస్తవాదులకు నిత్యద్వేయుఁడే యొజ్జయె
వ్వరికిఁ దూరమె నీమతం బెచట సంపాదించి తోతండ్రి ? నా
తరమే విన్ను మరల్ప ? వర్థిలుము శీతజ్యోతిచందమ్మునన్. 162

---

శ్రీతిరుపతి వేంకటేశ్వరుల పూజలకు లోటు వాటిల్లునా ? వాటిల్లదు. "సత్య మేవజయతి నానృతం." (ఇందు వి స్తరభీతిచేఁ జాలవదలితిమి) తి॥ వెం॥

ఇట్లు విన్నవించువాఁడు మహబూబు కాలేజి సహాయాంధ్రోపాధ్యాయపద

విభ్రాజి, శివానుగ్రిహవిరాజి

శివపురపు వీరభద్రపాకయాజి.

సనాతన ధర్మబోధినీ సామాజికుఁడు, శికింద్రాబాదు.

(1) ఈగుఱుతుగల వాక్యము, వేంకటేశ్వరస్వామివారికి సమన్వయింపదు. స్వామివారు బ్రిహ్మముగొల్చువారల నెవ్వరిని దూఱిరి ? ప్రమాణమేమి ? ఇట్టివెన్నోకలవు. మఱియొకటి మాత్రిము చూపుచున్నారము. చ. పరులను

(పేర్పడు వనవ ర్తియు వ్నిను సభాజనపాత్రముపేయఁడు)

క. ఏవనప ర్తియు ఘనటువ, నావనవ ర్తి యగు వేంకటాచలపతిపై
పీవలెఁ గావల మూనఁడ, పేవించియెతీరుపేవ చేకూరివచో॥. 163

తే గీ. బట్టకుఁడు వనవ ర్తి యాలుబ్దకు లెటు
గొల్తురో యట్ల కొలిచెడిఁ గొసరికొసరి;
ఇంతయెందుకు ? చెంమరా జెవ్వఁ, డతఁడు
గాఁడె వనవ ర్తి ? కూఁతునె కావ్యమొసఁగె. 164

గీ. వాని యేర్పాటు చొప్పున వాఁడు గొ౦రె,
వదియు సామికిఁదగుఁగాక, యట్లు కాక
పోవుఁగాక, యవ్వానికి పేవకుండు
గాఁ డనెడి దోసమును గట్టఁబోఁడు సుకృతి 165

క. "పేర్పడువనవ ర్తి" యటం, చేర్పాటొనరించితొక్కొ ? యిటులగునేని॥
దిర్పతివెంకనకున్ వాఁ, డర్పింపఁడు సుతులు విక్క మాడితిపుత్రి ? 166

(బహుమార్గ పేదులంజేయులగా, దలంపకుము)

ఆ. వె. యేకమార్గపేదియే పేది, బహుమార్గ, పేది యేటిపేది ? పేఁదు అతఁడు
ఏకమార్గ మన్న నే మనుకొంటివో ?,సత్యమార్గ మది పత్రిక స్తితెరువు.

ఉ. కారొకొ ? రక్కసుల్ కరు వకార్యరతుల్ "బహుమార్గపేదు" ల
వ్వారల మార్గముల్ తుదకుఁ బాడఁటి యోడరె ? జయ్యునైనవా
రేరుమ బెక్కుతోవలనె యేగుమనుందు, రజయ్యు లొక్కచే
దారిని బోదు రయ్యది సదా జయ మిచ్చు యశం బొసంగుచున్. 168

చ అరయఁగ నేర్తు పీవు చతురంగ మొకించుక గుర్తులేదె ? యే
లరిపురి నిక్కతాన నిను నొక్కటశిక్షితుఁ జేసినాఁడ, నీ
చరిత మటుండె, నియ్యెడ నజయ్యుల యెత్తొకతీరె యెప్పు, త
ద్ధఁపడి పారె పోటువరు తజ్ఞులదాఁటు లనేకమార్గముల్. 169

టూవి తిట్టెదవు బ్రిహ్మసమాజము జిహ్మవృత్తిపై" వేంకటేశ్వరస్వామివారు బ్రిహ్మసమాజము నెవ్వరి నావేశించి తిట్టినారో అయాహోట్లు పనివడినచో దేవయ్యలకుఁ జిక్కుతెచ్చెడివి యవి యెఱుఁగుదురుగాక.

చ. ఒకయెడ మూలయెత్తొకట నొండొకయెత్తొకమాఱు తేనిబం
ట్లి కదలునెత్తు మంత్రికదలన్ మఱియొక్కెడ తేఁడె దాఁటు పే
టొకయెడ నప్పటం దుదకు నోడుదు రీ "బహుమార్గవేదు" లే
రికి జయ మబ్బు వార లొకరీతినె యెత్తుమ రెత్తులర్థికా. 170

(సీ సంగతి యెల్లవారికి నసహ్యమె యయ్యెను)

ఉ. ముంగల సద్గతుల్ వొలయుపుణ్యులకెల్లను వేంకటేశు స
త్సంగతి సహ్య, మందులకె నల్పుచునుందురు సర్వదా; వృధా
భంగుర మైనకుక్షికయి పాపకృతుల్ రచియించువారి కా
సంగతి యెట్టులబ్బెడి? నసహ్య మశక్యము కొంతమందికిన్. 171

క. కటికివిదగ్ధదరిద్రుఁడు ఘటియింప దటం చెఱింగి కామ్యార్థముపై
నటియించు ననాదృతి. వేం, కటపతిసంగతియు న ట్లకట? సీ కయ్యెన్

(విశ్వములోన వెల్లరు వివేకులు వేడుకతోఁ బఠింపఁగా)

ఉ "హైదరుబాదు" పేర నొకయజ్ఞుఁడు హేలకు నొక్కదేహఁ జా
మోఁది చనంగ వేతొకఁడు వోవుచు మొందెముఁ జూచి "కత్తిబా
గాఁ దెగె "సా' ఫటుల్ వలయుఁగా?" యని మెచ్చెనఁట; టట్టులే సుమీ
సీదు కవిత్వపుంగరిమ నీతివిహీనమతుల్ పఠించుటల్. 173

(పొంగుచు నంటి "వరా జనులు పూజలొనర్తు" రటంచు)

చ. పతులకు నోఁచుకోవి యెలప్రాయపుటంగన లూరకే హిమ
ద్యుతిమలయానిలాదులను దూఱుదు, రాదర ముప్పతిల్ల సం
గతపతులైన కాంతలు వికామమహోత్సవముల్ పొవర్చి స
త్కృతులగఁ జేతు రిందుఁ గల దేవరహస్యము పీ వెఱుంగవే. 174

మ. ఉపయోగింపవు దేశికాఖ్య మొదటన్ "నోదాహరే దస్య వా
మపరోక్ష" మ్మను శాసనమ్ము కతనన్ మన్వాజ్ఞమై వట్టిత
ప్పపలాపింపఁగ వచ్చు నక్కటకటా? యాపై వృథామాషక
త్వపదం బెక్కితి వేస్మృతిన్ జదివి? శేషమ్యుఁడు శాసించెనో? 175

శా. అల్పంబే యగుఁగాక వాగరిమ నేవల్పుండనే యౌదుఁగా
కల్పత్వ మ్మది తిట్టునీకు వొకసహాయ్యమ్ము గావింప, దే

కల్పమ్మందును నీ వౌనర్చువని యేకష్టుండు గావింపఁ, డీ
శిల్పం బేగురునొద్దనేర్చి తరదే ? శిష్యా స్వయంవ్య క్తమో ! 176

ఉ. "పేదులవాఁడు నావుఱది వేఁదుఱువార్రిఁతలు వార్సినాఁడు వాఁ
డీదురితమ్మునన్ జెడెడి నే నహ మొంద" నటంచు నెంచె దే
మో ? దురితంబు వాని దనఁ బోలదు నీకయి వాఁడు పేర్లిలటఁజా
నీదియె పాతకంబు మహనీయుల వేత్తల నడ్గి చూడుమా. 177

ఉ. గొల్లది చల్ల లోఁ గడాపుఁ గొంపకుఁ గొంపకుఁగూడ నీళ్ళు, లే
పల్లవపాణి యేవియు "సెబా ! నిది యేమె యపాతుర్రాల ? యీ
చల్లకుఁ డెల్పు వచ్చె" ననఁ జాన వృథా జల మిచ్చినట్టియా
తల్లలఁ దిట్టు "నేఁచెనటి తా నిట నీ రిడె" నం చెఱుంగుదే. 178

క. గురు నేల తిట్టితన. మా గురువే యిటు చెప్పెనంచు గొణుఁగకుమా ! యీ
దురితమ్మెల్లను మెల్లను, పరి నాశిర మెక్కు మిగుల బరు విదితనయా 179

(తత్రృతిమారాధనము నిరసించినచో బ్రాహ్మనబర్హ ణన్యాయమునఁ
దక్కిన విగ్రహముల పూజయు నిర స్తము)

ఉ తిట్టఁగ లేదు నీవు ఋముఁ. దిర్పతివేంకటనాథునే చెడం
దిట్టితి విగ్రహార్చనవిధి న్నిరసించుట, కైనఁ గాశికా
పట్టణనేత దిట్టుటకుఁ బాల్పడ వే ? మతఁ దగ్రగణ్యుఁ డా
దట్టునిఁ దిట్టినప్పుడ "ప్రధానవిబర్హణ" నీతి సార్థమౌ. 180

క "కాశ్యత" ఇతి వివరణమునఁ, గాశ్యపి చనుఁగాక శూలకలితం బగుచున్
దృశ్య మగుఁ గాశి యది "య, ద్దృశ్యం తన్నశ్య" మనువిధికి లోఁగదుసూ.

(కలౌ వేంకటనాయక, అను వచనము)

క కానఁ "గలౌ వేంకట" యను, మాన మ్మండినను గాశి మహిమ మధిక మె
న్నేవియు రెట్లట్లగుటఁ" బ్ర. ధానవిబర్హణక" కదియ తగుఁ జామి పుత్రా.

క. క్షేత్రములలోఁ గాశి, క్షేత్రమ్ము త్తమము దానిఁ కెఱిచినపై నే
క్షేత్రమ్మునేవిఁ తెఱచుట పాత్ర మ్మద్దాని విడువఁ బాడియె కుత్తా. 183

ఉ, ఎంచఱు కాశి కేగుదురొ? యెందఱు తిర్పతిఁ జూడఁ బోదురో ?
వించుముకాదె ? సర్వపృథివిస్థలి క్షేత్రములెల్లఁ గాశితో

దం దులందూగ వయ్యది చెడజా జెడు సర్వముం దాన నున్న రా
తిం దెగం దిట్టి విగ్రహవిధి న్నిరసింతువుగాక యీవయిన్ 184

(దిక్కరి కొండయెక్కితివి దేవుడ ? తిర్పతివేంకటేశ్వరా)

ఉ. మ్రొక్కుల ముడ్పులుం గలుగుముగ్గుల మాత్రమె వేంకటేశుకొం
డెక్కుడు. రల్లకాశి కెపరేవియుం బోయెద రట్లు కావ న
మ్మిక్కలికంటె లింగమును మీఋము దూఱలు పోవు నంతం దా
దిక్కఱిదాన విగ్రహవిధి న్నిరసించుట సర్వసిద్ధమౌ 185

క. కావునం గాశీక్షేత్రము, పోవలయుజా ముందు దానిపోకకునై వా
చావిభవము వెలయింపు వృ. థా వో దది చెడియెతీరుం దగుకవివేంజా

సీ. అట్లొనర్చితివేనియది గంగంబడు, మీఁద రామేశ్వరము సముద్రమున మున్గు,
నాపైం బ్రియాగయు నటుపై గయాత్రయంబడుగంటుం దత్తద్వర్షస్థలములు,
నల్లంత రంగేశునవతార మదియుం గావేరిలో మున్గు దేవేరితోడం,
బిదపం గాంచ్యాదుల పేర్వోవు. నంతలో దక్షిణదేశయాత్ర లవి సురుంగు

తే గీ పైని "మక్క మదీ" నాని పరమముక్తి
దాయక క్షేత్రములు మనుధర్మశాస్త్ర
దూష్యపరదేశ యాత్రలు శిష్య ! మన కు
పాస్యతాభాజనములు గావలయునొక్క

(మే మీవిధిసర్వమంగళము నెప్పుడుం బాడుదుమయ్య వీకు-)

తే. గీ. "పాముతోం జెలగాటముల్" పనికి రావు.
శేషశైలేశుపై నేల రోషమన్న
వింటివో ? విను. "పీక్వరవేర" వైతి.
విన వవి యెఱింగియును జెప్పెదను గుమార !

మ. గురువిద్వేష మొకండుచాలదె ? వృథా కూర్చుండి యీ వేంకటే
శ్వరవిద్వేషముగూడ నేమిటికి ? దేవద్వేషముజా దేశకో
త్తరవిద్వేషము రెండునుం గలియువందం బెట్టిదో నీకు నే
వెఱింగింపజా వలెనే కుమార ! సుఖివై యీ త్రోవ రాం బోకుమీ. 189

మ. గురునిందాదురితంబు చాలక వృథా గొండాట శ్రీ వేంకటే
శర్వనిందాదురితంబు లేటికి; బళా సంస్కర్తృతల్ చాలు; దే

వరహస్యమ్ములఁ గోలిఁ జేతు మని సంభాళింప శక్యమ్ము గా,
వరయం జేతుము భ క్తి లేనియెడ నీ పద్దేవుపాదాబ్జముల్. 190

చ. నరుఁ డుకపైవచో నిదుతృణమ్మగు మేరువు, మంగళంబు లీ
వటిముటి నెన్నిపాడితివా యన్నియు నన్నియకోటులై వినుఁ గా
దిరిగి వరించునట్లు లలతిర్పతివేంకటనేత చేయుఁ ద
చ్చరణములెట్లు పట్టిన నొసంగు ఫల మ్మలదేవుఁ డర్పకా 191

ఉ మంగళమున్ ఐతించు టది మంచిదియే గురుమూర్తిగూర్చి య
మ్మంగళమూర్తి నీమనసు మర్మ మెఱింగి యిత్తోధికమ్ముగా
మంగళముల్ ఘటించుతఁ బ్రిమాదములన్ క్షమియించి దానిచే
తం గరుణాళుఁడన్ బిరుదు దైవతమూర్తికె చెల్లుఁగావుతన్. 192

ఉ. అర్పను దీర్పనుం దగనియజ్ఞాలయందున డాఁగి సారెకుం
దిర్పతి వేంకటేశ్వరుని దిట్టెదు నోరికొలంది, నిట్టినీ
దర్పము ధైర్యమున్ * గవిసదస్సులెదో సకలమ్మెఱింగి యె
ట్లూప్పులు పుచ్చుచున్నయవియో ? కను లింమక నిప్ప దర్పకా 193

* భవత్ప్రణీతగిరతామ్నాయంశ్రుత్వా సంతోషవశా దేవం లిఖామి గృహ్ణంతు కరుణానిధయః॥

శ్లో॥ లోకేఽస్మిన్ కలినామకాంధతమసవ్యాప్తే తమో దూషితైః దుర్వాదిత్యవిబంధకైశ్చ బహుభిః ద్దూ రీకృతే సజ్జనే, కృత్వా గిరతభారతం బహుసుపర్వానందసంధాయకం. విద్వద్ప్యేదదతుః ప్రిబంధ మతులం యౌతౌకవీంద్రౌ స్తుమః
శ్లో॥ సన్మార్గగౌ శ్రీపతివేంకటేశౌ, శిలాసమగ్రావివపుష్పవంతౌ, సుజ్ఞానదావజ్ఞజనస్య సమ్య క్కవీశితారౌ జయతాం రసజ్ఞౌ॥ శ్లో॥ గురుభూసురదైవదూషకా, స్వ్వకృతైనోఽంధవృకో విమృష్టతత్త్వాః। కలిసంకలితాత్మకాః ప్రబుద్ధాః పరభూభృత్కటకాంచితా శ్చరంతు॥ శ్లో॥ ఏతాదృగ్గ్రంథనిర్మాణే లోకజ్ఞానాదికారణే। భవంతావేవ దక్షౌద్వౌ కింకవీంద్రప్రఘటాహరీ॥

పంచాగ్ని మార్కండేయశాస్త్రి. కవిగిరితాలూకా
పోలవర గ్రామవాసి ప్రకృతే పాతగుంటూరుపురవాసి.

శ్రీరామకృష్ణకవులు గురువిందాపరులగుటచే నన్యులైనను శిష్యవృత్తి తుల్యమగు నిట్టిగిరతామ్నాయమును దమచేఁ జెప్పించుటచే నెంతయుఁ బ్రశంసనీయులే

తే గీ *అమ్మపుట్టిల్లు పీకింజరమ్ముదావి
“లంజలకుఁ బంజరం” బనెడుంజెనంటి

---

వారు చెట్టెక్కి కోకిలమ్మలైరి తమ సదుపదేశములను వినరు సరికదా, ఏవియో సాహసప్రియుక్త శతకాదులనుగూడ రచింపసాగిరి ఏదియో తీగఁ ద్రొక్కిన వారు దారితప్పినట్లు వీరిప్పటికిని దోవకురారు. కావిందు వారికై యమర్చిన గ్రంథము వారికొక్కరికేఁ గాకున్నను లోకమున కంతటికి నుపకారకము గాక తప్పదు

స్కూలుమాష్టరు. శిష్ట్లా వెంకటసుబ్బశాస్త్రి
అప్పాపురం బాపట్లపోష్టు

శ్లో॥ స్వచ్ఛందప్రసరత్సుధారసఝరీ మాధుర్య పారస్ఫుర । ద్దీర్ఘోదార శతావధాన కవితాసింహాసనాధ్యాసినౌ । ఈషన్మాత్రనిబద్ధ సర్వకుకవిప్రాగల్భ్య గర్వ గ్రహౌ । శ్రీమత్తిరుపతివేంకటేశ్వరకవీంద్రౌ శిష్యకల్పద్రుమౌ॥ శ్లో॥ అంగీకురుతం కృపయా, చంపకమాలాం మదర్పితామేతాం, ఇత్యభివాద పురస్సర మద్య ర్థనమాతనోమియువాం॥

చ॥ కలి కలుషోన్మదైకమదఖండనచండసరస్వతీసము, జ్జ్వలనయవాన శౌండ మపవారితవైరివృథావితండమై, వెలపెడు గీరతాగమము పీనులవిందుగ విందు నెల్లవా, రలము పఠించినారము పరాపరమూర్తులరైన మీకు శిష్యులు కలి పూరుషుల్ గురుయశోఽసహనమ్మునఁ దమ్ము మిమ్మునుం, దుల విడుకోఁదలంచి నరితూఁగభ్రమించియు మీయశంబు దోం, గిలు పవిఁబూన దానిఁ దమగీరత మెల్లెడ వెల్లడించె మేకులువిగియించి లాగితిరి కోయని కూయఁగ సర్వముండన, మ్ముల జరిపించి మించితిరి మూలముడుంగఁగఁజేసి మేల్మిసుం, గులఁదవిలింప నెంచితిరి, కోయిల లోర్చునె యట్టిధాటికా, బిలిబిలిమాటలు వ్నగవుపేఁతలనుం దగవంచు మీవిపక్షులకు జగమ్మెతాఁదెలుపఁ జొచ్చె. పికోద్ధతి చచ్చె. మిమ్మె భూ, వలయము మెచ్చె మీయశమభంగురమై కడుహెచ్చె . వైదుషీ. బలుఁధు నుగాను నన్నొక చిన్నశిష్యుఁగాఁ, దలఁపుఁడు శైవశేషుఁడ .. గమలాపురినుండు దుఁ గడ్పమండలిగా॥

శైవశేషశాస్త్రి. కమలాపురం, కడపజిల్లా.

*(రామకృష్ణ మహాభారతము, వింజరపర్వమునుండి)
శ॥ వింజరము ..వేశ్యా (లంజల) పంజరము .."

నీవు నను(గాని యెవ్వరినేనిగాని
యెట్టి తిట్లు తిట్టిన గణియింపవలెనె? 194.

సీ అలయయ్య నెఱు(గుదే యతఁడు † పాచకమౌళి శాకనీకగుఁ జుమ్మికల్లివంక
అలకాప్రినెఱుఁగుమవతఁడువంటలవాఁడెయతఁడు బావకుణ్ఞాతియగునొకాఁడొ
*"మేల్మి" మీయాతఁడేమిక్కుటంపున్ ధూమపాయిజాదరి గ్రామపాచకుండు
ఇంకనొండొకక్షేచండ్రు(ఁ డెల్లభూములనమ్మి యేమిచేసెనొ? నీకునెఱుకపడదె

తే గీ ఇట్టియాత్మసంబంధులకెల్లఁ దవుల
వింజరమ్మును దిట్టితి. వింజరమున
కిక్కడకు నేమి సంబంధ? †మిట్లనాకు
నచటనుండినయంత నేమయ్యెఁ బుత్రి

గీ పాచకత, యాచకత, నీళ్ళుమోమపనియుఁ,
గృతమమఱచి యవాచ్యముల్ గిలుకువాని
పనికిఁ దుల్యమ్ములమకోకు, పడరువారు
నరకమున వారినేటికి నవ్వెదీవు?

ఉ ఇంజరమేమి చేసె మతిహీను వినుకా గని పిత్రికల్మి *"నీ
కుం జన దిట్టిదుర్ణయము, కూళవుకాకుము, వేంకటేశు ప
త్కంజరజంబ నీ విపుడు కాఱలు పేర్చినలాభమేమి" నాఁ
"లంజాపంజరం" బయి యలందురు నే? "కవికుంజరం" బరే? 196

(† సీ॥ . జీ॥ పాచకులు, యాచకులు, నీళ్ళుమోమవారు గలరు కొందఱు విం
జరగ్రామమందు") (రా. కృ. శా. విం. ప. చూ )
(* ఉ॥ పింజరమందు మేల్మిబంగారమువంటి న్యాయపథగాములు . "సీ॥ ...
అహిఫేన ధూమపండాదుల సేవించి యపగతభాగ్యులై నట్టివారు ..." జూడం
బాడి యప్పులపాలై న యట్టివారు,) (రా. కృ. శా. విం. ప. చూ )
(‡వెలయాండ్ర నమర క్తిగలయాండ్రుగా నమ్మి యర్థమ్ము గోల్పోయినట్టివారు")
(† తే॥ అట్టివింజరమునఁ జెర్వుగట్టునరివి. బెంకుటిలు గట్టికొవి యుండె వేంకటే
శుఁడు") (రా. కృ. శా. విం. ప. చూ.)
(* క॥ .. కొందఱు విద్వ. ద్గణమునధిక్షేపింపవ్ గణఁగుదురు")

షరా:— ఈ పద్యమునందేమి. దీనికిఁ బూర్వమునను న్న. 104. 105.సంఖ్య
లుగల గీతములందేమి, వెం॥ రా॥ లెవరిని మనమందుందుకొని, కుంతలు, గుణహీ

సీ. కాశికాపట్టానఁగలవిజ్ఞుఁడొక్కండు విన్న బర్హిర్ముఖునిం బొనర్చె
నైజాముగాజ్యమ్మునఁ గలవారెందఱో నీపేరు వినుటకే యోప మనిరి
కడప కర్నూల్ వఱక్కఁగలప్రాజ్ఞులెల్లరిఁ గలిపురుషునిగాఁగఁదలఁచుచుండి
రల్ల నెల్లూరుపై పంతకుమున్నె విన్ బలితునిగా వ్రాసి పంపఁదొడఁగి

గీ. తెలిఁగి విజయనగరము నీ హేయదశను
దెలిసికొనియె గుంటూరు నీ చులకఁదనము;
ఇంజరంబును గూసిన యెద్దెకూఁత
లెన్ని గ్రామమ్ములను గూసె దెలుఁగఁ జెపుమ. 197

శా. ఏయూరిఁ దెగదిట్టనేమి యగు, నీవెవ్వారలఁ గొట్టి నే
మౌ, యాథార్థ్యము దాఁగ, దింజరము మాటట్లుంచు నీవబ్బలట్
నీయాత్మన్ గనుపట్టవే, అదినిను "వ్నీచుండ వీ" వంచుఁ దా
రోయఁ మానెనె ? దానిఁ దిట్టకొను పేరున్ రాదు నీకోలికిన్. 198

గీ. రమణ శ్రీలక్ష్మినరసాపురమున మొన్న
రావు శ్రీచెల్లయాంబకు రాణయెసఁగ
జరిగినది షష్టిపూర్తి యచటికి నీవు
రావు, బావయు రాఁడు. మీచేవదెలిసె. 199

(1914 సంఽ నవంబరు నెల 17 తేదీ మంగళవారం శశిలేఖనుండి)

షష్టిపూర్తి. అవధానములు.

ఈనెల 9 వ తేది సోమవారంనాడు చెల్లాయమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తి మహోత్సవము జరిగినది. వెంకటరామకృష్ణకవులను, తిరుపతివెంకటకవులను అవధానములకు శ్రీ చెల్లాయమ్మా రావువారు పిలిపించగా మొదట నప్పుతించిరి. అంత కార్యక్రమ పట్టికలు అచ్చొత్తింపించిరి. ఏకారణముచేతనో

---

నులు, పంకరులు, లోనగు నీచపదములతో దిట్టమొదలిడిరో వారలెల్లఁ దగు మాత్రము సాహిత్య సౌహిత్యములు గల్గి కవితచెప్పఁ గలవారనియు, సంపన్నగృహస్థులనియు పింతగ్రికృతఘ్నతకు రోయుటచే సకలము చెఱిగిన వారియెదుట నేమియు ననఁజాలక యిట్లు తిట్టబూనిరనియు, నెఱుఁగఁదగు, మఱివారివే కాక గ్రామము నెల్లఁదిట్టదొరఁకొనుటచే నాగ్రామమునందలి వారలెల్లి వీరి కృతఘ్నతకు నేవగించుకొనువారేయని విస్పష్టమకాన వ్యాఖ్యాన మన పేక్ష్యమ.)

రామకృష్ణకవులు వచ్చుటకు వీలులేనట్లు సూచన చూపింప నాకార్యక్రమ పట్టి కలు వదలి, తిరిగి కార్యక్రమపట్టికలు ముద్రింపించి .. 6 వ తేదీ తిరుపతి వేం కటకవుల శిష్యులలో నొకరగు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి చేతను అష్టావధానము చాలా బాగుగా జరిగినది. రు 116 లు బహుమాన మొసర్చిరి ...అవధా నులకు రెండు సూటపదార్లు బహుమాన మిచ్చిరి. తిరుపతి వేంకటకవులకు వెంకటరామకృష్ణకవులకు సమావేశము కలుగుచున్నది యెద్దియో వైచిత్ర్యముం డునని అనేకయూళ్ళనుండి చాలమంది జనము వచ్చిరి . శ్రీరాజా చెల్లాయ మ్మారావువారి వంటివారే పిఠాపురం అస్థానమునకు సంబంధించినవారు పిలపిం చినప్పుడు సభకురాని వెంకటరామకృష్ణకవులను, మరి యేరాజులు వీరికి తిరుపతి వెంకటకవులకును సమావేశము చూపించి సభ చేయింపగలరు ఇంక యిట్టి వూహ యెద్దియైను ఎవరికయిన నున్నయెడల౽ అద్దిమానుకుందురుగాక

ఇట్లు,
తులశి విశ్వనాథము.

---

చ. "అనవ" లటంచి మిమ్మెఱుఁగు నంతకు మున్నె జగంబుః చెల్లమా
జననికి షష్టిపూర్తి. మనశాస్త్రికిఁ దిర్పతి కిష్టిపూర్తి. భూ
జనులకు దుష్టిపూర్తి. ధృతిచాలని బావకు నష్టిపూర్తియున్
చనరుకతాన సర్వవిదితం బది యన్యో విఁకేమి వ్రాసెదో ! 200

చ పిలువఁగలేదొ ? మిమ్ములను, బిల్చిన "వత్తు" మనంగలేదొ ! పైఁ
దలఁ కుదయింపలేదొ ? కలత త్వము లోక మెఱుంగలేదొ ? య
న్యాయ నటుబుంచు, శోకరుఁడు యోగ్యుఁడు సూర్యవిభుండు రాజబం
ధులను నిజం బెఱింగి రవి తోఁపదొ ? నీమదికేవి యర్పకా ! 201

గీ. సకలము నెఱింగియును నిన్ను సాఁకువిభుని
మోముచూచి విన్నేమియు మొగము నెదుట
నాడకుండిరిగాక, నీయనృతములకుఁ
బార మున్నదె ? నీగుట్టు బయలు గాదె. 202

ఉ. ఈఁవొనరించుదోషము లనేకము. లందును పింజరంపు భూ
దేవులతోలి తేగు టది తీరవికోసము. వారిపాపముల్
కేవలభక్తి మ్రొక్కు మలిగింపకు. 'మాచెదుకూఁత లెల్ల నా
బాప విభించినాఁ" డనుచు వారికిఁ దెబ్బము శాంతి కల్గెడిఁగా. 203

ఉ. చూడఁడుగాక చూచునెడ సూర్యనృపాలుఁడు గూడ వేంకటా
ద్రీడవమాన మొప్పినను దీనికి నొప్పికొనండు. గ్రామమం
చేఁదొ యొకండు నీకు సరియే యగుఁగా కది కారణమ్ముగా
గాఁగ దిట్టిపోసెదవె గ్రామమునెల్ల;వివేకి సైఁచునే. 204

ఉ. ఎప్పుడుగాని సూర్యనృపుఁ డీవును బావయువాఁడయు తప్పుడుం
జెప్పులమారి పిప్పినుడిచెయ్యాలు తాఁ దిలకించి యుండఁ, దె
ల్లొప్పెడిఁ జూచెనేని. యతఁ దొప్పిన నొప్పుత. మేముమాత్రి మా
యొప్పులకుప్ప యొప్పినటు లుల్లమునం దలపోయ మప్పకా. 205

ఉ. ఆయన దర్శనమ్మునకు వందని వారము మేము. కాకశా
శీయము గాఁగ నాన్నపనిలింపుఁడు మాసభ కేగుదెంచుచొ
ప్పాయితమయ్యెఁ గాని యది యంతటి భాగ్యము లేనిదయ్యె. లే
దా, యతఁ డిందు కేమనునొ యానుడు లిందు లిఖింపకుందుమేః 206

చ. ధనమిడి పత్రికన్నిలిపి "తజ్ఞులమెప్పును గొం" డటంచు న
య్యనఘుఁడు సెప్పఁగాని "కవిసంతన కేల నుపానహమ్ము గై
కొని మరియాద సేయఁ దగు కొంచె నుదు ల్లిఖియించి పాప భా
జనమగుఁ" డంచు నాన్నపతితండ్రిఁడు చెప్పవనంగఁ జెల్లనే 207

ఉ. తిరుపతి వేంకటేశ్వరుని దేవుని దిట్టెడివీకుఁబ్రాఁతె ? యిం
జనము. భవ ద్విధంపుమనుజమ్ములు లే ర్ధను జన్మ లుందుఁరి పీ
దురితపు ధోరణిన్ గడకుఁ దోఁచుచుఁ దిర్పతివేంకటేశుఁ డిం
జరపురవాసులున్ సుఖమొసంగి క్షమింతురు గాక నీక మైః 208

గద్య

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరవిరచితంబగు విగ్రహారాధనము

స ం పూ ర్ణ ము.

---

*శ్రీమత్పరదేవతాయైనమః*

# లోకాభిరామాయణము




## * చతుర్థభాగము *

# గ్రంథ పరిచయము

(షష్టిపూర్తి ముద్రణమునుండి)

ఈ గ్రంథము ముఖ్యముగా సత్యనిర్ధారణమును గూర్చి ప్రవర్తించినది. అందులో ఈ నాల్గవభాగము మఱియు నాయంశము స్థిరీకరించును. వెం॥రా॥ కవులు తమ మహాభారతములో, వెం॥ శా॥ గారు తమకు స్వప్నములో కనపడి యేమో ప్రసంగించినట్లును, పిదప చిన వెంకటశాస్త్రిగారు ప్రత్యక్షముననే తమతో నేమో పలికినట్లును వ్రాసిరి ఈతుదికల్పనము చిన వెంకటశాస్త్రిగారు గతించిన రెండు సంవత్సరములకు బిమ్మట చేయబడినది ఈ యసత్య కల్పనమును రూపుమాపుటకే ఈ లోకాభిరామాయణము రచింపబడినట్లు ఇందలి పద్యము లనేకములు స్ఫుటపఱచెడిని ఇక నిందలి కల్పనమును గూర్చి మాగురువుగారొక యైతిహ్యమును చెప్పిరి వారి యింటనొక ముసలి దాసి పనిచేయుచుండెడిదట ఎన్నడును దొంగతన మెట్టిదో యెఱుగని యా యమాయికురా లొకనాడు కర్మము చాలక కడు స్వల్పమూల్యము గల ఇత్తడి వస్తువొకటి దొంగిలించెనట పిమ్మట నా సంగతి విముడ్చుకొనజాలక ఆమె తనలో తానే గొణిగికొనుచు దొంగతనము బయటపెట్టు కొన్నదట. అందుమీద, మనస్సుయొక్క స్వభావము సత్యమునందే బద్ధదీక్ష మగుననియు, దానిని ఆత్మఅన్యథా త్రిప్పినపు డాతని యాజ్ఞ చొప్పున బ్రవర్తించియును బిదప దన స్వభావమును వదలకొనక లోలో విచారించుచుండుననియు తోచి, వెంటనే ఈ గ్రంథరచనమునకు గడంగిరట.

తండ్రికి అన్నము పెట్టక ఇంటినుండి లేవగొట్టినట్లు రామకృష్ణమహాభారతమున వ్రాసిన విషయము శ్రీ శాస్త్రులవారు బందరులో నున్నప్పటి కాలమునకు సంబంధించినదగుటచే నందలి సత్యము నస్మదాదులగు నిచటివారెందఱో యెఱింగినదియే కావున విస్తరింపబనిలేదు

ఆ యీ యసత్య కల్పనములచే శ్రీశాస్త్రులవారి కొదలు మండినప్పటి ఆవేశమున నప్రయత్నముగా వెడలిన యీ గ్రంథ కవితాధార శ్రీ తి॥ వెం॥ కవుల రచనముల యందు విలక్షణతాస్పదమై, ఆంధ్రభారతికి నపూర్వాలంకారము గూర్చుచున్నది. రసికజన హృదయంగమములగు నిట్టి రచనలు పాశ్చాత్య భాషలయందెన్నియేని గలవు.

కొట్టూరి వేంకటేశ్వరరావు.

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

## లోకాభిరామాయణము

ఉ. శ్రీపతి వేంకటేశకవిశిష్యుఁడు వెంకటరాముఁ డొజ్జలన్
బాపములాడి యాడి, కడుఁ బ్రిల్లడుఁడై యది కారణమ్ముగా
నేపఱితాల్మితో నొకట వింటనె వందుచుఁ గాలయాపనం
బోపికఁజేయుచుఁగా మదికి నూఁటగల్గమి నిట్లు పొక్కెడున్. 1

మ. అరరే! యేమి మహాద్భుతంబిది మనోవ్యాపార మాపంగనే
దురహంకారి వలంతి? నన్నిది "గురుద్రోహమ్ముగావించి, తె
క్కఱచెన్ దీనిఁ దరింతువోరి?" యనుమన్ గర్జించుఁ దర్జించు నేఁ
దరణోపాయము చెప్పఁగాఁగలనె యోదైవంబ! యోజింపుమా 2

శా. నా మాటట్లులెయుంచు, మానవపశు వ్వన్నేరు ప్రశ్నింతు? రీ
వేమో సర్వమెఱుంగు నేతవని విన్నేరేనిఁ బ్రశ్నించుచో
నేమాడ్కిన్ బ్రతిచెప్పనెంచితివొ నా కింతేని వాకుప్రిచ్చు మో
స్వామీ! నీమహిమం బెదేని యొకత్రోవన్ జూపికాపాడదే, 3

చ. గురు వల వేంకటేశ్వరుఁడు కూరిమిబిడ్డనిగా గణించి వ్యా
కరణమొసంగెఁ, దచ్చరణకంజరజమ్ముగ నుంటి, నెన్నియో
పరమరహస్యముల్ కవితపట్టున నెట్టనఁ దెల్పెఁ, గన్నులం
దెఱచితి వక్కటావః నెటు దేవుఁడ! నీకడఁ బొంకనేరుతున్. 4

ఉ. ఆతఁడు వెట్టె దీపమిది, యన్నము నొద్దను గూరుచుంటినా,
యాతని పేరె జ్ఞప్తికి రయమ్మున వచ్చును బూటపూట, కే
మీ, తగదే? కృపాళుఁ డతఁ డిచ్చిన విద్దియచేతఁగాదె యీ
జీతపురాళ్ళు నాకు నృపసింహాంతతాన లభించు టెమ్మెయిన్. 5

చ. మఱపుఘటిల్లి వగ్గురుఁడు మన్ననమన్నలు, తోడివాఁడు ద
బ్బఱలకు దింపఁగా దిగితి, బాపములాడితి, నాడుమంటి, ను
ర్వర నెవఁడో యొకానొకఁ డపాత్రుఁడు "వహ్వారె" యన్న నేమి, యె
ల్లరును 'గృతఘ్నుఁ డితఁ' డనులాగున కగ్గముగాఁగ నేర్పితిన్ 6

ఉ. నాతెలమోమువాఁతలకు, నాచెదుచేఁతలకుం బదింబదిం
జేతమునందు నొచ్చికొని "సీ" యనువారలె యెల్లవారు, నా
రోఁతల కేరు నంతసిలిరో, యలవా రల "వేంకటేశ్వరా
రాతు" లటంచు నామదిఁ గరమ్ము నెఱుంగు సహేతుకమ్ముగన్ 7

ఉ. కొప్పరపుంగవీశులకుఁ గోరిరి గొప్పకుఁగాఁగ నాసనం,
"బెప్పుడు నేరు గోరఁదగ" దిట్లని పొఁజ్ఞులు సవ్వఁ గొంద,ఱా
తప్పున కొప్పఁ డగ్గురుఁడు, దానికిఁగాఁ గలహించి యోడి యే
తప్పదుఁగూఁతలో వదరి తజ్ఞ గురు వ్విరసించి రాఘనుల్. 8

చ. గురుఁడు సహాసనం బిడఁడ కొప్పరపువారికిఁ నేఁడు కారణాం
తరమున నెట్లు బొంకినను దానసమానెడ నేనుగూడ వి
షరమున కొప్పఁబోనవి కటా! పరికటంబుగ నేరెఱుంగ? ర
క్కరముబరాని కైతలకు గౌరవ మెవ్వఁడు పేయనొప్పెడున్? 9

ఉ. సీమకుసీమ యేకమయి చేయు మహోద్యమమెల్ల వమ్ముగా
నామెయిఁ దాను బల్కు నుడు వాగమవాక్యముగాఁగఁ బాండితీ
ధాముఁడు మద్గురూత్తముఁడు తద్దఁ బ్రశస్తికినెక్కునాఁ డిటవ్
నామదిఁ బొంగుమోదమది నమ్మునొ లోకము, నమ్మదో కదా? 10

మ. శివరామాదినతీర్థ్యులం గలపి యాసీమన్ గురుస్వామితో
గవితాసత్ప్రథలన్ మెలంగఁదగు నక్కల్యాణముల్ నోఁచుకో
నెవరిన్ జూడఁగలేని హేతువునఁ, బోపీ, దానికే మెట్లొ త
త్ప్రవిధం బాత్మమువంబు తెల్పఁగల పత్రిం బంపినన్ జాలదే. 11

ఉ అంతకుఁగూడ నోచికొననట్టి దురుద్యమపాతకమ్మునకా
సంతతమున్ మునింగి, పయి స్వాంతము చోరునిభాతి డాఁచి, శ్రీ
మంతు గురూత్తమున్ దెగడు మూర్ఖురు కత్తృణమాత్రులేని "వా
రెంతకుఁ జాలువారె" యని యేఁ బ్రకటించితి వ్యర్థవాక్కులకా 12

ఉ. చేసితి మెన్నియో గడుసుచేఁతలు వారలు నేముఁగూడి, పైఁ
గూసితి మెన్నియో దురుసుఁగూఁతలు, సర్వము గాలిఁబోయె, "సే
బా" సన మద్గురూత్తముని బ్రహ్మరథమ్ములు పట్టఁజొచ్చి, రీ
చేసినతప్పుచేష్ట లవి సిగ్గుల చేటయి మమ్ముఁ బీల్చెడిన్. 13

ఉ వారికి దబ్బఱల్ గిలుకువారికిఁ గొప్పిపువారి కెవ్వరో
ధీరవిచారుఁ డొక్కఁడెద దిక్కు డిగకా దగుబుద్ధిచెప్ప దు
ర్వారిణి కట్టిపెట్టిరఁట ః తొల్లి కడుంజెడుతోవఁ బోయియుకా
వారలు నేఁడు నెమ్మదికి వచ్చిరి, మాగతి యిట్లె పొక్కెడిన్. 14

ఉ. తజ్ఞ డొకండు తాదృశుఁడు తారసమై, ననుఁ బాపఁజేయు దు
ష్ప్రజ్ఞాని వేదులాన్వయజ భగ్నమనోరథు దుష్ప్రగల్భతా
భిజ్ఞుఁ జివాట్లువైచి యవివేకము వాపిన, నేను ఎత్కృతా
ప్రాజ్ఞతకోసి కొప్పరమువై ఖరి మిన్నకయుండుదుంగదా. 15

మ అటుపై నిప్పుడు రోయు లోకులె "సెబా" వంచున్ ననున్ మెత్తు, రం
తట మద్దేశికుఁ డాగ్రహమ్ము విడి ఛాత్రశ్రేణితోపాటు వి
స్ఫుటకారుణ్యము నాపయికా జిలుకు, ధీకూన్యత్వజన్యైనస
చ్ఛట నానాఁటికి లోఁగఁజేయుటకుఁ బశ్చాత్తాపమే చాలెడిన్. 16

ఉ అట్టి గురూత్తమున్ దెగడునట్టి కృతఘ్నుఁడ, నాదుజీవితం
బెట్టిది ః యేరు మెచ్చిన, "దిసీ" యని యెల్లరు రోయ నూఁకే
పొట్టకుఁగాఁగ గృష్ణుఁ డెటుపొమ్మన నట్టులె పోవుచుంటి, న
ట్టిట్టనఁజాల, వావికదియేమొ ఋతోక్తులు రావు నోటికిన్. 17

క. కష్టించి వాఁడు "విగ్రహ, పుష్టియు నైవేద్య నష్టి" పొంపిరివోఁగా
శిష్టులు "ప్సీ" యనుకూఁతలు, సృష్టించు న్నాకు వణఁకుఁ జే యప్పట్లన్.

మ. పరలోక మ్మొకఁడున్నదం చెఱుఁగఁ డప్రాజ్ఞుండు వాఁ, డంచుచే
దురితంబన్నను వెఱ్ఱదియఁ, డిట నేడుఃఖించి యేమౌఁః బర

స్వరమున్ జంటగఁ గై తసెప్పుటకు విచ్చల్ పూనియుంటన్ బర
స్వరదోషమ్ము వరస్వరమ్ముఁ గుదువఁగా బ్రాపించు నెద్లో యిఁకన్. 19

చ తిరుపతి వేంకటేశ్వరుల తీరునఁ బేరులు కల్పి కైతమున్
గిరిము రచింపఁ జూనుటనుగాదె యిం'ఒల్ ఘటియించె ముప్పు. త
ద్గురుత యనేకులిట సుఖముగూర్చియుఁ ( గష్టము మా కొసంగెడిన్
బరిణతి కేమియౌనొకొ ? పాతకినై యిటు వందికుందెదన్ 20

చ అని కనుఁగొట్కులిట దొరలు నకు్రవు లాపఁగలేక. కొంత నె
మ్మనమునఁ దన్మయత్వమున మార్చిన్పుడి. వెంటనె రూక్షవీక్షణ
మ్మున వనలమ్ముగ్రక్కుచును ముందట వేదులకృష్ణుఁ దన్నమా
డ్కి వి గవి పండ్లుగీటుచు నొగిం బలుకుట నరసింహరూపుఁడై 21

శా. ఓరీ ? కష్ట ! నికృష్ట ! కృష్ణ ! గురువై రోచ్చైర్మహాపాతక
పారంభార్ణవకర్ణధార ! వితతాపత్కారినిత్యానృతా
సారాలాపకలాప ! నారక మహాసంసార బీజాంకుర
కూరాగార ! చెడంగదీసితివిరా ! గుర్వంఘ్రిరక్తు న్ననుఁ. 22

మ కడుయోగ్యుల్ తలిదండ్రు, లెక్కఁతనఁ దద్గర్భమ్మునం దీవిటుల్
పొడమన్నేర్చితివో యఘమ్మువిచఁ బప్పుంబెల్లముల్ నీకు. * నీ
కడ కేతెంచిన చిన్న వెంకన "ననుం గాదించె నాయన్నగా
ర్గడు దుర్మార్గుఁ" డటన్నమాట విజమౌఁగా ? కష్టముప్టింపవా !

* గీ. ఆంధ్రకవితాపరీక్షార్థియై యతిగొట
కబ్బ మొక్కటి గై కొని కడెమనుండి
నందియమునందుచునువచ్చె చళ్ళపిళ్ళ
చిన్న వెంకటశాస్త్రి మాయున్నబనకు.

క. వచ్చి,. యెవరడుగకయే .. వేంకటేశ్వరు కుచ్ఛితములఁ బల్కెఁబూస
గుచ్చినరీతిన్

ఉ. నన్ను విభీషణుండనుచు నవ్విన నవ్వుదురేమొకాని. మా
యన్న విధంబు న్యాయమున కగ్గముగా. దతఁ డొద్దశ్రేయమేన్
గన్నులఁ జూడలేఁడు. మముఁ గాంచియు నీసువహించు. వింకనే
మున్నది ! నాకు నాతనికి నుల్లములన్ సరివోదొకింతయున్.

మ. చిననాఁ డాతనితండ్రి స్వర్గతుఁడుగా, శిష్యుండుగాఁ జేర్చి, వి
ద్యనొగిం జెప్పి, వివాహమున్ సలిపి, తద్దన్ ముద్దుగాఁ జూచి నం
దనుఁగా మచ్చిన యన్నమీఁద నట్లు వాతప్పుల్ ప్రసంగింప న
య్యనఘుం డీవును, నేను గాఁడుసుమి నీచాచార ! వాచాటకా ! 24

క. తనతండ్రి యతనితండ్రియు, మునుపెపుడో విభక్తులైరి, మోగినాతని కీ
తని కేమిజోలి యున్నది ? యనఘుఁడు నాగురుఁడు పెండ్లియతనికిఁ జేసెన్.

చ. నగలిడు సొమ్ము వెంకన ఋణమ్ముగ దెచ్చికొనెన్, వివాహ మొ
ప్పుగుగతి నైదురోజులు మహావిభవం బలరారఁ జేసె నా
దుగురుఁడు చేతిసొమ్ము కడుఁదోరముగా వ్యయపెట్టి, యట్టిచోఁ
బగతునిగా గణించునటె ! ప్రాజ్ఞుఁడు వెంకన మద్గురూత్తమున్ 26

చ. అనఘులు "మేలు ! మే !" లనఁగ నందు సదస్యమునాఁడు పాండితీ
ధనులకుఁ దక్కు విప్రులకు ద్రవ్యము హెచ్చుగ వెచ్చఁబెట్టె, రో
వనితలువచ్చి మేళము వివాహము నైదుదినమ్ము లాడి, రా
వనితల కిచ్చుసొమ్ము గురువర్యుఁడె తా భరియించె సర్వమున్. 27

మ. "అనుగున్ వేశ్యలఁ బిల్చి పెండ్లికి ధనం బవ్వారి వెచ్చించి నా
యనగా ర్నాకు ఋణమ్ముగన్టె" నని నీయగ్రిమ్మునం జెప్పి వెం
కన దుఃఖించినయట్లు గిల్కితివి. వెంకన్నన్ గనున్ యోగ్యుఁ డం
చు నెఱుంగున్ జగ మొప్పికోదు సుమి నీమన్ జేయ నీవెంచినన్. 28

ఉ. ఇంతకుఁ జిన్న వెంకనమనీషి గతించినమీఁద నీవు దు
శ్చింతవిటుల్ లభింపఁబడి పెద్దమహాదురితంబు చచ్చి స్వ
ర్గాంతరమందు నున్న యనఘాత్ముఁ గృతఘ్నునిగా నొనర్చి నా
యంతటివానిఁ జేసి, సుకృతాత్మువిజేయుదె నన్ను నీవిఁకన్ ! 29

---

ఉ. ఒండ్లన నేను బాల్యమున మందుడఁ జేసి తనంతదానె నా
పెండ్లికిఁ బెద్దయై తనకుఁ బ్రేముడిగల్గిన సానిమేళమున్
గొండ్లికిఁ బిల్చి యప్పునొదఁగూరిచె నా; కటుమీఁద నెన్నియో
యేండ్లు శ్రమించి యాఋణము నీఁగితి దైవమెఱుంగు నాగతిన్.

(రామకృష్ణమహాభారతము, విజయదశమిపర్వము చూ)

ఉ. ఇప్పటి కాఱువత్సరము లీకలహమ్ము జనించియాయె. నీ
వెప్పుడు వెంకనన్ గలిసి యీకలహమ్మున కాపెయుండెదో,
యిప్పటిదాఁక దాఁచి యతఁ డేగిన వత్సరయుగ్మమప్పుడా
చెప్పెద? వాతఁ డున్నపుడు చెప్పినఁ జెప్పునఁ గొట్టితీరఁడే? 30

మ. అతఁ డున్నపుడు నీవిటుల్ గిలుకుచో నాశ్యేతరు విన్నన్ను సూ
నృతదూరున్ దగుశిక్షసేయుననియే యిన్నాళ్ళకీమాట గ
ల్పితమున్ జేసితి. వెప్పుదేనఘము నిన్ బీడింపకేపోదు. సూ
నృతవైరుల్ చనుత్రోవఁ బోవునపుడేవి న్నీకుఁ దార్కాణమౌ 31

ఉ. "పెండిలి తద్దినమ్ముగతిఁ బెట్టుఁడు, తద్దిన మాచరింపుఁడీ
పెండిలిగా" నటంచుఁ జినవెంకన చెప్పఁడు, చెప్పుదేబెలం
దుండఁడు. తావృశుం డెటు "విజోపమయమ్మన సానిమేళమున్
మిండఁడు భార్యత పెట్టె" నని మిక్కుమ నీకథ సుంత చెప్పుమా. 32

ఉ వెంకన చెప్పలేద యిటు. వేఱొకఁడేనియుఁ జెప్పలేద. నీ
వింక నిటుల్ లిఖింపుటకు హేతు వెఱింగితి విమ్ము. మద్గురున్
వెంకటశాస్త్రి "మిండనిగ" వెల్లడిసేయుట. కంతమాత్రనే
కుంకెనె తద్యశఃపరిసరకోమలశీతలసాంద్రచంద్రికల్! 33

*శా. "చెల్లారెడ్డి" యటన్నపద్దె మెటులో చేఁజిక్కె మద్దేశికుం
డుల్లమ్మున్ బిగిలించె దానిఁ గొని యాయెచ్చెమ్ము నెట్లీగఁగాఁ
జెల్లున్ "దక్కవనం బదేరిదొ" యనన్ జేజేలు శిక్షింతు. రే
కల్లల్ గూసిన లోకమెల్లొ యెఱుఁగుం; గాపట్యముల్ డాఁగునే. 34

మ పరకీయామగనేచ్చ త ప్పదియు సంపాదింపఁగా నేర క
త్తరుణీరత్నముచేఁ జివాట్లుతిని పద్యాల్ చెప్పుటో తప్పెకా
కరయన్నేర్చినఁ జావుకన్న నిరయంబందుంటకన్నన్ మహా
భర. మేతత్కృతి కగ్గమై గురు వదల్పన్ గొంపముంచుంజుమీ 35

మ. పరకాంతామణు లెల్లఁ దల్లులమచున్ భావించువాడెప్పుడున్
దురితంబన్న భయమ్ముచెందు. సుజనస్తోత్రార్హుఁ డట్టింపు నా
గురుఁ డెవ్వారికి హానిలేనిగతిఁ గోర్కుల్ మీఱ వర్తించఁగా
కరయన్నీవలె నావలెన్ బర. మిహమ్మాఱన్ బ్రవర్తించెనే. 36

---

* దీనిని గూర్చి విగ్రహారాధనము చూ.

చ మనవలెఁ జేసినట్టిపని మాటఁగ మాట కసత్యమాత దా
దను బ్రియతింపఁ దొప్పికొనుఁ దక్కరికూఁతలు కూసి మున్నుచే
సిన దురితంబు పెంపుగనఁ జేతువు నీ వదియేమికర్మమో!
యన్నృతముకన్నఁ బాతకములంచు మఱొండు గనానున్నవే? 37

ఉ. మిండఁడొ గండఁడో, యతఁడు మేటికవిప్రకరమ్మునందు భు
క్కుండువిఖ్యాతి, "కావతఁడు కొంచెము నేరనివాఁడె" యన్మ, భూ
మండలి దిక్కులేకగద మన్నన నాతనిఁ జేరివేఁడి దే
వుఁడుగఁ గొల్చి నేఁడకట! పోకిరికూఁతలు గూయఁ బోయెనే! 38

చ "గురు"వని యొప్పికొం చతడు "కూళ" యనన్ ఫలమేమి? తల్లి దు
శ్చరితయటంచు వేశ్యతనుజాతుఁ డెఱింగియు గౌరవింపఁడే!
హర! హర! తల్లిపూజ్యయగు నందఱకున్ గురు డట్టులే వృథా
యఱచిన నేమిలాభమగు? నాతఁ డపాత్రుఁ డటంచు సారెకున్. 39

మ మలినుండైనను జెట్టయైన నఘనిర్మగ్నుండె యైనన్ మహా
స్ఖలదాచారుఁడెయైన నెట్టిఁడయినన్ ధాత్రిల్ గురున్, స్వాత్మజా
తులు తండ్రిన్ విడనాడరావ, సుచరిత్రుం డౌటనే యేను సే
వలు గావించితినే మదీయ పితకున్? వర్జింపనేలా గురున్? 40

మ. చెడె వక్త్రమ్మనృతోక్తులాడుకతనన్, జేతుల్ చెడెన్ సారెకున్
గడురోఁతల్ లిఖియించు కారణమునన్ గట్టా! యిఁకేలాగు క
ట్టిడినై కాలముపుచ్చనేర్తు? నెటు నా డెందంపుఁ గుందార్తు? పే
ఱిఁడినై తిగా, జెడితిన్, మహాఘ మెటు వారింపంగ నేఁజాలుదున్. 41

ఉ. అన్నయు దేశికుండునయి యాపటఁ బెంచిలిచేవి తన్ను సం
పన్న గృహస్థుఁ జేసిన కృపాళువిపై "దురితమ్ములాడె వెం
కన్న" యటంచుఁ గూసితివిగా యకృతాత్ముఁడ! నీదునాలుకన్
సున్నముపెట్టియే జలజసూతి యొనర్చెఁగఁటోలు బాలిశా! 42

చ. కలరల చిన్నవెంకనకు గాదిలిచుట్టము లెందఱేని య
య్యలములతోడఁ జెప్పికొన కందఱుకన్నను మిన్నవంచు నిన్
దలచి భవత్ప్రమత్తమునఁ దజ్జ్ఞుఁడు వెంకన యేడ్చెనేమి! నీ
మలిన మనస్క! నీమనసు మార్చెనొకో? తేత శిలావికారమో. 43

ఉ. వెంకన తల్లిగా ర్గలను వేఁడుఖువాఁడ ! భవద్దురాగతా
లంకృత దుర్వచోరచనలన్ విననేనియు విన్ శపించు నో
కుంకుడువేర ! నీయఱచుకూఁతలు రోఁతలు కట్టి పెట్టు, నీ
బొంకులు కాలిపోను దలపోటు జనించెడి నాఁడునాఁటికిన్. 44

ఉ. చచ్చినవానిమీఁదఁ జెలుచన్ గుఱుచల్లభియింతు. వాతఁడే
సచ్చరితుండుగానియెడఁ జచ్చిపిశాచముగాఁగ వచ్చి నీ
పచ్చనుమాపకున్నె ? "విను మన్ననచేసి వచించినట్టి యా
యచ్చరముల్ వెలింబఱచి" తంపు దురాగ్రహమర్త్విషోగ్రుడై. 45

ఉ. కాఁ డటువంటివాఁడతఁడు, కాఁడు కృతఘ్నుఁడు.కాఁడు తుల్వయున్
గాఁ డనృతప్రలాపియును, గాఁడు గురుద్విడపాత్రబుద్ధి, యా
పోఁడిదనెఱుంగు లోక, మెటు బొంకిన బొంకుము స్వార్థమై కటా !
పాడఱు నీవచోరచన, పాడఱ వాతనియోగ్యతాగతుల్ 46

క. కరటకదమనకులు భవ, త్స్వరూపమని చెప్పుటది స్వభావోక్తి చతు
శ్చరణము లయ్యావి నీవో, చరణద్వితయాభిమాన చతురుఁడ వరే ; 47

చ. చదునున మిఱ్ఱుపల్లములు చాతురివాల్చెడి శిల్పియున్, దుర
భ్యుదయు లవాస్తవమ్మునెడ నొండొక వాస్తవమున్ భ్రమప్రమా
స్పదులకుఁ దోచున ట్లొనరుపంగల. రించుక చర్చసేయఁగా
నవి, యిదియున్ మదిం దెలియు నద్దమునందలి మోముపోలికన్. 48

మ. శిరమున్ వంచుక యింటిలోన నొకటన్ జీవచ్ఛవప్రక్రియన్
"దురితంబియ్యది యెట్లుపోవు" ననుచున్ దుఃఖించుచున్నాఁడ. నె
వ్వరియింటన్ శుభకార్యమైన నల వా ర్బ్రాణాప్తులేయైన నే
వరుగన్ బిల్చినయేనిఁ, బోయినను మాన్రైయుండు నేమూలనో 49

శా. ఎవ తేమన్న జవాబుచెప్పుటకులేదే ! సుంత యాధార: మే
కవితా పత్రికయందుఁ జూచినను నిక్కంబింత లేదయ్యె. వా
స్తవవేత్తల్ గని యూరకుండరు, సమాధానంబు శూన్యంబు నా
యవివేకమ్మున కెంత చింతిలుదు ? నీ యజ్ఞాన మెట్లాఁగుమన్ ? 50

ఉ. నాదురవస్థ యెంతని మనమ్మున దాఁపగనేర్తు, దాఁచినన్
బో, దొకనాఁడు పెద్దతలి పుత్త్రుఁడు పుత్త్రిక పెండ్లిసేయఁగా

నాదెసకేగి యయ్యెడల నందఱు బందులు దూయబట్టికో
గా దగు నుత్తరం బెదియుఁగన్పడకేఁ దలవంచి మ్రిగ్గితిన్. 51

ఆ వె ఆణివిశ్వకులజుఁడైన కామన్నగా. ర్నను నడిగినట్టి వెన్నొ ప్రశ్న
లున్న, వొక్కదాని కున్నదే యుత్తరం, బేటివ్రాఁత వ్రాసితోటివారిఁత.

చ. చదువఁగలే దటందునొ ? వెనకా గురుఁ డాతఁడు గాఁ డటందునో ?
వదరిన తప్పుఁగూఁతల, నబద్ధము నాయవి గా వటందునో ?
కదనమునందు దేశికుని గట్టిగ నే నెదిరింతు నందునో ?
యెదియవి నెగ్గవచ్చు? నటు లెల్లరు న న్నుడికించు పట్టునన్ 53

ఉ. "చచ్చినచావు"గా బ్రతుకునంగతి దెచ్చితి వెన్నినాళ్ళటుల్
పుచ్చుదుఁ? బ్రాజ్ఞు లెల్లరును బూత్రిగఁ బాతకి వీఁ డటంద్రు, నీ
గచ్చులు కొంపవీసెఁ. గడుఁ గాఱుఱ పేర్చెకి నీదు చెళ్మ నా
మచ్చను మాపుచున్నది ప్రమాద మిదేగతి నీఁగఁజాలుదున్ ? 54

ఉ అన్నము లేకయున్ బ్రతుకనౌ, వసనంబులు లేకయున్ గుణం
బున్నెద నెట్టులో మనఁగనొప్పెడిఁ, గీరతిఁగోరి దుర్యశో
భ్యున్నతిలో మునింగి యన్యకోక్తులు గూడుగ నెట్లు జీవనం
బు న్నడిపింపవచ్చు ? విజముం దెలియంగలవారి ముందటన్ 55

చ పుంపురఁ గాగితమ్ముఁ గొని * పుత్రుఁడు తండ్రికి ద్రోహి యం చొక
ప్డఱకువు, వేఱొక "ప్డనుఁజు డన్నకు ద్రోహి" యటంచు మిణ్కెఁ, దీ
యఱపులు దూఱుగుల్ తెలియరంచుఁ దలంతువు సంతసింతు, ద
గ్గఱగలవారి కన్ను లెటు గప్పెదు పెప్పెపె మెమ్మెమేలతోకా? 56

చ గురువరు డస్మదీయనృపకుంజరునొద్దకు నొండు కాంజాం
తరమున రాఁడు గాక, మన తప్పుడుఁగూఁత లడంప వచ్చుచో

* ఆ వె. వారి వారి మాట వదియింపగా నేల
కలుషమనక మూఁడు కాళ్ళముసలి
యైన తండ్రిమీఁద నాగ్రహమంబూని
యల్లు వెలిచెనంట యాఘనుండు. (రా॥ మ॥ భా)

షరా — (ఈసంవత్సరమున వింకను గల వదరు వ్రాఁతలకు మా పురళ్ళుచిణము
జూడఁగోరెదము.)

ధరణిపుమోప్రిల నీయనృత దంభవచోరచనాపరాధ మె
క్కరణి సమర్థనీయమగుఁ గ్రక్కున నాతఁడు నోరు నొక్కుచో. 57

ఉ. ఏనునునీవు మద్గురుని యేత్తెఱ కీఁగలుగూడ గామి ల
క్ష్మీనరసాపురంపుసభఁ జేరఁగలేక మహానసంబులో
మానసమందుఁ జింతిలుచు మగ్గుటచేత నెఱింగె లోక. మిం
కేనియు "గొప్పకైన గొఱిగింపుడుఁ" గూఁతలు మాను టొప్పదే. 58

శా. "నంబీ! యేమిసహాయ" మన్న, "నెదుటన్ రాకుంటె సాయం" బటం
చుంబల్కంగతిఁ "జెల్లయాంబిక యశస్సు న్నిల్పి కాపాడఁ జి
త్తంబం దెంచి సభార్థ మేగ" మనుచోఁ దజ్ఞుండు నమ్మం, దనా
లంబం బీనుడి సిగ్గులేమి నిటు బల్కంబూని నా మిత్తఱిన్ 59

చ. మనసభ శుక్రవారమని, మామక దేశికమౌళిసత్సభా
దినమది మందవారమని ధీరులు వేఱొకనాఁడు గాఁగఁ బం
చినది జగం బెఱుంగు, గురుశేఖరుఁడున్ మన మేల యొక్కచో
టను గలియన్ వలెన్? వెసగడంగి కచాకచిగాఁ బెనంగఁగన్ 60

శా. తేనిన్ వారలు దూఱుచెందులకు? వారి న్నీవు వారింపఁగాఁ
బూనంగాఁ బనియేమి? యట్టిపనియే పుట్టన్ బ్రసక్తించుచో
నానిందోలగ మెట్టులొప్పికొనుఁ? జెల్లాంబామనం బెట్టు ల
ద్దానిన్ సైఁచెడి? నూర కేమిటి కసత్యంబుల్ గడుంబేర్చెదో! 61

ఉ. అంబకువెక్క నంబయయి, యావృతి తేనిని మచ్చినట్టి చె
ల్లాంబిక చేయు సత్సభనె యాపె కుమారుని దూఱువారు వి
క్కంబుగనున్నచో నదియుఁ "గాదనఁ దీతువుపిట్టరాయబా
రంబులతోఁ" బనేమి? యట రాజున కెందఱు గల్గ రాశ్రితుల్. 62

శా. ఈజన్మమ్మునఁ గావి వచ్చు భవమందేకావి మద్దేశికున్
రాజత్సత్సభ నీ కెదుర్పఁగలధైర్యం బబ్బఁగాఁబోదు; నీ
నై జంబిప్పటి కే నెఱింగితివి. శ్వానం బేమిసేయున్? మహా
రాజశ్రీ కిరవైన యేనుఁగని వైరం బెంత లోనుండినన్. 63

చ. మొఱఁగును గాక దూరముగ మోరవడన్ శునకమ్ము లేగ్గు ద
గ్గఱకరుగంగఁజాలునె, యొకానొకపట్టున నట్లొనర్చుచోఁ

గరిపదఘాతమున్ సయిపఁగాఁగలవే?, యెఱుఁగం దెవండు కు
క్కలఱపులు, వావదూకుల వృథార్భటులున్ మృగతృష్ణికాచ్ఛటల్? 64

ఉ "కక్కలు గూసికోఁ జెడునొకో? మఱి జంగము వ" ర్వటన్న య
వ్వాక్కుల కీవు వాఁగు చెడువాఁగు డుదాహరణమ్ము సుమ్ము. వీఁ
వెక్కఁడ! యొజ్జ యెక్కడ! జయించుటయెక్కడ! చాలుఁజాలు, "న
క్కెక్కడ? దేవలోకమది యెక్కడ?" దూరవిచార మక్కటా! 65

శా "వేఁడంబోద" మటన్న నొప్పవు, సభన్ వేరంబు సాధింపఁగాఁ
గూడంబోద మటన్న నెక్క విఁక నీకుం దప్పదుం గూఁతలన్
గాడంగూయుట తప్ప సత్కవివరగ్రామంబు మెచ్చించు నా
జాడల్ దోఁపవు, శ్వాన మట్లఱమచే శౌర్యంబగున్ మానికిన్! 66

మ తెగి విద్వత్సభలోన దేశికుని గద్దింపన్ వలెన్, దాన గె
ల్పగు, నోడేనియు సంభవించు నెటులే నొఁగాక లాభంబె యం
దగుపట్టున్ ధ్రువ, మెట్లటన్న, గురుతో నాలంబులో నోడినన్
సొగసే, గెల్చిన వేఱ చెప్పవలెనే: కూరత్వ పర్యాప్తతల్. 67

ఉ అంతియకాని "వెంకనకు నక్కర మొక్కటిగూడ రాదు, మే
మెంతయు గొప్పవార" మని యేడ్చిన లాభములేదు, దీనిచే
గొంతుక బొంగువోవుటయుఁ, గోవిదు లెల్లరు "సీ" యటంటయున్
గాంతుమకాని గౌరవము గాంచము నిక్క మెఱింగి చెప్పితిన్ 68

చ గురుఁడు స్వశిష్యవర్గమును గూడుక చెల్లమతల్లిగారి య
న్నరసపురమ్ము నేగునెడ నాకును నీకును భీతిగొల్పఁ జె
చ్చెర మన మల్లయార్యగృహసీమకు వచ్చినయప్పు డొజ్జమో
మరసి తటాల్న నీరయిన యాస్థితి దైవ మెఱుంగఁడే సఖా! 69

చ. అకళంకుండు పురాణపండ వరమల్లయ్యార్య వీథీవిత
ర్దిక శిష్యాన్వితుఁడై గురుప్రవరుఁ దర్దిన్ దంతముల్ దోమికొం
చెకసక్కెమ్మునకో యనంగ మనపై వీక్షించుచున్ గద్యెఁ గొం
దొకపే, పెందులకో యెఱుంగుదువె యార్యుండట్టు లేతెంచుటల్? 70

ఉ. పేరిఱమనున్నవా రురక పెగ్గెలు, బొగ్గులొవన్న వేఁడిదే
నీలుదయించె, వచ్చితివి నే చమదెందు సఖాంగణమ్మునన్

గూటిలో కూర్చుటో యగుటకుం బ్రియతింపు(డు. మీకు నై చు(డీ
యీలలి(బట్టి పేర్చుజ్వర మింతక యెంచక యేగుదెంచుటల్ 71

ఉ కూయుమనున్నవా రుదక కూఁతలు రోఁతలు మూల మ్రిగ్గి నే(
డాయిక మై వవందు సభ. కాయమ చెల్లమదేవి మిమ్మునుణా
"ధీయుతు" లంచు రాఁబిలిచె. దేలెడి రోజరుదెంచె. నే జ్వరం
బీయది లెక్కవెట్టకిట కిందులకే చనుదెంచితిన్ జుఁడీ ! 72

చ అణుమచునున్నవారు గృహమందున దాఁగి దురుక్తు. లన్నియున్
వితిపెడిరోజు వచ్చె. విటు పీలగునన్ చెదలోఁ దలంచి నే
నెఱుఁగఁజూఁడీ ! ఘటించె మనయేలిక చెల్లమదేవిగారు ప
ల్వారు గల నత్సభన్ దెలియఁబో ! గురుశిష్యుల తారతమ్యముల్ 73

చ వదరుచునున్న వా రుర కవాకుచవాకులు. నోఁటనొక్కఁగా
వర నుదయించె తేవి పినియంబిక చెల్లమదేవి కల్మి; మీ
కెద విదు గుండదేవి. యిదె యేఁ జనుదెంచుచునుంటి రండు. మీ
కిది కడుజక్కనైన తఱి. యే జ్వరితుండ జయింపవీలగున్. 74

చ వదరుచునున్నవార లవవాదలు నోరుకొలంది. నేఁడు మీ
వదనము కంపు సొంపు జనవల్లభు నగ్రమునన్ బయల్పడున్
బదఁడు వదస్పుటేన. విదె వచ్చితి నే జ్వరితుండనయ్యా మీ
మదమది చక్కఁజేసి మతిమంతులుగా నొనరించుపూవ్కితో" 75

శా ఈయంశమ్మను దోఁపఁజేయుటకె సుమ్మీ ! దేశికుండట్లు చె
ల్లాయమ్మన్ గననేగుచుణా. మన మొగాలా ర్తిణా బ్రివ ర్తింపఁగా
డాయణా వచ్చిన. దాతఁ దేమెఱుఁగుగట్టా ? "పీండుర్రిరా" రంచు. "లో
భీ యెంతుండిన. వత్తుఁ"రం చతఁ దెదన్ బేరాసఁజెందెంజుమీ 76

చ. స్వయముగఁ జూచియుంటిమి విశాలతరజ్వరయుక్తుఁడయ్యఁ జె
ల్లయ జననీవిదేశమున నమ్మెడ కేగెడియొజ్జ. నట్లుచూ
చియు "జ్వరితుండగాఁ" దనుచుఁజెప్పఁగ నోరెటువచ్చె ? వార్రియఁగాఁ
జే యెటులాడె ? పీకకట ! శిష్టకులమ్మున నెట్లు పుట్టితో ? 77

చ. "అనృతములాడువట్టున రవంతయు వీఁడు భయంపడండ. యిం
దునకు విమి త్తమేమి.యవి దుర్దయు విమ్ముగురించి చప్పదే

సినఁ దున కొక్క హేతువది చేకుఱె నో నయశూన్య! నీవు దే
వుని యసమర్థతన్ దెలిసి బొంకెదు వక్త్రము పూర్తిగాఁ జెడన్ 78

చ. అనృతములాడ నెల్లెడ భయంపడువా, రది నీకు లేశమున్
గనుపడ దిందు కేర్పడిన కట్టఁడిజాతులు వేఱు, వారిలో
జననమునంద నీవు పెఱుచన్ మఱిసారెకు బొంకనేర్తు, దే
వునియసమర్థతాగరిమ పూర్తిగ నీవది కెంత యెక్కెనో 79

చ జను లనృతంబు పల్కుటది "చచ్చినచావు" గఁ గొంకుచుందు, రీ
వును మనుజాండవేయగుచుఁ బుట్టియు దబ్బఱలాడ లేశమున్
మనమున వెన్కదీయ, వొకమారినవు రాయివి గావు నీవు, దే
వుని యసమర్థతా గరిమ పూర్తిగ నీవది కెక్కెనో గదే! 80

చ ఘనుల గణింపనేల? కడుఁ గశ్మలజాతులయందుఁ గూడ నీ
యనృతమునందుఁ గాలిడు దురాగతు మోమును జూచినంతఁ "ఛీ"
యనని జనుండు గల్గఁ డిటియంతయు నీవు నెఱుంగుదైన దే
వుని యసమర్థతన్ గనియె బొంకెదు వక్త్రము వక్రమైచెడన్. 81

మ అదియేవాలుక, దేనియం దనృతవాచారంభముల్ పుట్టు, న
య్యదియే మానస, మేని దీనియెడ నిత్య ద్వేషముంబూను, న
ల్లదియే జన్మము దేనిపోషణ కసత్యాలాపముల్ ప్రాపుగా,
నిది నీకున్ దెగి చెప్పుచుంటి నిటుపై నేమైన నాకేమిఁకన్. 82

మ. అనృతంబాడి భుజింప నన్నమది తా నన్నంబుగా, దట్టి లం
దిన బిప్పయ్యది బుప్పిగా, దనృత వక్తృత్వమ్మునం జేయు జీ
వనమున్ జీవన మొందుఁగా, దనృతవాక్ప్రాగ్భారముల్ రోయకుం
డిన యేప్రాణియుఁ బ్రాణిగా దెఱుఁగుమీ! నీకేను వ్రాక్రుచ్చితిన్.

సీ. అనృతకల్పనల సారెకొనర్చు ఖలుకన్నఁ బ్రాణమేలేని శవంబుమేలు
దస రసత్యాలాపరసికుకన్నను "బఱ్ఱు"మని మోగ్రు గర్దభంబైన మేలు
సత్యవాఙ్మధురసజ్ఞతలేని జడుకన్నఁ "గీ" యంచుఱుమ కీచురాయి మేలు
సూనృతేతరవాగధీను వక్త్రముకన్నఁ, గశ్మలంబగు తూము కాల్వ మేలు

తే గీ. ఎపుడు ననృతోక్తులాడెడి కృపణుకన్న
శ్వపచుఁడే మేలు, వర్ణపరిస్థితియేల

ఇంత యెఱుఁగని నీకు నేనేమి చెప్పి
యేమిసార్థక మోయనృతామయాత్మ ! 84

సీ. ఎఱిఁగి యనత్యదుర్దురిత పారావారపంకమ్మునం దిగఁబడకు బావ !
తెలిసి యనృతవచఃకలుష నారక కూపపర్యంతమున నిద్రఁబడకు బావ !
అరసి తథ్యేతరవ్యాహారనీహారపటలమ్ములోఁ జొరఁబడకు బావ !
చూచి సూనృతవచశ్చ్యుతిమయామయ సన్నిపాతమ్మునన్ బ్రుంగఁబడకుబావ !

తే. గీ. నీకొఱకుఁ జెప్పుచుంటి మన్నింపు బావ !
ఆత్మ వంచింపనెంచకుమయ్య బావ !
క్రిందుమీఁదులెఱింగి వర్తింపుబావ !
అనృతగతి వీడి వర్ధిల్లుమయ్యబావ ! 85

శా. నీదుర్మార్గపుఁగూఁతలన్ గురుఁడు వన్నెందక్కునం జేసిటుల్
వాదింపంజాలి. యూరకే యనృతముల్ వాపోవు నీదుర్మద
ప్రాదుర్భావ మొకింత దింపుటకునై వాకుస్రుత్తు. నింకేని మ
ర్యాదాపద్ధతిఁ బట్టిపోయి యఘపారావారముల్ దాఁటుమా 86

మ. మనమిల్లే తెగగిల్కుమంటిమి. గురు న్మన్నించువా రెక్కడై
పవిగాఁ బిల్వఁగవంపి యుత్సవములన్ బల్మాఱుఁగావించి య
ర్చనలి వ్వారిగ సల్పుమండిరి హతాశాపాశబంధంబు నీ
జననంబుల్ వృథసేయుమన్నది. పగల్ సాధింపలే మిమ్మెయిన్ 87

శా. త్రాగుంబోతువిధానఁ బూర్వపర సందర్భమ్ములే కెట్టులో
వాగన్ దాని యశమ్ముగల్గునె ? వృథోపాలంభముల్ నోటిచే
రేగా కన్యులగౌరవమ్మున కొకింతే వంకముంగూర్ప. వే
లాగో సత్సభలో నెమర్పుటకునై లావింత యార్జింపుమా 88

ఉ. "తీతువుపిట్ట" యం చతనిఁదిట్టితి. భావిఫలం బొకింత నీ
చేతమునం దెఱింగితివె ? చెచ్చెరనోటికి వచ్చినట్లుగాఁ
గూఁతువు. కొంపఁ గూలునముకో. విధియొక్కటికర్మ. మాతనిన్
బూతులుదిట్టినాఁడనని పొంగె, దెఱుంగవు వచ్చుదుర్గతుల్ 89

ఉ. చూడుము కొప్పరిపుఁగవులు. కూరుల ప్రేరణఁ జేసితిప్పుడుం
జావలఁబోయి పోయి పయిజాడ్యమువీఁడి కృతాపరాధముల్

ప్రీతయె పొవఁగా నొకట వెన్కటి తుంబురు కెల్లఁదగ్గి మో
మోదము నుండి యిప్డిపు డయోగ్యత పీఠఁదొడంగి రెమ్మెయిన్. 90

చ. మనల ననుగ్రహించుటకు మచ్చరపున్ దురితంపుఁ గూతలన్
బ్రిణయముకల్మిఁ బంపుగతిఁ బంపెడివారలు లేకకాదుసూ !
గౌనకాని కొప్రిపుంగవులు కుర్రింగిన హేతువు, వార లిప్డు లే
చిన మన కొక్క యుత్తరము చేరదు సర్వము వారికే చనున్. 91

చ "తిరుపతివేంకటేశ్వరులు దేబెలు, కూళలు మోసకుల్, కవి
త్వరచననే యెఱుంగరు వృథాయశమున్ గడియించినారు వా
రిరువురు శుద్ధకుంత" లని యీవును నేనును మిక్కు పోల్కిఁ బ
ల్వారు లిఖియించి తుంటరులు పుచ్చిరి కొప్రిమువారియొద్దకున్ 92

ఉ. అన్నియు శాఖలోవిజను లాసనచర్చకు నాగ్రహించుచున్
బన్నము వారి కౌనునుఁ బన్నినవే యవి ; సిద్ధవస్తుసం
పన్నత యట్టి ముష్కరుల వ్రాఁతలచేఁ జెడదంచు నెంచి యు
త్పన్న వివేకులై యిపుడు వాగరు కొప్రిమువారు సీవలెన్. 93

మ. మనకాబాపతు నుత్తరమ్ములెకదా మాన్యేతరుంగాఁగ నొ
జ్జను సాధించుట కూఁతమయ్యెడి, దురాశ ల్నీవు గుర్తింప వ
జ్జనవిద్యోక్తులు కొప్రిమున్ జెఱిచె , నీచందమ్ము నట్లౌఁజుమీ !
యనృతాహంకృతిదుష్కృతాశ్రియుఁడవై యాత్రోవకే పోయెదే ? 94

ఉ ఎందుల కట్టియుత్తరము లీవు లిఖించిన "శృంగభంగపుం"
దందనకన్న మిన్న లె ? వృథా యది మన్నయి విన్నుఁ బూర్తిగాఁ
బందనుజేసి యియ్యెడలఁ బందలుగూపెకి తప్పుఁగూతలున్
జిందులఁ జేర్చికొన్న మఱి చేకుఱునే ? మన కున్నతస్థితుల్. 95

ఉ. కాఁకరపత్రి మద్గురుఁడు కార్యవశమ్మున వచ్చినప్డు నీ
వాకరుణార్ద్రితోఁ గలిసి యంపుర్రిల వ్రాసిన నప్డె తీఱఁబో
యీకలహంబు , నే నచటనే యపు డుండిన నిన్నుఁబోలెఁ బ
ల్కోకలు పోయి యిక్కరణి మూలముదుంగు నవస్థ దెత్తునే. 96

చ. ఎమటికి నేగనైతివి. మఱేమియు నేరని మామకమ్మునిన్
గదనముపేయ వంపితివి, కొఱు లతంతలచేన్ గ్రిమమ్ముగా

ముదిరెను గయ్య మూపయిని ముష్కరతాస్పదులైన కుఱ్ఱలన్
గుమలుగుదుల్ల నంపితివి కోఁతులదండు బలెన్ జయాశమై 97

ఉ. అంతియకాని యెప్పుడును నాతని యగ్రిమునందు నిల్చి "నీ
వెంత? త్వదీయపాండితి యదెంత? భవత్కవనం బదెంత? నా
పొంత" నటంచుఁ బల్కుటకుఁ బోవఁగ జంకితి. పూరకే యశః
కాంతకు దేవులాడెదవు కంపము నెమ్మది నిండియుండియున్. 98

ఉ "వేంకటరామకృష్ణను వివేకిని నేను జయింతు సత్సభన్
వేంకటశాస్త్రి" నంచు సవివేకపుఁగూఁతలు గూతువేఁగదా
జంకఁగనేల నీకదతుఁ జయ్యన నాతఁడు వచ్చినప్పుడే
బొంకులో వ్రాసి కయ్యమును బూర్తిఁగఁబెంచఁగనేల యోలిమై 99

ఉ అతఁడు నీదు వందునకు నాత్మను బూర్తిగ జంకినప్పు డే
నీ తగురీతి నీ యెదుటి కేగిన నిన్నతఁ డేమిసేయు? నిం
కాతరుణమ్ము రాదుగద? యంత భయమ్మున మున్గు నీవొగిన్
గోఁతువు కోఁత లూరకయ, కోసినకోఁతగఁ గైత నిండఁగన్, 100

చ మనవిషమెల్ల బైలఁబడె, మమ్ము నృపాలకు మోమెకాక యే
యనఘునిఁగూడఁ జూమటకు వర్తతలేమి దటస్థమయ్యె; నొ
క్కనిముసమైన నెమ్మది సుఖమ్ముగ నుండఁగనేరదయ్యె నిం
కనయినఁ దప్పుఁగల్పనలు గట్టిన లగ్గగు నెంచిచూడుమా. 101

శా. నీతప్పంచెదుఁగూతలన్ గొని నిమన్ నిర్నిద్రనీతిప్రథా
ప్రీతుంజేయఁగ నెంచి దేశికుఁడు సుశ్రీవించి కల్పించు వి
ఖ్యాతగ్రంథములెల్లఁ గామగవులై కవ్యగ్రణీనిత్యసం
ధ్యాతంత్రోచితమంత్రరాజములునై వ్యాపించె వీక్షించితే. 102

శా. ఎన్నా శ్రీగతి మిక్కనేమగు? వృథా యీ వేసునుంగూడి; యా
పన్నెల్ చిన్నెలు నీకు నాకు నెటు రావచ్చున్? యతి ప్రాససం
పన్నంబయ్యు బుజాక్తిదూరమగు కావ్యం బెన్న పాశ్చవం
బున్నట్లుండి క్రమమ్ముగా సురుఁగు మాయోపాయముల్ వాయఁగన్, 103

చ. అకట! కతఘ్నియంచు నొకఁడల్లితి, వయ్యది పొల్లువోయెఁ ద
త్ప్రకటన నీకు నాకుఁ బరిభావము గూర్చుటెకాక పాయమై

న కతన వ్యాసముఖ్యుల మనంబులఁ గొందొకసిగ్గు గూర్చె. నీ
వొకటియునేని విల్పఁగల దున్నదె యంచలి వెక్కిరింపులన్? 104

చ ఆవులఁ బరాస్తపాశుపతిమంచు లిఖించితి సిగ్గుమాలి పై
దపుడలపైఁ "బురశ్చరణ" తాడన మక్కతనన్ ఘటిల్లె. నా
యవమతికూడఁ జాల కిపు డాయనతమ్ముని జిన్నవెంకనన్
బ్రిసిమలచిత్తు చింపితివి పాదుకృతఘ్నగణమ్ములోనికిన్ 105

మ జనకద్రోహియటంచుఁ దేలితివి వాచాలత్వమేపార వెం
టనె యాతండనృతమ్ముకూడ * దది సంధానించు దౌర్గత్యమం
చనిచెం బద్దెము; లంతతో భయముమై నాస్యమ్ము మూగయ్యె. నెం
దునకో తప్పుడుఁగూఁతలన్ గిలికె దీక్రోవల్ మదంబిమ్మనే 106

---

ఉ * కట్టుచునున్నవారు గృహకాండము నాంకిమందు, నన్నమున్
బెట్టకతండ్రి విల్ వెడలనెట్టినవాండ్రికునై గురున్ దెగన్
దిట్టినవాండ్రికై! యొకటనే మన ముందవలెన్ దురాగతం
బుట్టిపడంగఁ గూయు భవదుక్తులు సత్యములేని యర్పకా 1

ఉ. తీసియె యుంచినారలఁట! తీపవిగోతులు తండ్రినాత్మయా
వాసమునుండి గెంటునలవాండ్రికునై, గురుఁ దప్పగూఁతలన్
గూసెడివాండ్రికై: యొకటఁ గూలవలెన్ మనమెవ్వ వ్రాయునా
దోసమువిక్క మేవి, యెటు ద్రోహము లూరకపోవు నర్పకా 2

ఉ. చెక్కియెయుంచినారలఁట! చిక్కనిమేకులు, నీకు నాకుఁబె
న్మక్కువ నంటఁగొట్టుటకు, మానరు మానుఁ దటన్నుఁ దండ్రికిం
దొక్కఁడు ద్రోహి, వేఱొకరుఁడో గురుపట్టున ద్రోహియాఁగదా!
పిక్కము వారికిం దెలియునేనవి నన్ను స్పృశింపవర్పకా 3

ఉ. నూఱియె యుంచినారలఁట! మున్నవికత్తులు ముక్కముక్కలా
తీపనఁ గోతురంట! వెనుదీయ కనక్యము లాడువాండ్రియా
డూపసనన్ విజంబపుడు తోఁపకమానదు, తండ్రి వింటికిన్
జేఁగనీమియున్ గురునిఁ జెట్టబుగూయుటయున్ బయల్బడున్ 4

చ తెఱచియె పెట్టినారలఁట తీవ్రదవానలభీకరమ్ములౌ
నకముల్లెల్లఁ దండ్రి భవనమ్మున నుండఁగ నీక త్రోయు పం

శా శ్రీసూర్యప్రభుఁడిచ్చు దత్తములతో సిగ్గేది జీవింపఁగా
వ్రాసెం దేవుఁడు నీకు నాకు నొసటన్, బ్రారబ్ధమిట్లుండె నా
యీసాన్నిధ్యము వీడినన్ మనకు నేయే పాచితంబేది యే
మోసంబేని స్వయంకృతాఘములచే మూఁడున్ మతెందేగినన్ 107

చ నరకమటన్న నాయెన వణంకుచయించెడి. నందుఁ "గొత్రవే
ర్పుఅమమనున్నవా'' రనుచు వ్రాసె గురుం డనృత ప్రలాపికిన్

---

కరులను. దేశికున్ దెగడుకట్టిఁడులన్ బడఁద్రోతురంట ; యె
వ్వర మట కేగమో తెలియువాఁడు పరాత్పరుఁ డొక్కఁ డర్పకా. 5

చ విలిపియ యుంచినారలఁట ; నిస్తుల శత్రుపరంపరల్ దురా
త్ములకయి తండ్రినిల్వెడలద్రొబ్బుటఁ దేశికు బూతుఁగూతలం
బలుకుట. నేర్చికొన్న కవిపండితులయ్యెడ ముఖ్యులంట ; త
త్ఫల మనుభూతమౌనెడలఁ దథ్యము తేలగవచ్చునర్పకా. 6

చ కలిపియ యుంచినారలఁట ; కల్పెడివస్తువు దానితోడ నే
యలఁతి పితన్ గృహాంగణమునావలికిన్ బడద్రొబ్బు, నింకనే
యలఁతి గురూత్తమున్ దెగడు నాయువుగున్కై, తదంబువుల్
తలఁ బడునట్టి వేళఁగద ; తథ్యము కానఁగవచ్చు నర్పకా 7

చ ఇహమున నెండతేనిఁగల రిద్దఱదోన మెఱుంగు సాకిరుల్
నహి పరమం, దెవండు చని నారకముంగని వచ్చి చెప్పు ధీ
మహితుల, కిక్కుతాన మనమంచియుఁ జెడ్డయు నిందె తేటల్
బహుజనసమ్మతం బగు సభాస్థలిమందుకుఁ జాలునర్పకా. 8

ఉ. సూనృత ముజ్జగించి పెనుమందనమున్ గడియించి పేర్చుదు
ర్మానమునన్ దురాగతపువ్రాఁతలు వ్రాసినయంత నేమగున్ ?
ధీనిధు లెందు లేరె ; గుణశీలింపరె నిక్కము ; నోరు నొక్కరే ;
పైననరే యపాత్రులని ; పర్వముల్ వదరంగఁ బోయెనే. 9

శా. బహ్వాలాపములేల ? కల్లనిజముల్ పాలించువాఁ డున్నచో
నాహ్వానించి స్వకీయలోకమున నీయాచర్ప గావింపఁడే ?
కహ్వాచారులు దాఁగనేర్తురె ? యటన్ గాపట్యముల్ విల్చునే ?
జిహ్వాచ్ఛేదము సిద్ధమౌ పెఱిఁగి భాషింపన్ బ్రయత్నింపుమా. 10

దురితము నిక్కమేన్ని యెటు దుర్దశనీకును నాకు దప్పునో
మొఱక ! వృథాగ నేమిటికి మో మరుగన్ దెగఁబ్రేలెదోగదా ? 108

మ ఎపుడో నాకక మేగుదెంచునని నే నేద్వంగఁ బో, నద్ది నా
కిపుడే సిద్ధ మదెల్లటన్న. విను మాయా దేశద్రోహపుఁ
విపరీతస్థితిఁజేసి నాయెడఁద కావేగంబు పెల్లియ్యె నె
ల్లపుడున్ వ్రేలెడి మత్కృపన్నత మదాస్యంబంటి పీడించుచుఁ. 109

మ గురుకఁ ద్రోయఁగఁజాలినాఁడవె యవాకుల్ బల్ చవాకుల్ శతం
బులవన్ జాలితిగావి. యబ్లైసుమి దాపై పైపయిన్వమ్ము నా
నరకం బాఁగుటకూడ. నిప్పుడయినన్ నన్నామహాభాగు పా
దరజమునన్ దలఁదాల్పఁజేసి యెటులో ధన్యత్వముం గూర్పుమా 110

చ విటుఁ, డవివేకి, కాకవి. యవిజ్ఞుఁ డనార్యుఁ, డనర్హుఁ, డల్లవెం
కటకవివానిఁ బూజ్యునిఁగ గైకొనకుండని నీవు సర్వదా
రటన మొనర్చుమంటివి కరంబు శ్రమింపదుచుంటి వక్కట
క్కట ! యతఁ డట్టిఁడైన నగుఁగాక జగంబతనిన్ భజించెడిన్ 111

ఉ "దీనిఁ బఠింపు" డం చొకఁడు, "దీనిఁ బఠింపకుఁ" డంచు నొక్కఁడున్
మానుగ శీర్షికల్ నిలిపి ముద్రలపట్టికి లంపుచుందు. రె
ద్దానిఁ జూతవద్దనిన దానినె చూచుట లోకధర్మమౌఁ
గాన నిషిద్ధవస్తువనె కాంతు రెఱుంగుమవో, యెఱుంగవో 112

మ. ఉపకారార్థము పెండ్లిచేసె గురుఁ డోహో ! నాఁగ వెంకన్న కీ
వపకారమ్ముగ దానిఁ బొల్చెదవు ధైర్యం బెంత నీకున్నదో !
కపటస్వాంతుఁడ ! "పెత్తనమ్మను మిషన్ గాజేఁపె ద్రవ్యం" బటం
చపలాపించితి నీదు నాల్కకు నరం బావంతయున్ లేదొకో ! 113

చ అతఁడు మహోపకర్తయగు నన్నపయిన్ దురితమ్ములాడె నం
చతికిన నీమరాగతికి నంతును బొంతును గల్గఁబోము. నీ
బ్రతుకిటు తప్పుగల్పనలు పన్నుట కేర్పడఁబోలు; నీకు దు
ర్గతియెడ భీతిలేమ బహుకష్టము నిన్నిఁక విశ్వసించుటల్. 114

చ "అనృతము కష్టమిచ్చు. ఋత మన్నిట సౌఖ్యమునిచ్చు. దేవుఁడం
చు నౌకరుఁడుండె సత్యమును జూడఁగలాఁ డతఁ" డంచు నమ్మునా

ఈనుఁ జను విశ్వసింప, వీఁక "సర్వము కల్ల" యటంచు స్వార్థముం
బనిఁగొని సంగ్రహించు నలపాతకి నమ్మినవాఁడు పాడగుఁ 115

(అజవమేకు)

చ భయముజనించె నాయెద భవత్స్పృహవాసమునందు; ధైర్యమే
మియుఁ గనుపట్ట ద "య్యజవమేకు" స్మృతింబడె. నట్టు నన్ను ని
శ్చయముగ నీవు చేయునెడ శక్యమె దాఁటికొనంగ. నో దురా
శయ ! విను మక్కటావిధము సర్వము దెల్పెదనీకు బుద్ధికై 116

చ అజవయ నొందు విప్రుఁడు ధనార్జనకై చనిరంట ! దేశముం
దిరిగి ధనమ్ము మిక్కిలిగఁ దెచ్చినవారఁట ! మార్గమధ్యమం
దజవకు జబ్బుచేసి తన కాళ నపల్కొనునంతదన్కరా
నెఱిఁగి యతండు లోన నిటు లెంతయుఁ జింతిలసాగె నం బొగిన్. 117

మ "ధనమార్జించితి మెంతొ కష్టపడి యీద్రవ్యంబు దారాసుతుల్
దినుయోగం బది లేకపోయె నిది యీ దీనుండె సర్వమ్ము కై
కొను నావారలతోడఁ జెప్పఁ డెటులొక్కో ? వీని వంచించి నా
ధనముం గీవిధనమ్మునుం గలిపి మద్ధామంబునం జేర్చుటన్ " 118

చ అనిమదినెంచి యంతకభటావళి సన్నిధికింకఁ గొంతసే
పున కరుదెంచునంత సమయమ్ముం గనిపెట్టి స్వసన్నిధిన్ గనుం
గొనలను నీరు జాఱఁ దనకున్ వగఁజెందెడి మిత్త్రుఁబిల్చి "యో
యనఘ ! యిటేల చింతిలెద వాయువు శాశ్వతమౌనె యేరికిన్ 119

ఉ. ఎప్పటికేని దప్పనిదియేసుమి మృత్యువు దీని దాఁటువా
రెప్పుడుఁ బుట్టలేదు, మఱి యీపయిఁ బుట్టరు. పుట్టుజంతువుల్
తప్పక చచ్చుఁ, జచ్చినవి తప్పకపుట్టు, విచారమేల యీ
తిప్పలు బ్రహ్మముఖ్యులగు దేవతలేవియు దాఁటలేరుగా. 120

ఉ. కావున నన్నుఁగూర్చి యిటుగా విలపింపఁగనేల ? నేనిదే
పోవుచునుంటి నాకునయి పుష్పకమల్లదె వచ్చుచుండె, నా
పై విడు మింకఁ బ్రేమ, ఋణబంధ మిదే తెగుచున్న దెంతయో
నావిషయమ్మునందు శ్రమమునన్ బనిచేసితి వీవు కూరిమిన్. 121

ఉ. సారెకు వైద్యునిం బిలిచి చక్కనిమందుల నీయఁజేసి, తిం
పారఁగఁ బథ్యమైనగతి నన్నముఁ గూరలు వండిపెట్టి, తే
వ్వారొనరింతు రింత సదుపాయము? నేను నిజమ్ముగా జమీం
దారుఁడ, రోగిఁ గాను, గుణధాముని ని న్నొకవిజ్ఞ గడించుటన్. 122

శా. దారాపుత్రులు ద్రవ్యమున్ దినుటకే, దారిద్ర్యమో, రోగమో,
ప్రారంభించినయప్డు చూడరు సుమీ! ప్రాజ్ఞుండ వీ వన్నియు
న్నేరంబోలుదు, నీకతాన సుఖినై నేఁ బోవుచున్నాఁడ, సం
సారభ్రాంతుఁడఁగామి ని ట్టొకటి ప్రస్తావింతు నాలింపుమా. 123

ఉ. నా కుపచారమున్ సలిపినాఁడవు మిత్రుఁడ వంతెకాక స
ద్దీకుఁడ విట్టి నీ ఋణము దీర్పక పోతినయేని నాకు నా
నాకమునందు రాఁగల మహాపదవుల్ క్షణభంగురంబులౌఁ
గాక తిరమ్ము లెట్టుంగుఁ? గర్జము చెప్పెద నట్లొనర్పుమా. 124

చ. ధన మొకకొంత యిర్వురము దాఁచిన దున్నది యందులో సగ
మ్మున కధినేత నేను, జనిపోవుచునుండిన నాకు భాగ మెం
దున? కవి నీవ కైకొనుము, దుఃఖము నొందకు, మిందు లేశమున్
బనుపకుమీ మదీయులకు. భార్యయు బిడ్డలు నీకు నెక్కుడే! 125

ఉ. ఇందుల కొప్పవేనిఁ బయి నెన్ని భవంబులొ యెత్తికావి సం
క్రందనలోక మేను జనఁగా ఘటియింపదు; నమ్ము పుష్పకం
బుం దుదముట్ట రామికిది ముఖ్యనిమిత్తము; మాఱు చెప్ప కా
క్రందన మాఁగి యింక నొకకామము నాయది తీర్పఁగా వలెన్. 126

చ అది యెది యందువే, నిది రహస్యము మెల్లఁగ విన్ము: హంస బు
న్నదియును లేనిదిం దెలిపి యావిషయంబు వినిశ్చితమ్ముగా
నెదఁ గదియించి మేకొకటి యింతకుఁ బూర్వమె తెచ్చియుంచి నా
కది దిగవేయు మాసనమునందు మఱెవ్వరు చూడకుండఁగన్. 127

చ. అటువల కర్మ మియ్యది, కులాచరణం బది. మానరాదు నీ
వెఱుఁగ వెఁ కెన్నియో కలవ యిట్టివి ద్రావిడులందుఁ జిత్రముల్
గఱువలు సమ్మతించినప్రకారము మానఁగనేల? యెందుకే
ర్పఱచిరొ వారు. నీ విటుకృపన్ సలుపన్వలె మానకెమ్మెయిన్. 128

ఉ. తప్పనుకోకు మిప్పవి, పదంపడి నాకిది కారణమ్ముగా
నెప్పటియట్ల జన్మమొక టేర్పడునో మఱియేమొ ! యూరకే
చెప్పరు పెద్దలెయ్యవియు, శేముషిచాలక వారివాక్యముల్
తప్పదు రొక్కకొంద, అది ధర్మము కాదని నీవెఱుంగవే ? 129

ఉ. కావున నామనోరథము కాదన కాదృతి సంగ్రహింపు మిం
కీవు హీనస్పఁగాఁ దగిన దింతకు మించి మఱొండు గల్గ, దీ
సేవను బూర్తిఁ జావెఱిఁగి చేయవలెంజుమి, యట్లుకానిచోఁ
జావునకౌ నిమిత్తమిది, సద్గతి కావయి వంతరాయమౌ." 130

చ అని కడు మిత్రభావమది యంతయు నుట్టిపడంగ నా కుక
ల్పనకుఁడు బోధసేయఁగ స్వభావవినమ్రుఁ డమాయకుండు నౌ
ననఘుఁడు తోడివిప్రుఁ డది యట్టిదకాఁ దలపోసి చేసెఁ జె
ప్పినవిధి తప్పకుండఁ దనపేర్మిముడికాని ముదమ్ము దీర్పఁగన్ 131

ఉ, పిమ్మటఁ గొంతిసేపునకుఁ బ్రేతనివాసపుభూమి కాళవం
బిమ్ముగఁ దీసికొం చరిగి, రీతఁడు నింకొక కొంద అంతఁ గా
ష్ఠమ్మునఁ బెట్టునప్పుడు తటాలున మే కొకరుండు చూచెఁ బ్బ
ష్ఠమ్మున వెంటనే వ్రికృతసంస్కరణం బదియూపి కోపియై 132

ఉ, దగ్గఱనున్నవారలకుఁ దద్గతశంకువు చూప నందఱా
బగ్గున మండి 'యోచెనఁటి ! పాతకి ! " యం చౌక పెట్ట లేచి" యీ
యెగ్గితఁడే యొనర్చె" నని యే పడఁగం దెగగొట్టి న్యాయపుం
బెగ్గడతోడఁ జెప్పి రిది విప్రుల వారవి కొఱు లూరఁగన్. 133

చ అతఁ డెటుసేయఁగావలయు నంతయునట్లొనరించి "యోరి దు
ర్మతి"! యిటులేలచేసితివి మర్మము మాని వచింపు" మన్న, నా
హతవిధి ! యున్నమన్నయటు లంతయుఁ జెప్పెను బూసఁగుచ్చిన.
"ట్లతుకవు నీ కుకల్పనము ' లం చధికారి తిరస్కరింపఁగన్. 134

ఉ కాఁడు కుకల్పకుం డతఁడు, కాఁ డపకారియుఁ, గాఁడు లోభియున్
గాఁడు దురాశయుండు, కొఱగాని దురాగతు మాయమాటలన్
గాడఁగ నమ్మి యక్కరణిఁ గష్టికి పగ్గముగాఁగనై యముల్
వీడె సమస్తయోగ్యులను "వీని వధించుట యుక్తమే" యనన్, 135

ఉ కానఁ గుకల్పనా పటిమ గల్గిన పీయెడ విశ్వసించుచో
హానికి వగ్గమౌదు నవి యాత్మ వణం కువయించుమన్న. దే
మైనను మంచిదే విదుతు నాన్యతి నీవయి నింకఁ, బామతో
నే వరుఁడేని స్నేహమున కీకొని మోసము నందకుండునే. 136

ఉ. తప్పుఁగుకల్పనల్ సలుపుదారియె తారఁగరాదు కాని యం
దెప్పుడునిల్చునో. "హితుడు వింకొకఁ" డన్న పివేకమేమి ? యొ
క్కప్పుడు స్నేహమున్నయతఁడౌ, మఱియొక్కొకచో నరాతి ; పీ
వప్పుడు నన్నుమాత్రిము దురాశయ ; యొప్పరికింప నేర్తువే. 137

చ "ఎఱుఁగమె కాలనేమి, ఎతఁ డెన్ని కుకల్పనలం బొనర్చి పా
డతె ; నటులే యడంగు నవి యందఱ కల్పన లెన్నరాద, యా
యఱవ దురాశయుండయి, దురాశ హితుశా మృతుఁజేసి ద్రోవ్యపుం
బరణి సమ స్తముశా ఒనదు భార్యకుఁ జేర్పఁగఁజూచెనేకదా. 138

చ. మృతి వృధగా నతిం "దఱవమేకు" కతమ్మునఁ గాంచెఁ గాన సా
మెత యిది లోకమం "దఱవమే" కవి యెల్లరుఁ జెప్పికొందు. రా
కత నఱ వొక్కడే, యచటఁగా దటు, లిర్వర మర్వవారమే
కృతికొనసాఁగనీయఁజామి ; కృతిప్రిమపక్కిని పీవు ద్రొక్కినన్. 139

చ. అఱవ యొనర్చు హేతువున నట్లపకీర్తికి జాతి నర్వమున్
గుఱియగుటయ్యెఁ గాని యిటు కొందొక శాఖయుఁ జేయవచ్చుఁ ము
ష్కరుఁ డల కాలనేమియుఁ గుకల్పతుఁడేకద ; వాఁడుఁగూడఁ దా
నఱవ యనంగపిలుగునె ? యందఱ యందును నుండ్రి దుర్మతుల్. 140

ఉ. కానఁ గుకల్పనాపటిమ గల్గినవానిని జేరరాద, య
వ్వానిని జేర్పరాద యని వాకొనుటే యుచితంబు; నీవలె
న్నేనొక యర్వనయ్యు జననిందృపుఁ ద్రోవలుత్రొక్కనేర; నీ
చే నెటువంటి తప్పయినఁ 'జీ' యనకే రచియింపఁగాఁ బదున్. 141

శా. ఎన్నోకూసితి తప్పుఁగూఁతల, గురుండెన్నేని సైరించు. నా
పన్నుల్ నోరికొలందు లాడుటయు సంపన్నుల్ మదింబెట్టమిన్
మున్నెందుం గలయట్టిదే, యహ మొగిశా బూర్ణంబు గావచ్చె. నే
బన్నం బున్నదొ ? యిప్పుదేని గురుని౦ బ్రార్థింపఁగాఁ జెల్లదే. 142

తే.గీ. "విష్ణుదేవునిఁ దిట్టిన వెంకటేశుఁ
దిట్టినట్లగు" నని సుంత తెలియు నీకు
వేంకటేశునిఁ దిట్టిన విష్ణుదేవుఁ
దిట్టినట్లగునని కూడఁ దెలియ వలదె ? 143

మ. అటు లొక్కింతుక నీ వెఱుంగునెడ దుర్వ్యాహారముల్ తొల్లి వెం
కట నేతన్ గుఱిసేసి పేర్చిల, వదియజ్ఞానప్రయుక్తంబు యం
తట వస్త్వైక్యము దేశికుండు తెలిపెన్ దానన్ గనుల్ విప్పి చె
ప్పుట కొం దుత్తర మబ్బుమిన్ వృధగ వాపోవన్ ఫలంబున్నదే 144

శా. విష్ణుం డెవ్వఁడొ వెంకటేశుఁ డతఁడే, వేమేల ? రాముండునున్
గృష్ణుండున్ మఱివానిలేశములె, నీ కిజ్ఞానమే యున్నచో
జిష్ణుం వెంకటనేతఁ దిట్టెదవె సీ! సీ! వందితమ్మన్య ! నీ
తృష్ణాతంతువు పూర్తిగాఁ దెగుట కాతిట్టే నిమిత్తమ్ము రా. 145

ఉ. వెంకటనేతపై నకట ! వైరము నీవు వహించి తిట్టు నా
వంకము చూచి నా యొడలు బగ్గున మండెడి, దేనుగూడ నా
వెంకట నామధారి నని వీఱఁడివై తలపోయవైతి నీ
బొంకులు సర్వముం జెఱిచెఁటో ! గురుఁ, డింకెటు నోరువిప్పెదో? 146

తే.గీ. విగ్రహారాధనమునందు వెలయుపద్య
మొక్కఁడేనియుఁ దెప్పవే కుఱక "వాజ
కూఁత" లని నీవు మిఱికినఁ గూఁతలగునె,
"గీత" లని వాని వైదుషీ నేత లనరె ! 147

ఉ. నీవల వెంకటేశు నెటు నేరక తిట్టితి వట్లు కృష్ణునిన్
వావిడువంచు దేశికుఁ, డపాస్తనయు న్నిను మేలుకొల్పఁగాఁ
త్రోవ యొకింత చూపి "యిటు దూఱిఁ దూఱగపమ్ము" నంచుఁగా
దే వెఱవున్ గనం బఱచెఁ దేఁకువ నీవలె నొజ్జ పిదునే ? 148

ఉ. ఆతని తేఁకు వేమి, మఱి యయ్యనఘాత్ము నుపాయమేమి, వా
క్చాతురియేమి, నామనము సర్వమెఱుంగు నెఱుంగ నీవు, నీ
చేతము మాత్రమాతఁడు గ్రసించును గంత మటంచు సారెకున్
భీతివిగొల్పు నక్కటతనం బ్రేలెదు దూరమునందు దాఁగుచున్. 149

శా ఎన్నోకొన్నిదినాల శిష్యుఁడవు నీ కెట్టుల్ గురుస్వామియు
ద్యన్నైపుణ్యమువొల్చు వాగ్గరిమ చిత్త మ్మెక్కు ? నా కెప్పుడుకా
దన్నై పుణ్యమె జ్ఞప్తిలో మెలఁగు, నంతర్వాణిమాస్యంబు కా
కున్నన్ లోకము మెచ్చునే యరక నీ "హూహూ" లతోఁ బోయెనే: 150

మ. ఎవవిన్ చేపుని దిట్టఁగాఁ దగదటంచే బోధగావించె నో
యవివేకీ ! యల "విగ్రిహార్చనమునం" దంధత్వము స్వీదు. మ
య్యావి పద్దెమ్ములో ? లేక రత్నములో ? నీవజ్ఞుండవై పోక త
త్కవనస్తుం గని బుద్ధిగల్గి మనుమీ గర్వంబు చాలింపుమీ. 151

శా. నీ తండ్రిన్ మదినెంచు మమ్మహితుఁ డీవిన్నెట్లు సైరింపుఁ ద
చ్చేత మ్మెప్పుడు దేవతార్చనపయిం జెన్నారు, నహ్నాజలే
కే తా నెన్నఁడు భుక్తిగై కొనడు "నీసీలాటిదుర్మానివై
పో" తంచున్ మదినెంతగాఁబొగులు నా భూదేవవర్యుం డరే ! 152

ఉ నీతలిదండ్రులే మదిని నీమ దురాగతి రోయుచున్నచో
లాఁతులు నిన్ను మెత్తురె ? తలంపు మెవన్ , జలమున్ గుదింపు. మ
య్యో ! తగుమానిసింబలెనె యూరక "భారత" మంచువార్చఁతు నీ
కూఁతలు రోతవై బుధులకుకా వెగటయ్యెడి నేమిచేయుచున్ ! 152

శా స్నానంబున్ బచరింప వెన్నఁడును నంథ్యకా వార్చి వేరాఁడునుకా
భానుంజూడక దంతముల్ గడుగ వప్రాజ్ఞత్వపర్యాప్తదు
ర్మానికా గాఁకరపత్రిలోన విను సమ్మానించువాఁ డొక్కరుం
డేనికా గల్గిన వానిపేరు పెపుమా ? యేనేగి ప్రశ్నించెదకా. 154

ఉ అక్కట ! వేములాన్వయమునం దుదయించిన నీవు పొద్దు జా
మెక్కినమీఁద "బ్ర" ష్షాకటి మొంగిలిదే కరమందు నూవి మి
ట్టెక్క మొగంబుఁ గడ్గుటకు నేవమువొందినవార లెందతో
యక్కటికమ్ము మై మడివినట్టినుడుల్ వివిమేద్దు నీకునై 155

శా నీమశ్రేష్ఠల నాఁగనేరక భవన్ని శ్రేయసాకాంక్షిదా
యాద ప్రేమను నీదుతండ్రి మదుపాధ్యాయున్ సదా కోరు "మీ
రీమత్కిలు క్షమింపఁగావలయు వ న్నీక్షించి" యం చీవు నీ
వాదార్థంబు సుమేరుశాఖ వదుగన్ వ్రాతుమ్ముఁ దెల్లమ్ముగన్. 156

శా లేదా, తండ్రినె పోయి యడ్గు మతఁ డేలీలా బ్రిసంగించినో ?
నే దెవ్వారికిఁ గాఁడు పుత్రికుఁడు తగ్రేయోర్థులై వార లే
యేదైన్యమ్మునకేని పాల్పడుటలేదే ? చూడమే ? యట్టిచో
నీదౌర్గత్యము వార నీపిత ప్రియత్నింపన్ దొనంగుందునే. 157

ఉ పొట్టకుఁగా నపాత్రిమతముం గొని దేవుని దిట్టు పాపపుకా
గుట్టవు నీవు గావుటకుఁ గోవిదుఁడౌ జనకుండు మోద మె
వ్వట్టున బొందు ? "వీఁడు కులపద్ధతిఁ గర్మమొనర్చునంచుఁ దా
నెట్టులు నమ్ము నౌర ! భవదేకతనూజు విటుల్ పొనర్తువే. 158

మ పరమాపాత్రిఁడనైతి నీకతన నాపాంరబ్ధ మిట్లుండె. భూ
వరుఁడేని న్నిను మందలించునన నీవాఁరితల్ గనం డాతఁ డ
గ్గురువర్యుండొనరించు గీరతములోఁ గొంతేరియుం జూడ నీ
దురితమ్ము న్నపుఁ డాఁగుఁగాని యడియుకా దూరంబ యా తేవికిఁకా.

ఉ "వేంకటరామకృష్ణ" లను పేర్వినవచ్చినమాత్రినే కృప
ఘ్నాంకము జప్తిలోఁ దవిలి యుందఱు నీ యని కోయుచుండి రీ
పంకము నీఁగఁగాదగు నుపాయము శ్రీగురుపాదసేవ గా
కింక మఱొండు లేదుసుమి యెన్నివిధమ్ముల నెంచిచూచినన్ 160

చ గురు నలవారు "తిట్టి" రని "కొట్టిరి" యంచని యేవొ కొన్ని తుం
టరు లెదొ కారణాస్తరమునన్ సృజియించిన తప్పుఁగూఁతలన్
దురిమిన పత్రిక న్నడిపి ద్రోహము నీఁగఁగఁజాల, మంతనే
గురుత దొలంగెనే ? యఘము గుప్పి బెగడ్పఁజేఁయకుంతు నే ? 161

శా. సిగ్గొక్కించుక నీకు లేదుగద ? "సీ ! సీ !" యంచు లోకుల్ సహా
యెగ్గుల్ వల్కిన లక్ష్యపెట్ట వరరే ! యేనీదులో యీసుమై
దగ్గుల్ దగ్గిన వాని మాఁతగొని యీఁదఁకాబోవు సంద్రింబు. నా
కగ్గిన్ మ్రిగ్గినయట్లు బొందఁబడినట్లై డెందమల్లాడెడికా. 162

మ. ఎవరో కొందఱు విన్ను మెచ్చి గురు నెంతే దూఱిరం చేవియో
యవివేకోక్తులు చూపె, దే శకులులో యట్లన్నమాత్రిన్ బహు
స్తవనీయంబయి చెల్లెనే కురుకులాధఃపాతమూలమ్ము దు
ర్వ్యయసాయమ్ము దురోదరమ్ము బహుళాపత్కారి కావమ్యేనే. 163

మ జగదేక స్తవనీయు నందతనయున్ శస్త్రాస్త్రవిద్యాబ్ధిపా
రగు నాంగేయు, దురాగ్రహమ్మునఁ దృణప్రాయమ్ముగాఁ జూచి బల్
పొగరుం గూఁతలు గూయలేదె శిశుపాలుం, డంమ కేవేడుఁలో
"తగు" నంచాడరె? వాని శీర్ష మటుపైఁ దక్కించి యీఁగల్గిరే? 164

ఉ బాంధవమ్మునన్ మన మవాకు చవాకులుగూ౹ దాన "బ్రి
హ్మాండము మున్గిపోవు" నని యార్చుచుఁ దేర్చుచు "వంటయింటిలోఁ
గుండలలోన గుడ్డములఁగొట్టిన" మీసమెకాదు, వారివే
తొండునుగూత నూడదయయో! మతిమాలు ప్రసంగ మేటికిన్ 165

చ. కొలఁది యెఱుంగకే "మురికిగుంట" గలంచిన వారు వార, ల
వ్వల నది చిమ్మి క్రిమ్మికొనె వాసన "లోనరిబుం" డటంచు, నీ
తెలివికి నెంతయేడ్తు నది తెచ్చుక నెత్తిని రుద్దికొందు, వి
ప్పలుకలవారు వల్కిన "సెబా"సను లోకము,నిన్ను "సీ" యనున్. 166

చ మొదట "రిజిస్టరు"త్తర మమోఘము నంపినవారెవా? రదే
కదపుటయొనుగా కిఁక నొకం డెటులౌ? నదిగాక వారలౌ
గదపుటకున్న దేమన కొకానొకబీజము? వారికుండెఁ, గా
కిది పసిబాలుఁడే నెఱుఁగు నేటికి సామెతనెత్తితోకదా 167

ఉ కాలనుబోవుదాని నెనకమ్మున నెత్తిన రుద్దికొంటకే
గోలతనాన నమ్మురికిగుంటను బ్రింగితి, విట్టి నీ వచో
బాలిశతావిలాసమది భావిగతిౘ దలపించెడుౘ, జెడుం
గూళలకెందునుౘ "మురికిగుంటలె" కా పరమంద గమ్యముల్. 168

చ కదిపిరివారలేమనఁ గశ్మలచిత్తుల దుష్ప్రమత్తులన్
బదపడి "రెండునున్ విడిచి" వారికి నుత్తరమిచ్చియుంటి, మా
మదమదికోపి వెంబడినె మద్గురుమూర్తులు పూర్తిగా వృథా
వదరులవంపఁగా "సభకు వత్సలు రండ"ని పిల్చి రేదైజన్. 169

ఉ అందుకుఁజాలలేమి జగమంత యెఱింగె, భవద్భదంతరం
బందును నాహ్వదంతరమునందును గల్గినభీతి వేఁ దెఱుం
గుం డన పిన్నతల్లి మనకుం గదురంపిన నొజ్జ వచ్చునం
చుం దలకంచినాదె యొకచో మనమిద్దర మప్డు మ్రిగ్గుటల్? 170

ఉ. ఎప్పుడు దేశికుండచటి కేగుమమల్ వినవచ్చె నప్పుడే
తప్పె మొగమ్ములన్ దెలివితప్పలు మూసుక లోనబ్రింగుటల్
చొప్పడె. దీనికై మదిని శోకమునంతగఁ బొందవేమ; పి
విప్పుడుగూడ వారలకు "నీశ్వరవేద్దమె" యంట కేడ్చెదర్. 171

ఉ ఎవ్వరొ యేల నీకొమరుఁడే యనుకొ "మ్మటకెందు కేగరే
దవ్వ కృపాద్య చెల్లమ సభార్డము పిల్చెఁగదా'' యటన్నచో
గవ్వలమేనుడి న్నొడువఁగాఁగలమో ? వచియింపు మూరకే
చివ్వను జెంపఁగా దుడుకుఁ జెన్నటి కూఁతలు గూయఁబోయెనే. 172

శా "ఆరామద్రివిదాన్యవాయవనదావాగ్ని స్ఫులింగో" మ్మటఁ
చా రాజాశ్రితుఁ దిట్టఁబూవితిపి నీయజ్ఞాన మేమందు ? నా
ధీరుం డక్కటనజా జెడండుసుమి. యా తిట్టేర్చువిన్ను న్ననున్
నో రెల్లో తెగజార్చె దారయపు క్రిందుప్మీదు సుంతేనియున్ 173

మ పరమప్రీతిగ నొప్పపట్టి యల శ్రీపాదాన్వయాంభోధిశీ
తరుచిర్ గృష్ణకవీంద్రు వెంకటకవీంద్రద్వేషిగా నెట్టులో
యఁజవన్ బూవితి వంతమాత్రమునదే యాయుష్యమన్ లోఁ బర
స్పర శత్రుత్వము దాల్తురేమి యపునా ! చాతుర్యపర్యాప్తతల్. 174

ఉ. ఎంతటి పేర్మియుఁ గామటియు నెంతటి గౌరవముండకున్న ధీ
మంతుని మద్గురూత్తముని మన్నపమైఁగని "శిష్యుఁ"డంచు స
త్స్వాంతుఁడు కృష్ణమూర్తి కవి భారత మాత్మకృతంబు నంపి "నీ
స్వాంతము వ్రాయుమీ" యనునె ? శత్రుత యేగతి నిర్వహించెదో.

మ మనకర్మ మ్మిటుకాలి దేశికునిపై మాన్యేతరాలాపముల్
వనిగా నేర్పడెఁగాక లోకమున నేపాపాత్ముఁడున్ జేయఁడీ
పనిదుర్మార్గతకున్ గడంగితి మవథ్రింశమ్ములంగిల్కి వా
రనిదుర్వారకఘోరకూపమును జేరంబోవుచున్నామ హా. 176

చ. "అల భుజగేంద్రుతోఁ జెలిమి యాతనికిన్ జెడె" నంచుగిల్కి, త
య్యలఘునకున్ గురూత్తమున కర్మిలి మెండుగ నున్నవార్త వ్యా
సులఁ గనుగొమ్ము తెల్పెదరు చూచినవారట వారు నర్వః మెం
దులకు వృథాయసత్యములు నోటికివచ్చినయట్లు పేర్తెదో ? 177

చ. అల భుజగేంద్రసన్నిధికి వ్యాసమనీషియు మద్గురూత్తముం
దెలిమిని విల్వనంపఁబడి యేఁగిరి యప్పురి నొక్కనాఁడు ప్రా
జ్ఞులుగల సత్సభాస్థలిని సూరులు మెచ్చ నుపన్యసించి ర
వ్వల నదిపత్రికన్ గని యపారముదమ్మును గంటి నే నొగిన్. 177

శా. ఈ వెవ్వారికిఁ గొమ్ము లున్నవని యిం కేవారికిన్ లేవటం
చేవో తప్పుడుఁగూఁత లార్చితివొ యాయారజ్ఞు లాపత్రికా
భావం బూడ్చెడి. నోరునొక్కెడి. వృథా ప్రాగల్భ్యముల్ చస్వు వి
ద్యావైశద్యము హెచ్చుఁ గస్తురి నెటుల్ దాఁపంగ గూ పెట్టెదో. 178

మ. పగ సాధించునుగాక దేశికుఁడు విద్వత్త్రావ్రివంగ మ్మెటో
దిగఁద్రోయన్ గమకించి యేవిషయమో తేఁడీవొ యేతప్పుడుం
బొగరుం గూఁతలొ కూతు వయ్యవి వృథా పో కెమ్మెయి న్మాలమా
దిగలన్ రోయు కృతఘ్నతాఘమున నన్ దేలించి తూలించెడిన్. 179

చ. మన గురుతో నెదుర్కొనుట మాన్యతగాంచెను గొప్పరమ్ము కా
ళన గలవారిచేవయినఁ గర్మము కాలుటతప్ప లేకపో
యెను మన కెందు గౌరవ, మహీనుఁడు తేఁడిదుశీత మెట్టులో
తిని భరణమ్ము గొన్ సుదతి తీరున నుండఁగ ధాత వ్రాయుటన్. 180

మ. గురుఁ డూరేగిన నేగి కొండొకయెడన్ గొప్పింపువాః రొజ్జబ్రి
హ్మారథస్థుండుగ నెంచొ బ్రిహ్మారథమం దవ్వారు మారేగి, రె
వ్వరికింగాని యఘమ్మునందిరి వృథా వాపోవుచున్ బొట్టకే
భరణమ్మో గొను బొందువక్క నొకసౌభాగ్యమ్ము నీకబ్బెనే? 181

మ. నృపుఁడేని న్మన కట్టియుత్సవముఁగన్ జేయింపఁ, డేమన్న, దు
ష్కపటంపు న్మనవర్తనం బఖిలముం గాకున్నఁ గొంతేని భూ
మిపుచిత్తమ్ము న్పృశించియుండెడి నెటో మేపించుఁ గా కిట్టిపా
పపుదుశ్శీలుర కేమటం చితరసౌభాగ్యమ్ములన్ గూర్చెడిన్? 182

మ. మన కేలాభము లేకయున్నను జగన్మాన్యంబు శ్రీదేశికా
గ్రిణివాగ్ధోరణి వెంటవంటి మనవక్రింపున్నిడుల్ గొప్పపా
లను గల్పించుడు గేదెపాలగతి వాలాయమ్ము గాగ్రిహ్యంబులై
చను. వీలాభమ చాలఁ బ్రాజ్ఞ లిటులే శంకింత్రు రష్మద్గురున్. 183

## సింహము, ఎలుక.

చ. అఱచెద వూరకే గురునియంతరముల్ గనలేక, యెట్లు నీ
యుఱుపు లతం దరంపఁగలఁ? దాతని కంఠవు మూలి దాఁగె, దెం
దఱు "తగ" దన్ననున్ వినవు. దంభవచోరచనావిశేషముల్
గుఱిసెద వెన్నియేని; యనుఁగుల్ గుఱుఁ దేమియొనర్పనేర్చెడిన్. 184

తే. గీ. క్షుద్రుఁడగు శత్రు వొకపెద్దశూరునకుఁ ద
టస్థమగునేని యది దురవస్థ వాని
కపుడుపాయమ్ము క్షీమ్రిన కట్టిక్షుద్రి
వవ్వగింపఁజేయని పెద్దలనఁగ వినవె. 185

చ. కలవొకసింగ, మయ్యడి యొకానొక యద్రిగుహన్ వసించు. నం
డలి యొక లాఁగఁ జేసి వతతంబును సింగపుఁజాలు మెల్లఁగా
నెలుక యొకండు పీకికొని యామృగరాజున కంఠకుండ న
క్కాలవఁగలట్టి లాఁగకు వొగిల్ జనుఁ జిక్కు దదెన్నిభంగులన్. 186

శా. హస్త్యశ్వమ్ములనాఁపఁ బట్టులకు నిత్యమ్మున్ బ్రియత్నించుఁ ద
ద్ధైర్యస్థైర్యములన్ బ్రతాపమును గర్త్రస్థాయి యామెల్కపైఁ
గార్యం బింతయుఁ జేయవయ్యె: వలసింగం బింతకమ్మేయ దు
శ్చర్యల్ సల్పఁగదంగు నాయెలుక నిచ్చల్ బొచ్చుగిల్ బీఁకుచున్.

ఉ. ఎంతయు జాగరూకత సెయిన్ మృగరాజు లపాదునెల్కకై
వంతముఁబట్టి మేలుకొని పట్టువమంచుఁ దలంచి పొంచుఁ, ద
త్స్వాంతము గుఱ్ఱైతిలంగి యది యల్లన గన్నమువంద యుండు, నొ
క్కింత కమల్ మొగుడ్ప వలయెల్క వెనన్ గృతకృత్యమై చనున్. 188

ఉ. పిమ్మట నొక్కనాఁడు గుహవీడి మృగాధిపుఁ డొక్కవృక్షమూ
లమ్మునఁ గూరుచుండి తనలావు సమస్తము చింతఁజేసి "నా
గమ్ముల ఁగూల్చితన్నఁ, దురగమ్ములఁ జీల్చితిన్న. నక్కఁరం
గమ్ములఁ దీల్చితన్న. నెలుకంగని పట్టుట చాలఁగష్టమౌ." 189

చ. అని "యిది యేటిమాట, తనదంపహరితలమ్మున ముల్లు గుచ్చుకో
గునపము వెట్టి తీయు బొనఁగూడునె. సూదినెకాక, నీచ శ

తఱిన కొంతసేపు నేర్పఱచి తఱిగ్గడఁగించుట యుక్త" మంచు గ్రు
క్కునఁ దెలివొంది యెల్కయు కొండొకపిల్లిని దేఁదలంచుచున్ 190

చ. అదియెచటన్ లభించునను నంతఁ గనంబడె వృక్షకోటరా
స్పదమగు పిల్లియొక్కటి, కృపన్ మృగరాజము నైదానిఁ గాంచి "నీ
వెవ ననుఁ జూచి భీతిగొననేటికి? వృక్షము డిగ్గిరమ్ము నే
మదగజభక్షకుండ నవమానా మెఱుంగనె? నిన్నుఁ దిందునే? 191

శా. నీతో నొండొకకార్య మున్నయది యంతేవాసివై మద్గుహన్
జేతోమోదముమై వసింపుము భవచ్చిత్తానుసారమ్ముగా
నాతో నుండఁగవచ్చు భుక్తిసతము న్నాపంక్తి బోసేతుగా
కీతంటా లిఁక నీకు నెందులకు సర్వైశ్వర్యమ్ము నీ కిచ్చటన్. 192

చ. పని యది యెట్టిదన్న విను పర్వతపుంగుహ నానివాస, మం
దున నొక కన్నమందు నొక దుండగపున్ జెఱుచెల్క వాసమున్
గొని నడిరేయి నే నిదురఁగూరిన యప్పుడు మెల్ల వచ్చి గ్రు
క్కున మెడబొచ్చు నోటనిడుకొంచుఁ జనున్ దన లాఁగలోనికిన్ 193

ఉ. పట్టుదమంచు యత్నము నపారముగా నొనరించినాఁడఁ, గ
న్పట్టదు, లాఁగలోన నొకపట్టున నెట్టన డాఁగియుండుఁ బై
తట్టున కేగుదెంచియును దబ్బున లాఁగకుఁ బోవు. నంతలోఁ
బట్టుట కీవు నేర్పరి వుపాయము నీయది నే నెఱుంగుదున్." 194

చ ఇటు నుతియించి పిల్లి నెటులేఁ దనవెంకగ సంగ్రహించి య
క్కటికముమీఱఁ బెంచి చలికిన్నమి దాపునఁ గాపువెట్టి వె
న్కటివలెఁగాక సౌఖ్యముగఁ గన్నులనిండగ నిద్రగొంచు న
య్యటవిధరాధిపప్రవర మాగుహఁ గాలముపుచ్చె నంతటన్. 195

మ తనదుర్దర్పమడంచు పిల్లి యచటన్ దానుంట గుర్తించియున్
దిన నాహారముఁ దాఁగ నీ రొదవమిన్ దేహమ్ము శుష్కించి నె
ట్టన నెల్లో చననెంచి యుయెలుక బైటన్రా వెసన్ బిల్లి చ
ట్టనఁ బట్టెన్ దిగమ్రింగె. సింగమట పేక్కన్గాంచి యగ్గించఁగన్ 196

ఉ. కావున నీచకృత్యనకుఁ గావలె నీమఁ శొకిందు సింగపున్
లావది యేమిచేసె వలలాఁగపసించెడి యెల్కమీఁద? వ

ట్లే విను నీవయిన్ గురువిమేదైత్రయమున్ బనిసేయలేవ. నీ
వేవిమొ తప్పుఁగూఁ లోకచేగతిఁ బేర్లెదు నెగ్గెఱుంగమిః 197

శా "రంతుల్" మానుమటంచు మిత్కొదవు నీరంధ్రావివేకాన్విత
స్వాంతు న్నిన్నును నన్ను సత్సభకు నీడ్వన్ జేసి యస్మత్కవా
గ్వాంతుల్ మాన్పి శిరోభరం బుడిప పై వాత్సల్యమున్ జూపి ధీ
మంతుల్ మెచ్చ ననుగ్రహించునఁట! యామర్యాద లాలించితే. 198

శా రంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నీరంధ్రావివేకాన్విత
స్వాంతభ్రాన్త్యనిరంతరానృతవచఃప్రక్రాంతదుష్కల్పనా
ధ్వాంతక్రాంతకుకావ్యనవ్యరవిమీవ్యన్నవ్యతేజోంచితా
హంతాదంతురవాక్ప్రణాళికల నీహమ్మాన్ప కేనాఁటికిః 199

శా రంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ధీరమ్మన్యతారుద్ధత
స్వాంతాత్యంతదురాగతప్రవణనీచాచారవాచాటకా
చాంతానంతకృతఘ్నతాభర సురాసర్వస్వనిర్వాపణ
ద్వాంతుల్ కొందొక వృద్ధిచేసి మొగముల్ వాడింప కేనాఁటికిన్. 200

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు విక్రాంతాఖిలాశాంతనై
రంతర్యప్రతిభాసమగ్రకవితారాజ్యంబు పాలించు ధీ
మంతున్ దేశికు దూఱనాడిన భవన్మంతుస్థితుల్ వోవఁ ద
త్కాంతాంఘ్రిద్వయి మీటరంబు లిరవొందన్ జేయ కేనాటికిన్ 201

శా అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారగ్రాహివిద్వన్మన
శ్చింతాధాయితథాకృతాసుకృతరాశీభూతవాగ్జాతకు
ద్ధ్వాంతాలంకర్తైకతానకవితాధౌర్త్యంబునంజేసి గు
ర్వంతస్తాప మొనర్చు నీచరిత మేదన్ జేయ కేనాఁటికిన్. 202

శా అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనర్ఘ్యగ్రావభూషీనట
త్కాంతుద్వేషిశిరస్స రామరసరిత్కల్లోలలోలార్చటీ
సంతానోపమచారుధారకవితాసంతోషితాశేషభూ
కాంతాస్థానచరున్ గురున్ దెనఁకుపాపం బాప కేనాఁటికిః. 203

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు రారాజద్వ్యశఃకన్యకా
సంతానాయితభూమిపాలకసదాస్థానంబునం దుండియున్

జింతాకంతయు లేక పౌరుషముతో సిగ్గుగా విసర్జించి య
త్యంతానభ్యములాడు కాకవులకౌర్యం బార్పకేనాఁటికిగా. 204

శా అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సర్వక్ష్మాభృదాస్థానకు
ద్ధాంతస్థానచిరప్రసాదితయశ స్సద్వీనదోపానసా
శ్రాంత శ్రాంతయశఃప్రభూతకవితాసామ్రాజ్య సింహాసనా
క్రాంతుగా దేశికుదూఱు మోఱకుల పొంకం బార్పకేనాటికిన్ 205

శా అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పర్యాయాదృతానేకసా
ధ్వంతేవాసికృతావధాన సమయవ్యాఖ్యానవిఖ్యాపితా
శాంతస్థాయియశః ప్రసూనకవితాసౌందర్యరాజద్గళో
పాంతున్ దేశికుఁ దిట్టు కట్టెఁడుల గర్వంబార్పకేనాఁటికిన్ 206

శా అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు విద్యన్మాధురీహూత స
ర్వాంతర్వాణివరేణ్యపూత రసనాధారావరోదాహృతా
నంతశ్లోకరసోరుపద్యరసపానాప్లాయిసాధుస్తుతో
దంతున్ దేశికుఁగూర్చి వ్రాసిన యసత్యాల్ మాన్పకేనాఁటికిగా. 207

శా అంతుల్మానఁడు తిర్పతిద్విజుఁడు పారంపర్యసంప్రాపితా
చాంతామేయరసప్రసిద్ధకవితాపౌష్కర్యసాఫల్యకృ
ద్వాంతానంఖ్యనవప్రబంధపఠనవ్యాపృతిప్రలింగాభిదా
వంతున్ దేశికు నొంచువంచకుల పొం గార్పింపకేనాఁటికిన్. 208

శా అంతుల్మానఁడు తిర్పతిద్విజుఁడు విద్వజ్ఞావలేపుల్ వృథా
హంతాదంతురితాంతరాత్మకు లసత్యాలాపమూలాక్షరుల్
భ్రాంతుల్ దుష్కవితారసజ్ఞులగు మూర్ఖశ్రేణి వ్రత్యర్థులై
గంతుల్ వైవఁగ వారిగంతు లణఁగాఁగం జేయకేనాఁటికిగా 209

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మూర్ఖారాభియానావృత
స్వాంతంబౌ గజమట్లు కత్తృణము గాల్పం బూను కాలాగ్నియ
ట్లంతేవాసికృతాపరాధజవితాహంకారుఁడై పోరు ది
గ్దంతిన్ దేశికు వేఁడఁబోని అలకృత్యం బార్ప కేనాఁటికిగా. 210

శా. అంతుల్మానఁడు తిర్పతిద్విజుఁడు ప్రారబ్ధాతిరేకమ్మునగా
గొంతేసమ్మలు ముందు కయ్యమునకున్ గూకట్లు జాడించి కా
సంతైనం దప్రపలేక పాఱుదురుగా కవ్వారిఁ బాకాలయా
శ్మంతస్థాయుల బైట కీడ్చి పదరుల్ మాయింపకేనాఁటికిన్. 211

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు దుర్గర్వప్రకోపమ్మునన్
క్షంతవ్యమ్ములు గానివేరములు లక్షల్ సేసి యాపిమ్మటన్
గంతవ్యంబు నెఱుంగలేక మనమున్ గంపంబు వేధింపఁగా
గ్రంతల్ దూఱియుఁ బ్రేలువాండ్రి పస గంగంగల్ప కేనాఁటికిన్. 212

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనిర్వాచ్యప్రభావోల్బణా
క్రాంతానేకశతావధానకవనప్రారంభవేళాకృతా
త్యంతస్తోత్రసముత్సముత్కహిమవత్కన్యాదయాగణ్యకృ
త్యాంతున్ దేశికువల్వఁ గొల్వని యకృత్యంబొప్ప కేనాఁటికిన్. 213

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పారస్యజ్ఞుచే గ్రంథమున్
స్వాంతంబున్ జదివించి యందలి యసభ్యాలాపముల్ చించి మీ
చెంతన్ మీకృతులందు గోమయపయస్సేకంబు చేయించి భూ
కాంతాస్థానములందుఁ దద్యశముఁ బ్రాఁకంజేయ కేనాఁటికిన్. 214

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు స్వారాజేవియుం బౌరుషా
క్రాంతంబైన మనమ్ముతో సతతముం గాల్ ద్రవ్వు మాతోడ నెవ్వే
పాంతంబందొ మతెందొ యొక్కసభఁజేయంజేయ మీ మా కవి
త్వాంతర్యమ్ములుచూపి మీపొగరు మాయన్ జేయ కేనాఁటికిన్. 215

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సంరంభమ్ముతో వర్ధితా
హంతావేగముతో వధానభృతవిద్యాచాతురీధాటితోఁ
బంతంబొప్పఁగ వచ్చి పండితకవీట్ప్రాంతమ్మునం బాండితీ
కుంతాగ్రమ్మున గొంతునొక్కి చపలోక్తుల్ మాన్ప కేనాఁటికిన్. 216

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మర్యాదావిదున్ భూపతిన్
దాంతున్ దాతృశిరోవతంసు నయవిద్యాజన్యసౌజన్యసి
ద్ధాంతుం గొల్చియు నుంతయేని యభిమానాహంయువుల్ గాక వి
క్రాంతాలాపము లాడువాండ్రి తలభారంబు బూడ్ప కేనాఁటికిన్. 217

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు వైరంబున్నచోఁ బౌరుషం
బెంతేఁ జూపెడి వెల్మరాజ్యమున "మేమే" యంచుఁ గైతమ్మునన్
గంతుల్ యుడో చు వ్రాతఁ వ్రాయుచుఁ గ్రియాకాలమ్మునన్ భీతి నా
పొంతంపే వివమోనగాండ్రి కలరూపుం దేల్ప కేనాఁటికిన్. 218

శా "అలంతన్ శెందకు" మంచు మిక్కొదవు వి గెం ంతేవసద్ధర్మనం
చరితుణా దుర్లలితున్ దురాగతు దురాచారపరిచారున్ సభా
స్థలి కెక్కించి స్థలవ్యవ స్కం. గళమద్యత్స్వేదుఁ గావించి వి
చ్చలు రక్షించి యనుగ్రహించుననఁట ; తద్చాతుర్యముణా గంటివే ? 219

మ "అలంతణా శెందఁడు వేంకటాచల" మహాశ్రాంతేవసద్ధుర్మదా
విలనిర్భీకకృతఘ్నతాజ్వరభరోద్వేగప్రభావప్రభా
స్థలదాచారవచఃప్రచారవిలయాఖండౌషధప్రాయని
ర్మలపీహాంమనోహరాత్మకృతిఁ బర్వంజేయ కేనాఁటికిన్. 220

శా "రాపుల్ పీడు" మటంచు మిక్కొదవు ధీరమ్మన్యుని వ్నిన్ను దు
ర్వ్యాపారున్ సభలోనికీడ్చి భవదాకీర్తాపవాదాన్వితా
లాపంబు ల్మోదలంటఁ గాళ్చిపయి వాలాయంబు శిక్షించి నీ
పాపంబూడ్చి వతుల్ గ్రహింపుమనఁట ; తప్ప్రాగల్భ్యమూహించితే ; 221

శా "రాపుల్ పీడఁడు వేంకటాచల" మహారస్ఫారఘోరాన్వితా
లాపాంతేవసదాస్య కర్కటవిశాలశ్వభ్రదుర్వార్పహిః
వాప్రపక్షారతరావిలాంబుప్రుషదాపత్ప్రాపకాత్మీయవా
గ్భ్రాపాపాపరంపరావిభవముల్ గుప్పింపకేనాఁటికిన్ 222

శా "డంబాల్ మాను" మటంచు మిక్కొదవు ప్రౌఢమ్మన్యతాదోషమూ
ర్తంబై నట్టి భవన్మనంబునకు వీరిడన్ బుట్టఁగాఁజేయ వి
న్నుం బాండిత్యవిహీను యుండు సభయందున్ బట్టి రెట్టించి గ
ర్వంబు న్మాన్చి యనుగ్రహించుమనఁట · తద్వాత్సల్యమూహించితే ? 223

శా 'డంబాల్ మానఁడు తిర్పతిద్విజుఁడు' వీరిదాఖాన్యధన్యేతరా
లంబాలంబితగర్వదూర్వహదురాలాపాములాపస్వన
చ్ఛంబూకాయితనష్టధీకవికృతచ్ఛాత్రాపచారస్వరూ
పంబుణా బూర్తిగ రూపుమాపి దెసలం బ్రాకింప కేనాఁటికిణా 224

ఉ దవ్వులనుండి పేర్చుటది త. ప్పెదిరించి వచింత మందులో
వవ్వులొ పువ్వులో ? జగమునణా మనకబ్బెది. నందుకై మది
న్నెవ్వగ గూరెనేని విను నీచతకున్ గుమరౌ ప్రసంగముం
దర్పవ్వకు శిక్ష మిప్పటికె తద్దయు బొప్పెలుగట్టఁజూచితే. 225

మ. అవమానంబన వేఱెయున్నదియె కట్టా! చాలుమూలమ్ములన్
దవులంబోని యవాచ్యవాచకములన్ దద్దన్ బ్రసంగించుచున్
భువినెందుం దలవంపుగల్గు సరణిన్ బోనెంచుకన్నన్ హరీ!
శివ! రామా! కరుణించి నాసఖు నెటో చీవాట్లు వైవంగదే 226

మ భగవంతుండవు నీవు. నీకొరులు చెప్పంగాఁ బనేమయ్య? నే
నగుదున్ శిష్యుఁడ వేంకటేశ్వరున కీయన్నంబు తచ్ఛిష్యతా
ధిగతంబే. యటులయ్యు నగ్గురువరున్ దిట్టంగనుంకించు నా
తెగువ న్నీవఖిలమ్ము నాఁ సయిచి వర్ధిల్లంగఁజేయంగదే! 227

మ చెలియొక్కండు పురాకృతంబు కలిమిన్ సిద్ధించె. నవ్వాఁడు రోఁ
తలకున్ దింపె నధోగతింబడితి దెందంబూఱటం గాంచ ది
క్కులి యేరీతిఁ బొకాలు నీకరుణచేఁ గా కోమహాభాగ! యీ
తుబువన్ దప్పులు సర్వమున్ సయిచి నిర్దుష్టాత్ముఁగాఁ జేయవే. 228

మ పగఁజూపం దిపుడేని దేశికుఁడు. తత్పాపద్వయిన్ జూడఁబో
వఁగఁ బ్రీతింగని పోర్చుఁగాని యెటులో వాపోయి వాపోయి యే
మొగమున్ బెట్టుక దేశికోత్తముపదమ్ముల్ చూడఁగాఁబోదు నో
భగవంతుండ! యుపాయమున్న నెఱఁగింపన్ విన్నుఁ బ్రార్థించెదన్ 229

శా అన్నంబేరు భుజింపరే! యన్నృత వాగాలంబనపాత్రమౌ
నన్నంబన్నమె. సున్నమే మెఱుఁగుగాదా. దానికన్నన్ శివా!
బన్నంబందు మువింగితిన్ తెడితి నాపన్నున్ గురుద్వేషసం
పన్ను న్నన్నెటులో కృపాంబునిధివై మన్నించి రక్షింపుమీ 230

శా. నాకన్నన్ గలుషాత్ము లెందరొ నినున్ ధ్యానించి పాపమ్ములన్
వీఁకన్ ద్రుంచి యధోగతున్ గొనక నీవిఖ్యాతికిన్ పాత్రులై
శ్రీకిం దక్కక యాయిలన్ మెలఁగి పైఁజెన్నొందు లోకమ్ములన్
బ్రాఁకన్ గల్గిరటంచు వింటి. నటు నన్ బ్రార్థింతుఁ గాపాడవే. 231

మ ఎఱుఁగన్నేరక తప్పుతోవలకు న న్నవ్వాఁడు వోఁదోచె న
మ్మొఱకుంగూడ సహించి యిప్పుడయినన్ ముందైన సద్బుద్ధికిన్
చెరువుంగా నొనరించి దుర్గతుల నందింపన్ బ్రియత్నింప కే
త్రైఱు రక్షింపఁగదయ్య నీకరుణ మ్రిందింపన్ సమస్తాఘముల్ 232

మ. గురువుం దిట్టుటొకండె కాదు మఱియున్ గూర్చి తత్త్వముల్ చెక్కు మే
మర కేవేవియొ సల్పియుంటి; మవి యన్నియుల్ గూడఁ గావించియుం
దురుగా, కీగురుదూషణాఘమున కెంచున్ జొమ్మనా రుండఁబో
వరు మమ్ముంగాఁ బలె; దీని మారణ మొనర్పన్ దేవ! యత్నింపుమా 233

మ, ఒరులే చెప్పిననాకుఁ బుట్టినను నీయుద్రేకమెంతేని యు
న్నరకంబున్ దెలుపౌఁగదా? యెటుమది న్నా కూటముల్ గల్గు? దే
వర కారుణ్యముదక్క నీయఘము సంబాళింప వేఱొండు ది
క్కరయంగాఁబడ దెట్లు ప్రోచెదొ! మహాత్మా! పాపదావానలా! 234

మ గుఱుఁ దాడం దనృతమ్ము నేనెఱుఁగుమంగా; గొందొక్కఁ డాడంగ న
ద్దురితాత్ముంగా గరుణింపఁ దిక్కతననే ద్రోహిన్నునుంగా పైఁకే
ద్రై శిక్షింపఁగఁబూనె, నట్లగుట యెంతే మంచికిం ద్రోప యం
చరయన్నేర్చియుఁ గాలకర్మమున విశ్లైతిన్ శివా! ప్రోవవే 23

మ అతఁ డేత ప్రొనరించినన్ సమచు శిష్యవ్రాతముం బేర్మి, సూ
నృతవాగ్దూరు సహింపఁ దాదురిత మే నేమాఁతఁగాగొంటి స
మ్మతిలేకుండియుఁ దోఁచివానికితనం బాపంబు నానాట నా
మతివిర్జింకులు పెట్టసాఁగె నెటులో మన్నింపు మోదేవరా! 236

మ. "నను బ్రార్థించెదవేల? దేశికుని సన్మానించి నీతప్పులన్
వినుపన్ రాదె? "యనుగ్రహింపు" మనుచున్ వేఁడంగరాదే?" యటం
చనెదేమో? సుకువైన మార్గమదియేయౌ, నైన నాకీభవ
మ్మున కాయోగ్యత లేదు; నీవెటులో యీమూఢుంగా గటాక్షింపవే. 296

శా. పై కేకూఁతలు గూసినన్ గురుని సంభావింపకున్నట్టి దు
ర్బీకుండంచుఁ దలంపఁబోకు ననుఁ. దావృజ్మానసాహ్వావిధా
నైకాలంబన నీవు ప్రోచుటకునై హర్షింపఁగావచ్చు నే
దోకర్మమ్మున నిట్టులైతి విది నీ వూహించి రక్షింపవే. 237

మ. గురుఁడుంగా దేవుఁడు నిత్వరేకద? వరున్ గోపించినన్ గాచినన్
గరుణాళున్ గురుపీడి పాపమునకుం గారావుచుట్టంబనై
శరణోపాయము లేక నీచరణముల్ ధ్యానించుచున్నాఁడ దే
వర! యా "దాసరి తప్పుదండమునఁ బోవంగా జేసి కాపాడవే. 238

శా. ఐదావేఁదులు వోవుదెంచెఁ గలహం బారబ్ధమై: కృష్ణుఁ దే
సోదో గిల్కొనెకావి శాంతికొఱకై చూడండు; నేనింట నా
మోదమ్మింయుకలేని మోమున నఘమ్ముల్ వేస్రిల విట్లుంటి, నా
కేదేరీతిని గోడుపావఁగదె లోకేశా! కృపాశాళివై. 239

మ. అని యెంతేనియు వేఁడి వేఁడి మది కాయాసమ్మురా విద్రిగై
కొని న్వప్నమ్మున నెవ్వరో యొకరు "నీకున్ దేశికాంఘ్రిద్వయా
ర్చనచేఁదక్కఁ శమంబు గల్గ దుద కాళాపాశబంధమ్ము చే
నవిశంబుగా శివువేఁడి యేమిఫల ? మయ్యాచార్యుసేవింపుమా ! 240

మ ఎవరిన్ ధిక్కృతి చేసి నీవఘముచే విశ్లైతివో, వారినే
యవివేకం బఱఁజేసి వేఁడికొను మల్లంతన్ సుఖంబబ్బు మో
ము వికాసమ్మునఁ బొల్చుఁ బాతకశతమ్ముం బోవు లోకమ్ములో
నెవరున్నిన్గని దూఱఁబోవరు మనోభీష్టంబు సిద్ధించెడిన్ 241

మ "ఒకచో నొప్పియు నొంటరక్షయు" నెటుల్ యోగించు ? నీచేయు పా
తక మెల్లన్ గురుదూషణాత్మకమకాదా ? దానికిన్ దేశిక
పద్మకటాంఘ్రిద్వయసేవ మారకమగున్, బ్రాల్మాలఁగాఁబోకు నీ
కకలంకత్వమె కామ్యమైనయెడ నాయాలోచనం బట్టుమా 242

మ "గురుపీడన్ జనుఁగా, కయోగ్యుఁడయినన్ గూటించి తిట్టంబనే
మిర ? యోరీ ! యనృతాత్మ ! " యంచు విను నమ్మృత్యుంజయుండన్నను
త్తర మొండున్నదె ? యేలయిట్లు గతమున్ దర్పివ్వన్, శివున్ వేఁడఁగాఁ
గరుణింపం డతఁ; డేగి వేఁడుము గురున్ గారుణ్యమున్ జూపెడిన్ 243

మ. హరుకోపమ్ము గురుండు దీర్చు, గురుకోపాటోపమున్ దీర్ప శం
కరుఁ డేమాత్రముఁ జాలఁ డీనుడి నెఱుంగన్ జెప్పె నీదేశికుం
డరరే ! యాహితమెల్లఁ బోవిడిచి "దేవా ! నన్నుఁ బ్రోవంగదే !
పరమాత్మా !" యనినంతనే శివుఁడు నిన్ బాలింప నేతెంచునే. 244

మ. శివుఁడేమి ! యవివేకియే, యతనికిన్ "పె" న్వింతయున్ లేదె ? "మె
చ్చి వరంబాతఁడు కూళరక్కసుల కిచ్చె న్నన్ను రక్షింపఁడే ?
యవివేకాత్ము" నటంచు నెంచితివొ ? గుర్వాక్షేపకుం డెవ్వఁ డా
శివుచేఁ బ్రోవఁబడెన్ ? వచింపు మొకనిన్ జేయెత్తి యున్మత్తుఁడా. 245

శా. "కాకం" బేమిటి ? "తితు" వేమిటి ? వృథాకాఋల్ పర్రిలాపించి యీ
శోకంబేటికి నేఁడు ? పేర్రిలితి వెదో శోకించి యిప్డేమగున్ ?
వాకుల్ జారితి వేడ్రెఅన్ మనకు "దేవా ? పొర్రివు" మన్నన్ శివుం
డూఁకొట్టన్ వెఱివాఁడె ? యింత యవివేకోద్రేకముల్ సైఁచునే. 246

మ. గురుఁడేతండ్రి గురుండె దాత. గురుఁడే కూర్రాఘసంహర్త. దే
వరయున్ శ్రీగురుఁడే. గురుల్ దెగడి దేవళ్ళ న్నుతింపన్ వృథా
యజపుల్ వారు గణింపఁబోరు. చను మయ్యాచార్యు సేవింపు ము
ర్వర వర్తింపుము శీర్ష మెత్తికొని పాపంబెల్ల గూపెట్టఁగన్. 247

శా. ఈలీలన్ జనులొప్ప లేనియెడ మున్నె ట్టట్టులే దబ్బఋల్
వాలాయమ్మను గిట్కుచున్ శిర మధోభాగమ్ము వాంఛింపఁగా
వోలిన్ గాలము సర్వముం గడపి శాస్త్రోక్తపర్రికారమ్ముగాఁ
బాలింపన్ జనుసీ ! యఘంబొ ? సుకృతపార్రిగ్ర్యారమో ? యన్యమో ? 248

శా. నాకుం దోఁచినరీతి శాస్త్రగతికిన్ భంగమ్ములేకుండ. ధ
ర్మైకాయత్తులు మెచ్చురీతిభవదీయాంతర్గతిన్ బట్టి నీ
శోకంబాఁగు నుపాయము న్నుడివితిన్ శోధించి. నీమిత్ర్రి దు
ర్ధీకున్ బట్టక వేగ బాగుపడుమీ ? దేబయ్యవై పోకుమీ !" 249

మ. ఇటు బోధించినచుట్టులై నిదురమత్తెందేఁజనన్ మీఁద దృ
క్పుటముల్ విచ్చిదెసల్ గనుంగొని తమన్ బోధించు నప్పూరుషుం
డట నెందున్ గనరామి "స్వప్న" మని తానద్దాని భావించి య
ప్పటి కాయోజనతోడ నుండె గురుదేవద్వేషదోషార్తుఁడై. 250

శా. లోఁ "దప్ప" ంచు నెఱింగి. పై కఘపుజల్లుల్ వీఁక వర్షించును
న్మాదిన్ శిష్యునెఋంగుఁగాక జగ. మంతస్తాపముం బట్టియే
పోఁద్రోయన్ బర్రియతింతుర్రిగా కఘము శంభుండాది యౌ వేనతల్
వాదిం బియ్యది శిష్యశాసకముగా వర్ధిల్లఁగా కెల్లడన్. 251

ఇది శ్రీ కింకవీంద్ర .. ......
తిరుపతివేంకటేశ్వర కవి ప్రణీతమ్మగు
గీరతమ్మున లోకాభిరామాయణము
సంపూర్ణము

శ్రీమత్పరదేవతాయైనమః

* గిరతానుబంధము *

# క్షమాపణవ్యాసావళి



1918 సం॥రం

కృష్ణా పత్రికనుండి

సంగ్రహింపఁబడినవి.

శ్రీ

తిరుపతి వేంకటీయము

# * గిరతానుబంధము *

## —/ క్షమాపణ వ్యాసావళి /—

విషయసూచిక:



---

## సూచన

ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో శ్రీ వెంకటరామకృష్ణ కవులు "ఆంధ్ర కవులు అపరాధములు" అని రచించిన పద్యములను గూర్చిన ప్రతి విమర్శన వ్యాసములు.

# మహాకవి పోతనామాత్యుఁడు

ఏమహానుభావు నాత్మసాత్కరించుకొని గర్వించుటకై కడప మండల నైజాముమండలములు నేఁడు పోరాడుచున్నవో ఆపరమభాగవతశ్రేష్ఠుని ననవగ్రాసి లోకులచే బ్రువ్వఁ దిట్టఁబడుమాశిష్యుల నుద్ధరింపనాధార మగుపట్టకయు "శిష్యమౌఢ్యం గురుంయాతి" యనునభియుక్తోక్తికతన నది మానెత్తికిఁగూడ వచ్చినట్లు లోకుల యుత్తరములవలనను, గృష్ణాపత్రిక వలనను గనుపట్టుటంజేసియు మనుమున్న శీర్షికచేతనే లోకుల యాగ్రహము నివారించుచు సర్వజనవిదితమును చిరప్రసిద్ధమ్మును జర్వితచర్వణమ్మును నగు నమ్మహాకవి యోగ్యతంగూర్చి కొండొక ప్రస్తావింప నెంచుచున్నారము ఈమధ్యఁ బీఠికాపురమున నేదో సభలోఁ గొందఱుప్రాజ్ఞులు, చర్చించి మాశిష్యులను మందలించిరనియు, దానిపై వారింకను దమవాదమును గ్రంథరచనచే సమర్థించుకొందు మని చెప్పినట్లును, కృష్ణాపత్రిక వలనఁ దెలియవచ్చుటచేఁ గాఁబోలు నింతదనుక మాకుఁ దొందర గలిగించుకోకమిపుడు కొండొక గడువొసంగుచున్నను మాశిష్యులింతకుము న్నొనర్చిన యపరాధముల కుద్ధారకములని వ్రాసినగ్రంథములస్థితి నెఱిఁగినమే మంతవఱకు వీక్షింపకయే వారిపక్షమున క్షమాపణ చెప్పుచున్నారము. పీఠికాపురపు సభావృత్తాంతము చదివిచూడఁగా సభ్యులెల్లరు నేకవాక్యతగాఁదమచేసిన యకృత్యమున కేవగించుకొని యీయకార్యము "తల్లితో హాస్యమాడుట వంటిది" యని స్థిరపఱచినమీఁద నోటు మెదల్ప వీలులేక "అటులుండి నకుకు" మనుసామెతను స్మరించి యట్టియుత్తరమును మాశిష్యు లిచ్చి యప్పటికి దాఁటిపోయిరని మేము దృఢముగా నమ్ముచున్నారము. పైఁగా, "దూషణయు, భూషణయు" హాస్యముచేయుటయుఁగూడ వారియుద్దేశము కానట్లు మాశిష్యులు వాకు్రిచ్చినమాట కర్థమేలేదు. ఈయంశమును అపరాధ వ్యాసాంతమునన్న "పూర్వకవిరాజులకు నిది భూషణంబొ దూషణమొ యనుకొనుఁడు మీతోఁచినట్లు" అనువాండ్రవాక్యమే స్థిరీకరించుచున్నది. ఇందునుగూర్చి వారిగ్రంథావతారానంతరము చర్చింతము. ప్రస్తుత మాక్షేపించిన యంశముల నెత్తి విచారింతము.

(1) గురుకులక్లిష్టుఁడుగాక సహజపాండిత్యుఁడనని చెప్పెడుపోతరాజు నేరాజును బూజ సేయలేదు కావున నతఁడు దేవరలను దయ్యములను గీర్తింప మొదలిడినాఁడు కానియట్లు కావిచోఁ బోతనామాత్యుఁడును రాజుల నుతించువాఁడే. యనునది మొదటితిట్టు ఇందు "గురుకులక్లిష్టుఁడు కాఁ"డనునంశము సత్యము.

"సహజపాండిత్యుఁడ నటంచుసంబరపడు" అనుటచేఁ బోతన్నగారట్లుతనలోఁ దానను కొనియెనే కానినిజమున కతనికిఁ బాండిత్య మేమియులేదుఅని వెం॥రా॥ లాక్షేపించుచు న్నారు శ్లో॥ "గురుశుశ్రూషయావిద్యా" అనుటచే నీయాక్షేపణయు సమంజసమే కావలెను గానిసామాన్యు లట్లుతలఁచినను విశేషజ్ఞులట్లు తలఁపరు తలఁతురేని,వరప్రసాదాసాదిత సకలవిద్యాభాసితులగు కాళిదాసాదులెల్ల నెందులకుఁ గొఱగానివారు కావలసి వచ్చును. సామాన్యముగా విద్వత్తకు గురుశుశ్రూష కారణమైనను విశేషదృష్టిచే యోజించి వచోఁ బూర్వజన్మపరిపాకమాత్రలబ్ధ సారస్వతులగువారు క్వాచిత్కముగా నున్నట్లు లొప్పి తీరవలయును కావుననే, "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అను కాళిదాసోక్తి సంగచ్ఛమాన మగుచున్నది. చదువకయే విద్వాంసులగువారు క్వాచిత్కముగ నుండుట చేతనేకదా? పాణినిముని తనవ్యాకరణమున "తదధీతేతద్వేద" అని యధికార సూత్రము విరచింపవలసివచ్చెను ఈసూత్ర మాయాశాస్త్రాదులు చదివినవారితో పాటు చదువక తెలిసికొనినవారికిని, వైయాకరణతార్కిక, ప్రముఖబిరుదముల నిచ్చుట కేర్పడినది మన పోతన్నగారు, 'తద్వేద" అను రెండవ తెగలోనివారు కావున పోతన్నగారొక్కరేకాక మనమందఱమును ఆయన సహజపాండిత్యసత్తను శిరసా వహించి సంబరపడుట కేమభ్యంతరము లేదు. లేదు. లేదు అగుచో నీయనఘుఁడు పండితకవి మండలీమండితములగు రాజసదస్సుల కరుగవచ్చును ఆరాజులకుఁ గృతులీవచ్చును. వారగ్రహారాదులిడవచ్చును. ఇట్టిసామర్థ్య ముండియునితఁ డట్లొనర్పక తనయుద్దేశ మెట్టిదో భాగవతగ్రంథారంభమునందే— శా॥ "శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అని యుద్ఘోషించుచుండఁగా నియ్యనఘునిగూర్చి "యవా కులు చవాకులును" ఏదపటయేకాక, పైఁగా—

క॥ ఏకాలమందుఁ గానీ । వ్యాకరణాదులఁ బ్రశస్తి పడసినకవులన్
జేకొండ్రు నృపులు కొండ్రెయ । వాకు లవి చవాకులిచ్చి పలికెడివారిన్

ఆదిపోతన్నగారి భాగవతరచన "సవాకుచవాకులు" గా మొఱఁగు మోస కుల మోసమునకు నిష్కృతి విచారింప వలసియున్నది పైవిషయము నాత్మదృష్టాం తముమీఁద విచారించికొనినచో నేమగునో వెం॥ రా॥ లు స్మరించికొన్న నేమేనిఁ దెలియునేమో, తమకున్న వ్యాకరణజ్ఞాన మెంత, అది లేక యొప్పులుతప్పులవి చెపిన దెవరెఱుఁగరు? ఇంతయేల? ఈసూవ్యాసపుశీర్షిక యగుచూపణపదము తమతెలివికి నిదర్శనమేకదా. ఇంతటి వ్యాకరణపాండితి గలతమరు రాజసభకుఁ దగినంతటి కవితాపాకము గలిగినట్టియు, అష్టాదశ పురాణాంతర్గమగునట్టియు తత్త్వవిద్యా సర్వస్వ మగునట్టియు, సంస్కృతమహాభాగవతము వశ్రిమమ్మగ నాంధ్రీకరించి రసకవిత్వ

ముసకుఁ బరమావధియై విరాజిల్లుచునాఁటినుండి నేఁటివఱకునెల్లరమహాకవుల పొగడ్త లకు నిక్కయైనచక్కనిచుక్క పోతనమహాకవి రాజపరిగ్రహణయోగ్యుఁడు కాకుండె నేమి? పైఁగా రసార్ద్రకవితాభిరాముఁడగు పోతన్నగారు "పొడికవిత్వమల్లువాఁ"డేమి? శివ! శివా! ఎంతపాపపుమాట వినవలసివచ్చినది. పొడికవిత్వ మల్లువాఁ డను హేతువున నేరాజును గౌరవింపమి నీతఁడు హాలికుఁడై తేఁగినాఁడఁట! తేఁగి రాజులఁ దిట్టినాడఁట! ఇది "నక్కద్రాక్షపండ్లసామెత" గా నున్నదఁట! రాజద్వేషముచే నట్లొనర్చిన మఱికొందఱు కవులు కలరు. వారిని చరిత్రకారులోక మట్లె గ్రహించుచున్నది. పోతన్నవిట్లెవ్వరును జెప్పినది లేదే.—

(1) ఉ॥ కాటుకకంటినీరు—

(2) ఉ॥ బాలరసాలసాల—

(3) ఉ॥ ఇమ్మనుజేశ్వరాధములకు—

లోనగు పద్యములకు సంబంధించిన చరిత్రములు పరంపరగా వచ్చుచున్నవి. అందీ యపవాదము నిందముక నెవ్వరును జేర్చినవిలేదే! పోనిందు నాఁటివారికి దెలియని సంగతి నేఁటివారికిఁ దెలియవచ్చునందురా? ఈమాట నెట్లువిశ్వసింతుము? విశ్వసింతుమో? "ఇంటివాఁ డేదియో యనఁ బొరుగువాఁ డేదో" యన్నట్టులగుఁ గదా? పోతనకాలమువాఁడగు సింగన్న భాగవతషష్ఠస్కంధాదియందు—

ఉ. ఎమ్మెలు చెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూరలు పేసినవానిభక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజుఁగవి పట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్॥

అని యమ్మహాకవి స్వభావమును జక్కఁగా వర్ణించి కవి పట్టపురాజని మ్రొక్కుచుండ నేఁటికి వీరు "పొడికవిత్వమల్లువాని" గా గిలుకుటకు హేతువు పూజ్యము. సింగన పోతనలకుఁ గాలభేద మెంతో యుండదు. "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా? అట్టిచోఁ బోతనకవిత్వమాతని కాలమందే జగదాదరణపాత్రమైన దనుటకుఁ బైఁ జూపిన దృష్టాంతము చాలదా? పోతన కవిత్వము నుదాహరింపనియంత చేవ స్తముగల యప్పకవిగూడ—

"సహజపాండిత్యుని సంస్మరించి"

యని భక్తింజూప మాళిమ్యేలకో—

ఉ॥ ఊరుమబేరులేక బడియున్న "వానిఁగాఁ బోతనమహాకవిని చూఱుమన్నారు? అప్పకవియేని ఏ తనయెడ నిదేయుఁడు కానివాఁడుకాఁడు. రేఫశకట రేఫములమైత్రి

తనకిష్టములేని హేతువున భాగవత మాపట్టునఁ దనకు గిట్టక దానినెందులకును గైకొనక కైకొనకుండుట లోకుల యసంతృప్తికిఁ దావలమని యెంచి స్మరించి విరపరాధి యయ్యెనని సహృదయులు గ్రహించుచున్నారు అక్కడికిని నప్పకవియందుఁ గూచిమంచి తిమ్మకవి సార్వభౌమున కనుగ్రహము పుట్టక యతఁడొసర్చిన దొసఁగునకుఁ దగిన నిష్కృతి నాచరించికాని విడచినవాఁడుకాఁడు ఆనిష్కృతియు, భాగవతగ్రంథరచనాసమర్థనమును, అప్పకవిపొందిన పరిహాసమును. లోనగు వంశములు సర్వలక్షణ సారసంగ్రహమునఁ జూపగోరెదము లక్షణ గ్రంథములువ్రాయు విద్వాంసులకుఁ గొన్నిమతములు ఖండించుటయుఁ గొన్ని మండించుటయుఁ దప్పని పని అట్టివారికో నగ్రగణ్యుఁ డగు నప్పకవి భాగవత గ్రంథకర్తను స్మరించి యున్నను నతని పద్యము లుదాహరింప లేదనుదానికే లోకమంత మండిపడినప్పుడు తాము పోతన నెకసక్కెమాడుపట్టున నివియోగించిన——

"ఊరును పేరులేక" యను తమ సూత్రమునకు మొదటి యుదాహరణము కాదగు జ్ఞానలవదుర్విదగ్ధు లమ్మహాకవి నేలక్షణ గ్రంథ ప్రసక్తియును లేక యవలక్షణోక్తుల నాడ మొదలిడుచో నెంతమండిపడుదురో యెఱుఁగనివారుండరు. ఆలోకుల హృదయములు శాంతిపొందుటకే మేమొనర్చు నుద్యమమని ముందే వ్రాసియున్న శీర్షికవలన విజ్ఞులెఱుఁగుదురుగాక. పోతన్న సర్వసమర్థుఁడైనమహాకవియైనను పోతన్న గారినెందఱో రాజులు, అందుముఖ్యముగా రావు సర్వజ్ఞ భూపాలునివంటి విద్వద్రాజులు కృతినిమ్మని కోరియుండినను, అతం డైహిక తుచ్ఛసుఖముల యందిచ్ఛ లేశమును లేక యేదోరీతి నాభూపాలుని కనులసీమ తుడుముటకై భోగినీదండకమును వ్రాసెనని చరిత్రజ్ఞు లెల్లరు నెఱిఁగిన విషయమే. ఈసత్యమును మావాండ్రిట్లు పొలిపి పాడుచేయఁజూచిరి.——

గీ. రావుసర్వజ్ఞ సింహభూరమణుతోడ । నావ శ్రీనాథకవిసార్వభౌముఁడేమొ
చెప్పితత్కరుణాపాత్రుఁ జేయుపిదప । భోగినీదండకము నాఁడె పోతరాజు."

శ్రీనాథుఁడు సర్వజ్ఞభూపాలు నొకప్పుడు కార్యవశమున దర్శించినను అతని యొద్ద నంతటి చనవుగలవాఁడు కాఁడు, కావున రాజ కరుణాపాత్రునిగాఁ దనపోతనను జేసినాఁడనుట విశ్వాసదూరము. ఆపిదప భోగినీ దండకమును రచించుట యను పెద్ద కళంకమునకీఁ బోతన సిద్ధపడినాఁ డనుమాటయు నిరాధారమే. ఎప్పుడు భోగినీదండకము వ్రాసెనో తెలియఁదగు నాధారము సున్న. భోగినీదండకమువలన రాజకృప నభివృద్ధి చేసుకొనుటకుఁ బోతరాజు యత్నించినట్లు వెం॥ రా॥ లభిప్రాయ

పడుటతప్పు. ఆపంధకము పైపెచ్చు రాజులకాగ్రహము వచ్చుటకు సాధకమగునే కాని యనుగ్రహ సంపాదకము గానేర దను వంశమందుఁ గల వేశ్యమాత వాక్యములు చదివినచో బాలునకేని సుగమమే. కావున

ఉ. ఊరును బేరులేక పడియున్నతటిన్. మడిగట్టుకొన్నటుల్
నేరుము లాఁడుచుండెద రనేకులు లక్ష్యముగాఁగ నెట్టి క
ర్మాచరితకేని సిద్ధపడి కొంచెపుఁ గార్యము లాచరింతు రీ
తీరు ప్రపంచమందుఁ గలదే మన పోతన నెన్న నేటికిన్॥

అను మావాండ్రపద్య మనర్థదాయియనక తప్పదు. పోతరాజు భోగినీదండకముగూర నతనికిఁ దృణీకృత బ్రహ్మపురందరత్వము సాధించుటకే తోడ్పడు చున్నది పోతరాజు శీలమును దెలిసికొనుటకు భాగవతమున నెన్నో ఘట్టములయం దెన్నో పద్యములు దొరకును అందు వామన చరిత్రమునందలి—

క. వ్యాప్తింజెందక, వగవక ప్రాప్తంబగు లేశమేనిఁ బదివేలనుచున్
దృప్తింజెందని మనుజుఁడు సప్తద్వీపములనేనిఁ జక్కంబడునే.

శా. ఆశాపాశముదాఁ గడు న్నిపుడు లేదంతంబు రాజేంద్ర ! వా
రాశి ప్రావృత సర్వభూవలయ సామ్రాజ్యంబు చేకూరియున్
గాసింబొందిరిగాక వైన్యగయ భూకాంతాదులున్నర్థకా
మాశంబాయఁగ నేర్చిరే ? మును నిజాశాంతంబులన్ జూచిరే॥ ౨॥

సీ. సంతుష్టుఁ డీమూఁడుజగములఁ బూజ్యుండు,
సంతోషి కెప్పుడు జరుగుసుఖము,
సంతుష్టిగాకున్న సంసారహేతువు॥ ౩

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ మౌంజియో దండమో
వడు గే నెక్కడ ? భూములెక్కడ ? కరుల్ వామాక్షి లక్ష్యమ్ము లె
క్కడ ? విత్యోచితకర్మ మెక్కడ ? మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయె త్రోయ కిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్॥ ౪

పైపద్యమువలనఁ బోతరాజుగారి విస్పృహత్వము తేటతెల్లమగును. కాని సంస్కృతమున నున్న వ్యాస భాగవతమునకు నాంధ్రీకరణ మగు వామనచరిత్రమునకును గవి హృదయమునకును సంబంధమేమి ? యని కొంద ఱనవచ్చును. ఆంధ్రీకరణమైనను బోతన్నగారి స్వకపోల కల్పిత మధికముగా నుండుటచే వానినుని

యందుఁ గవికంతర్భావము చెప్పితిమని గ్రహింతురుగాక. ఇట్లే పింగళిసూరనగారికి-

సీ. శబ్ద సంస్కారమెచ్చటను జాఱఁగ నీకపలుక నే। ర్చుట బహుతపఃఫలము గాదె॥

అనునెడ నంతర్భావము వెల్లఁగఁ దగు. ఇదేరీతిని గవులకు స్వకృతగ్రంథ ములయం దచ్చటచ్చట నంతర్భావమును గల్పించి వారివారిహృదయములను వ్యంగ్య మర్యాదగా నరయుట సహృదయసమ్మతము. మఱియు నీయుదాహరించిన పద్య ములు పోతన్నగారి శీలమునకే కాక యాయనకుఁ గల యాంధ్రవ్యాకరణ రహస్య జ్ఞతకును నతి విర్మల కవితా ప్రవర్తకతా ధూర్వహతకును గూడ నుదాహరణము లని విజ్ఞు లరయుఁ గలరు. పోతన్నగారు విప్రుహులే కాక యితరులతో పాటు దర్వివ్యార్జనాసక్తి గలవారే యయి పాండిత్యలేని హేతువున రాజాంసన్మానము పడయ నేరక నిపిని దైవకృతిగా భాగవతము నాంధ్రీకరించుటయే విక్కమగునేని అదైవము నేని యతఁడు తనకు ధనధాన్యాది శ్రేయఃపరంపరలనే ప్రసాదింపుమని ప్రార్థింప వలయుననుట యుక్తిసహము కాకపోదు అట్లుండ నీమహాకవి "కైవల్య మాత్ర మునే కోరనేల? పైఁగాఁ దనకు రామభద్రుఁడు ప్రత్యక్షమై" "మన్నామాంకితముగా శ్రీ మహాభాగవతంబు దెనుంగు సేయుము, నీకు భవబంధములు దెగును అని యేల చెప్పెను కృత్యాది పద్యమునందలి కవికోరకె తనుగుణముగా వరప్రదానము కను పట్టుచున్నది భగవద్గీత యేమని నొడువుచున్నది?.

శ్లో॥ యే యథామాం ప్రపద్యంతే। తాం స్తథైవ భజామ్యహమ్

కైవల్యాతిరిక్తమగు కామము పోతన్నకు లేదు. కావున నతనికిఁ దుచ్ఛమగు నైహికసుఖ వాంఛయుండి యది తీర్చుకొనగతి లేక "నక్క దాక్షపండ్లు" సామె తకు వగ్గమై రాజులఁ బట్టి దేవళ్ళ వెంబడిఁ బడియె నని వ్రాయుట నరకహేతువని చెప్పకతప్పదు.

"క. .... వరకే। పతికో దోషోమరణే। పతి కిం

భయ"మన్న చదువు చదువన్ బోలున్॥

శాంతం పాపం ప్రతిహత మమంగళమ్, ప్రకృత మనుసరామః, పై నుదాహ రించిన పద్యములవలనఁ బోతనకుఁ గల సంస్కృత వ్యాకరణజ్ఞత యంతగా సమ ర్థింపఁబడదు, ఈపైని యతని సంస్కృత వ్యాకరణజ్ఞతకే కాక నిరుపమాన సాహి తికిఁగూడ ప్రేరకము లగు కొన్ని యుదాహరణములు చూపియిప్పటి కీ కవి విషయమును ముగింతము.

క. శర్మద, యమవందనత వర్మద, పతితతనముక్తి పవిత్రాచేతో
మర్మద, నంబువివారిత దుర్మద నర్మదఁ దలంచెఁ ద్రోవగాఁ పటుఁడుగాఁ॥ ౧

ఉ. స్వస్తి. జగత్త్రయీభువన శాసనకర్తకు హంసమాత్రవి
ధ్వస్తవిలింపభర్తకు మదారపదవ్యవహర్తకుం మునీం
ద్రస్తుత మంగళాధ్వర వితానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్రపరిహర్తకు దానవలోక భర్తకున్॥ ౨

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డటఁ బోయి ముదమ్మునఁ గాంచె దండకా
రణ్యము తాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజవరేణ్యము సత్యగణ్యమున్॥ ౩

వ॥ రంగదత్తుంగవిశదమదకలకరికటతటజనిత మదసలిల కణగణ పిగణిత దళశతనయన భుజసరళ మిళిత లలిత నిఖిల దిగధిపతి శుభకర కరకనక కట కఘటిత మణిసముదయ సముదితరేణువర్గదుర్గమంబులు

ఇట్టివి పెక్కులు భాగవతము చదివి పౌఢకవిత్వమనవా రుందరు మాహాం ద్రేంద్రులకో యిట్లనుచున్నారు. పోతన మహాకవి, పోతన విరసమాధి, పోతన విష్ణుహృదు భక్తుఁడు అనునది యీవ్యాససారము.

---

# ఉభయకవిమిత్రుఁడు

ఈ పైబిరుదముచే విరాజిల్లుచున్నట్టి తిక్కనసోమయాజిం గూర్చ మాళిష్యులా పూర్తిగా నోరు చేసికొన్నారు. కొమ్ముగలవాని వ్రాయసకాఁడుగా వ్యాసునకుఁ గుదిర్చి నట్లే తిక్కనకుఁ గుమ్మరి గురవయ్యను లేఖకుఁడుగా గుదిర్చినా రనునట్టి యుద్ఘాట నాదులను విడిచి ప్రధానముగా నీతనిగుఱించి యుఱిన యుఱుపుల నెత్తికొని విచారింతము. ఆయుఱుపులలో—

"ఉభయకవిమిత్రులన ! తిక్కయజ్వగారు" అనునఱువు పెద్దది, ఇది "భోగినీ దండకము వ్రాఁడె పోతరాజు" అను కూఁతకన్న నెక్కుడుగా నందలి "అష"ను

బట్టి గుణితింపవగు ఇట్టికూఁతలు దినుటకుఁ దిక్కన్న చేసిన యపరాధమేమందురాఁ దాని స్వరూపమును వారే వర్ణించినారు. "ఇచ్చకొలఁదిగా నచ్చ తెనుఁగుపదములను బెట్టి తలతిక్క యన్వయములతో నన్నయభట్టుగారి త్రోవను బాడుచేసినాఁడఁట." నన్నయ్యకన్నఁ దిక్కన తెలుఁగుపదముల నెక్కువగా వాడుట తెలుఁగుకవనమునకు వన్నెపెట్టుట యని లోకము గుణముగా వినుతింపఁగా నామొఱకుల కది యవగుణముగాఁ గానుపించినది ఇది జన్మకాల ఫలితమనుకొందమా?, కాక మతేమి!. ఇఁకఁ దలతిక్క యన్వయముల విషయమో!, దానికి మార్గదర్శకుఁడు నన్నయభట్టే తక్కువభాగము రచించిన నన్నయ్యగారి కవనమున నవితక్కువగా నుండిన నెక్కువగా రచించిన తిక్కన్నగారి కెక్కుడుగా నుండుఁగాక, అది యొక దోసఁగా? "పాతక్రమా దర్థక్రమో బలీయాన్" అను విధియుక్తోక్తి నెఱిఁగినవారి కేరికి నవి తలతిక్క యన్వయములు కావుగదా? అట్టిచో నీయఱపులేల? పైఁగా తిక్కన్నగారికి సంస్కృతభాషలోఁ దగినశక్తి లేదఁట?, దానినిగప్పిపుచ్చుట కేదోయొక శ్లోకమును "జచ్చిచెడి చేయంగల విన్నపములు" గా రచించెనఁట. దానింబట్టి చూడ నితనికి సంస్కృతకవి మిత్రత్వము ప్రతిహత మగుటచే నితఁ డెట్లో యాంధ్ర కవులకు మిత్రుఁడైనంత మాత్రమున నుభయకవిమిత్ర బిరుదమునకుఁ బాత్రుఁడు గాఁడఁట! అట్టి బిరుదము నేప్రభువును నీయలేదఁట! చూచితిరా? నానాఁటికి మాశిష్యుల తెల్వితేట లెట్లు పరిణమించినవో? ఈదోసమెవరిది? శ్లో॥ "అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చై వాప్యదండయన్। అయశో మహ దాప్నోతి నరకం చాధిగచ్ఛతి" ప్రకృత మను సరామః. తిక్కనకృత మగు శ్లోక శైలిని బట్టియేమి, ఉత్తరమీమాంసా శాస్త్ర పారంగతత్వమున కుద్బోధకమగు శాంత్యాది పర్వముల యాంధ్రీకరణముచేత నేమి, పూర్వమీమాంసా పాండిత్యమునకును వేదశ్రౌత సంప్రదాయ శౌండతకును బ్రాపక మగు సోమయాజిత్వము చేతనేమి పైఁజెప్పిన పాండిత్యులకుఁ బూర్వరంగపాయములగు వైయాకరణత్వ తార్కికత్వముల చేతనేమి తిక్కన్న వేదవేదాంగ తత్త్వజ్ఞుఁడనుట నిక్కము. ఎట్టిమహాపండితుఁడు గానిచో శంకరు నంతటివానిని ముప్పుతిప్పలం బెట్టి మూఁడు చెఱువులనీరు త్రావించిన బౌద్ధమతము నితఁ డెటు లోడించి వారి దేవళముల నమ్మాలింపఁ గలిగెడిని! ఆకాలమునకు లోకము తెలుఁగుకవిత్వము నెక్కుడు ప్రేమించుటచేత నితఁ డాంధ్రకవి యయ్యెనేకాని సంస్కృతభాషాశక్తి లేకకాదు ఈయూహ నిక్కమగుచో నితని కేప్రభువును నొసఁగకయే కాళిదాసాదులకుంబలె నాబిరుద మన్వర్థమేకదా? కాళిదాసుఁడై కాళిదాసయినట్లే యుభయకవులకు మిత్రుఁడై యుభయమిత్రుఁడైఁ సోమయాగ మొనర్చి సోమయాజి కాలేదా?

ద్రిని సేవ్రించినవా(డు ? ఇంతయేల ప్రస్తుత పిఠాపురపు రాజాగారి కొమరునకు నానాములనో లేకకాకాలనో యుపదేశించుచాము "పీఠపురయువరాజగురుడు" కాలేదా? తుబిరుదమిచ్చిన ప్రభువెవరు ? ఇది ప్రియాప్రియు క్తము సహృదయులారా ? "జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెంబేలా ?" తిక్కన్న గురించి మనమా సమ ర్థించువారము ? ఈవావమాకులా విరసించువారు ?. కేతనవంటి మహాకవి తిక్కన కాలమువా(డై యతని యాపరణము వినాతన నామరూపములు పైకెక్కక యు క్తిం జేసి తనదశ కుమారచరిత్రము నతని కంకిత మొనర్చి—

"తే గీ కవిత(జెప్పి యుభయకవి మిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన"

అని యతని బిరుదముతో వేనోళ్ళ( బొగడి తనగొప్పను సమర్థించికొను చుండ మనమాతని బిరుదము నెందులకు సమర్థింపవలయును ? నానావిధముల నాట్ యుభయకవులకు( దిక్కన దిక్కయి యుండియు వినయార్థము మిత్రమాత్ర బిరుద మునేకాల్చిన యోగ్యత నీముది కుణ్ణుగ గుణింప( గలరా ?. చూడు(డు కేతన యెట్లు వర్ణించినా(డో, సీ॥ సుకవీంద్ర బృందరక్షకు( దెవ్వ(డవిని వీఁడను నాయకుఁ దొడ వై నవా(డు" సుకవితా నికేతన మగు కేతన యుభయకవితా కేతనమనుట కత(డు తెలు(గొనర్చిన దశకుమారచరిత, కాదంబరీ కావ్యములే కాక ధర్మశాస్త్రాంధ్రీకర ణముగూడ( దోడగునుగదా ? అట్టివా(డు తనసమకాలమువానినెట్టివా(డై న నట్లు మతిం చునో విజ్ఞులరయరా ? పైఁగా నీతిక్కన్న—"పామరు(డువోలె" నరణ్యపర్వశేష మును బూరింపక మానెన(ట ?, నన్నయవలెఁ దానును నంద చుదమట్టవలసి వచ్చు నేమో యని భయపడి తిక్కన్న యరణ్యపర్వ శేషమును వదలి యుండనోపునని చరిత్రకారుల యూహం బురస్కరించుకొని మాశిష్యులు తిక్కన్నను గేలిగొట్టు చున్నారు. పైచరిత్ర విక్కమేయయి తిక్కన్న యట్లు సంశయించి వదలుటవిజమే యయినను నయ్యది యతనికిఁ బండితత్వమునే యాపాదించును గాని పామరత్వము నాపాదింపదు విఘ్నకారి యని పేరువడసిన యరణ్యపర్వమును మొదలిడి దైవవశ మున విఘ్నమురా విరుత్సాహియై పూనినకార్యముపట్ల విముఖతను గాంచుటకన్న మొట్ట మొదటనే యాసందిగ్ధవిషయమును వదలుట సమంజసముగదా. ఇదియే పండిత లక్షణము శ్లో॥ "ఉచిత మను చితంవా కుర్వతా కార్యజాలం పరిణతి రవధార్యా యత్నతః పండితేన" అని భర్తృహరి. పై సందియము నిక్కమగునేని భారతపూ ర్తి యైనపిమ్మటనేని యరణ్యపర్వశేషమును దిక్కన పూరించి యుండవలయుననుట యు క్తిసహము కాకపోదు. ఇఁక( గేవల మరణ్య పర్వమును ముట్టినంతన తాను

నన్నయవలె మృతిచెందుదునను నమ్మకయే దానిని స్పృశింపమికి హేతువనినఁ దప్ప దదితర సామాన్య విఘ్నభీతి యట్టి ఘనకార్యము నాఁగుటకుఁ జాలదు ఇంతవఱ కిది చరిత్రకారుల యూహాలం బురస్కరించుకొని వ్రాసితిమి మాకిట్లు తోఁచు చున్నది. నన్నయభట్టు పూర్తిగానే యరణ్యపర్వమును గూడఁ దెనిఁగించి యుండ నోపుననియు నది తిక్కన కాలమునకు నుపలబ్ధమగుట కలిగి యుండెననియుఁ గావు ననే తిక్కన—

"ఆం దానిదొరంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అనిచెప్పినమాట సంగచ్ఛమాన మగుచున్నదనియు పెద్ద పొత్తమగుకతన వేఱువేఱు సంచికలుగాఁ గట్టఁబడియుండు నప్పొత్తమునందలి యారణ్యపర్వశేష మేకారణముననో యంతరించఁగా నా సంచి కలో నున్నంతవఱకే కైకొని పోయినవానిని బూరింప సమర్థుఁడులేక కొంతకాలమా కొఱతతోడనే తెలుఁగు భారతము వ్రాసికొనువారనియు, కావుననే యట్టి ప్రతు లున్నట్లు చరిత్రకారులు వ్రాయుట సమర్థనీయమయ్యెడి ననియు క్రొత్తత్రోవ యొకటి స్ఫురించుచున్నది చిరకాలప్రహత మగు మార్గమును వదలి యీనూత్న మార్గము నింతమాత్రమున లోకము విశ్వసింపదు. విశ్వసించుచోఁ దిక్కన్నవాక్యము నకు లక్షణ చెప్పవలసి యుండదు. మఱియు భయాదికల్పనకు నవకాశమునుండదు. ఎఱ్ఱన తానొనర్చినది స్వల్పభాగ మగుటచే దానిని దనపేర నేల ప్రకటింపవలయు నని యెంచి నన్నయపేరనే ప్రకటించెననుకొన్న ననుకొనవచ్చును. లేదా నన్నయ్య యెడఁ గలభక్తియేని యందులకుఁ గారణముగాఁ గైకొనవచ్చును. ఇదియేకానిచోఁ దిక్కనవదలిన వదలుంగాక వదలుటకుం గలకారణమేని వ్రాయకుండెడినా? యని సందియమైన మనకేల కలఁగఁగూడదు. ఇది మార్గాంతరము దీనింగూర్చియింకను విస్తరించినఁగాని తేలదు. నిక్కముగాఁ దిక్కన్న విఘ్నభీతిచే వదలినను బామరుఁడు కాక పండితుఁడే యనునదియే మనకుఁ బ్రస్తుతవాదమున కుపకరించు యుక్తి. తిక్కన్నమహాకవి తిక్కన్న యుభయభాషా పారంగతుఁడు. వేయేల? మనయాంధ్ర పారవశ్యమునకు దిక్కనఁదగువాఁడు దిక్కనయే. ఆతనియెడల మన మెల్లప్పుడును గృతజ్ఞులమై యుండుటవిధి. కృతఘ్నులు దండ్యులు. అన్యత్రకృతఘ్నులీ జగదున కర్తయెడలను గృతఘ్ను లగుదురుగాక. మనమన్నారిని క్షమింపవలసినది యని సోమయాజులను వేఁడికొందము. ఇంతే ఈవ్యాసమునకు దాత్పర్యము.

# ప్రబంధపరమేశ్వరుఁడు-ఎఱ్ఱాప్రెగడ

ఉ. మూఁగురయందు నన్నయ సమున్నతుఁడై కడులక్షణంపుఁబ్రౌ
వై గుదిగూర్పు నేర్పుగలఁడై తగు తిక్కన కేమి యజ్వయున్
లోఁగక యాతనిం దెలియ న్యూనుఁ డనం దగఁ డెఱ్ఱనార్యుఁ డెం
తే గడుసుందరమ్ముఁ గలఁ డిర్వురకున్ సరివచ్చు నన్నిటన్॥

(మాదేవీభాగవతము ౧ వ స్కం)

ఈ యెఱ్ఱాప్రెగడకుఁ గాళిదాసుఁడన్నట్లు శంభుదాసుఁ డను బిరుదముగూడ నన్వర్థమై విరాజిల్లు. ఈతఁ డరణ్యపర్వశేషము పూరించుతఱి నాఘట్టమునందలి నన్నయ్యభట్టువాంతోఁ దనధారను గల్పి కవిలోకము వలరించిన విద్వత్కవిచూడామణి-

చ. స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి విరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల సు
ద్ధురతరహంస సారసమధువ్రతనిస్వనమున్ పెలంగఁగా
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్ ॥ ౧ ॥

శా. దానాంభః పటలమ్మునం బృథుపయోధారావళిం దాల్చిగ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్ప్రయో
దాపీతంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతమ్మునన్॥ ౨

మఱియుం గొన్ని పద్యము లా ఘట్టమునందలివి చూచికొని నన్నయభట్టు కవిత్వముతోసరివచ్చునో లేదో విజ్ఞులువిచారింపఁగలరు. మా, వెం॥ రా॥ లితనివి—

“భారతమ్మున పేర్వెట్టఁబట్టిగాని యెఱ్ఱప్రెగ్గడ బండార మెవరెఱుఁగరు ?”

అని తూలనాడుచున్నారు వారి యుద్దేశము శంభుదాసుని కవిత్వము నన్నయ కవిత్వముతోఁ గూడి “గంగాం రథ్యోదకం యథా”

అనునట్లయినదని స్ఫురించుచున్నది నన్నయ కవిత్వమునకును ప్రెగడ కవిత్వమునకును, అంతటి భేదమును విజ్ఞు లంగీకరింపరు ఈషద్వైషమ్యము మాత్రమే ప్రాజ్ఞసమ్మతము. అట్లే కానిచో నే శ్రీనాథుఁడో మరల నాభాగమును బూరించి యాతని కవిత్వము నవలఁ ద్రోసివేసి యుండుననుట యుక్తిసహము కాక పోదు. సకల విద్యాసనాథుడులెల్ల వితనికవిత్వమును శిరసావహించినపు డేతుల్లో

యేమోయన్న నది పాటించువారెవరు ? ఈప్రబంధ పరమేశ్వరుఁడు తిక్కనవలెఁ దఱచు జిలిబిలి పదములను గూర్చియు రసము పుట్టించెను

ఉ. నీమగఁ డంత యెక్కుడె ? మనీషులు భూసురులింత తక్కువే ?
కోమలి ! యేల యిట్లు కడుఁ గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్, దివిజపుంగవుఁ డాదిగ భక్తి గొల్వఁగా
నేమిటికొక్కొ ? వారు కడు నెల్లిదమైరిట నీకునిచ్చటన్ ॥౧॥

ఆ. వె. సత్యమును శమంబు శౌచంబు లేక నా । స్తిక్యమును నిషిద్ధసేవనంబు
గలిగి తిరుగు దుష్టకష్టజనశ్రేణి । పొలియు నుభయలోకములకుఁ గాక॥

పైపద్యములోఁ జెప్పినట్లుభయ లోకములకు వెలియగు వెంగలులు తప్ప నిమ్మహాకవి నుల్లన మాదరని మా నమ్మకము

క. ఈలోకమయగుఁ గొందఱ । కాలోకమకొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా ! । యేలోకములేదు సూవెయిలఁ గొందఱకున్॥ ౩

శా. ఆలస్యంబొక యింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమఱ, మర్త్యనీయు లతిథుల్, సత్యంబ పల్కంబడున్
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాల్తు, మట్లౌటనె
క్కాలమ్మున్ బటు మృత్యురోగ భయశంకం బొంద మే మిమ్ములన్ ॥౪

ఆయాఘట్టములనుండి యుదాహరించిన పైపద్యముల వలన నితఁడు సర్వవిధముల నన్నయ తిక్కనలకు దీటని తేలుచున్నది. కాన నితఁడు భారతారణ్యపర్వపూర్తికిఁ దగి యందులకుఁ బూనెనే గాని వేఱొండుగాదు. పైఁగా మాకృతజ్ఞలితని హరివంశ రచనముసగూడ నుల్లసమూఁద మొదలిడిరి.

“హా ! చవసోమునిహరివంశముగనుఁడీ ! యదియెంతచక్కఁగానున్నదియో”

ఈతోవ వీరికి ముందు కందుకూరి వీరేశలింగము పంతులుగారు త్రొక్కినదియే. ఎవరిట్లు వ్రాసినను నది విచారదూరమని మాయభిప్రాయము. హరివంశము సర్వసులభముగా నుండఁదగిన పురాణపాకములోఁ దెలిఁగించుట లోకోపకారకమని ప్రబంధపరమేశ్వరుఁ డెఱిఁగి యట్లు తెలిఁగించెను. సోమన్నయో ? ఇతని తరువాత దానినే తెలిగింపఁ బూనెను గానఁ దన కవిత్వమును బ్రబంధ పాకమునకు మార్చికొనెను. అతడు తెనిఁగించిన దానినే యితఁడు తెనిఁగించుటకు గలకారణమెట్లో తనకు భారత గాధాసంబంధ ముండుటను వాంఛించుటయే యని మా యభి

ప్రాయము. ఇందుల కుభయకవిమిత్రుని గద్యము నేదో సంబంధము గల్పించి తన గద్యమునందుఁ జేర్చికొనుట సాహసమగుచున్నది. పురాణశైలికిని బ్రబంధ శైలికిని భేద ముండుటవలనఁ గవుల యుద్దేశములు వేఱుకొనవలెనేకాని ఆభేదమువలన వారి తారతమ్యములను గమనించుట యుక్తిసహము కాదు. లేనిపోని యాడంబరముల వలననే కవుల కుత్కర్షాపకర్షములు గలుగునెడల వైషధాది గ్రంథకర్తలకన్న గాళిదాసు లొచ్చుకాక తీరదు. అట్లగుచో—

“అద్యాపి తత్తుల్యకవే రభావాత్” అను వళియుక్తి యెట్లు సర్వవిద్వత్సమ్మతి నందఁ గలిగెడిని? ఇట్లే శంభుదాసునికిని నాచనసోముని కవనము వలన నధఃకరణ ముచితము గాదు. పురాణశైలిని బ్రస్తుతము చేసికొని విచారించి యెట్టి కవిత్వమునందు రసహీనతను గనఁజేసిన సోమన కవిత్వమునం దాపట్టున లోటు లేకుండ సాధించి యప్పుడు సోమన నెట్టినకన్న నధికుఁ డనుట మాకిష్టము. ఉద్దేశ భేదమును గణింపక పాకభేదము నుపేక్షించి విచారింతుమేని తిక్కన యుత్తరరామాయణమును కంకంటివారి యుత్తర రామాయణముచే నేల నెట్టింపరాదు? అందులకుఁ బ్రాజ్ఞు లంగీకరింతురా? అట్లే ప్రస్తుత విషయము నని తెలియఁదగు. సోమనరచనానంతరము పెగ్గడ జీవించియుండి తానుగూడ సోమనవలెఁ బ్రబంధపాకమునే పట్టినచో నేమగునో కొండొక మన మాలోచించుకొనవలదా? సోమన యెట్టివతో సముఁడే కానక్కఱలేదు. ఇంచుక లోఁగువాఁడైనను నతనిరచన నతిక్రమించు తలఁపుతో శైలి మార్చుకొని రచనకుఁ గడంగుచో నతిక్రమించుట సుకరమే. శైలి మార్చక పురాణమని మనమున నుంచుకొని యదే శైలిని బట్టి వ్రాసి యతిక్రమించినచో నెపుడు పైవారి యాక్షేపణకు నెట్టిన పాత్రుఁడు కాకతీరదు. ఇఁక—

“సరస కవిరాజా మంత్రిభాస్కరుని రామాయణ ముండఁగా నెట్టి తనరచన యంతకన్న రసవత్తర మగునని భ్రమించి వాల్మీకము నాంధ్రీకరించెను గానయది రసహీనమగుటచే నేరును బ్రేమింపమి మాదును బేరును లేక నశించెను

అనువర్ణము గలయపార్థపుదూషణోక్తులను విచారింతము. ఇందుంగూర్చి పూర్వపరిజ్ఞాదార్యులుగారు రామాయణమునందలి గౌరవముచే నందులకుఁబూనె నని కొన్ని యుక్తులు వ్రాసియున్నారు. అవియు నంగీకరింపఁ దగినవియే. కాని యెట్టిన తనంతఁ దాను రామాయణాంధ్రీకరణమున కుపక్రమింప లేదు. కావునఁ గృతినాయకుని యభిప్రాయానుసారముగా నందులకుఁ గడంగె ననుట సత్యము. కావున భాస్కరుని నతిక్రమింపవలె నని పూని భగ్నమనోరథుఁడయ్యెనని చూఱుట బుద్ధి

పొరపాటు. భాస్కరుని కవిత్వమునకుఁ బెగ్గిగడకవిత్వము దీటుగాక "ఊరుఁ బేరు లేకయూరక చెడిన" దని వ్రాయుటయు నసహ్యమే ఇప్పటికిని దానియుద్ధరణమునకై యత్నించుచున్న శ్రీశ్రీపోలవరపు జమీందారుగారేమి వారి కతన మేమేమి అక్కడక్కడ దానియుపలబ్ధిని వినుచున్నారము శ్రీవారందులకై కొంతధనమును వెచ్చించిరి కాని గ్రంధమున్నచోటు విచారదూర మగుటచే నాపొత్త మీవలికి రావయ్యె అదవా, నశించినదేయందము. అంతమాత్రమున దానికిఁ గారణము రసహీనత్వమే యగునోటు ? ఈయనుమానము నుపయోగించుటెడల నెందఱో మహాకవుల నీరసులు కావలసినచ్చును. కావున నాతోగ్రవనిచాచరణీయము "స్థితస్య గతి శ్చింత నీయా" కనుక భారతారణ్యపర్వగత మగు నెఱ్ఱన రామాయణ కవిత్వము నొకింత చవిచూచి భాస్కరుని కవిత్వమునకు దీటగునో కాదో విచారింతము

మ. పఱచుఁ జవ్వగఁ, జేయలంతి విలుచున్, బట్టిక యాసాసలన్
విఱువోవుం బొదలందు డిందుఁ బొడముం బిట్టుల్కి వేదాఁటుఁ గ్రి
మ్మఱి చూచుం, జెవిఁ దార్చివిల్చు, మలయున్ మట్టాడుఁ గోరాడు, నే
మఱి నట్లుండుఁ దృణంబు మేయు, మనలం మాయామృగం బిమ్మలన్॥

మ. కమనీయంబగు జన్నిదంబు శిఖయుం గొపీనముం ధాతు వ
స్త్రము దండంబును గూడియున్ గుశపవిత్రంబున్ గడుం వృద్ధభా
వము సంధిల్లఁ ద్రివండి వేషధరుఁడై వచ్చెన్ బభిక్రింతి దే
హము నం దోఁపఁగ సీత యున్నెడకు మాయావశుఁ దక్షిణతం॥

ఉ దేవతలార ! యోవనణీ దేవతలార ! జగత్త్రయోన్నతుం
డై వెలుఁగొందు రాముని కులాంగని జానికినేను. నన్ను మో
హావిలుఁ డొక్క రక్కసుఁ డనర్గళుఁడై కొనిపోయెడుం గృపన్
గావరె ? పుణ్యమున్ యశముఁ గైకొనరే యిదె మీకు మ్రొక్కెదం॥

స్థాలీపులాకన్యాయముగా నుదాహరించిన పైపద్యములను జదివిన యేప్రాజ్ఞుఁడును బెగ్గిగడ కవిత్వము భాస్కరుని కవిత్వమునకుఁ దీసిపోవునని తలఁపఁడు. ఒక వేళ నేదేని కొండొక సందర్భమునఁ గొందఱ కవిత్వము నతిక్రమించుటయు గలదు. అంతమాత్రమున నానుప్రసిద్ధులను గేలిచేయుట తగునా ? రామాయణ కవులలో నెవ్వరికంటెఁగాని కుమ్మరిమొల్ల యధికురాలు కాదనుట సర్వసమ్మతముగదా ! ఆమొల్ల రామాయణము నందలి సీతారావణులవాక్యోపవాక్యములలో సీతావాక్యములు చదివినవారికి మొల్లకవిత్వపటుత్వము సర్వవిధములవిరుప మాన మని తేలకమానదు. అందులకు

సంతసించవలసినదే కాని దానినాధారముగా జేసికొని వాల్మీక్యాది సంస్కృత కవులను గాని భాస్కరాదులగు నాంధ్రకవులనుగాని గేలిసేయనగునా ? ఇది కవితామర్మము నెఱుగు ప్రాజ్ఞులత్రోవ కాదు భాస్కరుఁ డేమి ఎఱ్ఱాప్రగ్గడయేమి నాచనసోము డేమి మహాసుప్రసిద్ధులు వీరి కవితా సారములను వేఱువేఱుగ ననుభవింపవల యునేకాని సంకరము చేసికొని కళవళపడఁ గూడదు చూతపనసాది ఫలమ్ముల రసములు ననుభవించునపు డొకదానితో నొక దానికిఁ బోరుగల్పించి చర్చించుట యెందులకు ? సుప్రసిద్ధగాయకుల సభలవిషయమునఁ గూడ దక్షులగువారు భిన్న భిన్నమగు నవకాశముల నిచ్చి తద్రస మనుభవించు చుందురు సుప్రసిద్ధులంగూర్చి ప్రశంసించుకొనునపు డొకరి ప్రశంసా సమయమున వేఱొకరి ప్రశంసను గలుపు టనుచితమని మురారిమహాకవి తన నాటకమున గొండొక సందర్భమున వివరించి యున్నాడు దానికి మేము తెలింగించిన పద్యమిట నుదాహరించు చున్నారము.

చ. ఒకరొకరుండ్రు వీరవరు లొక్కరికొక్కరు తీసిపోరు భూ
మికి యశ మబ్బె రావణుని మెప్పున నంచనుకొందుమేని వా
లికి నతఁ డింత జంకె లవలేశము లొక్కటకించి కన్నులుం
టకు గని వీను లుంటకు వినందగు నల్పులమేమి చెప్పగన్

అతి విస్తర మెందులకు ? మాశిష్యులు వెం॥ రా॥ లు వ్రాసినట్లు భాస్కరుని కన్నఁ గాని నాచన సోముని కన్నగాని ప్రబంధపరమేశ్వరుఁ డెప్పట్లను దగ్గువాఁడు కాదు. పైపెచ్చు వారల నతిక్రమించు ననుట నిక్కము. ఇతఁడు భారత రచనకుఁ దగినవాఁడై యరణ్యపర్వ పూర్తి చేసెనే కాని యెట్లో వ్రేల్పెట్టి ప్రతిష్ఠ నార్జించినవాఁడు కాదు ఇతనింగూర్చి నీచప్రసంగము చేసినందులకుఁ బ్రాయశ్చిత్తము క్షమాపణ చెప్పుటయే అనునది యీవ్యాససారము.

---

# శ్రీకృష్ణదేవరాయలు - శ్రీవారి యాస్థానకవులు

మాశిష్యులు కృష్ణరాయలయాముక్తమాల్యదయందలి కథమాత్రము మంచి దని యాగ్రంథమును —

" వట్టిపాషాణపాక మెవ్వండుసదువు "

అని నిరాకరించి "కపిమణి" న్యాయమును గనఁజేసినారు. ఇట రాయలయపరాధము కఠినపాకముగాఁ గవిత్వము జెప్పుటయే యని వాండ్రి యూహ. రాయల కవిత్వమునందు లోకమునకు "నారికేళపాక" మనునూహ కలదు కాని వీండ్రి వలెఁ "బాషాణపాక" మను ప్రాజ్ఞులులేరు. పాషాణ మెంతపగులగొట్టినను రసము వీనదు. నారికేళమో? పగులఁగొట్టినయుత్తరక్షణమున మధురరసమునొలుకును. అట్లగుటచే నారికేళపాకమును బాషాణపాకమనుట నోటివేటుదక్క వేఱుగాదు "ఎన్నిమార్లు పఠించినను రాయలకవిత్వ మెఱుకపడ" దనుట తమబుద్ధిలోపమును బయటఁ బెట్టుకొనుటకు సాధకము. రాయలవింతకన్నఁ దిట్టలేదు. కాని యితఁ డవివేకరాజులంబోలె "నయినవారి కాకులలోను కానివారికి కంచాలలోను" అనునట్లుగా బిరుదముల నొసఁగి సమ్మానించినట్లు పెద్దనను వెక్కిరింపఁబట్టున సూచించిరి —

"తే॥ గీ॥ మారన కథావిధానము చూఱలాడి ।
కోరి శ్రీనాథుతెరువులఁ గొల్లఁగొట్టి ।
మనుచరిత్రం బొనర్చి పెద్దనగడించె ।
నాంధ్రకవితాపితామహం బన్నబిరుదు"

గడించినవాఁడు పెద్దనయైనను బిరుద మిడినవాఁడు రాయలే కనుక మా వాండ్రతెలివికిఁ గృష్ణరాయలు—

"సీ॥ ఈఁకిగెముత్తికి బోడుపేలావు లిస్తి కురుపగంగికి జరీకోక లిస్తి"

అనునవివేకపురాజులలోఁ జేర్పఁదగువాఁ డయ్యె. రాయలపాకమును నిందించినను నతనిని గవి యని వ్రాయుచు నవివేకనృపులలోఁ జేర్చుటయు "ఆంధ్రకవితా పితామహ" బిరుదమునకు మనుచరిత్రరచనను హేతువుగాఁ గైకొనుటయు నిందు మిక్కిలి శోచనీయములు

"ఆంధ్రకవితా పితామహుఁ డెవ్వరీడు? పేర్కొన నీకున్?"

అను మనుచరిత్రపీఠికలోని రాయలవాక్యము వలన నాబిరుదము మనుచరిత్ర రచనకుఁ బూర్వమే యీఁబడినట్లెఱుకపడుచున్నది. కావున నేదొంగతనమో చేసి

"గ్రంథచోరులు గాని కవులు గారు"

అనుతెగలోఁ జేర్చి రచించినపొత్తమునకు నంతసించి రాయ లీబిరుదము నొసఁగె ననుమావాండ్రయూహపరికాదు వోవింపు। ప్రస్తుతము పెద్దన—గ్రంథచోరుఁడా? కాఁడా?

అనునది విచారింతము. ఇందునుగూర్చి శ్రీరాయబహదూరుపంతులుగారే తగినసమాధానముల నిచ్చియున్నారు. గ్రంథకర్తల కెవరికవిత్వమున నెక్కుడు గౌరవముండునో వారిపోలికలు వారికల్పములఁ జేరుట యనివార్య మనుట సహృదయ సమ్మతము ఇది నిక్కమేయగునేని శ్రీనాధునిపోలికలు లుండుట సహ్యముగదా ? ఇఁక మారవి శ్రోవిలకుఁ గలసంబంధమో ? అతఁడంతకు మున్న యాంధ్రీకరించిన కథ యగుటచే సమాహిత మగుచున్నది. ఇంతమాత్రమునఁ బెద్దనమనుచరిత్ర మునందలి "మ॥ బహువైతోఁచుకుటుంబరక్షణకు" అనుపద్యము లోని కుకవిగర్హణమును—

"తే॥గీ॥ ప్రాఁతమాలికచేఁ దాళపత్రిపుస్త
కాటవుల నర్థపుందెరువాట్లు గొట్టి
కొఱఁతఁ బడు నని కుకవిని గొనరితిట్టి
పెద్దన యొనర్చినట్టితప్పిదము నదియె"

అని యనుకరించి గేలిగొట్టుట సర్వాసహ్యము మానన శ్రీనాధులఛాయ లను వదలి పెద్దన స్వకపోలకల్పితములను విచారించికొన్నవారికిఁ బెద్దన గౌరవము తేటపడదా ? చూచియో, చూడకయో, పూర్వకవుల యనుసరణము దవులని కవు లెవ్వరు ? వాల్మీకియా ? వ్యాసుఁడా ? కాళిదాసుఁడా ? ఇఁక మరెవ్వరు ? ఋషులకు వేదము. కాళిదాసాదులకు బురాణములు మార్గదర్శకము లని విజ్ఞు లెఱుఁగరా ?

" మధుమయఫణితీ నాం మార్గదర్శీ మహర్షిః "

అనుభోజరాజోక్తి కర్థమేమి ? మావాండ్రెలిపికి భోజరాజును గ్రంథ చోరుఁడే కావలెనుగదా ? అందఱును గ్రంథచోరులగునపు డాపని నింద్యమేకాదు కదా ? గ్రామమెల్లఁ దాగుఁబోతు లగునెడల నిఁక వెలి యెవ్వరికి ? కావున సకలసుకవిజన సామాన్య మగు పూర్వకవివచో బహూకరణమును బెద్దన కొకదోసఁ గుగా బొల్పి యతనిఁ దృణీకరించినందులకు సభాముఖమున సతనిమనుచరిత్రాత్మక మగు యశఃకాయమునకు క్షమాపణ చెప్పక తీరదు ఈ చెప్పించుట యాంధ్ర భాషాభిమానుల కవశ్యకర్తవ్య మగుపని. ఇట్లు దురభిప్రాయపడు రసాభాసులను మనమం దుంచికొనియే కదా సంకుసాలనృసింహకవి తనకవికర్ణరసాయనమునందు

"చ. హృదయగతిన్ బురాతనక వీశ్వరు లేగినవీధిలేమ నేఁ
దదనుగతిన్ రచింపకృతి తార్త్వికులన్ గణుఁగింపకుందునే ?
మదగజరాజముల్ చనినమార్గములన్ గడు వింపునింపవే
మదగజరాజయానమదమంథర బంధురయానమానముల్."

అని వివరించి యున్నాఁడు మఱియు — "బాణోచ్ఛిష్టం జగత్త్రియమ్" అనువాక్యము నేని వివారించక కవుల సంప్రదాయము నెఱుఁగక యూరక వావిదు మట దండ్యమగు నసవాదము దీనింగూర్చి యింకను విస్తరింపవలసియున్న ను జిరకాలము క్రిందటనే యీ విషయ మన్యత్రి చర్చించి విడిచినవగుటచే నింతతో దీనికి స్వస్తిచెప్పి వేఱొకవెక్కిరింపును బ్రస్తావించుచున్నారము — " కృష్ణరాయలు మనుచరిత్రకృతినందికొని పల్లకి దనచేతితోఁ బట్టి యూరేగించుటయే కాక యది గినన్ని యగ్రహారములిమ్మటకు బెద్దనకవి ముక్కుతిమ్మనకంటె గొప్పవాడు కాఁడఁట పైవెక్కిరింపువలనఁ గృష్ణరాయలు శుద్ధపండితమ్మన్యుఁడే కాని శాంతమ్యము గని పెట్టువంతటి వివేకి కాఁడని తేలుచున్నది రాయలకాలముగతించి యెన్ని వందల సంవత్సరములోయయ్యెను గాని చరిత్రకతన నమ్మహామహు నిట్లుగ్రహించినవారు లేరు ముక్కుతిమ్మన్నయే పెద్దనకంటె ఘనుఁడగునెడల రాజు ముక్కుతిమ్మన్న నే పైరీతిని గౌరవించి యుండును గౌరవింపఁడో ? అప్పుడే తిమ్మన్న " రాజా పెద్దనకును నాకును నీ వేమి భేదము కని పెట్టితివి నీపరిపాలనాజ్ఞాన మెచ్చట దగులఁబడినది " యని యడుగక మానువాఁడు కాడు పెద్దన తనకన్న ఘనుఁ డని తిమ్మన యెఱిఁగినవాఁడు కావుననే యతని బిరుదప్రదానాదులకు సమ్మతించెనని విజ్ఞు లనయఁ గలరు. ఇదిగాక తిమ్మనకగ్రహారాదులను రాయలీయలేదనుటకు మావే దుఱయ్యల కాధారమేమో ? పెద్దన చెప్పినపద్యము చిక్కునది కావునఁ బెద్దన కిచ్చి నది తెలియుచున్నది. తిమ్మన కిచ్చిన శాసనముగాని యావిషయమునఁ దిమ్మన చెప్పిన పద్యములుగాని దొరకనందున నాదానస్వరూపము తెలియుట లేదనుకొన రాదా ?. తిమ్మన యాయవార మెత్తికొని జీవించున ట్లాధార మేమేనియున్నదా ? "అప్రతిషిద్ధ మనుమతం భవతి " కనుక తిమ్మన్నకును అగ్రహారాదికమును రాయ లిడియె నవియే సిద్ధాంతము ఇందునుగూర్చి కవిజీవితములు మాడఁదగు అగ్రహారాదిదానము పెద్దన తిమ్మనలకు సమానమైనను "కవిగండపెండెరము" "ఆంధ్ర కవితాపితామహ" బిరుదప్రదానము, అను నీరెండును దిమ్మనకన్నఁ బెద్దనఁ బెద్దనఁ జేయుచున్నవి ఆయంశమును నాటిసభ్యులును అప్రభువును వారివారివాగ్ధాటిలోనగు గుణాతిశయములంబట్టి నిర్ణయించి యుందురనుట యుక్తి సహము. అంతమాత్రిన బెద్దనతిమ్మనకన్నఁ గాని తిమ్మన పెద్దనకన్నగాని యెమ్మననియు లొచ్చుననియు నిర్ణ యింపరాదు. తిమ్మన —-

"ముద్దుగాల్కొడు నుడులతో బారిజాతాపహరణమును వ్రాసి రాయలకును గంతఃపురమునకును గల్గినవనో వైకల్యమును దీర్పఁగలిగెననియుఁ బెద్దన కీపాండి

త్యము లేదనియు నిందుచేఁ బెద్దనకన్నఁ దిమ్మన్నకే యెక్కుడగు బిరుదప్రదానాది కము రాయ లొనర్పవలసి యుండుననియు నట్లుచేయలేదు కావునరాజు తిమ్మన ఋణమునఁ బడియుండెననియు మా విచారదూరులు తెగివ్రాయుచున్నారు. మాకుభయకవులయందు సమభావమున్నను వాచపౌకస్త్యమునకై క్షణకాలమన్యథాగావ్రాయుఁ చున్నందులకు సహృదయులు మన్నింపవలయును తిమ్మన బెద్దనకన్నఁ జాలవృద్ధుడగుటయేగాక రాయలయంతఃపురమునకు బుట్టినింటనుండి యరణముగావచ్చిన కవియనుప్రతీతికిఁ దావలమగుటచే నంతఃపుర మతనికిఁ దమమనోవైకల్యముల తెలిగెలిఁగింపవగుటచే దిమ్మన తన కవితచే దాని వారింపుట సంఘటించెనేగాని యంతమాత్రముననది యనన్య సాధ్యమగు కార్యమని వలనుపడదు అంతకన్న ముమ్మడుగుగ నాపనిని బెద్దనయు నెరవేర్పఁ గలఁడు కాన నిక్కతనఁ బెద్దనకన్నఁ దిమ్మన ఘనుఁడుకాఁడు కాక యిది సిగ్గెఱుఁగక వ్రాయువ్రాఁత యేమందురా? అంతఃపుర కలహాదులలోఁ దఱుమ దాసీదాసాదులు వారణస్థానమున నుండి కృతకృత్యత నందుట కలదు అంతమాత్రమునఁ బెద్దనాదికవులకన్న వాండ్రెమిన్నలని తలఁచునంతటి వెఱ్ఱిమొగమా మనకృష్ణరాయలు? దైవవశమువలన నీ ప్రసంగము కలిగినది గావున ముక్కుతిమ్మన్నగారికవిత్వము మనముచదువుకొను భాగ్యముకల్గినది ఈ యంతఃపుర ప్రసంగమే లేనిచో మనకునెంతో కొంతభాగ్య మబ్బినను నింతటిభాగ్యము తిమ్మన్నగారివలనఁ గలుగదేమోయని మా సంశయము తిమ్మనమహాకవియైనను పారిజాతాపహరణమున నీ ప్రసంగముపట్టుననే యెక్కుడు చాకచక్యమును జూపఁగలిగినాఁడు. దానినే యెల్లరును సంఖ్యాంకనముగ గట్టిచేయుచున్నారు తక్కిన భాగములు కింతటిగౌరవము రాలేదు. మనుచరిత్రమునకో అట్లు గాక సగభాగము శృంగారమునకును తక్కినది భాషావిశేషపోషణమునకును చేర్పడిప్రతిపద్యరసాస్పద మనుయశమును బోషించుచున్నవి. ఈచర్చవలనమాకుఁ దిమ్మనయందు గౌరవ భావములేదని యెంచఁగూడదుసుఁడీ! ఏవేని కొన్నిపద్యములు కొన్నికారణముల వలనఁ గొండఱు నిరుపమానములుగా వ్రాయవచ్చును, వానికిఁ బ్రాజ్ఞులు సంతసింప వచ్చును. గాని యంతమాత్రమున నితరులనెత్తిపై వారి నెక్కించుట యుచితముగాదు. ఇది పెద్దనతిమ్మనలతారతమ్యచర్చ గాన పక్షద్వేషమ్య మవివక్షిత మనుచొప్పున సమాహితము కావచ్చును పెద్దనకును పేణాకయెద్దనకును నొకప్పుడిట్లు మనమువిచారింప వలసివచ్చును, ఎద్దనయేవో కొన్నిరసోత్తరములు పదములు వ్రాయుననుకొందము. అంతన పెద్దనకుఁ దైవాఁడగునా? కాదు మహామహులనుగూర్చి సాంకర్యము పనికిరాదని యిదివఱకే వ్రాసితిమి గాననిఁక నిట విస్త

రింపము. కృష్ణదేవరాయలకవిత్వము కఠినమైనను రసవత్తర మైనది కావున నది యాలంకారికాంగీకృత మగునారికేళపాకప్రాయముగా రసజ్ఞులు శిరసావహించి యుంద నుకఁ కంఠపాఠముగా వల్లించి పండితులగుచున్నారనియు నంతటి గ్రంథకర్త. యంతటివేత్త యంతటిపరిశీలకుఁడు నగు రాయలు పెద్దనంగూర్చి చేసినసమ్మానము వలననే పెద్దనయాధిక్యము స్ఫుటమగుచుండఁగా నయ్యనఘుంగుఱించి నోరుచేసి కొనుట చీవాట్లు దినుటకుఁదక్క వేఱొండు ఫలమునకుఁ గాదనియుఁ పెద్దన్నను దొంగ యనుట నోటిదోషమనియు నిప్పట్ల నెఱిఁగియెఱుఁగక మావాండ్రొనర్చిన దొసఁగును లోకము మన్నించి వారి నాశీర్వదింపవలయుననియు వీవ్యాససారము

---

# శ్రీనాథుఁడు, పింగళి సూరన్న.

"శ్లో॥ జగదాదరణీయ జాగరభావం । జలజాపత్యవచో విదారగమ్యమ్"
(శ్రీకృష్ణ కర్ణామృతము)

మాశిష్యులు పైకివులిరువురకు నింతమిం చొకచేవిధమగు నపరాధమును గల్పించినారు సూరన తనకావ్యమందు "భోగపుఁబడంతులకుఁ" బ్రధాన నాయికాస్థానము నొసంగి యపరాధి యయ్యెను శ్రీనాథుఁడో ? తనజీవయాత్రయందేకాక భగవంతుని దివ్యచరిత్రయందుఁగూడ సానికూఁతులకు జోటిచ్చి మహాపరాధి యగుచున్నాఁడు ఇందు సూరన దొసఁగుకన్న శ్రీనాథునిదొసఁగు కొండొక పెద్దది యగుటచేఁ గ్రమమును దప్పించి "సూచీకటాహ" న్యాయాశ్రయణ మొనర్చి ముందు సూరన్ననుగూర్చి విమర్శింతము భోగపుఁబడఁతులకుఁ బ్రధాననాయికాస్థానము వీఁగూడదని యేలాక్షణికులును వ్రాయలేదు సరికదా, ఆయాయీకావ్యపరిభేదముల యందు వారలకుఁ బ్రధాననాయికాత్వమునుఁగూడఁ గంఠోక్తిగా శాసించుచున్నారు. ఇందునుగూర్చి మా "తృణీకరణము" నందు మున్నే వీండ్రశిష్యాపశదుని ద్వారమున వీండ్రచేతనే యడుగఁబడి విస్తరించి యుత్తరమిచ్చియుంటిమి గాన మరల విస్తరింపము. కళాపూర్ణోదయమునుద్దేశించి—

"భోగపుఁ బడంతులా ? కళాపూర్ణకథకు నెత్తిన ప్రధాననాయిక లెంతతప్పు?"

అని ముక్కుపై వ్రేలుపెట్టుకొనుట దొక్కశుద్ధిలోపమని విజ్ఞులు గ్రహింపగలరు. మఱియుఁ బింగళి సూరన—

"శుభమస్తని యదేమి? గారుడంబు! తెలుఁగుఁ జేసినవాఁడు వైదికుని పగిది"
అనునది యొకయాక్షేపణ. గరుడపురాణము పారలౌకికక్రియా సందర్భము లను గూర్చి ప్రవర్తించిన దగుటచే దానిని మొట్టమొదటఁ దెలిగించుట నియోగి శ్రేష్ఠుఁ డగు సూరనామాత్యునకు వైదికత్వమును గల్గించుచున్నదఁట మాయవాచారు లకు నియోగివైదిక భేద మింత చక్కఁగాఁ దెలియును. సూరన యీయకార్య కరణము వలన వైదికుఁడయ్యెనేకాని లేనిచోఁ గాఁడనియే వీండ్రయుద్దేశము కాకేమి? వైదికశబ్దమునకు సరియయిన యవయవార్థము గ్రహించినంగదా. తత్త్వము బోధపడుట. పైదికుఁడనఁగా సనాలోచనపరుఁ డని మాగ్రామ్యుల తాత్ప ర్యము భవతు. దానింబట్టి చూచినను సూరన యమంగళాశంకి యయి గారుడమును మునుమున్న యాంధ్రీకరింపక విడిచినచో వీండ్రి చెప్పుదంటు శంకలకు దావొసఁగ కుండెడినా? అపుడు తిక్కనతోపాటు "పామరుఁడు" కావలసివచ్చునుగదా? ఇంత కన్న సూరన్నా? నీపేరు బాగు లేదు నీయింటిపే రంతకన్న బాగులే దని వెక్కిరిం చినఁ గొంత యుచితముగ నుండునేమో? చదువరు లూహించుకొందురుగాక! గరుడపురాణము తెలుఁగుఁ జేసినపిమ్మటనేకదా, సూరన రాఘవపాండవీయాదికము రచించి సర్వైశ్వర్యముల ననుభవించినది? అగుచో దీనివలననే యాపురాణము శుభ సంపాదక మని స్ఫుటమగుచున్నది—

"ఫలానుమేయాః ప్రారంభాః" కావున వీరనుకొనిన ట్లది యమంగళావహి కాదు. ఆరహస్యము సూరనకుఁ దెలియును కావుననే యతఁ డిట్లొనరించెనను నంతమాత్రము ప్రస్తుతము చాలును. సూరన దీనితెలుగునకు పూర్వ మేవిధమైన కవిత్వమును జెప్పనే లేదని ధ్రువపఱుచునాధారములు లేవు కావున మునుమున్న వ్రాసిన పద్యమే గరుడపురాణాంధ్రీకరణ మని వాదించుట తెల్వితక్కువ కాక మఱేమి? ఆంధ్రీకరించుటకే సూరన జంకుచో రచించుటకు వ్యాసుఁ డెంత జంక వలెనో? ఈశంకలును సమాధానములు ననునవి యక్షరాస్యులు మెచ్చఁదగినవి కావు. సూరనం గుఱించి యాపాదించిన యపరాధము లనాదరణీయము లనుసంశయమిం తకు దేలినసారము. ఇందునుగూర్చి పూర్ణప్రజ్ఞాచార్యులుగారు విస్తరించి వ్రాసి యున్నారు. వలయువా రది చూడఁ గలరు.

ఇక శ్రీనాథునిగూర్చి ప్రస్తావింతము. ఇతఁడు భీమఖండమునందు దాక్షా రామభీమేశ్వరునకు — "సానికూఁతులతగులమును" వర్ణించినమాట సత్యము. ఆవిష యము మూలమున లేదనుకారణమున మా యకించనులు మిక్కిలిగ నొక్కి వెక్కి రించి పండ్లిగిలించుచున్నారు. శ్రీనాథుఁడో? మాబోట్లను గవులుగా గణింపక పోవుటట్లు

లుండ మనుష్యులనుగాఁ గూడఁ గైకొనని యంతటిమేటి. ఈయంశమానాఁటి కవులలోఁ గొందఱఁ గుఱిచి యొకానొక సందర్భముననతఁడు పరిహసించిన—

"కొండపీటిలో గాడిద ? నీవునుం ? గవివిగావుగదా ? తలపోసి చూడగణ"

అను పద్యసందర్భములోనైన వానివలన సుగమమే ఇంతటి మహాకవి మూలామ క్తమగు విటత్వమును భీమునియం దేలయాపాదించునో? సుంత విచారింపవలదా? అతఁడు శైవగ్రంథరహస్యములు పూర్తిగా నెఱింగినవాఁడు శివలీలలయం దన్యత్ర క్లుప్త మగువిటత్వమును దనయాంధ్రీకరణమానందు భీమేశ్వరునియం దాపాదించి వర్ణించెననునది సహృదయ సమ్మతము

"అనుక్త మన్యతో గ్రాహ్యమ్" అను ప్రామాణికసమయము శ్రీనాథునికిఁ దెలియును మన కేమిని దెలియదు ముందు రాఁబోవువాని నరయక పండ్లిగిలించి చివాట్లుతినుటమాత్రము సుంతతెలియును అది యటులుండుఁగాక. పైసందర్భము వలన శ్రీనాథుని యాంధ్రీకరణము "మక్కికిమక్కి" వంటిదిగాక మూలగ్రంథ మును నిమిత్తమాత్రము ముందుంచి తనచిత్తము వచ్చినట్లు ప్రవర్తించెడిది యని ధ్రువపడుచున్నది ఈయంశ మతనిగ్రంథ మేది చదివినను దెలిసెడిదే కావున నతని యాంధ్రీకరణమాంధ్రీకరణము గాక స్వతంత్రరచన ప్రాయమని యొప్పక తప్పదు—ఇంత వఱకు వ్రాసినదవ్వవలన వెం॥ రా॥ ల—

"సానికూఁతులతగులమీఁగానునకును ? బలికితివి నీస్వభావంబు బయలుగాను."

"తెలుఁగుపేఁతయకా? స్వతంత్రించినీవు చేసినదియేది? శ్రీనాథ?చెప్పుకొనఁగ"

అనువెక్కిరింపులజ్ఞాన మూలకములని తేలుచున్నది ఇఁక—

"పల్నాటి వీరచరిత్రముకూడ స్వతంత్రకావ్యముగాదు"

అనువర్థముగల వెక్కిరింపునకు నొడివిన హేతువు—

"మధ్యపఱ్ఱుఁబెట్టి" అనునదిగా మావాండ్రవ్రాఁతవలనఁదే లుచున్నది మధ్య పఱ్ఱుఁ బెట్టుట స్వతంత్రకావ్యత్వభంజక మని గ్రహించుమోఱకులు వీండ్రకన్న వమ్య లింతదనుకఁ బ్రపంచమున లేమిం జేసి యందునుగూర్చికూడ విస్తరింపఁ బనిలేదు. ఇఁక—

"ఎఱచిదిమవారలేనియు నెమ్మి మెడకుఁగట్టికొందురె ?"

"గొప్పకవీశ్వరుండె యగును శ్రీనాథుఁడు గుణాఢ్యుఁడగునొ ? కాఁడొ ?

అమనసంబద్ధప్రలాపములనుగూర్చి కొండొక మందలించి విరమింతము. శ్రీనాథుఁడు విటుఁడా ? కాఁడా ? అమనది మనకిట విచార్యముకాదు. విద్యాప్ర

స క్తినిగూర్చి విచారించుసమయమున నట్టిపరిన క్తిని దెచ్చి వెక్కిరించువాఁడు మను జన్ముఁడా ? కాఁడా ? అనునది విచార్యము

శ్లో॥ "వ్యాసం వసిష్ఠనప్తారం శ క్తేః పౌత్రి మకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ "

వ్యాసుని కెట్టివిశేషణము లుపయోగింపఁ బడినవో చూచితిరా? మాగురిగింజలే యైనచో—"దాసికాంతమ్"

అని వెక్కిరించి ధిక్కరింతురోటు ? ఇట్లే వాల్మీకినిగూర్చి—

శ్లో॥ కూజంతం రామరామేతి మధురంమధురాక్షరం ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ ?

అనిప్రాజ్ఞలోకమెల్ల నమస్కరింప మాగుణజ్ఞులో?

"ప్రాక్పండాలిప్రియమ్" అని యీసడింతురేమి ? వేయేల ? ఇదియంతయు బరమనీచుల మని తెల్పుకొనుటకుఁదక్క నెందులకును బనికిరాదు. ఇంతమాత్రిమున నమ్మహాకవుల యశమునకు దొనఁ గువయింపదు. ఇంకకువిడిమే యేకపత్నీవ్రతులగు ప్రాజ్ఞులేని చర్చించినచోఁ గొంతయేని చర్చింపఁదగు నేమో కాని—

"మ॥ పుల్లాంభోరుహనేత్రి ? నీవారులతోఁ బోకుంటివో ? లేక నీ
తల్లిందండ్రి నకీర్తిభంగ మనియో ? తర్కించి ద్రివ్యమ్ముకై
యిల్లాలైతివొ ? నాదుకర్మ మహిమో? యేర్పర్చ లేనైతి నా
చెల్లా రెడ్డికిసాటి గామయితిమాచీ ? మాటలింకేటికిఁ॥

అనునట్టిశోచ్యులా. యిట్టిచర్చకు నర్హులు ? ఎవరొనర్చినను బైచర్చకును విద్వత్తకును సంబంధమునరిపడదు ప్రాజ్ఞులట్లు సంబంధముకలుపువారిని క్షమింపరు. అట్లెయిఁగియు మాశిష్యుల యప్రస్తుతాలాపములను గణింపక యధికప్రసంగులగు నీయజ్ఞుల క్షమింపవలసిన దని లోకులంగూర్చి ప్రార్థించుటయే యీ వ్యాసమునకు ముఖ్యాభిప్రాయము.

---

1. తెనాలిరామకృష్ణుఁడు.
2. " అట్టిబీదకవులు "
3. నన్నయభట్టారకుఁడు.

మా వెం॥ రా॥ లు, తెనాలిరామకృష్ణకవినిగూర్చి యేయపరాధమును వావి డువ లేదుగాని యితరు లారోపించినదానివిమాత్రి మనువదించినారు. ఇతనిని—

"తే॥ గీ॥ తగనిగర్వమ్మునం జేసి తన్నుఁదానె
పొగడుకొనువాఁ డటంచు జెప్పుదురుగాక"

అనిమాత్రము స్పృశించి వదలుటకుఁ గారణమేమో సుంత విచారింపవలసి యున్నను దీనింగూర్చి "విజయధ్వజము" అను కరపత్రమునందు "రామకృష్ణుల దౌర్జన్యము" అను శీర్షికక్రింద శ్రీపుల్లెల శ్రీరామశాస్త్రిగారు చర్చించియుం టచే మేము వదలు చున్నారము వెం॥ రా॥ ల॥ వ్రాతకాకున్నను. వీండ్రెవరివ్రాత ననువదించినారో వారివ్రాఁతనేవి సుంత చర్చించి రామలింగనిగర్వము తగనిదో? తగినదో తేల్చుట యుక్తముగాన "గ్రామంగచ్ఛన్ తృణంస్పృశతి"గా నెంచుక దానింగూర్చి ముచ్చటించుకొందము. రామకృష్ణకవి కీర్తింపకట్టినవాడు శ్రీరాయబహం దూరు పంతులవారు వారుపాండురంగమాహాత్మ్యమునందలి—

"మ॥ ఉదయంబ స్తనగంబు" అనుపద్యము మొదలగుకొన్ని పద్యముల యందలి రామకృష్ణుని శక్తివర్ణనముసుబురస్కరించుకొని యట్లునిర్ణయించియున్నారు ఆనాక్యములు కవినిగూర్చి కృతినాయకుఁడు పలికినట్లు కవివ్రాసికొన్నవి అట్లే ప్రతికవియుఁ దనశక్తిసంపదను బ్రకటించుకొనుట యాచారమై యున్నది పరికించి చూచినచో నొకఁడు—

శా॥ "ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లే" । రనియు వేఱొకఁడు—

"ఆంధ్రకవితా పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్"

అనియు, మఱియొకఁడు—"క్షితిలో నీమార్గ మొకరికిని రాదుసుమీ !"

అనియును, కృతినాయకునిచేఁ జెప్పించుకొనువారుగనే కన్పట్టుచున్నారు కొందఱకవులు తమంతఁదామే తమశక్తినిగూర్చి చెప్పికొన్నవారును గలరు ఇంకఁ గొందఱు భగవంతుఁడు కలలోఁ బ్రత్యక్షమై చెప్పుమాటలలో దమశక్తినిగూర్చి యతనిముఖముననే ప్రకటింపుకొన్నవారును గలరు దీనింబట్టిచూడ నీయాచార మొక తెనాలిరామకృష్ణకవికేకాక సర్వకవులకును సంబంధించుచున్నది. రామకృష్ణకవి కన్నఁ బ్రాచీనుఁ డగు శ్రీనాథుఁడు భూమిలోఁ దనవంటికవి లేనేలేఁ డని కృతినాయ కునిచేఁ జెప్పించినమాట నుపేక్షించి రామకృష్ణకవి చెప్పించినమాటలనే గణించి యతనినిమాత్రమే యాత్మశ్లాఘాతత్పరునిగా లిఖించినపంతులవారివ్రాఁత చింత్యము ఏమైనను బ్రస్తుతమింతకన్న నందుల కవకాశము చాలదు. వెం॥ రా॥ లు స్వయ ము గా రామకృష్ణుని దూఱలేదనునదియే మనకు ముఖ్యము. వీండ్రు రామకృష్ణునకు క్షమాపణ చెప్పనక్కఱ లేదు. ఇఁక వీండ్రు—

"అట్టిబీదకవులకు" క్షమాపణ చెప్పవలసి యున్నది "అట్టిబీదకవు" లన కేమో విచారింతము మావాండ్రియూహచొప్పున నీబీదకవులు" తమకు స్వప్నము వచ్చినట్లు కృత్యాదిని వ్రాసికొన్నవార లని స్ఫుట మగుచున్నది

"తే॥గీ॥ఒకఁడు స్వప్నప్రకారము నుగ్గడింప । నెల్లవారలకుఁ గలవె తెల్లవార్లు
నప్పుడు రను తలంపు లే దెవ్వరికిని । బేరుకొననేమిటికి "నట్టిబీదకవుల"

అని వెం॥ రా॥ లు వ్రాసియున్నారు స్వప్నమునకును బీదతనమునకును సంబంధమేమో మనము తెలిసికోవలసియున్నది. ఏరాజునో యాశ్రయించియున్న కవికి స్వప్న ముగాదనియు, నట్లుగానికవులకు స్వప్నములు వచ్చుననియు మావాండ్రి యాశయ మని మనము పూర్వకవుల గ్రంథముల పీఠికలంబట్టి నిర్ణయింపవలసి యున్నది ఎక్కడనో కాని రాజాశ్రితులగు కవులు నృపునిం దప్పించి దేవునకుఁ గృతి నీయలేరుకదా ? నృపుఁడు కలలో నగుపట్టవలసినంత యావశ్యకత లేనివాఁడని వాండ్రితాత్పర్యము బాగుగ విచారించితిమేని "పగలు చూచుచున్నరాజు రాత్రి కల, లోనికి వచ్చుటయు కొండొకచోఁ దటస్థింపవచ్చును ఇది విచారణాంతరము రాజా శ్రితుల కైశ్వర్యము సులభమనియుఁ దదితరులకునది దుర్లభ మనియు నెంచి తదితరు లను బీదకవులుగా మావాండ్రు గర్హించినారు ఇది సమంజసమే.

"శ్లో॥ అన్నృతం చాటువాదశ్చ ధనయోగో మహానయం ।
సత్యం వైదుష్య మిత్యేష యోగో దారిద్ర్యకారకః"

కలివిజృంభణమునందలి యీశ్లోకమునుబట్టి విచారించితిమేని విద్వత్కవులును సత్యవక్తలును దరిద్రులని తేలుచున్నది వారు రాజాశ్రితులైనను ధనవంతులు కాఁజా లరు ఇదియు విచారణాంతరమే ఏమైనను సర్వసామాన్యదృష్టికి రాజాశ్రయము ధనకారకము గాన నది లేనిస్వతంత్రులు "బీదకవులనియే పిళ్వబడవచ్చును. కాని మావాండ్రివలె లోకము వారి నీసడింపక యెక్కుడుగా గౌరవించుట యనుభవ సిద్ధమై యున్నది అప్పకవి కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడు వీరు వారననేల ? నూటికి నథమపక్ష మేఁబదిమందికవులిట్టి "బీదకవులే." వీరి నందఱను నిష్కారణముగా నేదో స్వప్నకారణాభాసమును గల్పించి తృణీకరించుట పెద్దయపరాధము కాకపోదు ఇందులకై యాయాకవులకుఁగూడ మాయనాత్మజ్ఞులు క్షమాపణ చెప్పుటయే కాక మాగురిగింజలు తమకుఁగూడ స్వప్నము వచ్చినట్లు "రామకృష్ణ మహాభారత" మను పేరితో మూఁడునాలుగు తప్పుడు పద్యములువ్రాసి ముగించిన యనత్యప్రలాపమునందు లిఖించికొనియుంటచే నీబీదతమునకుఁ బాత్రులగుటనుండి

యెక్లో తప్పికొనుటకుఁ బ్రియత్నింప వలసి యున్నది ఆయాకవులకు స్వప్నములు వచ్చియుండునా ? లేక వృథాగా నసత్యమునే వారు వ్రాసియుందురా ? అను నంశమిందు వివార్యమేకాని దానిని గాదనుటకుఁగాని యౌననుటకుఁగాని వాదిప్రతివాదులకుభయులకునాధారములు లేవు వారివారి హృదయములే ప్రమాణము కావలెను విశ్వసించినవారువిశ్వసింపవచ్చును తక్కినవారు మానవచ్చును—

"సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతః కరణ ప్రవృత్తయః"

అనుకాళిదాసోక్తియే యిట శరణము ఆగ్యబుద్ధి యప్రత్యక్ష'' మని యెఱుఁగినవారెవరును వారికి స్వప్నములు రాలేదని విశ్చయింప సాహసింపరు ఆదిగాక, అందు మొదట స్వప్నప్రకారము నుగ్గడించిన తిక్కనసోమయాజిమాత్రమే విశ్వసించి వదపడి యావిషయము నుగ్గడించినవారిని ద్రోసివేయుట కేమియాధారము. తిక్కనకన్నఁ బోతన్నయం దెవరికేని యీవిషయమున నన్యథాబుద్ధి గలుగుటకు హేతుసామగ్రి కలదా ? కావున వీవిషయ మెంతచర్చించినను దేలునది కాదు వారి స్వప్నములను విశ్వసించువారికిన్ను విశ్వసింపనివారు ఘనులని మాత్రము మేము విన్నయింపఁ జాలము మఱియు —

తే॥ గీ॥ దేవతాప్రార్థనంబును దేశనగర । రాజువర్ణనముఁ కథాచన యంత ।
క్రొక్కివిడిచినపుంతయే దిక్కుమాలి । కవనముం జెప్పదగిప్రజ్ఞానిధులకు"

అను మాయవ్యక్తుల పలాపమున కర్థమేలేమ నగరాది వర్ణనము మహాకావ్య లక్షణమని లాక్షణికులు విధించియుండ వీండ్రిట్లనుట కర్థమేమి ? అందుభిన్నభిన్న మార్గములచే నలరింపనిచో శ్లాఘ్యుఁడు కాఁడు అలరించినచో శ్లాఘ్యుఁడు అనునది ; సహృదయ సమ్మతము కవిత్వము విట్లాక్షేపించినచో నికఁ వీండ్రు గానము నెట్లాక్షేపింపవలెనో ? యోజింపుడు ఏగాయకుని గానము విన్నను వెనుకటిరాగములే ఆసప్తస్వరములే ఆ "రామనీనమానమెవ్వరే ? ఏటిదీయాక్షేపణ ? ఎందుకీవ్రాఁత ? ఎట్టిదీసారగ్రహణము ? ఒకగాయకుని పాటయందొకవిధమగు రసము వేఱొకగాయకునిగాత్ర మందిఁకనొకతెఱఁగు సొబగును తజ్ఞులరయుట లేదా ? ఇటులుండ మావాండ్రీపుంత ఎడిచి యేదోముండ్లంపుతనుబడి చేయువిమర్శనమువలన మాకీవేణుగోపాలశతకపద్య చరణములున్మృతికిం దగులుచున్నవి—

సీ॥ ఈనెగాం డ్లంటనో యీండ్లబైశాఖను చెన్నంగి సుద్దులు సెప్పలేరు
కైతగాండ్లంటనో కొల్పంగ డించుక చిన్నచ్చరముపేరు సెప్పలేరు"

మఱియు నష్టాశ్వవర్ణనముల మాటటులుండెను. గ్రంథాదిని "శ్లో॥ ఆశీర్నమస్క్రియా" అని లాక్షణికులు విధించినవానికో నన్యతమ మగు దేవతాప్రార్థనముకూడ మహాంధ్ర శేషముగాఁదోఁచుటకు హేతు వేమనుకోవలెను? ఇవి యంతయు జన్మకాలఫలితముదక్క వేఱుకాదు. పోనిండు. ఆయావర్ణనములను విడిచి దేవతాప్రార్థనాదికమును దుడిచి వీండ్రింతవఱకు వ్రాసినపొత్తమేది? ఇంతయెఱిఁగినవీండ్రు విశ్వగుణాదర్శము తెనిఁగింపను నందు దేవతానామ గ్రహణపూర్వక మగునాశీర్వచన మేల చేయవలయును? అందుఁ బూర్వకవులఁబోలెఁ గృతినాయకు నాశీర్వచింపనుఁ జెప్పిన పరమాశ్లీలాశయగర్భిత మగుపద్య మొకటి యిట నుదాహరించుచున్నారము—

"చ॥ పలువురలోనఁ దండ్రి తనపాణివిభున్ భుజగేంద్రభూషణుణ్ ।
జలమున నెగ్గులాడుటకు నైఁపక యోగవిసృష్టదేహయై ।
వెలమలనేతకుణ్ బ్రియము బెంపఁగ వెండి నగాత్మజాతయై ।
వెలసినముద్దరా లెపుడు వేంకటసూర్యనృపాలు నేలుతణ్॥

ఈవ్రాఁతకూడ— "దిక్కుమాలి కవనముంజెప్పదగిన ప్రజ్ఞానిధులు" కలిపినదియేకదా? అశ్లీల యగును? వారశ్లీలమార్గముగ విట్టిపట్టునఁ బ్రవర్తింప వారు మేమశ్లీలమయముగఁ బ్రవర్తించితిమి ఇదిభిన్నమగు మార్గమందుకో? శాంతంపాపం ప్రతిహత మమంగళం గురిగింజల కేకర్మమును దెలియదనుట కీపద్యము నుదాహరించితిమేకాని వీండ్రతప్పుచేఁ బూర్వకవుల సందర్భమ్ములను సమర్థించుటకుఁగాదని విజ్ఞులరయుదురుగాక మఱియు నీజ్ఞానలవదుర్విదగ్ధులు—

"గానటబీనటగా సంస్కృతమునూత్రము చదివి తెలుఁగుసమర్యాద నెఱుఁగక యాంధ్రకవనము చెప్పువారింగూర్చి కొంతవాకుచ్చిరి ఇట్టివారు ప్రాచీనులలోలేరు. కావున నిది ఇప్పటికాలపువారి కేరికో తగులవలెను మాబుద్ధిచే విచారింపఁగా వింతగు మున్ను స్వప్నములు వాకొను దరిద్రకవులలో మొదటివాండ్రుగా వీండ్రెట్లు స్మృతికిఁ దగిరిరో అశ్లే దీనికిని బ్రథమోదాహరణముగా వీండ్రే తగుదురన్నారు ఇందలియాథార్థ్యమును లోకమే నిర్ణయింపఁగాక. అట్టివారినిగూర్చి—

"సిగ్గెఱుఁగరొకో?" అనివ్రాసిరిగదా? సిగ్గెయున్నచో నీవ్రాఁతలేమి? ఇంతకు మున్నొనర్చిన చేఁతలేమి? అవియు నివియుగనినవారు వీరిల కదియుండునని యెవ రనుకొందురు? ఇఁక నీవిషయమును ముగించి వీరుమొట్టమొదట నెత్తికొనిన నన్నయ్యభట్టారకునిగూర్చి కొండొక ప్రస్తావించి వీండ్రయపవిత్రవాక్కుల నింత దనుక విమర్శించి సంపాదించుకొన్న పాపమునుండి విముక్తులమై విరమింతముగాక

# భట్టారకుఁడు

"అథర్వణాచార్యుని భారతమును విని సహింపక నశింపఁ జేసెననియు, సహపాఠిని గ్రంథపీఠికయందుఁ బేర్కొని గురుని బేర్కొనక పీఁటిడి యయ్యెననియు తెలుఁగుకవిత్వమునకు మొదట సంస్కృత భాషలో మఙ్గళశ్లోకము రచించి బడాయి గనపఱచె ననియు నేమేమో వావికిచిరి ఈకుశంకల నన్నిటిని మంచిమంచి యుక్తులతో ఖండించి పూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు, శేషాద్రి రమణకవులు శ్రీరాజా కోటగిరి వెంకటకృష్ణారావుగారును మండలించి యున్నారు. ఆ ప్రత్యుత్తరములే చాలును. నన్నయభట్టు మంగళశ్లోకము సంస్కృతములో రచించుటకు శంక యేల కలుగవలెను? అంతకు మున్నాంధ్ర గ్రంథములు రచించినవా రెవ్వరేని యాంధ్రము నందే మంగళము చేసియున్నట్లు మనకేమయిన నాధారములు గలవా? సంస్కృతిభాష వలననే బ్రతుకఁ దగిన యాంధ్రభాషకు సంస్కృతశ్లోకము మంగళ పద్యముగా నుండుట యుక్తియుక్తమేకదా? మార్గదర్శియగు నన్నయభట్టు సంస్కృతముతో మొదలిడెను గానఁ దిక్కనాదులుకూడ నట్లే యేల మొదలిడలేదని శంకించుటకు నుంత యవకాశము కలదుగాని నన్నయ్య నడుగుట కేవిధమైన యవకాశమును గాన రాదే? నన్నయ్య భట్టనఁగా నాంధ్రమున కెట్టివాఁడు?

క॥ "మీమాటలు మంత్రంబులు । మీమెట్టినయెడ ప్రయాగ మీపాదపవి
త్రాపలతోయము లఘు । ద్యోమార్గయురాంబుపౌనరుక్త్యము లుర్విన్"

ఇట్టివాఁడు; అతనిత్రోవ నొకరు పోవలసినదే కాని తెలుఁగులో నతనికిమార్గ ప్రదర్శకులు నేఁటిదనుకఁ గనుపట్టరే? అతఁ డేది ప్రయోగించినను నది—

"ఆడినదాట పాడినది పాట"గాఁ దిక్కనాదులు శిరసా వహించిరే కాని యది కాదనువారు లేనే లేరుగదా? అతఁడు

"చేసెఁ + మహా" అనుచోఁ బ్రాపస్థానమునందు, "చేసెమ్మహా"

అని ప్రయోగించిన నదియే యిటీవలవారికి వేదమైనది కాని ఆనకారము మకార మేలయైనదని యడుగువా రింతవఱకు జనింపలేదే? తక్కిన తిక్కనాదుల ప్రయోగము లనుగూర్చి యడుగవచ్చును గాని నన్నయ్యభట్టారకుని విషయమున నోరు మెదుపుట కెవ్వరికిని నధికారములేదే. సంస్కృతమున మహాభాష్యకర్త ప్రవృత్తిని గూర్చి శంకించియుఁ దెలుఁగున నన్నయ్య భట్టారక ప్రవృత్తిని గురించి నోరు తెఱచియు

సీభాషా ప్రపంచమున బ్రతుకుటకు గతియే లేదు. కావున నిది సయుక్తిక మగుఁ గాక యయుక్తికమగుగాక, దానింగుఱించి వాదిదుచుట మహాపరాధము. చేతనైనంతవఱ కమ్మహామహుననుసరించి పోవలెను అందులకుఁ దిక్కనసోటుల వితరులం బట్టి క్షమ ర్థించుకోవలెను. తిక్కనాదుల యాంధ్ర భాషామంగళాచరణ మతనికిఁ బ్రిపర్తకము కాదు తిక్కనయు నన్నయ యంతటివాఁడు. కావున స్వతంత్రించి మంగళాచరణ మాంధ్ర మువనే చేసినాఁడు. నన్నయ్య భట్టారకున కొక విధమగు యుక్తి యుండఁ దిక్కన సోమయాజి కింకొక విధమగు యుక్తియున్నయది. ఇటీవలివారు ద్వితీయాచార్య ప్రాయుఁడగు తిక్కన ప్రవృత్తినే చాలమంది యనుసరించి యున్నారు. ఉభయుల పోకడలును మాన్యములే, ఇట్లగుట యచ్చటచ్చట వేదమునందును గలదు. అది "యుదితానుదితహోమ" విషయము నెఱిఁగిన మీమాంసా శాస్త్రజ్ఞులవలన నెఱుఁగఁదగు. నన్నయభట్టు చేసిన వ్యాసంగము వేదమునందు, శాస్త్రములయందు, బహ్మాండాది పురాణములయందు, మఱియు ధర్మశాస్త్రాదికము నందు నవి యతవి—

"సీ॥ తనకులబ్రాహ్మణు" అను పద్యము వలనఁ దెలియుచున్నది ఇంతటివ్యాసంగ మును గీర్వాణ భాషయం దొనరించినవాఁడు రాజ నిరోధముచే దేశభాషయగు నాంధ్రమునఁ గవిత రచింపవలసి వచ్చినను నాభాషాభిమాన మంతనే నశించెడినా? అతఁ డొక మంగళాచరణమునందే యననేల! భాంతాంధ్రీకరణమునం దెల్లయెడ నాయభిమానమును గనఁజేయుచునే యున్నాఁడు దానింబట్టి యతవి, బ్రతుకే— "బడాయి" గానిర్ణయింపవచ్చునే? అయ్యో! యెంత పాపకాల మాసన్నమైనది కృష్ణదేవరాయలు——

ఆ॥ వె॥ "తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను దెలుఁగువల్లభుండ"

అని తన్నుంగూర్చి శ్రీకాకుళాంధ్ర దేవుఁడు వాకుృచ్చినట్లు చెప్పియున్నాఁడు అట్లే నన్నయ్య—

"సంస్కృతమేల యనిన నేను జదివినది సంస్కృతభాష, తెలుఁగునకు జీవి తమే సంస్కృతభాష దానివి వదలి తెలుగు బ్రతుకదు ఇంతటి ప్రాముఖ్యము దాని యందున్నదని తెల్పుట కద్దాన మంగళశ్లోకము చెప్పెనమకొనరాదా? ఇవి యన్నియు మన యుత్ప్రేక్షలు, అతఁడు వియంత ఆశవిని మనమడుగువారము కామనునదియే యటఁ బ్రిధానమగు వాదము. వేదమువలె, రాజాజ్ఞవలె, వాంధ్రకవుల కెల్లరకు నది శిరోమాల్యము, పొండు నోరెత్తకుండు. అథవా, నోరెత్తెదరో? రాజా జ్ఞకుఁగూడ నోరెత్తి గెల్చి మఱియు నోరెత్తుఁడు, అపుడు జవాబు చెప్పుదుము చమవరులారా! చర్వితచర్వణమే యయినను బలువురు లోకులు కోరుటచేఁ గొంత

వలకు మహాకవులం గూర్చి కీర్తించి ధన్యులమైతిమి ఈ ధన్యత్వమునకుఁ బరల పరాకారణ మగు మాశిష్యులను ధన్యులే యనుకొందము. వాండ్రు "మితభాషిత్వము మాని చేసిన యపరాధమునకుఁ జేసికోఁదగిన ప్రాయశ్చిత్తము నీక్రింద వివరించు చున్నారము

"మ॥ మితభాషిత్వముమాని యేల హరిపై మిథ్యాభి యోగంబుచే
సితిఁ పాపాత్ముఁడ నర్ధరోధుఁడను దుశ్చిత్తుండ మత్తుండ, మి
ర్మతినీ దేహము కాల్పనే ? దురిత మేమార్గంబునంబాయు ? నే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుమ ? నన్ గారుణ్యభావంబునన్"

క॥ పాపాత్ముల పాపములఁ । బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గలదని నొడివిన । పాపాత్ముని పాపమువకుఁ బారముగలదే"

అను నీభాగవతములోని సత్రాజిత్తు పశ్చాత్తాపము నందలి పద్యద్వయమును బ్రతిదినమును సహస్రావృత్తిగా జపించినచో వచ్చుభయమందేని ఇట్టి జడత్వ ముడుగునని మా యాశయము. పత్రికాపాఠకులారా ! మనమీవ్యాసములకుఁ బోతిన్నగారిని మొట్టమొదటఁ బేర్కొనియుంటిమి తుట్టతుదను గూడ నతని ప్రసంగమునే యెత్తి కొనినచో నుపక్రమోప సంహారములకు సాంగత్య మనుకూలించెడిని. నన్నయ్యను వదలి పోతన్నను ముందెత్తికొనుటకు హేతువు మావాండ్రతవిని మిక్కిలిగా నొవ్వఁ దిట్టి తృణీకరించి "కూరాకులోఁ బురుగును" గావించి యుంటచే నతని విషయమునకు గడువాసంగలేక యట్లు ప్రారంభించితిమి. అతనినంతగా నొప్పించుటకు మావాండ్ర కితరకవులకన్న నతఁడు చేసినయపరాధ మేమియు లేమగాని యందొక రహస్య మున్నయది. అది యిది పోతన్న నెంత తగ్గించినచోఁ దమకంతయుచ్చైః పదము గల్గునని మావాండ్ర యాశయము ఈసందర్భము వాండ్రు వ్రాసిన పద్యములలోని—

"క॥ ఏకాలమందుగానీ" అని మున్ను మేముదాహరించిన కందపద్యము వలన బాలునకేని మగమమే ఆపద్యభావము అప్పుడేమి, ఇప్పుడేమి ఎప్పుడేమి ? పెద్ద పండితులగు కవులనే రాజులు స్వీకరించుచున్నా రనియుఁ దదితరులను స్వీకరించుట లేదనియుఁ గదా ? దానివలనఁ దమకెంత యుచ్చైఃపదము లభించుచున్నదో యోజింపుఁడు. ఈమహాలాభము కొఱకుఁ బోతన్నగారి "నవాకుచెవాకులు ప్రేలువాఁగా" మా యవ్యక్తులు వదరియున్నారు ఇందువలనఁ దమరనుకొన్న యుచ్చైః ... సాంకవులగునో లేక లమహాదయతమ లోనగు నవగుణములే సాధి

తములగునో నిర్ణయింపఁదగువారు సహృదయులు చూచితిరా ? స్వార్థపరత్వ మెట్టిపాపములకు మూలమో ? కావున పీలైనంత వఱకు స్వార్థపరత్వము వదలు కొనవలసినది యని మావాంధ్రు పొందుచున్న పరాభవమువలన మన మెల్ల రము నేర్చుకొనవలెను ఇంకను బోతన్నగారిని గూర్చి వ్రాసిన పద్యములవలనఁ దెలిసికొనఁదగు రహస్యము లున్నవి. వానిని మేము వ్యాఖ్యానము చేయుటకన్న మీరు వ్యాఖ్యానము చేసికొని వ్యంగ్య మర్యాదచేఁ దత్త్వమరయుట యుక్తము మేము వ్యాఖ్యానము చేసితిమో ? మావాంధ్ర నెత్తికెక్కు "లఘు హృదయత్వము" చట్టన మానెత్తికె వచ్చినను రాఁగలదని యందులకుఁ బూనమైతిమి.

---

## అ శ్రు త ర్ప ణ ము

[షరా] ఆయీపద్యములు వెంకటరామకృష్ణకవులలో నొకరగువెంకటరామశాస్త్రి గారి నిర్యాణానంతరం - తిరుపతి వేంకటేశ్వరులలో నొకరగు వెంకటశాస్త్రి శతావ ధానిగారిచే రచింపబడి 1939 సం॥ కృష్ణాపత్రికలో ప్రకటింపబడినవి

( ప్రకాశకులు )

శా॥ అన్నా ! వేంకటరామశాస్త్రి ! సుఖివై ఆయుర్బలంబున్న సం
పన్నుండీతఁడు సత్కవీశ్వరుఁడు మావాఁడంచు మాబోట్లు ని
న్నెన్నంగా గబ్బము లెన్నిచేతువొకదా ? యేలోపమున్ లేని నీ
చెన్నున్ ధాతసహింపలేక యిటుచేసెన్, గన్నుగుట్టెంగదే ? ౧

కం॥ వయసేబదియారిటి కెచ్చయి యుండదు త్రిదశకాలమైశ్వర్యము త
ద్దయు ననుభవించి త్రిదశాలయ మేగితె ? లేవెవీకిలన్ దత్సుఖముల్ ౨

ఉ॥ ఇప్పనె యింతకెక్కుడుగ నింద్రుఁడునీకు ? పిఠాపురీ విభుం
డిచ్చినదానికిబ్బడిగ నీఁగలఁ డేమియతండు ? నేను ని
న్నచ్చటఁ జూచినప్పుగతమంతయుఁజెప్పుదు "మోనమైయిటుల్"
వచ్చితి " నంచు నెంతపొరపా టొనరించితి వెట్టి శిష్యుఁడా ! ౩

తే॥ గీ॥ నీదు సహపాఠియేగాదు నాదు సుసహ
పాఠి యిర్వు రచటలేరి భాష తెలుఁగు
వ్యాపకము చేయుచుందు రవ్వారి కీవు
తోడుపడి నాదు పేమమ్ము గూడఁ జెపుమ ! ౪

తే॥ గీ॥ కొన్నిపనులుండుటన్ జేసి కొంతకాల
మాగుటావశ్యకంబయి యాగినాఁడ
ఆయె నాకార్యములు తరువాయి స్వల్ప
మనుచు మనవాండ్రితోఁ జెప్పుమయ్య నీవు । ౫

శా॥ నన్నున్ నీవుత్యజించి యేగినను నీ నాఁటెంపు శుశ్రూష నా
హృన్నిష్ఠ రేజమునందుఁ బాయదుసుమీ ? హేత్వంతరంబుండి యే
తెన్నో త్రొక్కితిగాక ; మెచ్చఁదగు నంతేవాసి వేమండి నీ
వన్నా ! పోవుటయెంత కానిపనియో ఆత్మన్ విచారించితే ? ౬

తే॥ గీ॥ ఆగుట వశమ్ముగాక నీ వేగినాఁడ
వేగుట వశమ్ముగాక నే నాగినాఁడ
దైవతంత్రిమ్ములొక్కప్డు దైవమునకె
వశము గావన్న నింక నెవ్వరికి వశము ? ౭

మ॥ పితృభక్తుల్ గలరెందఱేనియు నినున్ బేర్కొందు నవ్వారిలోఁ
గృతకృత్యుండ వటంచు నేనెఱుఁగుదున్ గ్లేశంబు లక్షింప కే
గతి నీవందుఁ జరించితో ? యెఱుఁగు నీగాత్రిమంబు నీకిచ్చు స
ద్గతి నాపేవయె లేమసందియము స్వర్గంబేగి భోగింపుమా ? ౮

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి. శతావధాని

—• గద్య •—

ఇది శ్రీ కెంకవీంద్ర ఘటాపంచానన. బాలకళానిధి. బాలసరస్వతి.
విద్వత్కవి. కవిచక్రవర్తి. కళాప్రపూర్ణ శతావధానీత్యాది
బిరుదాంకితులైన తిరుపతి వేంకటేశ్వర కవి ప్రణీతం
బైన గిరతామ్నాయమ్మును క్షమాపణ వ్యాసాను
బంధమ్మును - సమాప్తము
" సమస్త సన్మంగళానిభవంతు "
శ్రీమత్పర దేవతార్పణ మస్తు ।
ఓ మి తి శి వ మ్

# ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 3 | 1 | విక్క | విక్కి | 49 | 5 | విథా | విథా |
| 4 | 29 | న్నవి | న్నవి | 49 | 27 | త్మకుఁ | త్మకుల్ |
| 5 | 7 | నొక్క | నొక్కా | 50 | 11 | ర్వ్ణక | ర్వర్ణక |
| 5 | 22 | కతన | కతనన | 52 | 7 | రొక్క | రొక్కా |
| 8 | 24 | ర్యశ్పూ | ర్యస్పూ | 52 | 21 | తక్కువ | తక్కు |
| 12 | 23 | సోక | స్తోక | 52 | 22 | లముఁ | లముల్ |
| 16 | 9 | చానులు | చాలును | 53 | 24 | నే | పి |
| 18 | 28 | యీరసి | యారసి | 54 | 5 | ముకన్న | మునకన్న |
| 19 | 18 | జెఱిచెన్ జెఱిచెఁ | జెఱిచెన్ | 57 | 20 | గాఁగ | గాఁక |
| 19 | 22 | లొప్పెఁబో | లొప్పెనొప్పెఁబో | 58 | 9 | నన్మ | నన్మ |
| 22 | 15 | వేజింపి | జింపివే | 58 | 16 | తిసా | తిరసా |
| 25 | 16 | సంతు | సం | 64 | 19 | చొంకం | చొకం |
| 27 | 15 | వంద | పంద | 66 | 2 | దుఁ | దుఁద |
| 27 | 25 | పగ | పంగ | 67 | 23 | ధనం | దనం |
| 30 | 26 | చెంప | బెంప | 83 | 11 | నే | పే |
| 32 | 2 | బ్రితి | బితి | 86 | 1 | వోఁచ | దోఁచ |
| 32 | 4 | ప్పవా | ప్పన | 95 | 25 | త్వ్యాదు | త్వవైను |
| 32 | 6 | డురా | డుదురా | 99 | 6 | టాలా | టలా |
| 32 | 15 | దవి | నిద | 109 | 8 | న్యత | న్యత్రి |
| 35 | 6 | విన | సిన | 109 | 27 | పాద | వాద |
| 38 | 27 | పయిపె | పయినె | 110 | 18 | మాతమిత్రరు | మాత్రమితరు |
| 38 | 4 | వఁ | వల్ | 111 | 28 | వింత | వింతి |
| 38 | 8 | బ్రిహ్మఁ | బ్రిహ్మల్ | 112 | 5 | నపద్య | పీనపద్య |
| 41 | 1 | సాక్ష | సాక్ష్య | 112 | 21 | రసి | మారసి |
| 41 | 23 | కటంచు | కటుంచు | 112 | 26 | నాన | దావ |
| 42 | 19 | విపి | విపి | 117 | 13 | మాయే | మాయొ |
| 45 | 7 | తిట్టి | తిట్టు | 118 | 7 | మీకి | మీరి |
| 47 | 15 | నవ్వి | నివ్వి | 118 | 11 | యనును | యగును |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 121 | 22 | దుర్గః | దుర్గహః | 282 | 3 | నట్లు | నటు |
| 122 | 14 | ఆపం | అవం | 282 | 14 | తలు | తల |
| 129 | 17 | గరు | గురు | 283 | 5 | పుడు | ప్పుడు |
| 129 | 20 | రుడ | గురుడ | 285 | 5 | చల్ల | చల్లి . |
| 135 | 2 | వంతుడు | వంతుండు | 286 | 3 | ర్నను | ర్నన్ను |
| 136 | 3 | కృరము | కృతము | 289 | 25 | దగా | డుగా |
| 136 | 22 | చదెవ | చదువ | 290 | 24 | రనన | నన |
| 137 | 14 | మునులు | ములు | 290 | 24 | పరిసి | పరసి |
| 178 | 19 | యతం | యంత | 291 | 27 | ఫుంగ | ఫుంగ |
| 179 | 6 | కింగా | కికింగా | 296 | 10 | మునన్ | మ్ముక్ |
| 183 | 7 | దాటరె | దాటరే | 297 | 23 | తిప్పు | తిప్ప |
| 198 | 2 | బొప్ప | లొప్ప | 301 | 23 | దూతిం | దూతిన |
| 198 | 3 | కవ్వు | కివ్వు | 303 | 28 | ర్వ్యయ | ర్వ్యవ |
| 199 | 26 | శద్వ | శ్వద్వ | 304 | 2 | జపా | జప్రా |
| 200 | 15 | మున | మ్మున | 308 | 25 | యుమె | యామె |
| 209 | 16 | డ్కడ | డక్కడ | 311 | 27 | యుటో | పేయు |
| 223 | 11 | స్పధానా | స్పధనా | 311 | 28 | వేనిప | టోవని |
| 226 | 21 | లక్షీః | లక్ష్మీః | 312 | 26 | వువ్వ | పువ్వ |
| 241 | 6 | సన్యా | నన్యా | 313 | 22 | గతు | గతుల్ |
| 247 | 27 | ముత్తో | ుత్తో | 314 | 10 | నైంకే | నైంపకే |
| 253 | 5 | యత్నా | యుత్నా | 320 | 23 | అది | అవి |
| 256 | 12 | గానల | గావల | 320 | 29 | గ్రహ | గ్రతము |
| 257 | 18 | వదా | పదా | 324 | 15 | కోర | క్రోధ |
| 259 | 5 | వధా | వదా | 325 | 11 | గద | గదు |
| 261 | 27 | వాఘ్రి | వ్యాఘ్రి | 332 | 20 | విజాని | నదాన |
| 262 | 2 | లుకూ | లకూ | 335 | 5 | మారని | మారన |
| 266 | 2 | వర్తి | వర్తి | 337 | 1 | వానా | దానా |
| 267 | 27 | సహః | సాహః | 337 | 26 | షద్వే | షద్వై |
| 272 | 20 | ర్తియు | హర్తి | | | | |
| 281 | ఎ 9 | దున్న | దున్న | | | | |

షరా.— 241 పేజీలోని - 1934 అని సంఖ్య 1914 గా సవరించుకొనునది